ఎమెస్కో

జ్ఞాన జ్యోతి

# మధ్వాచార్య



కన్నడ మూలం : డా॥ వ్యాసనకెరె ప్రభంజనాచార్య

స్వేచ్ఛానువాదం

శ్రీమతి గోపికా ప్రసాద్



## సమర్పణ

శ్రీ మూల సీతారామలక్ష్మణుల
పాద పద్మాలకు భక్తితో
సమర్పిస్తూ...

- గోపికా ప్రసాద్

## మా మాట

భారతీయ ఆధ్యాత్మిక జీవితం ప్రపంచాన్నే సమ్మోహన పరిచేది. భారతీయ ఋషులు, దార్శనికులు విశ్వమానవ సౌఖ్యం కోసం, మానవుడి పరమోన్నతికోసం తపించారు. ఆలోచించారు. ప్రబోధించారు. తత్త్వం సామాన్యుడికి బహుదూరం. ఇదే పరమసత్యమన్న నిర్ధారణ కూడా అసాధ్యం. నిరంతర అన్వేషణ, అనంత ఆలోచన సాగుతూనే ఉంటుంది. వేదాలు, ఉపనిషత్తులు ఈ అన్వేషణలో, ఆలోచనలో భాగాలే. పురాణేతిహాసాలు ఆ సత్యాన్ని కథనరూపంలో దర్శించే, దర్శింపజేసే ప్రయత్నం చేశాయి. ఈ అన్వేషణలో భాగంగానే బౌద్ధ, జైన దర్శనాలు వచ్చాయి. ఇవి కొంతకాలం వైదిక దర్శనంపై తెరవేశాయి. మళ్లీ వైదిక తాత్త్వికతకు పురావైభవాన్ని తెచ్చినవారు త్రిమతాచార్యులు, శ్రీ శంకరాచార్యులు, శ్రీ రామానుజాచార్యులు, శ్రీ మధ్వాచార్యులు.

ఆచార్య శంకరుల అద్వైతం, ఆచార్య రామానుజుల విశిష్టాద్వైతం, ఆచార్య మధ్వుల ద్వైతం గత రెండువేల సంవత్సరాలలో తాత్త్వికలోకాన్ని ప్రకాశవంతం చేసిన గొప్ప దర్శనాలు. భారతీయ తత్త్వశాస్త్రానికి ఈ ముగ్గురు మహోన్నత మతాచార్యులు ఎనలేని కీర్తి సంపాదించి పెట్టారు.

శ్రీ మధ్వాచార్యులు తనకు పూర్వం ప్రచారంలోకి వచ్చిన అనేక సిద్ధాంతాలను ఖండించి ద్వైత సిద్ధాంతాన్ని ప్రతిష్ఠించారు. వ్యాస మహర్షి రచనలకు గొప్ప వ్యాఖ్యానాలు రచించారు. వాటికి పలువురు చేసిన 'కువ్యాఖ్యానాల'ను ఖండించారు. తన 'సువ్యాఖ్య'లతో పునరుజ్జీవింప చేశారు. తన సిద్ధాంతాలకు వ్యాసమహర్షి రచనల నుండే ప్రమాణాలను చూపించారు. శైశవదశ నుండే అసమాన ప్రతిభా పాటవాలను ప్రదర్శించిన మధ్వాచార్యులు ప్రజ్ఞాపూర్ణులు.

శ్రీమతి గోపికా ప్రసాద్ 1980 దశకం ఆరంభంలో - భర్త శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్, I.A.S., తిరుమల-తిరుపతి దేవస్థానాల ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్‌గా ఉన్న కాలంలో - కన్నడ భాషను నేర్చుకుని, ఆ భాషలో ప్రచురితమైన దాస సాహిత్యాన్నీ, మధ్వసిద్ధాంత గ్రంథాల్నీ విస్తృతంగా అధ్యయనం చేశారు. ఈనాటికీ చేస్తూనే ఉన్నారు. శ్రీ సత్యప్రమోద ద్వైత సేవా సంస్థను స్థాపించి, దాని ద్వారా అమూల్యమైన మధ్వసిద్ధాంత సాహిత్యాన్ని సరళమైన తెలుగులో అందరికీ అందుబాటులోకి తీసుకువచ్చేందుకు కృషి చేస్తూ ఉన్నారు.

పూర్ణప్రజ్ఞులైన ఆచార్యమధ్వుల జీవితాన్ని గురించి కూడా అందరూ తెలుసుకోవాలన్న ఆకాంక్షతో, కన్నడంలో డా॥ వ్యాసనకెరె ప్రభంజనా చార్యులు గారు రచించిన 'పూర్ణప్రజ్ఞదర్శనమ'నే గ్రంథాన్ని శ్రీమతి గోపికా ప్రసాద్ తెలుగులోకి స్వేచ్ఛానువాదం చేయడం అభినందనీయం.

మా ఇతర ప్రచురణలాగే ఈ గ్రంథాన్ని కూడా పాఠక మహాశయులు ఆదరిస్తారని ఆశిస్తూ...

ఎమెస్కో విజయకుమార్

## రచయిత్రిగా ఒకమాట

ద్వైతసిద్ధాంత స్థాపకులైన మధ్వాచార్యుల గురించి చాలా కొద్దిమందికి మాత్రమే తెలుసు. జగద్గురువులైన దార్శనికులలో దాదాపు చివరి గొప్ప తత్త్వవేత్త. అయినప్పటికీ, వైష్ణవ సిద్ధాంత మహా ప్రచారకులైన చైతన్య మహాప్రభు, గౌరాంగ శ్రీల ప్రభుపాద (హరే కృష్ణ ఉద్యమ స్థాపకులు), గుజరాత్‌లోని భాగవత ప్రచారకులు, ఉత్తర భారతంలో, వైష్ణవ సిద్ధాంత ప్రచారకులు, తాత్త్విక వేత్తలైన నరహరితీర్థులు, వాదిరాజులు, మాధవ తీర్థులు, పద్మనాభ తీర్థులు, జయతీర్థులు, రఘోత్తమ తీర్థులు, శ్రీపాద రాయలు, వ్యాస తీర్థులు, శ్రీరాఘవేంద్ర తీర్థులు, శ్రీ సత్యధ్యాన తీర్థులు, శ్రీ సత్య ప్రమోదులు, శ్రీ సత్యాత్మ తీర్థులు, శ్రీ విశ్వేశ తీర్థులు, శ్రీ భండారకరె మఠాధీశుల వంటి గొప్ప తత్త్వవేత్త లెందరినో ప్రభావితం చేసిన ఘనత శ్రీ పూర్ణప్రజ్ఞులైన మధ్వాచార్యులదే. వీరి తత్త్వజ్ఞాన ప్రచారానికి కన్నడ దేశంలో, దాససాహిత్యంగా ప్రఖ్యాతి చెంది – ద్వైత వైష్ణవ సిద్ధాంతం వాడవాడలా వ్యాపించి కులాతీతంగా ప్రచారంలోకి వచ్చింది.

అయినప్పటికి శ్రీమధ్వుల సిద్ధాంతానికి శంకర రామానుజులతో పోలిస్తే, రావల్సిన ఆదరణ రాలేదేమో అనిపిస్తుంది. దీనికి ఒక ముఖ్య కారణం ఈ సిద్ధాంతాన్ని అవలంబించేవారు, మధ్వులుగా పిలవబడి, ఆచార వ్యవహారాలలో కట్టుబాట్లతో ఉండి, సమాజంలోని ఇతర వర్గాలతో మత సంబంధిత విషయాలలో అంత కలివిడిగా లేకపోవడమేమో అనిపిస్తుంది. మధ్వాచార్యుల తత్త్వవిచారాలు, వారు రచించిన తాత్త్విక గ్రంథాలూ, వ్యాస సాహిత్యానికి వారు రచించిన భాష్యాలూ, తాత్పర్య నిర్ణయాలలో, సామాన్య సాధకుని నుండి సన్యాసుల వరకూ వారి వారి ఆశ్రమధర్మాలు ఎలా నిర్వర్తించాలో, ముక్తిసాధనకు మార్గమేమిటి – భక్తి జ్ఞాన వైరాగ్యాలకు సంసారంలో ఉన్న మనం ఏం చేయాలన్న విషయాలు – సమాజంలోని

అన్ని వర్గాల వారికి వారివారి యోగ్యత ననుసరించి సాధన ఎలా చేసుకోవాలో సూచించారు.

శ్రీ మధ్వాచార్యులు, తను మాటలలోనే – తాను కొత్తగా చెప్పింది ఏమీ లేదనీ, శ్రీ వేదవ్యాసుల అభిప్రాయాలనే తను స్పష్టంగా వివరిస్తున్నాననీ – అలా చేయడానికి కారణం, ఆయనకు ముందు రచించబడిన శంకర రామానుజుల అద్వైత, విశిష్టాద్వైత సిద్ధాంతాలు, అలానే వేదవ్యాసుల రచనలు ఆధారం చేసుకొని ప్రచారంలోకి వచ్చిన ఇతర సిద్ధాంతాలు, ఆస్తికులు కాని వారు చేసిన వ్యాఖ్యలు... ఇలా వచ్చిన 21 సిద్ధాంతాలను, శ్రీమధ్వాచార్యులు విమర్శనా దృష్టితో పరిశీలించి – వ్యాసుల ఆంతర్యానికి ఆ వ్యాఖ్యలు ఎలా విరుద్ధమో నిరూపించి – వ్యాసుల అసలు మనోభావాలు వ్యాసుల వారి మాటల్లోనే వారి రచనల్లోంచి ప్రమాణంగా చూపించి ఒక గొప్ప తాత్త్విక పరిశీలనా చరిత్ర సృష్టించారు.

కర్ణాటక ప్రాంతంలో కొంత ప్రాచుర్యం లభించినా, శ్రీ మధ్వుల తత్త్వవిచారాలకు రావలసి ప్రచారం రాలేదు. గత కొన్ని శతాబ్దాలుగా, వారి రచనలు, ఆ రచనలపై వచ్చిన భాష్యాలు, టీకలు, వివరణలు పండితులకు మాత్రమేకాక సామాన్యులకు కూడా అందుబాటులో ఉండాలన్న మహోన్నత ఉద్దేశంతో వాదిరాజులు, శ్రీపాదరాయలు, శ్రీవ్యాస రాయలు, శ్రీపురందరదాసులు, శ్రీ జగన్నాథదాసులు, శ్రీ విజయదాసులు, శ్రీ గోపాలదాసుల వంటి ఎందరో మఠాధిపతులు, పండితులు, దాసులు, మధ్వుల ద్వైత సిద్ధాంతాల్ని కర్ణాటక ప్రాంతంలో కన్నడ భాషలో రచించబడిన సుళాదులు, సంకీర్తనల రూపంలో కొంత ప్రచారం చేసినా – అవి చాలావరకు, సాహిత్య సంగీత ప్రచారంలో భాగంగా వారికి పోయింది గాని, తాత్విక ప్రపంచంలో చూపించాల్సిన ప్రభావం చూపించలేదు.

గత కొన్ని దశాబ్దాలుగా మధ్వ పీఠాధిపతుల ఆధ్వర్యంలో, కొందరు దార్శనికుల నిరంతర కృషితో, చాలా ద్వైత సిద్ధాంత గ్రంథాలు కన్నడ భాషలో రచించబడి, ప్రచురించబడి, సామాన్యులకు అందుబాటులోకి రావడానికి దోహదకారి అయినాయి.

తెలుగు మాట్లాడే ఆంధ్రప్రదేశ్‌లోకానీ, తమిళం మాట్లాడే తమిళనాడులో కాని, శ్రీమధ్వుల సాహిత్యం ఆయా భాషలలోకి అనువదించబడి, వారి సిద్ధాంత

ప్రచారానికి జరగాల్సిన కృషి జరగలేదనే చెప్పాలి. ఈ మధ్య కాలంలో కొంత ప్రయత్నం మొదలయింది. ఉత్తరాది మఠాధీశులైన శ్రీ సత్యాత్మ తీర్థుల ఆధ్వర్యంలో శ్రీ విశ్వమధ్వ మహాపరిషత్తు, శ్రీ పెజావరు పీఠాధీశులైన శ్రీ విశ్వేశతీర్థుల ఆధ్వర్యంలోని శ్రీ అఖిల భారత మధ్వ మహా మండలి ఆధ్వర్యంలోనూ, తిరుచానూరులోని శ్రీమన్ మధ్వ సిద్ధాంత ఉన్నాహినీ సభ ఆధ్వర్యంలోనూ, మేము స్థాపించిన శ్రీ సత్య ప్రమోద ద్వైత సేవా సంస్థ ఆధ్వర్యంలోనూ, కీ.శే. శ్రీ కాశీ కృష్ణాచార్యులు, శ్రీ పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు, నందివెలుగు, మచిలీపట్నం మధ్వమహా మండలుల ఆధ్వర్యంలోనూ, శ్రీ సుసర్ల శ్రీనివాసరావు (Sr) కాకినాడ, శ్రీ రాచూరి శ్రీనివాసరావు, కీ.శే. మానూరి నారాయణరావు వంటి వారి కృషితోనూ కొన్ని గ్రంథాలు తెలుగులో రచింపబడడానికీ, ప్రచురించబడడానికీ అనుకూలమైనది.

అయినా ఈ గ్రంథాలన్నీ మధ్వులచే రచింపబడి, మధ్వులచే ప్రచురించబడి, చాలా వరకు, మధ్వులకు మాత్రమే లభ్యమయ్యేటట్లు జరిగినందువలన ఈ రచనల ప్రభావం గాని, ఈ ద్వైత సిద్ధాంత రుచిగాని, మధ్వేతరులకు అందుబాటు లేకుండా పోయింది.

చాలా కొద్దిమందికి మాత్రమే తెల్సిన విషయం – శ్రీ మధ్వాచార్యులు కర్ణాటకలోని ఉడిపి ప్రాంతం వారైనా వారి ముఖ్య శిష్యులైన, శ్రీ పద్మనాభ తీర్థులు, శ్రీ నరహరితీర్థులిద్దరు ఆంధ్రప్రాంతం వారే. ఈ అద్వైత మహా పండితులు శ్రీ మధ్వులతో తత్త్వవాదనచేసి, శ్రీ మధ్వుల తాత్త్విక భావ ప్రభావంలో తన్మయులై, వారు ఆచరిస్తున్న సిద్ధాంతాలు వదలి, మధ్వులకు శిష్యులై – ద్వైత తత్త్వ ప్రచారానికి మూలస్తంభాలుగా నిలిచారు. 13వ శతాబ్దంలో శ్రీ మధ్వుల శిష్యులైన వీరు శ్రీ ఆచార్యులవారితోనే వుండి కర్ణాటకలోనే స్థిరపడిపోవడంతో తెలుగునాట వారి తాత్త్విక ప్రచారం జరగడానికి అవకాశం కలుగలేదు.

కన్నడ దేశంలో ఈమధ్య కాలంలో, కొన్ని దశాబ్దాలుగా డా॥ వ్యాసనకరె ప్రభంజనాచారిగారు శతాధిక ద్వైత సిద్ధాంత గ్రంథాలు రచించి 'వ్యాస మధ్వ – మండలి' స్థాపించి, వాటిని ప్రచురించి ఎనలేని సేవ చేస్తున్నారు. వారి గ్రంథాలను దాదాపు పది వరకు మా సత్య ప్రమోద ద్వైత సేవాసంస్థ తెలుగించి ప్రచురించడం జరిగింది.

తెలుగులో సమగ్రమైన ఖచ్చితమైన మధ్వుల జీవిత విశేషాలు వివరించే గ్రంథమే సామాన్యులకు అందుబాటులో లేకపోవడం చాలా దురదృష్టకరం. ఆ అవసరాన్ని దృష్టిలో వుంచుకొని వ్యాసనకరె ప్రభంజనాచారిగారు కన్నడంలో రచించిన 'పూర్ణ ప్రజ్ఞ దర్శన' గ్రంథం ఆధారంగా తెలుగులో స్వేచ్ఛానువాదం చేసే అదృష్టం నాకు కల్గింది. వారికి నా కృతజ్ఞతలు.

మొదట ఈ గ్రంథాన్ని కూడా మేము మా 'శ్రీ సత్యప్రమోద ద్వైత సేవాసంస్థ' ప్రచురణగా శ్రీ మధ్వమహా పరిషత్తు ఆధ్వర్యంలో ప్రచురించాలనుకున్నాం. కాని ఎమెస్కో ప్రచురణ సంస్థ అధిపతులైన శ్రీ విజయకుమార్ గారు తెలుగులో సరైన మధ్వ చరిత్ర లేనందున – మా సంస్థ ప్రచురించే గ్రంథం మా ఇతర ప్రచురణలవలె మధ్వులకే పరిమితమయ్యే అవకాశం వున్నందున – తెలుగులో అందరికీ అందుబాటులో వుండే విధంగా ఈ గ్రంథం ప్రచురిస్తే బాగుంటుందన్న సూచన యిచ్చి, దీని ప్రచురణ బాధ్యత తీసుకోవడం మాకు చాలా సంతోషదాయకం. శ్రీ విజయకుమార్ గారికి, వారి ఎమెస్కో సంస్థకు మా ప్రత్యేక ధన్యవాదాలు. మా గురువులు శ్రీ నాగేంద్ర ప్రసాద్ ఆచార్యులుగారు ఎప్పటికప్పుడు సలహా సహకారాలు అందించినందుకు ప్రత్యేక కృతజ్ఞతలు. చదివేవారికి ఆసక్తికలిగేలా తగిన మార్పులు చేసిన శ్రీ జి. వల్లీశ్వర్ గారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు.

తెలుగు ప్రజానీకానికి శ్రీ మధ్వుల జన్మ రహస్యం, మహిమ, వారి తత్త్వ విచారాలు, శ్రీ వేదవ్యాసుల ఆంతర్యం తెలియడానికి ఈ 'ఆచార్య మధ్వ' అవకాశం కల్పిస్తుందని ఆశిస్తూ శ్రీ మధ్వులు ప్రతిపాదించిన విష్ణు సర్వోత్తమత్వ, వాయి జీవోత్తమత్వ సిద్ధాంత ప్రచారానికి దోహదకారి కావాలని శ్రీనివాసుని ప్రార్థిస్తున్నాను.

గోపికా ప్రసాద్

ఇంటి నెంబరు : 70,
రోడ్డు నెంబరు-8, బంజారాహిల్స్
హైదరాబాదు - 500 034,
ఫోన్ : 040-2335 0813.

## 'జ్ఞానజ్యోతి' మధ్వాచార్య గురించి...

**మ**ధ్వాచార్యులు (క్రీ.శ. 1199-1278) ప్రపంచము చూసిన అద్భుతమైన దార్శనీకులు. సకలశాస్త్రములు, సకల భాషలు, సకల కళలు వారికి కరతలామలకములు. అందుకొరకే 'పూర్ణప్రజ్ఞులన్న' పేరు వారికి అన్వర్థకము. వేదోపనిషత్తులంతా మహాభారతము, రామాయణము, భాగవతము మొదలగు సకల మూలగ్రంథముల భావమును విశిష్టమైనరీతిలో ఆవిష్కరించిన విద్వద్విభూతి అన్నది వారి గొప్పతనము. అందుకొరకే వారి గ్రంథములకు సర్వమూల గ్రంథములని పేరు.

పండిత పామరులకు వారిజీవనము బాల్యమునుంచి గ్రంథములు వ్రాయువరకు అత్యంత ఆశ్చర్యకరమయినది. వారికృతులవలెనే వారి ఆకృతి, వారి ఆకృతివలెనే వారి కృతులు పరిపూర్ణమయినవి. సంగీత విద్యయందు వారు విద్వన్మణులు.

వారి కృతులు చూచుటకు వామనమూర్తులవలె చిన్నవయినప్పటికిని అర్థము యందు త్రివిక్రముని వలె పెద్దవి. వారి మహిమలు ఊహకందని సర్వతోముఖ వ్యాప్తి కలిగినవి. వారిజీవనము అద్భుతములతో కూడుకొనినది. దేహ దార్ఢ్యముతో ఎంతటి మల్లులనూ మన్నుతినిపించిన జగజ్జట్టి. తంత్ర శాస్త్రము, మంత్ర శాస్త్రము మొదలగు సకల శాస్త్రముల యందు వారు దశప్రమతులు. అంతటి విశ్వతోముఖప్రతిభ, పరిపూర్ణ ప్రమతిగల వ్యక్తిని పొందుట ఈ భువనము యొక్క భాగ్యము.

మధ్వులవలెనే వారి పరంపర సాంస్కృతికముగా, సామాజికముగా, సాహిత్యముతో, ఆధ్యాత్మికతతో, సర్వతోముఖ ప్రగతికిచ్చిన కానుక. హరిదాస సాహిత్యము జనుల అభివృద్ధికి అనన్యముగా తోడ్పడును. మొత్తము హరిదాస సాహిత్యము వెనుక ప్రతి ఒక్క ఘటనయందు శ్రీ ఆచార్యుల ప్రభావము కనపడుతుంది.

మధ్వులు ప్రతిపాదించిన సిద్ధాంతము ఇహపరముల సుఖసాధనములకు అత్యంత మార్గదర్శనము నిచ్చు కల్పవృక్షము, కామధేనువు. ఆ సిద్ధాంతము నిత్యజీవనమునకు అతి ముఖ్యమయినది.

అయినను ఇంతటి అద్భుతవ్యక్తి యొక్క సరియయిన పరిచయము జగత్తునకు సరిగ్గా అవలేదనియే చెప్పవచ్చును. ఇతరులకుకాని, వారి సిద్ధాంత అనుయాయులకు సహా వారి జీవనము, సాధనముల మాహాత్మ్యము తృప్తికరముగా తెలియుటలేదు. అందుకు వాటికి కావలసిన గ్రంథముల కొరత కారణము కాదు. నారాయణ పండితుల సుమధ్వవిజయము వీరి సమగ్ర జీవనము తెలుపు కావ్యము. ప్రమాణ పూర్వక విషయవివరణములలో ఈ కృతికి మించినది చరిత్రలోనే లేదని చెప్పవచ్చును. అదియేకాక అణుమధ్వ విజయమను (ప్రమేయనవమాలికా) సంగ్రహకృతిని వారే రచించిరి. ఈ కావ్యవివరణ కొరకు వారే భావప్రకాశిక అను మరొక గ్రంథమును రచించిరి. పై రచనలే కాక మధ్వాచార్యుల సాక్షాత్ శిష్యులయిన శ్రీ హృషీకేశ తీర్థులు కూడ సంప్రదాయ పద్ధతి అన్న గ్రంథమునందు శ్రీ మధ్వాచార్యుల జీవిత విశేషములను విపులముగా వివరించడమయినది. ఇవియేకాక సుమధ్వ విజయమునకు వ్రాసిన వ్యాఖ్యానములయందు మరియు శ్రీ మధ్వులను స్తుతించుచు రచించబడిన వివిధ స్తోత్రముల యందు శ్రీ మధ్వుల జీవిత విశేషములు, వారి మహిమలు వర్ణింపబడినవి. ఇటువంటి స్తోత్రములను సంగ్రహించి శ్రీ వ్యాస మధ్వ సంశోధన ప్రతిష్ఠానమువారు 'వాయు స్తోత్రమాలిక' అన్న గ్రంథమును 'స్తోత్ర మాలికా-1987'లో ప్రచురించిరి. హరిదాస సాహిత్యమునందు మధ్వమహిమను వర్ణించు విపుల కృతులు యున్నవి. ఇవేకాక శ్రీకూర్మం (శ్రీకాకుళం జిల్లా) శిలా శాసనము కూడా లభ్యమవుతున్నవి.

ఇంతటి విపుల సమాచారమును ఇవ్వగలిగిన ఇన్ని గ్రంథము లున్నప్పటికిని శ్రీ మధ్వుల జీవితచరిత్ర జనుల కందుబాటులో లేకపోవుట దురదృష్టకరము. వారి వ్యక్తిత్వమువలె వారి కృతులు, వారి సిద్ధాంతము జనులకు తృప్తి నివ్వగలిగిన స్థాయిలో అందుబాటులో లేవు. మధ్వులు కాని వారికి ఈయన పరమతములను ఖండించి వాటిని సహించలేని వారిగా అపోహమాత్రమే మిగిలినది. దీనికి ముఖ్య కారణము, వారు రచించని వాటి

గురించి రచింపబడిన గ్రంథములను సమర్థవంతముగా ఉపయోగించు ప్రయత్నము జరుగలేదు. ఎటు చూసిన కన్నడములో మధ్వుల గురించి వెలువడిన గ్రంథములు తక్కువనియే చెప్పవచ్చును. అట్లు లభ్యమగుచున్న కొలది గ్రంథములలో కూడ మధ్వుల గురించి విషయములు సంతృప్తికరంగా లేక అసమగ్రముగా యుండుటవలన వారి భవ్యవ్యక్తిత్వమును వివరించుటలో పూర్తి న్యాయము జరుగలేదు. ఇప్పటివరకు శ్రీ మధ్వుల గురించి వచ్చిన గ్రంథములలో ఆయన గురించి లభ్యముగా యున్న వివిధ కృతుల వివరములను సమగ్రముగా ఉపయోగించుట జరుగలేదు. సుమధ్వవిజయము చాలసార్లు అనువదింపబడినప్పటికిని అందులోని విషయములు సమగ్రముగా ఉపయోగించుకొనకపోవుట వలన శ్రీ మధ్వుల జీవిత విశేషములు సామాన్యజనుల కందుబాటులో లేవు. శ్రీ మధ్వుల గురించి సమగ్రముగా తెలుసుకొనవలెనన్న తహతహ కలిగిన వారు కోకొల్లలుగా యున్నప్పటికిని, ఇంతవరకు సమర్థ ప్రయత్నము జరగకపోవుట శోచనీయము. ఇటువంటి సమగ్ర సమర్థ ప్రచురణ జనులకందుబాటులో లేకపోవుట మధ్వులకు తలవంచుకొను పరిస్థితికి కారణము. ఒక విధముగా ఆంగ్లమునందు ప్రచురింపబడిన ఒకటిరెండు గ్రంథములు కన్నడ గ్రంథముల కన్న మెరుగుగా యున్నప్పటికి ఆ గ్రంథముల యందు కూడ మధ్వుల చరిత్రలను, మహిమలను వివరించుట యందు తగు న్యాయము జరుగలేదు. జిజ్ఞాసువుల నిరాశ తొలగించుటకు ఒక సమగ్ర మధ్వచరిత్ర రచన అనివార్యము.

సామాన్యజనులకందుబాటులో శ్రీ మధ్వులచరిత్ర యుండవలెనని నా మనసులో ఆవేదన యున్నప్పటికిని దానిని కారణాంతరముల వలన పూర్తిచేయలేక పోతిని. శ్రీహరి గురు అనుగ్రహముల వలన ఈనాటికి ఈ పూర్ణప్రజ్ఞాదర్శనమును గ్రంథరూపముగా వెలువరించుటతో నా కల నిజమయినది. శ్రీ మధ్వుల గురించి ఇంతవరకు ప్రకటితమయిన అన్ని గ్రంథములలోను మా సంశోధనలోను, సంగ్రహముల యందు దొరికిన అనేక మాహాత్మ్యములను ఉపయోగించుకొని దీనియందు సమగ్రముగా తగిన రీతిలో శ్రీ మధ్వులను ప్రమాణముగా పరిచయము చేయుటకు ప్రయత్నించితిని. దీనిలో మధ్వుల మాహాత్మ్యములే కాక ఆయన సందర్శించిన

అనేక స్థలములను స్వతఃగా సందర్శించి అచట ప్రజలనించి సంగ్రహించిన అనేక వివరములను వివరించితిని.

శ్రీ మధ్వుల చరిత్ర తెలుసుకొనవలెనన్న కుతూహలమున్న జనులకు ఇది ఉపయోగపడునన్న నమ్మకమున్నది. శ్రీ మధ్వుల మహిమలకు సాక్షిగా యుండు అనేక స్మారకముల వర్ణ చిత్రములను దీని యందు ముద్రింపబడినవి.

– వ్యాసనకెరె ప్రభంజనాచార్య
కన్నడ మూలగ్రంథ రచయిత

జ్ఞాన జ్యోతి

# మధ్వాచార్య

హనుమంతుడు, భీమసేనుడు మహాబలవంతులు.

అసమాన శక్తిమంతులు.

దుర్జన సంహారకులు.

రామాయణ మహాభారతాలకు కీలక పాత్రధారులు.

ఆంజనేయుడు లేని రామాయణాన్ని, భీముడులేని భారతాన్ని ఊహించగలమా?

త్రేతాయుగంలోని హనుమ, ద్వాపర యుగంలోని భీమసేనుడే కలియుగంలో మధ్వాచార్యులుగా అవతరించారు. అజ్ఞానాంధకారాన్ని పటాపంచలుచేసి, జ్ఞాన భాస్కరుడిగా ప్రపంచానికి ఆధ్యాత్మిక వెలుగును ప్రసరింపజేశారు....

★ ★ ★

మానవుడు పరిపూర్ణమైన ఔన్నత్యం సాధించాలంటే ఒకే ఒక్క పరికరం వుంది. అది జ్ఞానం. సామాన్యులకైనా, సిద్ధులకైనా అన్ని మూల సాధనాలకి ప్రధానమైన మూలసిద్ధి జ్ఞానమే.

అన్ని జ్ఞానాలకి మూలం తత్త్వజ్ఞానం.

శాస్త్రాలన్నీ అంగాలైతే, తత్త్వజ్ఞానం అంగి.

జ్ఞానాన్ని దేహం అనుకుంటే, తత్త్వజ్ఞానం ఊపిరి.

మామూలుగా మనం అభ్యసించే విజ్ఞానంపట్ల జిజ్ఞాస ఈ జడ ప్రపంచానికి పరిమితం. కాని తత్త్వజ్ఞానంపట్ల జిజ్ఞాస భగవంతుడి సాక్షాత్కారానికి దారితీస్తుంది. మనం ఎన్నిరకాల సుఖసౌఖ్యాలు అనుభవిస్తున్నా కడుపునిండా ఆహారంకన్నా అవేవీ ఎక్కువ కాదుకదా! అలాగే ప్రపంచంలోని ఏ భాగ్యమూ కూడా జ్ఞానానికి పర్యాయమూ కాదు, ప్రత్యామ్నాయమూ కాదు. తిండి తినకపోతే శరీరం శుష్కిస్తుంది. అలాగే తత్త్వచింతన లేని జీవితం శుష్కిస్తుంది.

## ఆధ్యాత్మ ఖని

విజ్ఞానం సంపాదించాలంటే లేబొరేటరీల్లో ప్రయోగాలు చేస్తాం. మరి తత్త్వజ్ఞానం సంపాదించాలంటే...? శాస్త్రాలను అధ్యయనం చేయటమే మార్గం.

సైన్సు ప్రయోగాల లక్ష్యం భౌతికంగా కనుపించే విజయసాధన. తత్త్వజ్ఞాన సాధన లక్ష్యం – ఈ ఇంద్రియాల వాసనలకు అతీతమైన పరమార్థం.

ఈ సాధనకి ఆధారం ఆగమాలు, వేదాలు, వేదాంగాలు, ఇతిహాసాలు, పురాణాలు, స్మృతులు మొదలైనవి. వేదాలు ప్రధానంగా నాలుగు. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణ వేదం. వీటిని నిర్ధారించేవే మంత్రబ్రాహ్మణ ఆరణ్యకాలు, ఉపనిషత్తులు. వేదాలకి ఆరు అంగాలున్నాయి. వాటిని శిక్ష, వ్యాకరణ, నిరుక్త, ఛందస్సు, జ్యోతిష్యం, కల్పం అంటారు. ఇతిహాసాలు మూడు : రామాయణం, మహాభారతం, భాగవతం.

ఇక పురాణాల్లో మహా పురాణాలు, ఉప పురాణాలు అని రెండు రకాలు. భాగవతం, వరాహపురాణం, వామన పురాణం, విష్ణు పురాణం మొదలైనవి మహా పురాణాలు. మహావరాహ, నారసింహ, మహాకూర్మ మొదలైనవి ఉప పురాణాలు. వాటిల్లో కూడా సాత్త్విక, రాజస, తామసాలని భేదాలున్నాయి. వ్యాస స్మృతి, మనుస్మృతి మొదలైనవి స్మృతులు... ఇవన్నీ తత్త్వజ్ఞానాన్ని సముపార్జించటానికి మూలమైన శాస్త్రప్రపంచ స్వరూపం.

ప్రతిమనిషీ ఏదో ఒక సమయంలో జీవిత పరమార్థాన్ని అన్వేషించటం ఆరంభిస్తాడు. కాని, ఇంత విశాలమైన, లోతైన తత్త్వజ్ఞాన సాగరాన్ని మథించడం ఎలా?

దీనికి జవాబు మధ్వాచార్యుల బోధనలో లభిస్తోంది.

అసలు జరిగిందేమిటి?

ఈ జ్ఞాన సముద్రంలో ఆధ్యాత్మిక మథనం కాల ప్రవాహంలో అనేక కల్లోలాల్ని ఎదుర్కొంది. కృతయుగంలో తత్త్వజ్ఞానం ఉచ్చస్థితిలో వుంటే, అది ద్వాపరయుగం

చివరిభాగంలో నీచస్థితికి దిగజారింది. గౌతమ ముని శాపంవల్ల తత్త్వజ్ఞాన ప్రపంచం అంతా అంధకారమయమై పోయింది. వేదాల్లో అనేక భాగాలు మరుగున పడిపోయాయి. మిగిలినవి మలినమయ్యాయి. వేదాంగాల పరిస్థితీ కూడా అంతే. అప్పటికింకా మహాభారతం వగైరాల రచన జరగలేదు. వేదార్థాలు తెలిసిన భూలోకంలోని ఋషులు, మునులు అంతా గౌతముడి శాపంవల్ల జ్ఞానం కోల్పోయారు.

అప్పుడు...

భగవంతుడే శ్రీ వేదవ్యాసుల రూపంలో అవతరించి, వేదాలను, వేదాంగాలను పునరుద్ధరించారు. వాటి అధ్యయనం సులభతరం చేశారు. శ్రీవేదవ్యాసులు మహాభారతం వంటి ఇతర రచనలద్వారా వేదార్థ నిర్ణయం కూడా సులభం చేశారు. వారి బ్రహ్మసూత్రాలు ఒక్కటి చాలు – సకల శాస్త్రాల సారాన్ని ఔపోసన పట్టడానికి.

కృతయుగంలో మరో విపరీతం జరిగింది. దుష్టులు కూడా తత్త్వజ్ఞానం తెలుసుకొని దుష్ప్రయోజనాలకోసం దానిని ఉపయోగిస్తూ వచ్చారు. ఆ క్రమంలో అయోగ్యుల చేతిలోకి శాస్త్రాలు చేరటంతో, దాని పరిహారంకోసం తరువాత కాలంలో బుద్ధావతారం ఆవిర్భవించింది. దుష్టుల్ని మాటలతో మోహపరిచి, శాస్త్రాలకు వాళ్ళని దూరం చేయటం ఆ అవతార ప్రయోజనం. అందువల్ల చివరికి తత్త్వజ్ఞానం యోగ్యులకి మాత్రమే అందుబాటులోకి వచ్చింది.

**తత్త్వవిప్లవం**

క్రమంగా కలి ప్రభావంవల్ల ప్రజల్లో తత్త్వచింతన సన్నగిల్లిపోయింది. భోగభాగ్యాలమీదే మనసు నిలిపి భగవంతుణ్ణి మరిచిపోయారు. ఇలాంటి ప్రజల్లోంచే కొందరు పండితులనబడేవారినుంచి శాస్త్రాలపై వికృత వ్యాఖ్యానాలు రావటం ఆరంభమైంది.

ఈ వ్యాఖ్యానాలు అనేక రకాలుగా వచ్చాయి. గతంలో గౌతముడి శాపంవల్ల వేదాలను మర్చిపోయినట్లే, ఇలాంటి దుర్భాష్యాలమూలంగా శ్రీవేదవ్యాసుల రచనా లక్ష్యం మరుగున పడిపోయింది. శాస్త్రాన్ని నమ్మనివాళ్ళూ, శాస్త్రాలకి విపరీత భాష్యాలు చెప్పేవాళ్ళూ కలిసి ఆధ్యాత్మిక ప్రపంచాన్ని భ్రష్టు పట్టించారు. ఫలితం? పట్టపగలే చిమ్మచీకటి అలుము కొన్నట్లుగా ఆధ్యాత్మిక ప్రపంచం అంతా అంధకారమయమైపోయింది.

ఈ పరిస్థితిలో వేదాల స్వరూపాన్ని, ఉనికిని అంగీకరించని సిద్ధాంతాలు కొన్ని, అంగీకరించినా, వాటి యథార్థ స్వరూపాన్ని వివరించకుండా విపరీత జ్ఞానాన్నిచ్చే

వ్యాఖ్యానాలతో సిద్ధాంతాలు కొన్ని.... ఇలా ప్రచారంలోకి వచ్చాయి. ఈ అయోమయ స్థితి ఫలితమేమిటయ్యా అంటే – అసలు భగవంతుడనే వాడున్నాడా– అని ప్రశ్నించేవాళ్ళు మొదలయ్యారు. ప్రపంచమంతా బ్రహ్మమే అనేవాళ్ళు కొంతమంది, జీవులందరూ బ్రహ్మలే అనేవాళ్ళు కొంతమంది. కొంతమందిది శూన్యవాదం. మరికొంతమందిది చైతన్యవాదం. ఇంకొంతమందిది జడవాదం. ఇంకా–దైవవాదులు, కర్మవాదులు, జ్ఞానవాదులు, జ్ఞానకర్మ సముచ్చయవాదులు, కర్మత్యాగవాదులు, ఉభయత్యాగవాదులు... ఇలా భిన్న వాదులు పుట్టుకొచ్చారు. బ్రహ్మ యొక్క అపూర్ణత్వవాదులు వేరు, స్వయం బ్రహ్మత్వవాదులు వేరు, బ్రహ్మపూర్ణత్వానికి పరిమితిని ఆపాదించినవాళ్ళు వేరు.

బ్రహ్మ గుణాలను వర్ణించే వాళ్ళున్నట్లే, బ్రహ్మ నిర్గుణుడని వాదించేవాళ్ళూ వచ్చారు. బ్రహ్మకి ఆకారాన్ని ఆపాదించేవాళ్ళున్నట్లే, ఆ పరమాత్మకి ఆకారమే లేదనేవాళ్ళూ వచ్చారు. ఈ వాదప్రతివాదాలు ఏ స్థాయికి వెళ్ళాయంటే – కొంతమంది ప్రత్యక్షవాదులు, కొంతమంది యుక్తివాదులు, కొంతమంది కేవలం ఆగమవాదులు, కొంతమంది కేవలం త్యాగవాదులు, కొంతమంది భోగవాదులు... వేదాల్ని ఒప్పుకొన్న వాళ్ళు కూడా వాటి తత్త్వం అవైదికం అని నమ్ముతూవచ్చారు. ఇంకా, వేదవాదులు, ఉపనిషద్వాదులు, జాతివాదులు, జాతి అతీత తత్త్వవాదులు, ప్రత్యక్షమే ప్రమాణం అనే వాళ్ళూ....

ఇలా ఆధ్యాత్మ ప్రపంచమంతా భిన్న భిన్న వాదులతో నిండిపోయింది. భిన్న సిద్ధాంతాలు, భిన్న వ్యాఖ్యానాలు పుట్టుకొచ్చి ప్రజలకి సరైన మార్గదర్శనం లేని అయోమయస్థితి ముదిరిపోయింది. ఈ సంక్లిష్ట వాతావరణం వల్ల అసత్యం, అధర్మం పెచ్చు పెరిగి అశాంతి అన్నిచోట్లా వ్యాపిస్తోంది. త్యాగం బదులు భోగం, ప్రీతి బదులు ద్వేషం విజృంభించసాగాయి. పశుబలి, నరబలి, తంత్రవిద్య వగైరా అవలక్షణాలు బాగా వృద్ధి చెందుతూ వచ్చాయి. గురువుల్ని భ్రష్టాచారాలు ఆవహించాయి. దీని ప్రభావం రాజకీయ వర్గాలమీద కూడా ప్రసరించింది.

దాంతో నిత్యజీవితంలో భద్రత నశించింది. దొంగలనుంచి ప్రజలను రక్షించాల్సిన రాజులే దొంగలైపోయి ప్రజల్ని భక్షించటం మొదలైంది. వాళ్ళ భోగలాలస కోసం మారణహోమాలు జరిగాయి. అమాయకులు, బలహీనులు, స్త్రీలు వీటికి బలైపోయారు. ధార్మిక భ్రష్టాచారాలు, రాజకీయ భ్రష్టాచారాలు అన్నిటికీ మూలకారణం ఏమిటో కనిపెట్టి పరిహారం చేసే మార్గమే కనిపించకుండా పోయేటంత దుస్థితి. సాత్వికులు వున్నారు. కానీ, భ్రష్టాచారాల్ని ఖండించే శక్తిసామర్థ్యాలు వాళ్ళకి లేకుండా పోయాయి.

### మధ్వాచార్య

అలాంటి గందరగోళ దుస్థితిలో జిజ్ఞాసువులంతా మార్గాంతరం కోసం ఎదురుతెన్నులు చూస్తూవుండిపోయారు. వాళ్ళకి కావలసింది ఒక గురువు.

వైదికమైన శాస్త్రాల నన్నింటినీ సమన్వయంచేసి, యథార్థ పరతత్వాన్ని ఆవిష్కరించి, ప్రజలకు ఆధ్యాత్మిక జీవనమార్గాన్ని చూపించే గురువు కోసమే వారంతా తపించారు. తపస్సు చేశారు.

అప్పుడు...

అజ్ఞానాంధకారంలో మునిగిపోయిన ఈ ప్రపంచానికి ఆధ్యాత్మిక వెలుగు ప్రసాదించటానికి జన్మనెత్తిన అవతార పురుషులు, జ్ఞానజ్యోతి మధ్వాచార్యులు.

పుట్టుకతో ఆయనపేరు వాసుదేవ.

1199 నుంచి 1280 వరకూ వారి భౌతిక జీవన యాత్రలో ఆయన తన అసమానమైన పాండిత్య ప్రతిభతో తాత్విక ప్రపంచంలో అపూర్వమైన ఆధ్యాత్మిక కాంతిని ప్రసరింపజేశారు. ప్రపంచానికి అమావాస్యనాటి రాత్రి సూర్యోదయమయినంత విశేష అనుభవం కలిగించారు. ఈ భౌతిక ప్రపంచంనుంచి పరమాత్ముడి వరకూ సకల విషయాలలో పరిపూర్ణజ్ఞానం ఇచ్చిన మార్గదర్శకులు కనుక పూర్ణప్రజ్ఞులయ్యారు.

కాలానుగుణంగా చూసినట్లయితే, భరతభూమి మనకి ప్రసాదించిన వైదిక మతాచార్యుల్లో ఆయన చివరివారు.

ఆయన సిద్ధాంతమే చివరిది.

అదే ద్వైత సిద్ధాంతం. మధ్వమత స్వరూపం.

### పరశురామ క్షేత్రం

ఆయన అవతరించటానికి ముందు జరిగినదేమిటంటే...

ఒకప్పుడు క్షత్రియులంతా స్వార్థంతో లోక నాశకులైనప్పుడు శ్రీమహావిష్ణువు స్వయంగా పరశురాముని అవతారం ఎత్తి, 21సార్లు దండెత్తి దుష్ట క్షత్రియుల్ని సంహరించారు. దాంతో శిష్టులైన క్షత్రియులు మళ్ళీ తలెత్తుకోగలిగారు.

పరశురాముడు తాను జయించిన భూమండలాన్ని బ్రాహ్మణులకు దానం చేశాడు. తనకోసం మరో భూప్రదేశాన్ని నిర్మించుకోవాలనుకున్నాడు. తన చేతిలో గొడ్డలిని బాణంలా

ప్రయోగించాడు. దాని ధాటికి సాగరంలో వరుణుడు తగ్గాడు. ఆ ప్రయోగాన్ని భగవంతుడి ఆదేశంగా భావించి, పశ్చిమ సముద్రపు ఒడ్డునుంచి వెనక్కి జరిగాడు. దాంతో వాసయోగ్యమైన భూమిపైకి లేచింది. అదే పరశురామ క్షేత్రం. రజతపీఠ (ఉడుపి), కుమారాద్రి (సుబ్రహ్మణ్య), కుంభాసి, కోటీశ్వర, క్రూడు (శంకర నారాయణ), గోకర్ణ, మూకాంబికా (కొల్లూరు) – వీటినే పరశురామ క్షేత్రం యొక్క సప్తమహాక్షేత్రాలని పిలుస్తారు.

ఆ క్షేత్ర రక్షణకోసం పరశురాముడే ఒక రాజుని సృష్టించాడు. రామభోజుడు అనే పేరుతో ఆ రాజు ఆ క్షేత్రాన్ని అభివృద్ధి పథంలో నడిపించాడు.

ఆ రాజు ఒకసారి ఒక యజ్ఞం చేయడంకోసం భూమిని బంగారు నాగలితో దున్నుతుంటే ఆ నాగలి కొర్రుకి తగిలి ఒక కాలనాగు మరణించింది. నిజానికి ఆ కాలనాగు యజ్ఞం భంగం చేయటానికి వచ్చిన రాక్షసుడు. రాక్షస సంహారం పాపంకాదు, అయినప్పటికీ సర్పహత్యాదోషం పోగొట్టు కోవడంకోసం పరశురాముడి ఆదేశంమీద ఆ రాజు అయిదు యోజనాల విస్తీర్ణంగల రజతపీఠం నిర్మించి, దానిమధ్యలో బంగారు శేషాసనం కూడా స్థాపించాడు. ఆ బంగారు శేషాసనం మీదనే రాజు చేత పరశురాముడు యజ్ఞం చేయించాడు. యజ్ఞం తరువాత ఆ పీఠం భూమిలో కలిసిపోయింది. ఆ ప్రదేశాన్నే రజతపీఠం అంటారు.

అనంతాసనం (శేషాసనం) మీద పరశురాముడే స్వయంగా లింగాకారంలో సన్నిహితుడైనాడు. ఆయనే అనంతేశ్వరుడు. ఈ అనంతాసన దేవస్థానానికి ఈశాన్యంలో అనంత సరోవరం అనే పుష్కరిణి నిర్మితమయింది. దేవస్థానం ముందు భాగంలో ఇంకో పుష్కరిణి వుంది. రజతపీఠం చుట్టూ నాలుగువైపులా కడియాళి. పుత్తూరు, కనర్పాడి, బైలూరు అనే దుర్గాలయాలు, నాలుగు ఉపదిక్కుల్లో తాంగోడు, మాంగోడు, అరితోడు, ముచ్చిలకూడు అనే నాగాలయాలు వెలిశాయి.

మరో పౌరాణిక కథ ప్రకారం – దక్ష ప్రజాపతి తన కుమార్తెలయిన అశ్విని మొదలైన 27 నక్షత్రాభిమాన దేవతలను చంద్రుడికిచ్చి వివాహం చేశాడు. అయితే ఆ 27 మందిలోనూ రోహిణి పట్లే చంద్రుడు ఎక్కువ ప్రేమ చూపించడంతో ఆగ్రహించిన మిగతా భార్యలు భర్తమీద తండ్రికి ఫిర్యాదు చేశారు. క్రోధావేశంలో మునిగిన దక్షుడు వెంటనే చంద్రుడి తేజస్సు అంతా క్షీణించిపోవాలని శపించాడు. ఆ శాపంనుంచి విముక్తిపొంది, మళ్ళీ తన పూర్వతేజస్సుని పొందటంకోసం చంద్రుడు తపస్సు చేసిన స్థలం కూడా ఈ రజత పీఠమే. అనంతేశ్వరుడికి కుడివైపున వున్న ఒక అడవిలో చంద్రుడు తపస్సు చేయటంవల్లనే ఆ అడవిని అభయారణ్యం అని పిలుస్తారు.

చంద్రుడి తపస్సుకి మెచ్చిన శివుడు అక్కడ అనంతేశ్వరుడి ముందున్న పుష్కరిణిలో ప్రత్యక్షమై, చంద్రుడికి పాత తేజస్సు క్రమంగా పెరిగేలా వరమిచ్చాడు. అందుకే ఆ పుష్కరిణి చంద్రేశ్వరి, చంద్రమౌళీశ్వర అని ప్రసిద్ధి చెందింది. పుష్కరిణే దేవస్థాన మయింది. కొంతభాగం మాత్రం పుష్కరిణిగా వుండిపోయి చంద్ర పుష్కరిణిగా ప్రసిద్ధిపొందింది. చంద్రుడి శాప పరిహార స్మారకంగా ఆ క్షేత్రం 'ఉడుపి'గా ప్రచారంలోకి వచ్చింది. 'ఉడు' అంటే నక్షత్రాలు, 'ఉడుప' అంటే నక్షత్రాలకు అధిపతి అయిన చంద్రుడు.



శ్రీ అనంతేశ్వరస్వామి, ఉడుపి

అనంతేశ్వరుడు నారాయణుడు. ఆయనకి ముందు భాగంలో శివుడు చంద్రమౌళీశ్వరుడు. ఆయన విష్ణువైతే ఈయన వీర వైష్ణవుడు. అంటే విష్ణువుని చూపించేవాడు. విష్ణువుకి ముందున్నాడు. ఈతడు మనోనియామకుడు. 'భకుతజన ముందే నీనవర హిందె' అన్న దాసవాణిలో ఇది స్పష్టమవుతుంది.

## అవతార భూమి

**ఈ** ఉడుపికి దగ్గరలోని పవిత్ర పుణ్యక్షేత్రం పాజక. ఇక్కడే అవతార పురుషులైన మధ్వాచార్యులు అవతరించారు. పరశురామ క్షేత్రాలలో ఇదొక అపూర్వ స్థలం. దానికి పడమటన విమానగిరి, దానిమీద పరశురాముడు ప్రతిష్ఠించిన దుర్గా సన్నిధానం వున్నాయి. దానికి నైరుతి దిక్కున పరశురామకొండ వుంది. దానిలో సుందరమయిన పరశురామమూర్తి వున్నారు.

పాజకానికి నలుదిక్కులలోనూ నాలుగు తీర్థాలున్నాయి. పరశు తీర్థం, ధనుతీర్థం, బాణ తీర్థం, గదాతీర్థం అనే ఈ నాలుగూ పరశురామ దేవుని 'పరశు' మొదలైన ఆయుధాల చేత ఉద్భవించినవి. అందుకే ఆ క్షేత్రాన్ని 'పాజక' అంటారు. పరశురామదేవుడి ఆయుధాలు పాపుల్ని సంహరించినట్లే అతని ఆయుధాలచేత నిర్మింపబడిన ఈ తీర్థాలు సకల పాపాల్ని నాశనం చేసే దివ్యతీర్థాలు.

పరశురాముడు ఈ జగత్తుకే జనకుడు. దుర్గాదేవి జగన్మాత. వాళ్ళిద్దరూ నివసించిన 'పాజక' మధ్వాచార్యులకు జన్మభూమిగా వెలుగొందింది.

మరో విశేషమేమిటంటే;

పాండవులు అజ్ఞాతవాస సమయంలో పాచకులై ఈ యుగంలో అవతారమెత్తటానికి ఎంచుకున్న స్థలం 'పాజక క్షేత్రం'. అరణ్య వాసకాలంలో పాండవులంతా ఈ ప్రదేశాన్ని సందర్శించారని ప్రతీతి.

## జగద్గురువుని తల్లిదండ్రులు

ఈ పాజక క్షేత్రంలో 'నడిల్లాయ' అనే ఇంటి పేరుతో మధ్యగేహ అనే బ్రాహ్మణోత్తముడు వుండేవారు. అపురూపవతియైన వేదవతి ఆయన భార్య. వాళ్ళు అపురూపమైన దాంపత్యం సాగిస్తూ వుండేవాళ్లు. మధ్యగేహుడి జీవితం ఎంత సాత్వికమయిందంటే – ఆయన ప్రతిరోజూ ఉడుపికి వెళ్ళి అనంతేశ్వరుడి సన్నిధిలో పురాణ ప్రవచనం చేస్తూండేవారు. వేదాలు, ఉపనిషత్తులు వగైరా సనాతన ధర్మ శాస్త్రాలలో ఇతిహాస, పురాణాలలో ఆయనకు అపార పాండిత్యం వుండేది. ఆ పాండిత్యానికి తగిన వినయం ఆయనకు అలంకారంగా భాసించేది.

పరిణతి చెందిన తన పాండిత్యంతో ఆయన రామాయణ, భారతాది పురాణ పఠనం చేస్తూంటే, దేవతలు సయితం తన్మయులైపోతారా అన్నంత జనరంజకంగా వుండేది. అలా ప్రచారంలోకి వచ్చిన ఈ బ్రాహ్మణోత్తముడ్ని అందరూ 'భట్ట' అని పిలిచేవారు.

ఆ దంపతులకి ఇద్దరు మగపిల్లలు పుట్టి శైశవ దశలోనే చనిపోయారు. ఒక ఆడపిల్లమాత్రం మిగిలింది. కాని వంశోద్ధారకుడైన కొడుకు పుట్టాలన్న ఆరాటం వదిలిపెట్టలేదు. దానికి తోడుగా తత్త్వం తెలుసుకోవాలన్న జిజ్ఞాస కూడా వాళ్లను వెంటాడింది.

స్వతహాగా వేదాలు తదితర శాస్త్రాల్లో పాండిత్యం ఉండటం చేత వాళ్లకి ఇతర సిద్ధాంతాల గురించి పరిచయం ఉంది. వాటిని అంగీకరించినప్పటికీ వాళ్ల ఆలోచన సరళి సజావుగా సాగలేదు. నిజానికి దేవుని అస్తిత్వం విషయంలో వాళ్లకి సందేహం లేదు. కాని దేవుడు నిర్గుణుడు, నిరాకారుడు, జగత్‌మిథ్య మొదలైన వాదాల మూలంగా భగవత్‌తత్త్వాల విషయంలో ఒక సందిగ్ధత వాళ్ల మనసుల్ని అలుముకొని ఉంది. వేదాల నిరూపణకి ఆ సిద్ధాంతాల ఆలోచనాసరళికి పొందిక లేకపోవటంతో మనసులో ఏదో ఒక అలజడి. దానివల్ల వాళ్ల దైనందిన ఉపాసనకి అంతరాయం.

ఈ నేపథ్యంలో తన తత్త్వ జిజ్ఞాసను పరిష్కరించగల్గిన పూర్ణ ప్రజ్ఞావంతుడైన కొడుకు కలిగితే ఎంత బావుంటుంది అని ఆయనకు అనిపించింది. ఈ అన్వేషణలో ఒక ఉపాయం తట్టింది. 'కర్దముడు కపిల మహామునిని, పరాశరులు శ్రీ వేదవ్యాసుని పుత్రులుగా పొందారు. పాండురాజు కూడా భీమునితో కూడిన పాండవుల్ని పుత్రులుగా పొందారు. వారికి ఆ సంతతి ఎలా లభించింది? భగవంతుడైన శ్రీహరిని ఆరాధించడం వల్లనే కదా! మా కులదైవం కూడా అనంతాసనుడు శ్రీహరే కదా! కాబట్టి మనం కూడా శ్రీహరిని ఆరాధించి అంతటి లోకోత్తరుడైన కొడుకుని ఎందుకు పొందకూడదు?' అని ఒక నిర్ణయానికి వచ్చారు.

## రజత పీఠంలో సువర్ణసేవ

అలా దైవప్రేరణతో నడిల్లాయరు (మధ్యగేహుడు) భార్యతో కలసి ఉడుపికి వచ్చారు. అసలు వాళ్ళ మూల స్థానం ఉడుపి దగ్గర శివళ్ళి. కారణాంతరాలవల్ల ఇంతకాలం పాజక క్షేత్రంలో ఉండాల్సి వచ్చినప్పటికీ వాళ్లకిప్పుడు సాధనక్షేత్రం ఉడుపియే అయింది.

శివళ్ళి వచ్చిన దగ్గర్నుంచి వాళ్లు కలియుగంలో అసాధారణమైన రీతిలో శ్రీహరిని ఆరాధించడం మొదలుపెట్టారు. కఠినాతికఠినమైన అనేక వ్రతాలు చేస్తూ వచ్చారు. వాటిల్లో పయోవ్రతం, విష్ణుపంచక వ్రతం, భీష్మ పంచక వ్రతం మొదలైనవి ఉన్నాయి. ఇక ఏకాదశి, కృష్ణాష్టమి, చాతుర్మాస్యం మొదలైన అభ్యాసాలు నిత్యకృత్యమైపోయాయి.

ఇన్ని చేస్తూ ఉన్నా వాళ్లు పురాణ ప్రవచనాన్ని విడిచిపెట్టలేదు. పురాణ ప్రవచనాన్ని మించిన తపస్సేముంటుంది? శమదమాదులు వారి సహజ గుణాలయ్యాయి. వాళ్ల ఆరాధనాభ్యాసం ఏ స్థాయిలో సాగుతున్నదంటే, చూసినవాళ్లకి – వామనుడి జననంకోసం అదితి–కశ్యపులు చేసిన తపస్సు గుర్తుకు వస్తుంది. అదితి–కశ్యపులు కోరుకున్నది వామనావతారంలో భగవంతుడి సాక్షాత్కారం అయితే, నడిల్లాయరు దంపతుల సేవ జీవోత్తముడైన వాయుదేవుడి అవతారం కోసం.

అలా రోజులు, నెలలు, ఋతువులు, సంవత్సరాలు గడుస్తున్నాయి. మొత్తం పన్నెండు సంవత్సరాలపాటు సాగించిన కఠోరమైన ఉపాసన – ద్వాదశస్తోత్రం రచించిన మధ్వాచార్యుల అవతారానికి కారణమయ్యింది.

భగవంతుడు అనుగ్రహించాడు అనటానికి సంకేతంగా వేదవతి గర్భం ధరించింది. (దేవకీదేవి ఎలాగైతే శ్రీకృష్ణ జననానికి ముందు గర్భందాల్చి శోభిల్లిందో అలాగే వేదవతి కూడా శోభిల్లింది.) తొమ్మిది మాసాలు నిండాక ప్రసవమయ్యేరోజు దగ్గర పడుతోంది.

అయినా నడిల్లాయరు మాత్రం ప్రతిరోజు ఉడుపికి వెళ్లి తన నిత్య పురాణసేవని కొనసాగిస్తూ ఉన్నారు.

విజయదశమినాడు అభిజిత్ ముహూర్తంలో ఆకాశంలో సూర్యుడు మహాతేజస్సుతో ప్రకాశిస్తున్న సమయంలో వేదవతికి సుఖప్రసవం జరిగింది. తేజోవంతుడైన కొడుకు జన్మించాడు. అతడు ఇతర శిశువుల్లాగ పుడుతూనే గర్భవాస దుఃఖంతో పుట్టలేదు. ఈ శిశువు కాంతి ఊహాతీతమైనది. ముఖం ఆనందంతో వెలిగిపోతోంది. "నిజంగానే వాయుమూర్తి జన్మించాడు" అనుకుంటూ ఆ దంపతులు సంభ్రమానందాలలో మునిగిపోయారు.

ఆ రోజు మధ్యగేహులు ఉడుపిలో పురాణ పఠనం ముగించుకుని ఇంటికి వెళుతున్నారు. ఎటువంటి సమయాల్లో కూడా జ్ఞానకార్యాన్ని విడిచిపెట్టని దీక్ష ఆయనది. చూసేవాళ్లకి సంసారాన్ని అపేక్షిస్తున్నట్లుగా అనిపిస్తుంది. కాని నిజంగా స్వధర్మాన్ని ఆచరిస్తూ కూడా సంసారం సుఖంగా సాగుతోందంటే అది దైవనిర్ణయం. దీనిని తెలుసుకోలేని వారు తమ స్వంతకార్యాల కోసం స్వధర్మాన్ని పరిత్యాగం చేస్తారు. అందువల్ల లభించే అరిష్టాలే ధర్మహాని, దుఃఖప్రాప్తి.



శ్రీ మధ్వాచార్యుల వారు అవతరించిన ఇల్లు పాజకక్షేత్రం

భార్య ప్రసవ వార్త తెలియకుండానే ఆ రోజు పురాణపఠనం పూర్తి చేసుకుని ఇంటికి వెళుతున్న నడిల్లాయరుకి దారిలో అనేక శుభ శకునాలు కనిపించాయి.

మంగళవాయిద్యాలతో సాగుతున్న ఊరేగింపు ఆయనకు ఎదురయ్యింది.

ఆకాశంలో దేవదుందుభులు మ్రోగినట్లనిపించింది.

ఇవి రెండూ ఏకకాలంలో సంభవించాయి. దారిలో ఎదురైన జనం నడిల్లాయరుకి వారి సుపుత్ర జననం గురించి ఉల్లాసంగా తెలిపారు. అలా ఎన్ని శుభ శకునాలు. అవన్నీ అందిస్తున్న ఆనందంతో నడిల్లాయరు ఇంటికి వెళ్లి పిల్లవాడి ముఖం చూడగానే ఆనందాతిశయంలో మునిగిపోయారు. రాముడు శిశువు రూపంలో ఉన్నప్పుడు చూసిన దశరథుడికి కలిగిన ఆనందోత్సాహమే నడిల్లాయరుకీ కలిగింది.

ఆ మధుర క్షణంలో మధ్యగేహులు భగవంతుని మనసారా స్మరించారు. "స్వామీ! మేం కోరుకున్నట్లే మాకు మగపిల్లవాణ్ణి ప్రసాదించావు. అలాగే అతనికి తత్త్వజ్ఞానాన్ని కూడా తెలుసుకొనే భాగ్యాన్ని కలిగించు." అని వేడుకొన్నారు. క్రమంగా జాతకర్మ తదితర సంస్కారాల్ని పిల్లవాడికి జరిపించారు.

ఆనందోత్సాహాలతో నామకరణం చేశారు. దేవతలకు కూడా ఆనందం కలిగేలా ఆ చిరంజీవికి 'వాసుదేవ' అనే పేరు పెట్టారు.

## నడిల్లాయరుకి గోదానంతో తత్త్వజ్ఞానం

నడిల్లాయరుకి ఆధ్యాత్మిక శ్రీమంతమేకాని, భౌతికమైన సంపద ఏమీలేదు. ఎంతటి పేదరికమంటే, పుట్టిన పిల్లవాడికి పాలు కూడా లేని పరిస్థితి. అయితే ఆ చిరంజీవి ముఖంలోని తేజస్సు చూపరులను ఆకర్షించేది. మూడిల్లాయరు అనే శ్రీమంతుడు నడిల్లాయరుకి ఒక ఆవుని దానం చేశాడు. ఆ దానం అక్షయమై మూడిల్లాయరుకి జ్ఞానప్రాప్తి సాధనమయింది.

పాత్రుడైనవాడికి చేసే దానం అనంతం అవుతుంది అన్నది శాస్త్రవాణి. మూడిల్లాయరు విషయంలో జరిగిందదే. వారు వృద్ధులవటంవల్ల కొంతకాలానికి కాలం చేయక తప్పలేదు. కాలక్రమంలో తమ ఇంట్లోనే తమ కొడుక్కే ఆయన కొడుకుగా జన్మించాడు.

ఇందులో అసహజమేముంది? తనకుతానుగా బృహస్పతి తన కొడుకైన భరద్వాజ మునికి కొడుకై ద్రోణాచార్యుడిగా పుట్టలేదా? పైగా వారికి పరశురామ శిష్యత్వం లభించింది. వీరికి పరశురామ క్షేత్రంలో అవతరించిన మధ్వాచార్యుల అనుగ్రహ భాషణాన్ని వినే

సుయోగం లభించింది. సాధన అంటే ఇదే. గోదానం జ్ఞానప్రాప్తికి సాధనమవుతుంది అనే ఆర్యోక్తికి ఇది నిదర్శనం.

## హరి సమర్పణ

వాసుదేవుడికి మూడు మాసాల వయస్సు వచ్చింది. అంటే - మొదటిసారిగా ఇంట్లోంచి బయటికి తీసుకువెళ్ళే సమయం. శిశువుకి అప్పుడు ఆచరించాల్సిన కర్మ 'నిష్క్రమణ'.

మధ్యగేహులు ధర్మం తెలిసిన వ్యక్తి కనుక ఈ 'నిష్క్రమణ' అర్థవంతంగా వుండాలని భావించారు. శిశువును నేరుగా ఉడుపికి తీసుకువెళ్ళారు. ఏ అనంతేశ్వరుడి కరుణవల్ల తాను ఈ శిశువును పొందానని నమ్ముతున్నారో ఆ దైవం పాదాలముందు శిశువుని వుంచారు. "స్వామీ! ఇది నీ ప్రసాదం. ఈ శిశువుకి తల్లీ, దండ్రీ అన్నీ నీవే అయి మార్గదర్శనం చేయాలి" అంటూ ప్రార్థన చేశారు.

అలా చేయాలని మధ్యగేహులుకి ఎందుకు అనిపించింది?

"కెరియసీరను కెరిగెజల్లివరవపడె దవరంతె కాణిరో, హరియ కరుణ దళాద భాగ్యవ హరి సమర్పణ మాడిబదుకిరో..." (సూర్యుడు ఉదయించే ముందరే వెలుగు ప్రసరిస్తుంది - మధ్వతత్త్వం)

అంటే - మధ్వాచార్యులు శైశవదశలో వుండగానే ఈ తత్త్వ ప్రభావాన్ని మధ్యగేహులు చవిచూశారు. ఈ రోజు అనంతేశ్వరుడికి సమర్పణ చేసిన ఆ పుత్రరత్నమే ఒక అనర్ఘ రత్నమయింది.

## భయపడ్డ భూతం

ఒకసారి సంక్రాంతి పండగనాడు అనంతేశ్వరుడి ఆలయంలో విశేషమైన ఉత్సవం జరిగింది. ఎంత త్వరగా ముగించుకుని వెళ్దామన్నా చీకటి పడిపోయింది. మధ్యగేహులు తన పరివారంతో కలిసి పాజకకి బయల్దేరారు. దారిలో ఒక అడవిని దాటాల్సివుంది.

రాత్రి అయినా అలవాటైన దారే గదా చీకట్లో కూడా వెళ్లిపోగలం అనుకున్నారు. ఆ అడవిలో సగం దూరం వెళ్లేసరికి అకస్మాత్తుగా ఆ బృందంలో ఒకరు రక్తం కక్కుకుని కింద పడిపోయాడు. అందరికీ తోచిన కారణం ఒక్కటే. అక్కడ భూతం ఏదో వుంది. కాని భూతం వుంటే ముందు చిన్నపిల్లలకి కదా అలా (బాలగ్రహం) జరగాల్సింది! అంతా ఖంగారు పడసాగారు. మధ్యగేహులు భయంతో తన శిశువును అక్కున చేర్చుకున్నాడు.

అంతలో రక్తం కక్కుకుని పడిపోయిన మనిషిని ఆవహించిన భూతం మాట్లాడటం మొదలుపెట్టింది.

"ఎంత ధైర్యం మీకు? ఇది మా ప్రాంతం. ఇది మేం సంచరించే సమయం అని తెలిసే వస్తారా?... మీ మధ్యలో ఈ చిరంజీవి లేకుండావుంటే మీరెవ్వరూ ప్రాణాలతో మిగిలేవారు కాదు. ఇతడు సామాన్యుడు కాదు. సాక్షాత్తు లోకేశ్వరుడు. అందుకే మీరు బ్రతికిపోయారు..." అంటూ ఆ భూతం ప్రకృతిలో కలిసిపోయింది. ఆ సంఘటనతో అందరికీ బాలమధ్వుల మహిమ తొలిసారిగా అర్థమయింది.

(ఇప్పటికీ-మధ్వులను ఎవరైతే విగ్రహం రూపంలోగానీ, గ్రంథ రూపంలోగానీ ఇంట్లో వుంచుకుంటారో వారికి ఎలాంటి భూతప్రేతాల పీడవుండదన్నది నిర్ధారిత సత్యం. ఈ సంఘటన జరిగిన ప్రాంతం ఉడుపికి దగ్గర 'సందళి కేపాడి'గా ప్రసిద్ధి చెందింది.)

## అయ్యో! ఉలవలు తినేశాడే

ఒకసారి తల్లి వేదవతి పొరుగింటివారికి పనిలో సాయం చేద్దామని వెళ్లింది. వెళ్తూవెళ్తూ, ఒక గ్లాసు పాలు తన కూతురి చేతికిచ్చి, "తమ్ముడు ఏడిస్తే పట్టాలి సుమా" అని చెప్పి వెళ్లింది.

ఆమె అలా వెళ్లగానే పిల్లవాడు ఏడుపు మొదలుపెట్టాడు. అక్క పాలు పట్టింది. అయినా ఏడుపు ఆగలేదు. ఎక్కెక్కి ఏడుస్తున్నాడు. ఆకలితోనే ఏడుస్తున్నాడనుకొని, ఇంకా ఏం పెట్టాలా అని అక్క అటూఇటూ ఇల్లంతా గాలించింది. ఒక మూల పశువులకు వేయడం కోసం ఉంచిన ఉడకపెట్టిన ఉలవలు బుట్టలో కనిపించాయి. వెంటనే ఆ ఉలవల్ని తమ్ముడికి పెట్టింది. బుట్టెడూ తినేశాడు (మింగేశాడు). ఏడుపు ఆపేశాడు.

తల్లి ఇంటికి తిరిగొచ్చేసరికి సాయంత్రం అయిపోయింది. పిల్లాడు ఎలావున్నాడోనని ఆందోళనగా ఆమె పరుగుపరుగున వచ్చి చూసేసరికి, ఇంట్లో అంతా ప్రశాంతంగా వుంది. 'హమ్మయ్య' అనుకుంది. ఆ ఆనందం ఎంతోసేపు నిలవలేదు. "అమ్మా, తమ్ముడు ఏడిస్తే పాలు పట్టాను. ఇంకా ఏడుస్తూనే వుంటే ఉడకబెట్టిన ఉలవలు పట్టాను. తినేసి హాయిగా నిద్రపోతున్నాడు, చూడు" అంటున్న కూతురి మాటలు వింటూనే వేదవతి ప్రూస్పడిపోయింది. అన్నంకూడా తినలేని శిశువు ఉలవలు తినటమా? వయసులో వున్నవారే హరాయించుకోలేని ఉలవల్ని నా శిశువు తిన్నాడా?... నవనాడులూ క్రుంగిపోయాయి. కూతురిమీద కేకలేసింది. కాని ఆ పిల్లకేం తెలుసు - ఉలవలు అజీర్తి కారకమని.

అక్కడ్నుంచి ఆందోళనతో పిల్లవాడిని ఎత్తుకుంది. పిల్లవాడు అపస్మారక స్థితిలో వున్నాడని ఖంగారు ఖంగారుగా భర్తకి కబురుచేసింది. మధ్యగేహులు వచ్చారు. విషయం తెలిసి ఆయన వ్యథ చెందాడు. 'ఇప్పుడేం చేయగలమా' అనుకున్నారు. 'కంటికి కనుపించని ఆ ధన్వంతరినే ప్రార్థిద్దాం' అనుకుంటూ ఆ పిల్లవాడినలాగే పడుకోబెట్టి ప్రార్థనలు మొదలుపెట్టారు. ఈ సంగతంతా తెలిసి క్రమంగా ఊరిలో జనం అంతా అక్కడకొచ్చి ప్రార్థనలో పాల్గొన్నారు. వాళ్లందరికీ ప్రేమపాత్రుడు ఆ చిరంజీవి... కానీ క్రమంగా ఆ పిల్లవాడు కళ్లు తెరిచాడు. నవ్వుతున్నాడు... ఆడుతున్నాడు... కేరింతలు కొడుతున్నాడు. "ఏడాదైనా నిండని శిశువు ఉలవలు తిని జీర్ణించుకోవటమా! ఇతనేమన్నా భీమసేనుడా?" అనుకుంటూ అందరూ సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయారు.

## వృషభం వెనుక దేవ వృషభం

వాసుదేవుడికి ఏడాది నిండింది. ఒకరోజు ఉదయం నుంచి అకస్మాత్తుగా వాసుదేవుడు కనిపించకుండా పోయాడు.

ఎక్కడ? ఎక్కడ మా చిన్నారి? ఎక్కడ మా వాసుదేవుడు? ఏమయ్యాడు? ఎటు వెళ్ళాడు?– ... అనుకుంటూ తల్లిదండ్రులు ఆదుర్దాగా ఇల్లంతా వెతికారు.

ఇంటి ఆవరణ అంతా వెతికారు.

ఇరుగుపొరుగు ఇళ్లల్లో వెతికారు.

భయం, బెంగ వెంటాడుతుంటే, బావుల్లో, చెరువుల్లో కూడా గాలించారు... ఆందోళన పెరిగిపోయింది. ఏడాది వయసు కుర్రాడు తప్పిపోవటమా?

ఈ వార్త ఊరంతా వ్యాపించింది. వాసుదేవుడంటే అందరికీ ముద్దే కనుక ప్రతీ ఒక్కరూ ఆత్రుతగా వీథివీథి వెదికారు.

మధ్యాహ్న సమయం దాటింది. పిల్లవాడి ఆచూకీ తెలియలేదు. ఆ తల్లిదండ్రులు దుఃఖంలో మునిగిపోయారు. గ్రామస్థులంతా చేరి ఓదార్పు మాటలు చెబుతున్నారు. అంతలో అటుగా వెళ్తున్న ఒక పరదేశి ఈ హడావుడి చూసి, విషయం ఏమిటని ఆరా తీశాడు. గ్రామస్థులు చెప్పిన విషయం విని "అరె, నేను ఊళ్లోకి వచ్చేముందు ఒక ఎద్దు తోక పట్టుకుని మీరు చెప్పిన వయసుకల కుర్రాడు ఆ కొండ మీదకి వెళ్లటం చూశానే" అన్నాడు. అతని మాటలు ఎవరికీ నమ్మశక్యం కాలేదు. ఏడాది వయసు పిల్లవాడు ఎద్దు తోక పట్టుకొని కొండనెక్కటమా? అసంభవం.

మధ్యగేహుని ఇంట్లో పొలంలో పనిచేసే ఎద్దు వున్నాయి. ఒక ఎద్దు అడవిలో మేతకి ఉదయాన్నే వెళ్ళటం రోజూ జరిగేదే. అయితే ఎద్దు తోక పట్టుకుని పసివాడు వెళ్తాడా?

"ఊహు" అనుకున్నారు. మళ్ళీ దుఃఖం పొంగుకొస్తోంది. రోదిస్తున్న ఆ తల్లిదండ్రుల్ని ఓదార్చటం ఎవరివల్లా కాలేదు... అలా సూర్యాస్తమయం అయింది. చీకటి పడుతోంది.

అంతలో... పొద్దున్నే అడవికి వెళ్లిన ఎద్దు ఇంటికి తిరిగొచ్చింది. అందరూ అప్పుడు సంభ్రమంతో గమనించారు. ఆ ఎద్దు తోక పట్టుకుని వెనకాల ఏడాది వయసున్న వాసుదేవుడు వస్తున్నాడు!!

అంతా చేష్టలుడిగి చూస్తూ వుండిపోయారు. ఆ తల్లిదండ్రులకి ఒక్కసారిగా నిశీలో సూర్యోదయం అయినంత - దరిద్రుడికి చింతామణి దొరికినంత- జిజ్ఞాసువుకి తత్త్వ సాక్షాత్కారం అయినంత ఆనంద పరవశం కలిగింది. కన్నీటి బాష్పాలల్లా ఆనంద బాష్పాలయ్యాయి.

(పాజకక్షేత్రం నుంచి ఆగ్నేయ దిక్కునున్న ఒక కొండమీద వాసుదేవుని చిన్నచిన్న పాదాలముద్రలు, ఆ వృషభం పాదాల గుర్తులు ఇప్పటికీ కనిపిస్తాయి).

## చింతపిక్కలతో తీరిన ఋణం

ఒకరోజు వాసుదేవుడు సాటిపిల్లలతో ఆటలు ముగించుకుని ఇంటికి చేరాడు. అమ్మ పిలిచి, "మీ నాన్నగారిని భోజనానికి రమ్మను" అని చెప్పింది.

తండ్రి దగ్గరకెళ్లాడు. అమ్మ రమ్మంటోందని చెప్పాడు. మధ్యగేహుడికి తెలుసు. భోజనానికి వెళ్లాలి. కాని తమకి ఎద్దు అమ్మినవాడు వచ్చి కూర్చున్నాడు. అతనికి బాకీ ఇంకా తీరలేదు. అతన్ని వదిలి ఇంట్లోకివెళ్లి భోజనం చేయలేదు. ఋణం తీర్చకుండా భోజనం చేయటానికి అతని తత్త్వం అంగీకరించలేదు. ఋణం తీర్చకుండా తినటానికి శాస్త్రం కూడా సమ్మతించదు.

అందుకే కొడుకుతో అన్నాడు : "బాబూ! మనకి ఎద్దుని అమ్మినవారు వచ్చి కూర్చున్నారు. వారికి బాకీ చెల్లించడానికి తగినంత ధనం నా దగ్గరలేదు. నేనిప్పుడు భోజనానికి రాను. నువ్వు వెళ్లి తినేసేయ్".

"ఓ అలాగా!" అన్నాడు చిన్నారి వాసుదేవుడు. వెంటనే ఆ వచ్చిన వ్యాపారిని తమ ఇంటి ఆవరణలోని చింతచెట్టు దగ్గరికి పిలుచుకువెళ్లాడు. ముద్దుగా వున్నాడని పిల్లవాడి

వెంట అతను వెళ్లాడు. వాసుదేవుడు ఆ చెట్టు మొదట్లోంచి దోసిలినిండా చింతగింజలు తీసి ఆ వ్యాపారి చేతుల్లో పోసి "తీసుకోండి మీ బాకీ" అన్నాడు.

ఆశ్చర్యం!

ఆ వ్యాపారికి ఆ చింతగింజలు కాసుల్లాగా కనిపించాయి. ఆ 'ధనం'తో "బాకీ తీరిపోయింది స్వామీ" అంటూ అతను వెళ్లిపోయాడు. మధ్యగేహుడు సంభ్రమంలో మునిగిపోయాడు.

(పాజకక్షేత్రంలో శ్రీవాసుదేవ తీర్థానికి వాయవ్యంలో వున్న ఒక పురాతన చింతచెట్టు అదే చింత చెట్టుగా ప్రసిద్ధిచెందింది.)



మధ్వులు డబ్బుకు బదులుగా చింతగింజలు ఇచ్చిన చింతచెట్టు

కాని ఋణం ఋణమే. దేవఋణం, ఋషి ఋణం, పితృ ఋణం, భూత ఋణం, మనుష్య ఋణం అనే ఐదు ఋణాలను తీర్చటం కోసం మనిషి దేవయజ్ఞం, ఋషియజ్ఞం, పితృయజ్ఞం, భూతయజ్ఞం, మనుష్య యజ్ఞం అనే పంచ మహా యజ్ఞాలను ఆచరించాలని శాస్త్రం చెబుతోంది. అలాచేయకుండా భోజనం చేయటం మహాపాపం అంటారు.

మధ్యగేహుడు తన కొడుకు చేసిన చింతపిక్కల చెల్లింపుని కుర్రచేష్టగా తీసుకుని, తరువాత రోజుల్లో చాలా శ్రమించి, డబ్బు కూడబెట్టి తీసుకెళ్లి ఆ వ్యాపారికి చెల్లించబోయాడు. అతను "అదేమిటీ! మీ బాకీని మీ అబ్బాయి ఆ రోజే చెల్లించేశాడు గదా?" అన్నాడు.

భట్టు నిర్ఘాంతపోయాడు. తన కొడుకు ఇచ్చింది చింతపిక్కలేగదా! ఇతను ధనం అంటాడేమిటి? ఆ వ్యాపారి తీరిపోయిన బాకీ నిమిత్తం మళ్లీ సొమ్ము తీసుకోనని ఖచ్చితంగా చెప్పేశాడు. భట్టుకి ఋణవిమోచనం జరిగిపోయింది. తొలగించినవాడు వాసుదేవుడు.

## పెళ్లివారి ఇంటినుంచి గుడికి

నియూరు అనేది మధ్యగేహుల బంధువుల ఊరు. అక్కడ ఒక పెళ్లి జరుగుతోంది. ఆ పెళ్లికి భట్టు దంపతులు తమ చిరంజీవితో కలసి వెళ్లారు. వివాహమంటపంలో అందరూ పెళ్లి వేడుక చూడటంలో నిమగ్నమై ఉన్న సమయంలో వాసుదేవుడు మెల్లగా నడుచుకుంటూ ఎటో వెళ్లిపోయాడు.

కొంత సమయం తర్వాత వాసుదేవుడు కనిపించటం లేదని భట్టు దంపతులు గుర్తించారు. ఈ సారి వాళ్లు ఏమాత్రం ఆలస్యం చేయకుండా ఇంట్లోనూ, బయటా మొత్తమంతా గాలించటం మొదలుపెట్టారు. ఏడాది వయస్సున్నప్పుడే అడవంతా తిరిగొచ్చిన వాసుదేవుడు ఇప్పుడు మూడేళ్ల వయస్సులో ఎంత దూరం పోయాడో! ఎటు పోయాడో! ఆ కొత్త ఊళ్లో ఇంటా బయటా ఎంత గాలించినా ప్రయోజనం లేకపోయింది. భట్టు కంగారు కంగారుగా ఊరంతా వెతుకుతూ దారిలో కనబడినవారందరినీ "మా పిల్లవాడు కనపడ్డాడా?" అంటూ ఆత్రుతగా అడగసాగాడు. కొంతమంది ఎదురొస్తున్నవాళ్ళు మాత్రం "ఒక చిన్న పిల్లాడ్ని చూశాం! ఇంత చిన్నవయస్సులో ఒంటరిగా వెళుతున్నావేంటయ్యా అని అడిగాం. దానికతను చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు" అన్నారు.

భట్టుకి ఆదుర్దా పెరిగిపోయింది. ఆ బాటసారులు ఇచ్చిన ఆచూకీ ప్రకారం వెతుక్కుంటూ, వెతుక్కుంటూ ఉడుపి దాకా వెళ్లిపోయాడు. అక్కడ వాసుదేవుడు అనంతేశ్వరుడికి సాష్టాంగ ప్రణామం చేస్తూ తండ్రికి కనిపించాడు. భట్టు నిర్ఘాంతపోయాడు. ఎక్కడ నియూరు? ఎక్కడ అనంతాసనం?

మొత్తం దూరం రెండు యోజనాలు. దారిలో కుటఊరు, తాళ్లపాడె దాటాలి. కొడుకును చూసిన వెంటనే భట్టు కళ్లల్లో ఆనందం పొంగుకొచ్చింది. "బుజ్జి, ఇంత దూరం నువ్వెలావచ్చావయ్యా" అని అడిగాడు.

దానికి వాసుదేవుడు చిరునవ్వు చిందిస్తూ చెప్పాడు. "తండ్రీ! నేను ఒక్కణ్ణే రాలేదు. నాకు తోడుగా దేవుడు ఏదో ఒక రూపంలో వస్తూనే ఉన్నాడు".

ఇలా వాసుదేవుడు తరచుగా ఇల్లు విడిచి వెళ్లిపోవడం జరుగుతూండేది. దాంతో భట్టు దంపతులు ఎప్పుడూ "భగవంతుడా! పరిసర ప్రాంతాలన్నీ భూతప్రేతాలతో నిండిన భయంకరమైన అడవి. ఈ చిరంజీవిని మాకు ప్రసాదించిన నువ్వే ఇతడికి ఎలాంటి అపాయం కలగకుండా కాపాడాలి స్వామీ" అంటూ భగవంతుణ్ణి ప్రార్థిస్తుండేవారు.

## భారతీశుని అక్షరాభ్యాసం



శ్రీ మధ్వాచార్యులవారికి అక్షరాభ్యాసం చేసిన శిలాఫలకం, పాజకక్షేత్రం

భట్టు దంపతులు ఒక శుభ ముహూర్తాన వాసుదేవుడికి అక్షరాభ్యాసం చేయించారు. శాస్త్రోక్తంగా పూజలు చేసి, పెద్ద బండ రాయి మీద కొన్ని అక్షరాలు రాసి దిద్దించారు. రెండవ రోజు మళ్లా మొదటిరోజు రాసిన అక్షరాలనే అదే క్రమంలో రాసి దిద్దమని చెప్పారు. వాసుదేవుడు ఒక నవ్వు నవ్వి "అప్పా, రాసిన అక్షరాలనే మళ్లీ మళ్లీ ఎందుకు రాయిస్తున్నారు, అవన్నీ నాకు ఇదివరకే వచ్చాయికదా!" అని రాసి చూపించాడు.

అప్పటికి తండ్రికి మనోవికాసం కలిగింది. 'ఈ పిల్లవాడు ప్రతిభా సాగరుడు, ఇతడిమీద ప్రజల దుష్ట దృష్టి పడటం మంచిదికాదు' అని భావించి అప్పటినుంచి అతని చేత ఏకాంత ప్రదేశంలో అభ్యాసం చేయించడం మొదలుపెట్టాడు.

## శివభట్టు పరాజయం

ఒకసారి నేయంపల్లీలోని బంధువుల గృహంలో ఒక ఉత్సవానికి వెళ్తూ, వేదవతి తన కుమారుణ్ణి కూడా వెంటతీసుకువెళ్లింది. అప్పటికి ఆ వివాహోత్సవంలో జ్ఞానకార్యం జరుగుతోంది. ప్రతిరోజూ శ్రవణాదులు చేయాలన్నదే శాస్త్ర విధి. వివాహం సందడిలో కూడా వేదవతి ఆ విధిని పాటించింది. ప్రవచనం వినడం కోసమని అక్కడే కూర్చుంది. ఆమె తొడమీద వాసుదేవుడు కూర్చున్నాడు.

ఆ కాలంలో బాగా ప్రసిద్ధి చెందిన పౌరాణికుల్లో శివభట్టు ఒకడు. అతడు మడినాయ వంశంవాడు. అతనిచుట్టూ అపార సంఖ్యలో శ్రోతల బృందముండేది. తన పీఠానికి తగినట్లే శివభట్టు కూడా శివసర్వోత్తమం వచ్చేటట్లు ప్రవచనం చేసేవాడు. కానీ వాసుదేవుడు

దాన్ని సహించలేకపోయాడు. కూర్చున్నచోటునుంచే వాసుదేవుడు మాట్లాడుతూ "ఓ! పౌరాణికుడా! నువ్వు చెప్పే అర్థం వ్యాసుడు, శుకుడు వంటి దివ్యాత్ములకు సమ్మతంకాదు".

చూడ్డానికి చిన్న పిల్లవాడులా ఉన్నాడుకానీ, అతని వాక్కు సింహగర్జనలా ఉంది. శ్రోతలంతా ఆ శబ్దంవచ్చిన దిక్కుకు చూశారు. శివభట్టు కంగారుపడిపోయి జవాబు చెప్పటానికి తటపటాయించాడు. ప్రజలందరికీ అర్థమయ్యింది - అతనికి సరైన అర్థం తెలియదని. అప్పుడు అంతా కలసి ఆ మూడేళ్ల వాసుదేవుణ్ణి మురిపెంగా అడిగారు. "నువ్వయినా సరైన అర్థం చెప్పు నాయనా!"అని.

ఆ చిరంజీవి ఆ ప్రకరణ యొక్క సరైన అర్థాన్ని విష్ణుసర్వోత్తమత్వానికి అడ్డులేకుండా వివరించాడు. శివభట్టుకి పరాభవమయ్యింది. అది వాసుదేవుని మొదటి ప్రవచనమైంది. అప్పటినుంచి వాసుదేవుడి ప్రవచనాలు పరంపరగా సాగుతూవచ్చాయి. ప్రవచనమనేది ప్రామాణికంగా ఉన్నప్పుడు మాత్రమే దాన్ని గౌరవించాలి. ప్రామాణికంగా లేదంటే దాన్ని ప్రతిఘటించకపోవటం అపచారం. మొత్తంమీద వాసుదేవుణ్ణి తన వెంటబెట్టుకుని వెళ్లడం వల్ల తప్పు ప్రవచనాలు వినే దుస్థితినుంచి వేదవతి తప్పించుకుంది.

ఇంటికొచ్చాక వాసుదేవుడు తండ్రికి జరిగింది చెప్పాడు. "తండ్రీ! నువ్వే చెప్పు. ఎవరి వాదన సరైంది. నాదా, శివభట్టుదా?" అని ప్రశ్నించాడు. భట్టు అవాక్కయ్యారు.

ఎంత వయస్సున్న కొడుకు ఏ స్థాయిలో మాట్లాడుతున్నాడు?

అతని ప్రతిభని ఎలా కొలవాలి?

తనకే జటిలంగా కనిపించే ఆ పురాణ ప్రసంగాన్ని తన కొడుకు మనస్సుకు హత్తుకునేటట్లు వివరించాడే! ఇతను కూడా ప్రవచనాచార్యుడేనా?... "అయివుండవచ్చు" అనుకున్నారు భట్టు. "ఇదంతా భగవంతుని దయ" అనుకుంటూ భట్టు తన కొడుకుని దగ్గరకు తీసుకుని "నాయనా నువ్వు చెప్పిందే సరైంది" అన్నారు.

## లికుచ శబ్దార్థం

ఒకరోజు మధ్యగేహుడు పురాణప్రవచనం చేస్తున్నారు. అందులో భాగంగా రకరకాల వృక్షాల గురించి చెప్తూ పురాణ శ్లోకాలను విడమరచిచెప్తున్నారు. ఆ శ్రోతలలో వాసుదేవుడు కూడా ఉన్నాడు. తండ్రి అనేక వృక్షాల పేర్లు వివరించి చెప్తుంటే, శ్రోతలంతా సంభ్రమాశ్చర్యాల్లో మునిగిపోయారు.

అంతలో వాసుదేవుడు లేచి "నాన్నగారూ! మీరా శ్లోకాలకి మరోసారి అర్థం చెప్పండి" అని కోరాడు. తండ్రి చెప్పారు. వాసుదేవుడు "నాన్నగారు, ఈసారి కూడా మీరు ఈ మూల శ్లోకంలో ఉన్న 'లికుచ' శబ్దానికి మాత్రం అర్థం చెప్పలేదు" అన్నాడు. మిగతా శ్రోతలంతా విస్మయం చెందారు. నిజానికి 'లికుచ' అంటే ఏమిటో మధ్యగేహుడుకి కూడా తెలియదు. అలాగని దానికి తప్పు అర్థం చెప్పే ప్రయత్నం ఆయన చేయలేదు. శివభట్టు చేసింది విరుద్ధోక్తి. మధ్యగేహుడు చేసింది అనుక్తి. విరుద్ధోక్తి అనర్థకరమైంది. అనుక్తి అజ్ఞానద్యోతకం మాత్రమే. ఏమైనా వాసుదేవుడు మాత్రం ఈ అనుక్తి కూడా ఒప్పుకోలేదు.

భట్టు జవాబు చెప్పకుండా మిన్నకుండిపోయారు. అప్పుడు శ్రోతలు "వాసుదేవా! ఆ అర్థం నీకు తెలుసా?" అని అడిగారు.

"తెలుసు. 'లికుచ' అంటే అడవి పనస అని అర్థం" అని చెప్పి కూర్చున్నాడు. భట్టుతో సహా శ్రోతలంతా దిగ్భ్రాంతి చెందారు. "ఇతడు పూర్ణప్రజ్ఞుడు. సచ్ఛాస్త్రాన్ని సమగ్రంగా తెలిసినవాడు. తండ్రికి మించిన తనయుడవుతాడు సుమా!" అని పొగిడారు. ఇది తండ్రికి అవమానకరమైన విషయమా? కాదు. నిజానికి కొడుకు తనకన్నా ప్రతిభాశాలి కావటమన్నది ప్రతి తండ్రీ గర్వించే విషయమే! అందులో అవమానమేమున్నది? పైగా అక్కడున్న పురజనులెవ్వరూ భట్టుని తప్పు పట్టలేదు కూడా! అసలు 'లికుచ' అన్న పదానికి అర్థం చెప్పకపోవటం పెద్ద అపచారమేమీ కాదు. కాని వాసుదేవుడు ఎందుకంత జిజ్ఞాస చూపించాడు అన్నది ప్రశ్న.

(ఈ ప్రశ్నకి జవాబు తరువాత కాలంలో బయటపడింది. మధ్వాచార్యుల ముఖ్య శిష్యులలో ఒకరు త్రివిక్రమ పండితులు. వారు వాయుస్తుతిని రచించారు. ఆయన కొడుకు నారాయణ పండితాచార్యులు 'సుమధ్వ విజయా'న్ని రచించారు. ఆ తండ్రీ కొడుకుల వంశమే 'లికుచ' వంశం. అందుకే వాసుదేవుడికి ఆ 'లికుచ' శబ్దం మీద ప్రీతి, దాని అర్థం వివరించకుండా విడిచిపెట్టినందుకు తండ్రి ప్రవచనం పట్ల అప్రీతి.)

## పాలు పెరుగుల మీద బండరాళ్ళు

ఒకసారి తల్లి వేదవతి ఏదో పనిమీద బయటకి వెళ్తూ పాలు పెరుగు గిన్నెలను పిల్లులు, ఎలుకలు, మూతిపెట్టి పాడు చేయకుండా చూస్తూండమని నాలుగేళ్ళ కొడుక్కి చెప్పి వెళ్ళింది. వాసుదేవుడు ఆ పక్కనే వరండాలో ఆడుకొంటున్నాడు.

కాసేపటికి వేదవతి తిరిగి వచ్చేసరికి ఆ గిన్నెలు కనబడలేదు. అక్కడే పెద్ద పెద్ద బండరాళ్ళున్నాయి. బయట ఆడుకుంటున్న వాసుదేవుణ్ణి "పాలు పెరుగు పాత్రలు

ఏమయ్యాయి?" అని తల్లి అడిగింది. వాసుదేవుడు అక్కడ్నుంచే గట్టిగా అరుస్తూ చెప్పాడు. "పిల్లులు, ఎలుకలు మూతలు తోసేయకుండా ఆ గిన్నెల మీద నేనే బండరాళ్ళు పెట్టాను. వాటి కింద పాత్రలున్నాయి, చూసుకో!"

వేదవతి దిగ్భ్రాంతి చెందింది. "నాలుగేళ్ళ కుర్రాడేమిటి? నలుగురైదుగురు కూడా మోయలేని పెద్ద పెద్ద బండరాళ్ళని బయటనుంచి మోసుకొచ్చి గిన్నెల మూతల మీద పెట్టడమేమిటి? వీడేమైనా భీమసేనుడా?"

...ఇలా వాసుదేవుడు చేసే లీలలు క్రమంగా పెరిగిపోతూ వచ్చాయి.

అతను ఏం చేసినా ప్రతి పనిలోనూ ఒక కొత్తదనం కనిపిస్తోంది.

ఒక వింత కనిపిస్తోంది.

ఒక లీల తోస్తోంది.

పిల్లలు ఆడుకునే ఆటల్లో కూడా వాసుదేవుడి సృజనాత్మకత విభిన్నంగా ఉంటోంది. క్రమంగా ఆ గ్రామ ప్రజల్లో 'ఇతను సామాన్యమైన పిల్లవాడు కాదు' అన్న భావం బలపడసాగింది.

సామాన్యుడు కాకపోతే ఎవరు?

ఈ ప్రశ్నకి సమాధానానికి కొన్ని సంవత్సరాలు వెనక్కి వెళ్ళాలి. ఒకసారి సంక్రమణోత్సవ కాలంలో అనంతేశ్వరుని గుడి ముందు ఒక గ్రామస్థుడికి పూనకం వచ్చింది. దేవత ఆవహించింది. అతడు గుడిముందున్న ఎత్తైన రాతి స్తంభం మీదకెక్కి పెద్దగా మాట్లాడసాగాడు. ఆ రోజు అతనిద్వారా అమ్మవారు పలికిన మాటలు "ఈ ప్రపంచానికి మేలు చేసే వ్యక్తి కొద్దికాలంలో ఈ పరిసరాల్లోనే అవతరిస్తాడు" అని.

(వాసుదేవుడు పాలు పెరుగుల మీద మూతపెట్టిన బండరాళ్ళు ఇప్పటికీ పాజక క్షేత్రంలో అతను అవతరించిన ఇంటిలో కనిపిస్తాయి.)

## వాసుదేవ తీర్థం

క్రమంగా పరశురాముడు నిర్మించిన పరశుతీర్థంలో, ధనుస్తీర్థంలో, బాణతీర్థంలో, గదాతీర్థంలో స్నానం చేయటం వాసుదేవుడికి నిత్యకృత్యం అయిపోయింది. వర్షాకాలంకానీ, శీతాకాలంకానీ, పెనుతుఫానురానీ ఆ నాలుగు తీర్థాల్లో స్నానం చేయటం మాత్రం మానేవాడుకాదు. వయసు వస్తున్నకొద్దీ ఒంటరిగానే ఆ తీర్థాలకువెళ్ళి స్నానం చేస్తూ వచ్చేవాడు. తల్లికి చాలా బెంగగా ఉండేది.



ధనుస్తీర్థం



బాణతీర్థం



పరశుతీర్థం



గదాతీర్థం

"వాసుదేవా! నువ్వు ఒంటరిగా అంతదూరం స్నానానికి వెళ్లిరావటం నాకు చాలా ఆందోళన కలిగిస్తోందయ్యా!" అంటూ ఆ తల్లి రోజూ అంటూనే ఉండేది. అయినా సరే వాసుదేవుడు అదే పనిచేస్తుండేవాడు. ఒకరోజు ఏమైనాసరే కొడుకుని ఒంటరిగా పోనీయకూడదని తల్లి పట్టుబట్టికూర్చుంది. అప్పుడు వాసుదేవుడు చేతిలో ఉన్న రాయిని ఇంటికి ఈశాన్యదిక్కుగా విసిరాడు. ఆ రాయి ఎక్కడ పడిందో అక్కడ ఒక్కసారిగా నేల చీలి, నిర్మలమైన జలం ఉబికిరావటం ఆరంభించింది. ఊరుఊరంతా ఆ జలని చూసి దిగ్భ్రాంతి చెందారు. క్రమంగా ఆ జల ఒక తీర్థంగా ఆవిర్భవించింది. అదే వాసుదేవతీర్థం.



వాసుదేవతీర్థం

అప్పుడు వాసుదేవుడు తల్లితో అన్నాడు. "అమ్మా! ఇక నువ్వు బెంగ పడనక్కర్లేదు. రోజూ నేను ఈ తీర్థంలోనే స్నానం చేస్తాను". అప్పటికిగానీ ఆ తల్లికి వాసుదేవునిలోని అపూర్వశక్తి తెలిసిరాలేదు. తెలిసిన తరువాత చాలా విచారించింది. తొందరపడి కొడుకుని ఆ తీర్థాలకి వెళ్ళవద్దన్నానే అని బాధపడింది. అది చూసి వాసుదేవుడు "అమ్మా విచారించవద్దమ్మా, ఆ నాలుగుతీర్థాల సన్నిధానం ఈ తీర్థంలో ఉంది. ఇందులో స్నానం చేస్తే అన్ని తీర్థాల స్నానఫలం లభిస్తుంది" అన్నాడు.

కొడుకు శక్తినైతే తెలుసుకుందికానీ, ఆ తల్లికి ఈ నాలుగు తీర్థాల సన్నిధానం విషయంలో సందేహం తీరలేదు. తల్లి మనసుని గ్రహించిన వాసుదేవుడు ఒక

మఱ్రిచెట్టుమొక్కను తలకిందులుగా నాటి ఇది సరిగా చిగురు మొలిస్తే, ఈ తీర్థంలో ఆ నాలుగుతీర్థాల సన్నిధానం ఉన్నట్లే చెప్పవచ్చునన్నాడు. అలా చెప్పినంత మాత్రాన తల్లికి సందేహం తీరుతుందా! అప్పటికప్పుడు వాసుదేవుడు అది చిగురించడాన్ని తల్లికి చూపించాడు. అదే భవ్యవృక్షం అయింది. తల్లికి సందేహనివృత్తి అయింది.

## బ్రహ్మోపదేశం

అసాధారణ ప్రతిభను చూపిస్తున్న వాసుదేవుడికి ఉపనయన యోగ్య వయస్సు రావటంతో ఈ సంస్కారాన్ని త్వరగా పూర్తిచేయాలని తండ్రి మధ్యగేహుడు ఆరాటపడ్డాడు.

ఉపనయనం అయితేకానీ ద్విజుడు కాలేడు. జన్మనిచ్చిన తల్లికన్నా, జ్ఞానాన్నిచ్చే గాయత్రికే ప్రాధాన్యం ఎక్కువ. గాయత్రీ మంత్రోపదేశం పొందడమంటే సకల వేదాలను అధ్యయనం చేయటానికి అర్హత పొందినట్లే. ఆ సంస్కారం జరగనంతవరకూ బ్రాహ్మణ్యమూ లేదూ, జపతపాలూ లేవూ, జ్ఞానమూ లేదు. పిల్లల ఆరోగ్యలోపాల్ని, జాతక దోషాల్నీ పరిహరించే అపూర్వశక్తి కూడా ఉపనయన సంస్కారానికి ఉంది. ప్రతినిత్యం సంధ్యావందనంలో సూర్యుడికి అర్ఘ్యమివ్వటం వల్ల ఆయుష్షు, ఆరోగ్యం, ఐశ్వర్యం వృద్ధి చెందుతాయి. అమాయకుల్ని కూడా తెలివిగలవారుగా వికసింపచేసే శక్తి గాయత్రి మంత్రానికుంది.

వాసుదేవుడి ఉపనయనానికి శుభముహూర్తం నిర్ణయించారు. బంధువులందర్నీ పిలిచారు. వేదవేదాంగ పండితుల్ని ఆహ్వానించారు. అత్యంత శాస్త్రోక్తంగా ఉపనయన సంస్కారం చేసి ఆ తల్లితండ్రులు కృతకృత్యులయ్యారు. ఉపనయనం జరిగిన నాటినుంచీ ప్రతినిత్యం త్రికాలసంధ్యలో గాయత్రి జపం, అగ్నికార్యం చేసి తీరాలి. ఇది ద్విజుడి ముఖ్య కర్తవ్యం. అతి చిన్నవయసులో విద్వాంసులు కూడా నేర్వలేనంత సునాయాసంగా, శీఘ్రంగా వాసుదేవుడు వీటిని సాధన చేయసాగాడు.

## హఠుడైన మణిమంతుడు

ఒకరోజు ఇంట్లో వంట పూర్తయ్యింది.

భట్టరు దేవుడికి నైవేద్యం పెట్టారు. వైశ్వదేవం పూర్తిచేసుకున్నారు. విస్తరాకు వేసి ఇల్లాలు వడ్డన కూడా చేసింది. తీరా వడ్డించే సమయానికి వాసుదేవుడు కనబడలేదు. తల్లి "నాయనా, వాసుదేవా! ఎక్కడున్నావు? త్వరగా భోజనానికి రా, నాయనా!" అని కేకవేసింది. ఆ సమయానికి వాసుదేవుడు ఇంట్లో లేదు. ఇంటికి దూరంగా విమానగిరి

మీదనున్న దుర్గాదేవి గుడిలో ఉన్నాడు. అంత దూరంలో ఉన్నా తల్లి కేక అతని శ్రవణేంద్రియాల్లోకి చొచ్చుకుపోయింది.

అంటే అతను దూరశ్రవణాది సిద్ధుల్ని పొందిన వాయుదేవుడా? తల్లి పిలుపువిని వాసుదేవుడు విమానగిరి నుంచి ఒక్క అంగలో ఇంటికి చేరుకున్నాడు. హనుమంతుడు సముద్రాన్ని లంఘించినట్లే లంఘించాడు.

అప్పుడు ఒక సంఘటన జరిగింది.

ఆ విమానగిరి దగ్గరే ఒక కాలసర్పం ఒక్కసారిగా పడగవిప్పి తోక మీద లేచింది. వాసుదేవుడు ఇంటికి వెళ్లాలని అడుగువేయగానే కాటు వేయబోయింది. కాని వాసుదేవుడి రెండో అడుగు ఆ పడగమీదే పడింది. అంతే గరుడపాదం కింద నలిగిపోయిన సర్పరాజులా ఆ కాలసర్పం యమపురికి చేరుకుంది. (వాసుదేవుడి పాదఘట్టనకు పగిలిన బండ ఇప్పటికీ విమానగిరి దగ్గర కుర్కాలు గ్రామంలో కనిపిస్తుంది) తర్వాత కాలంలో ఈ స్థలంలో వాదిరాజస్వామి ఒక మధ్వాచార్య విగ్రహప్రతిష్ఠ చేసి గుడి కట్టించారు. మధ్వపాద చిహ్నాలు ఇప్పటికీ చూడవచ్చు.



శ్రీ మధ్వాచార్యులవారు మణిమంత సర్పాన్ని సంహరించిన పాదముద్ర, పాజకక్షేత్రం

ఒకసారి వాసుదేవుడు చేతిలో ఒక దండం పట్టుకుని తిరగటాన్ని తండ్రి గమనించి, అడిగారు : "వాసుదేవా! ఏమిటీ దండం?"

వాసుదేవుడు తడుముకోకుండా, "తండ్రీ, నేను వైష్ణవమతాన్ని ప్రతిష్ఠాపిస్తాను" అన్నాడు.

తండ్రి నవ్వారు. "నాయనా, ఇది కలియుగం. అధర్మం తాండవం చేసే ఈ యుగంలో దేవుడి గురించి నువ్వు చెప్పే మాటలు వినేదెవరు? నీ చేతిలోని ఆ ఎండుకర్ర చిగురించటం ఎంత అసాధ్యమో ఇదీ అంతే..."

తండ్రి మాటలకు వాసుదేవుడు మారుమాట్లాడకుండా తన చేతిలో కర్రని ఇంటిముందు గొయ్యితీసి పాతిపెట్టాడు. దానిమీద నీళ్లు చల్లాడు. కుర్రాడి చేష్టలు చూసి తండ్రి నవ్వుకున్నారు.

విచిత్రం!

కొన్ని రోజులకి ఆ ఎండుకర్ర చిగురించడం ప్రారంభించింది. క్రమంగా కొమ్మలు, రెమ్మలు వేసి పెరగసాగింది. మధ్యగేహుడికి నిర్ధారణ అవుతోంది. కొడుకు సాధారణ మానవుడుకాదు... ఒక కాల సర్పం వచ్చి ఆ చెట్టుని కాటు వేసింది. విషసర్పం కాటువేస్తే ఆ చెట్టు మాడిపోవాలి కదా! కాని ఆ చెట్టు ఇంకా ఇంకా చిగుర్చింది. పెద్ద వృక్షమయింది. ఈ యుగంలో వైష్ణవ సిద్ధాంత ప్రకాశానికి సంకేతంగా నిలిచింది.

### గురుకుల వాసం

ఉపనయనం జరిగాక గురుకులంలో వుండి విద్యాభ్యాసం చేయటం అప్పటి సంప్రదాయం. గురుకులవాసంలో వుండి వేదాధ్యయనం చేయాలంటే ఉపనయనం జరిగితేనే ఆ యోగ్యత లభిస్తుంది.

తోటంతిల్లాయిల గురుకులవాసం ఆ ప్రాంతంలో చాలా ప్రసిద్ధి చెందింది. అక్కడ చాలామంది విద్యార్థులు వుంటారు. ఆ గురుకులంలో వాసుదేవుణ్ణి చేర్చాడు మధ్యగేహుడు.

గురుకులవాసంలో దినచర్య చాలా క్రమశిక్షణా భరితంగా వుంటుంది. త్రికాలసంధ్యలు ఆచరించాలి. గురువులు నేర్పే పాఠాలు విని, అర్థంచేసుకుని వల్లె వేయాలి. ఆటవిడుపుగా ఆటపాటలు క్రీడల్లో పాల్గొనాలి.

క్రమంగా వాసుదేవుడు గురువుల ముందుకూర్చుని పాఠాలు అభ్యసించడం కన్నా ఆటపాటల్లో పాల్గొనటమే ఎక్కువైపోయింది. అన్నిరకాల ఆటల్లోనూ, క్రీడల్లోనూ వాసుదేవుడు అతి చురుగ్గా పాల్గొంటూ ప్రథముడుగా నిలుస్తూ వచ్చాడు. కుస్తీలు, బరువులు ఎత్తడం, గురి చూసికొట్టడం, ఈతకొట్టడం... వగైరా ఏ ఆట తీసుకున్నా, ఏ క్రీడ తీసుకున్నా

వాసుదేవుడిదే అగ్రస్థానం. వాసుదేవుడి శక్తి, సహనం, బలం చూసి అందరూ అతన్ని "భీముడు, భీముడు" అనటం ప్రారంభించారు.

మహాభారతంలో భీముడు శిశువుగా వున్నప్పుడు అతని చేయి తగిలి శతశృంగ పర్వతం నూరు ముక్కలయింది. తల్లి కుంతి దిగ్భ్రాంతి చెందింది. కాని వాయుదేవుడి వరప్రసాదుడు కనుక భీముడిశక్తి అనంతమైనదని ఆమెకు అర్థమయింది. ఈ వాసుదేవుడు కూడా నాలుగేళ్ళ వయసులో పాలు పెరుగు గిన్నెలమీద పెద్ద బండరాళ్ళను సునాయాసంగా ఎత్తిపెట్టాడంటే ఇప్పుడు సహాధ్యాయులు (ఆటపాటల్లో అతని శక్తిసామర్థ్యాలు చూశాక) "భీముడు, భీముడు" అని పిలవడంలో ఆశ్చర్యం ఏముంది?

## చెండాటయే కందుకస్తుతి

రోజులు గడుస్తున్నకొద్దీ వాసుదేవుడి ఆటపాటల్లో భగవంతుని చింతన కనబడసాగింది. తోటి విద్యార్థులు గమనిస్తున్న కొద్దీ వాళ్ళకి ఇదే నిర్ధారణ అవుతోంది.

ఒకసారి చెండాట ఆడుతున్నప్పుడు ఆటలో భాగంగా వాసుదేవుడు తన్మయత్వంతో పాడుతున్నాడు.

'అంబరగంగాచుంబితపాదః పదతల విదలిత గురుతర శకటః।
కాలియనాగక్ష్వేలనిహంతా సరసిజనవదలవికసితనయనః।
కాలఘనాలీకర్బురకాయః శరశత శకలిత రిపుశత నివహః
సంత తమస్మాన్ పాతు మురారిః సతతగ సమజవ ఖగపతినిరతః

చెండు యొక్క గతికి అనుగుణంగా అతని నోటినుంచి ఆశువుగా వచ్చిన ఈ మాటలు ఈ బ్రహ్మాండం యొక్క నిర్మాణం, నియమం భగవంతుడికి ఒక చెండాట అన్న తత్వాన్ని వ్యక్తం చేసింది.

**అప్రమేయోఽ నియోజ్యశ్చ స్వయం కామగమో వశీ ।**
**మోదత్యేష సదా భూతై ర్బాలః క్రీడనకై రివ ॥**

(మహాభారతతాత్పర్య నిర్ణయము 2/75)

కృష్ణుడి ఆటపాటల చింతనంతా దానితోనే నిండిఉంది.

కృష్ణుడి ఆటపాటల తత్త్వం వాసుదేవుడి పదార్చనలో ఉంది. అంటే వాసుదేవుడి ఆటపాటల ఉద్దేశ్యం భగవంతుని చింతనేనా! జ్ఞానంలేని పిల్లలు భగవంతుడి మహిమని

తెలుసుకోవాలి. జ్ఞానం ఉన్న పెద్దవాళ్లు ఆ తత్త్వాన్ని పిల్లల ఆటపాటల్లో చూసి ఆనందించాలి. ఆ విధంగా అందరి మనసులూ ఉత్సాహంతో ఉప్పొంగాలన్నది వాసుదేవుడి ఆంతర్యం. ఈవిషయాన్నే వాసుదేవుడు తన నడతలో, తన పలుకులో ప్రకటించాడు. అతి సునాయాసంగా, అతిశీఘ్రంగా అన్ని విద్యల్లోనూ అతను ప్రావీణ్యం సంపాదించాడు. అందువల్ల సాటి విద్యార్థులు కూడా గురువులు బోధించినదానికన్నా వాసుదేవుడు చెప్పింటే పాఠాలు నేర్చుకోవాలని తహతహలాడేవారు.

**గంధర్వ విద్యానిపుణస్య నిత్యం గంధర్వ వర్యే అనుగీతకీర్తేః।**
**కలాశ్చ శేషా హృదయే గురుర్నః కరోల్లసత్కందుకవద్విభాతి॥**

(త్రివిక్రమ పండితాచార్యులు తత్త్వప్రదీపశ్చా 21)

**కరతలే ఖలు కందుకవత్ సదా సకలయా కలయా సహ విద్యయా।**
**అరిధరేణ సమం స్ఫురితం గరోర్మనసి తస్య విడంబయతో జనాన్॥**

(శ్రీనారాయణ పండితాచార్యులు సుమధ్వవిజయము - 3/42)

ఈ కారణంగానే వాసుదేవుడు పాడిన స్తుతిని 'కందుకస్తుతి' అంటారు. దీనికే 'శ్రీకృష్ణపద్యం' అని కూడా పేరు.

## గురువుకే మంత్రోపదేశం

**గు**రువుగారికి వాసుదేవుడి వైఖరి ఏమాత్రం నచ్చలేదు. అతనికి ఎంతసేపూ ఆటలమీదే దృష్టి. ఆటలమీదున్న శ్రద్ధ పాఠాల మీద చూపించడంలేదని గురువుగారికి అసంతృప్తి కలిగింది. దీనికితోడు వాసుదేవుడు చీటికీమాటికీ గురుకులం వదలి ఇంటికి వెళ్లటం, వెళ్లినవాడు ఒకపట్టాన రాకపోవటం, వచ్చినా పాఠానికి కూర్చుంటే ధ్యాస ఎక్కడో ఉండటం... ఇవన్నీ గురువుగారికి నచ్చలేదు.

చివరికి ఒకరోజు గురువుగారు ప్రశ్నించారు : "ఏమిటి నాయనా ఇది! నీ సహపాఠకులంతా ఎలా చదువుతున్నారో చూడు! నువ్వెందుకు వాళ్లలాగ పాఠంమీద దృష్టి పెట్టడంలేదు".

వాసుదేవుడు వినమ్రంగా జవాబిచ్చాడు : "గురుదేవా! ఒక్కొక్క చరణం బట్టీపట్టించే మీ బోధనావిధానం నాకు నచ్చలేదు. ఇలా తాపీగా ఒక్కొక్క చరణం వల్లెవేస్తూ చదవటం నాకు సాధ్యంకావటంలేదు".

గురువుకి కోపమొచ్చింది. తన బోధనావిధానాన్నే వాసుదేవుడు ఆక్షేపిస్తున్నాడని ఆగ్రహం కల్గింది. ఆ సమాధానంలో ఆయనకి వాసుదేవుడి పొగరు కనిపించింది. ఆయన వెంటనే, "ఓహో, నువ్వు బట్టీపట్టకుండా పాఠాలు చదివేటంతటి మేధావివా? సరే, ఇప్పటిదాకా నేను చెప్పిన పాఠాలన్నీ నీకేమాత్రం వచ్చాయో చూస్తాను. వరుసగా అప్పజెప్పు" అన్నారు.

వాసుదేవుడు చిన్న చిరునవ్వు నవ్వాడు. చేతులు రెండూ జోడించి, వినయంగా గురుదేవులకు నమస్కరించి అప్పటిదాకా తాను నేర్చుకున్న వేదమంత్రాలన్నీ కంఠోపాఠంగా చెప్పడం మొదలుపెట్టాడు. ఒక ప్రవాహంలా సాగింది ఆ పఠనం. అంతవరకూ ఆ గురుకులంలో ఏ విద్యార్థికీ ఇంకా బోధించి ఉండని 'మహానారాయణోపనిషత్తు'ని కూడా శ్రావ్యమైన స్వరంతో పఠించాడు.

ఆహా! ఏమా కంఠమాధుర్యం! ఏమా నిర్దుష్ట ఉచ్చారణ! దేవతలే పఠిస్తున్నారా? - అన్నంత స్పష్టంగా ఆ వేదోచ్చారణ సాగింది.

శిష్యుడి అసాధారణ ధారణాశక్తిని చూసి గురువులు అప్రతిభులైపోయారు. వాసుదేవుని సరిగా అంచనా వేయలేక, మాటజారినందుకు ఆయన పశ్చాత్తాపం చెందారు.

## గురుకులంలో దండతీర్థం

ఒకరోజు వాసుదేవుడికి తమ గురుకుల పరిస్థితులు మనసులోకొచ్చాయి. గురువుగారి దగ్గర శిష్యులు చాలామందే ఉన్నారు. ఇలా గురుకులంలోకి వచ్చే తనలాంటి శిష్యులకి అన్నవస్త్రాలను కూడా గురువులే సమకూరుస్తారు. నిజానికి ఆ గురుకులానికి విస్తృతంగా భూమి ఉన్నప్పటికీ, తగిన నీటివసతి లేదు. నీటి కొరత కారణంగా గురుకులాన్ని నిర్వహించడం కష్టమవుతోంది.

ఈ ఆలోచన వచ్చిన మరుక్షణమే వాసుదేవుడు తన చేతిలో ఉన్న దండంతో నేలమీద గీత గీశాడు. అంతే. సహాధ్యాయులు అందరూ చూస్తుండగానే ఒక్కసారిగా భూమి బీటవారింది. దానిలోంచి నీళ్లు ఉబికిరావడం మొదలయింది. అది క్రమంగా ఉధృతమైన జలధారగా మారిపోయింది. ఆ జలధార ఆ గురుకులాన్నీ, పరిసరాల్లో ఉన్న బీడుభూముల్ని కూడా సస్యశ్యామలం చేసింది.

తన తల్లి కోసం ఒక తీర్థాన్నీ, గురువుకోసం కూడా మరొక దండతీర్థాన్ని వాసుదేవుడు అలాగే సృష్టించాడు. శిష్యుడి మహిమను చూసి గురువు ఆశ్చర్యపోయాడు (ఈ దండతీర్థం

ఉడిపి దగ్గర కాపు అనే స్థలానికి దగ్గర్లో ఉంది. ఇప్పటికీ ఈ తీర్థం ఎప్పుడూ నీటితో నిండి వ్యవసాయానికి ఉపయోగపడుతూ ఉంటుంది. ఉడుపిలోని ఎనిమిది మంది మఠాధిపతులూ పర్యాయపీఠానికి వెళ్లేముందు ఆ దండతీర్థంలో స్నానంచేసి వెళ్లడం ఆనవాయితీ).



శ్రీ మధ్వాచార్యులవారు నిర్మించిన దండతీర్థం

## గురుపుత్రుల ఉద్ధారం

గురుకులంలో నిత్య అగ్నికార్యాలతోపాటు, కొన్ని హోమాలు కూడా గురువులు చేస్తూంటారు. వాటిలో వాడటంకోసం శిష్యులు అడవిలో తిరిగి సమిధలను తీసుకురావాలి. అలా ఒకరోజు శిష్యులంతా సమిధలు ఏరడంకోసం అడవిలో తిరుగుతున్నారు.

ఆ శిష్యుల మధ్యలో గురువుగారి కొడుకు కూడా ఉన్నాడు. అతనిపేరు కూడా వాసుదేవుడే. సమిధలు సేకరించి అందరూ కలసి ఆశ్రమానికి తిరిగివెళ్లే సమయానికి ఉన్నట్టుండి గురుపుత్రుడు "తలనొప్పి తలనొప్పి"అంటూ స్పృహతప్పి పడిపోయాడు. నిజానికి అది అతనికి శైశవదశ నుంచి పీడిస్తున్న వ్యాధి. అలా అకస్మాత్తుగా తలనొప్పి వస్తున్నప్పుడు భరించలేనంతగా బాధపడుతుండేవాడు. లేనప్పుడు బాగానే ఉండేవాడు. అయితే మన వాసుదేవుడు మాత్రం ఈ విషయాన్ని అప్పుడే మొదటిసారి గమనించాడు.

స్పృహతప్పి పడిఉన్న గురుపుత్రుడి దగ్గరగా వెళ్లి, వాసుదేవుడు అతని చెవిలో తన నోటితో బలంగా గాలి ఊదాడు. సహాధ్యాయులు 'ఇదేమి వైద్యం' అనుకుంటూ చూస్తూండగానే గురుపుత్రుడు మెల్లగా కళ్లు తెరిచాడు. లేచి కూర్చున్నాడు. కొద్ది క్షణాల క్రితం తలనొప్పి వచ్చిన సంగతే ఎరగనంత ఆరోగ్యంగా నవ్వుతూ లేచి నిలబడ్డాడు. అప్పట్నుంచీ గురుపుత్రుడికి ఎన్నడూ తలనొప్పి రాలేదు.

జరిగిందేమిటి?

అతని చెవిలో వాసుదేవుడు గాలి ఊదటంతోనే అతనికి మంత్రోపదేశం చేసినట్లయింది. తలనొప్పి తగ్గటంతోపాటు, గురుపుత్రుడికి అసాధారణమైన ప్రజ్ఞాశక్తి చేకూరింది. అంతే, మరుక్షణం నుంచి పూర్వజన్మలు జ్ఞప్తికి రావడం మొదలయింది. అనతికాలంలోనే అతడు అనుపమమేధావి అయ్యాడు.

ఇలాంటి తలనొప్పి ఒకప్పుడు క్షీరసాగరమథన సమయంలో శివుడికి కూడా కలిగింది. మేరుపర్వతాన్ని మథించినప్పుడు కాలకూట విషాన్నే ముందుగా వాయుదేవుడు కొంచెం తన చేతిలో వేసుకుని మథించి, ఈశ్వరుడికిచ్చి, మిగిలిన విషాన్ని తను స్వీకరించాడు. రుద్రుడు దాన్ని మహాప్రసాదంగా భావిస్తూ శ్రద్ధగా స్వీకరించాడు. అప్పుడు శివుడికి భరించలేనంత తలనొప్పి వచ్చి మూర్ఛపోయాడు. అప్పుడు వాయుదేవుడు తన హస్తస్పర్శతో ఆ విషాన్ని అమృతతుల్యంగా మార్చాడు. దానికితోడు 'అచ్యుత, అనంత, గోవింద' అనే నామస్మరణతో రుద్రుడు రక్షించబడి నీలకంఠుడయ్యాడని మనపురాణాలు పేర్కొంటున్నాయి. ఈశ్వరుడికి తలనొప్పి రావటానికి కారణం అతడు సేవించిన విషం కాలకూట విషం కావటమే.

ఏ రోగమైనా సంప్రాప్తించిందంటే అది పూర్వజన్మ పాపఫలమన్నమాటే. గురుపుత్రుడికి పుట్టినప్పటినుండి అప్పుడప్పుడు ఒకసారి తలనొప్పి రూపంలో దీర్ఘవ్యాధి ఏదో వెంటాడుతున్నదంటే, అది గత జన్మల్లో ఎక్కడో చేసిన పాపఫలితంగా సంక్రమించిందే! పాపాలు పరిహారం కావాలంటే అది పుణ్యకార్యాలవలన సాధ్యమవుతుంది. వాసుదేవుడు స్వతహాగా పవనుడు. అందుకే అతని నోటినుంచి వచ్చిన పావనమైన గాలి గురుపుత్రుడి చెవిలో ప్రవేశించినవెంటనే అతనికి పాపవిమోచనమయి, పావనుడయ్యాడు. తలనొప్పి వ్యాధి పోయి నిరోగి అయ్యాడు.

ఈ విషయం వింటూనే గురువు తోటింతిల్లాయార్ సంభ్రమాశ్చర్యాలకు గురయ్యారు. కొడుకు ఒక దీర్ఘవ్యాధినుంచి విముక్తుడయ్యాడన్న ఆనందం ఒకవైపూ, అనూహ్యమైన మహిమను తన శిష్యుడు ప్రదర్శించాడన్న ఆశ్చర్యం మరొకవైపూ ఆయన్ని చుట్టుముట్టాయి.

ఏమిటా శక్తి!

ఇంతచిన్న వయసులో నా శిష్యుడు ఇంత శక్తిమంతుడా!

ఎంతటి అపూర్వమైన పురుషుడు!... ఇతనికి తెలియంది లేదు, ఇతను చేయంది లేదూ, ఇతను చెప్పలేనిది లేదు. ఆహా! ఇంతటివానితో కలసి ఉండటం నాకు ఎన్ని జన్మల సుకృతఫలమో కదా!... అనుకుంటూ గురువు తన శిష్యుణ్ణి చూసి గర్వపడ్డారు.

## గురువులకు జ్ఞానసందేశం

అలా గురుకులంలో చాలాకాలం గడిచింది.

ఒకరోజు వాసుదేవుడు గురువుల దగ్గరికి వచ్చి ప్రణామం చేసి ఒక చిన్న అభ్యర్థన చేశాడు.

"గురువర్యా! ఐతరేయశ్రుతిని మీకు అప్పచెప్పాలని నాకనిపిస్తోంది. మీరు కొంచెం విని దాని అర్థం గమనించాలని నా కోరిక." గురువుకు అర్థమైంది. వాసుదేవుడు తనంతట తానుగా వచ్చి ఇలా కోరుతున్నాడంటే, దీని వెనుక ఏదో ఒక పరమార్థముంది. గురువు ఆనందంగా అంగీకరించారు.

వాసుదేవుడు ఐతరేయశ్రుతిని పఠించడం ప్రారంభించాడు. ప్రతి చరణం ఒక శ్రావ్యగీతంలా అనిపించింది. ఆ శ్రుతిని పఠిస్తున్నప్పుడే దాని రహస్యం, స్వారస్యం ఆ పరిసరాల్లో అణువణువునీ ఉత్తేజభరితం చేస్తోంది. నిజానికి ఐతరేయశ్రుతి అత్యంత క్లిష్టమైనది. దాని అర్థం అంత సులభంగా బోధపడదు. దాన్ని అర్థం చేసుకోవడం గురువులకు కూడా కష్టంగా ఉంది. ఈ విషయాన్ని గ్రహించిన వాసుదేవుడు, గురువుగారికి ఆ శ్రుతి శ్రీహరియొక్క సర్వోత్తమత్వాన్ని తెలుసుకునే అపూర్వసాధనంగా వివరించాడు.

ఆహా! ఏమి దివ్య అనుభూతి అది. గురువులకు మరోసారి అర్థమైంది. మోక్షానికి దారి తీసినట్లనిపించింది. శిష్యుడి అసాధారణ ప్రజ్ఞా పాటవాలకు ఆశ్చర్యపడుతూనే ఆశీర్వదించారు.

వాసుదేవుడు గురువులకు నమస్కరించి, "గురువర్యా! నేనిక వెళ్లాలి. అనుజ్ఞ ఇవ్వండి" అన్నాడు. గురువులకు అప్పుడు పరిపూర్ణంగా అర్థమయింది. వాసుదేవుడు వెళ్లిపోయే తరుణమొచ్చింది కాబట్టే గురుదక్షిణగా ఈ శ్రుతిని నాకు అప్పజెప్పాడు అనుకున్నారు.

ఐతరేయశ్రుతి యొక్క అర్థం బోధపడినా శిష్యుడి మహిమ మాత్రం గురువులకి పూర్తిగా అవగతం కావటంలేదు. అదొక చిక్కుముడిగానే ఉండిపోయింది. వాసుదేవుడు

గురువులకు జ్ఞానసందేశమిచ్చి, ఆటలాడుతున్న చిన్నికృష్ణుడి విగ్రహాన్ని కూడా బహూకరించాడు.

ఆ రకంగా వాసుదేవుడు గురువులకు తెలిపిన ఐతరేయశ్రుతి సాక్షిగా ఇప్పటికీ వారి దశ ఉపనిషత్ భాష్యాల్లో ఒకటిగా ఐతరేయభాష్యం భాసిల్లుతోంది. దాని అధ్యయనం ఒక అద్భుతం. పంచఉపనిషత్ రహస్యాలను తెలిపే వ్యాఖ్యానప్రపంచంలో దాని స్థానం విశిష్టమైంది.

వాసుదేవుడు గురువులకు బహూకరించిన పారాడే కృష్ణుడి విగ్రహాన్ని, బృందావనా చార్యులుగా పిలవబడే (వాదిరాజ మఠ పరంపరలోని) విశ్వప్రియతీర్థులు పూజించారని, తిరిగి ఒడెయరు అనే సన్న్యాసి శిష్యులకు ఇచ్చారని ప్రతీతి. ఇప్పటికీ ఆ విగ్రహం ఉడుపికి దక్షిణంగా నాలుగు కిలోమీటర్ల దగ్గరలో ఉన్న ఒడెయర ఇంటి పరంపరగా పిలవబడుతున్నది. ఇప్పుడు దండతీర్థమఠంలో పూజింపబడుతున్న ప్రతిమ విశ్వప్రియ తీర్థులు ఇచ్చిన మరొక వెన్నకృష్ణుని ప్రతిమ అని ప్రతీతి.

## సన్న్యాసానికి రంగం సిద్ధం

వాసుదేవుడి గురుకులవాసం ముగిసింది.

ఎటుచూసినా తత్త్వజ్ఞానం కోసం అన్వేషణ. దాహం వేస్తున్నవాళ్లకి నీళ్లు ఎంత అవసరమో, జిజ్ఞాసువులకి శాస్త్రం అంత అవసరం. అపారమైన శాస్త్రరాశి అందుబాటులో ఉన్నా, దాన్ని తెలుసుకోలేని అయోమయంలో సజ్జనులైన మానవులంతా కొట్టుమిట్టాడు తున్నారు. ఈ పరిస్థితికి తోడు శాస్త్రాలమీద వెలువడిన విభిన్న వికృతవ్యాఖ్యానాలు.

ఈ పరిస్థితిని వాసుదేవుడు సుదీర్ఘంగా విశ్లేషించాడు.

ఒక ఉత్తేజభరితమైన ఉత్తుంగతరంగంలాంటి భావావేశంలో మునిగిపోయాడు.

"శ్రేష్ఠమైన ఆగమశాస్త్రాలకు అపవ్యాఖ్యానాలు చెప్పడంద్వారా అపచారం చేసిన వాళ్లకి ఏమిటి శిక్ష? ఉగ్రదండనమే. మహాశక్తురాలైన దుర్గాదేవి సహితం దుష్టులను శిక్షించటం కోసమే అవతరించింది. కాబట్టి నేను కూడా వాగ్దండన చేయటం ఒకటే సరైన శిక్ష. అందుకోసం నేను దండం ధరించాలి, సన్న్యాసం తీసుకోవాలి. రాగద్వేషాలను విడిచిపెట్టాం అనుకుంటున్న సన్న్యాసులు భ్రష్టాచారాలతో ఆశ్రమ పవిత్రతను పాడుచేశారు. ఇప్పుడు నా ముందున్న తక్షణ కర్తవ్యం - అట్టి ఆచార విచారాలకు పునర్జీవాన్ని ఇవ్వటం, సన్న్యాసదీక్ష తీసుకోవటం, మంచి గ్రంథాలను వెలువరించడం."

సన్యాసానికి మొదటి అర్హత – తనకున్న సమస్తాన్ని భగవంతుడి సమర్పించడం. తనకి వున్నదేకాదు, తాను చూసింది 'ప్రతీదీ భగవంతుడి ఆధీనమే' అని విశ్వసించడం.

అదే వాసుదేవుడి విశ్వాసం కూడా. తనకు కనుపించిన ప్రతిదానికీ నమస్కరించేవాడు. ఎవరన్నా ప్రశ్నిస్తే – "అందులో భగవంతుడున్నాడు. అందుకే నమస్కరిస్తున్నాను" అనేవాడు. చూసేవాళ్ళకి ఇది చాలా విచిత్రంగా కనుపించేది.

## అచ్యుత ప్రేక్షుల కథ

ఒకరోజు వాసుదేవుడు ఇంట్లో ఎవరికీ చెప్పకుండా, ఇంటినుంచి బయల్దేరి ఉడుపి సమీపంలోని ఒక యతి దగ్గరికి వెళ్లాడు.

ఆయన పేరు అచ్యుతప్రేక్షులు. ఆయన్నే పురుషోత్తమ తీర్థులని కూడా పిలుస్తారు. ఆయనకి అనునిత్యం అచ్యుతునిమీదనే ధ్యాస. విద్య, వైరాగ్యాల సాకారమూర్తి ఆ సన్యాసి. ఆయన పీఠం కూడా అసామాన్యమైంది. అది స్వతహాగా హంసనామక పరమాత్మ ఏలిన వేదాంత పీఠం. దానికి శ్రీ సనక సనందులు, శ్రీ దూర్వాసులు, శ్రీవరతీర్థులు, శ్రీ సత్యప్రజ్ఞతీర్థులు, శ్రీ ప్రాజ్ఞతీర్థులు మొదలైనవాళ్లు పీఠాధిపతులుగా వుంటూ వచ్చారు.

పరతీర్థులు దూర్వాసుల వారి శిష్యులు. ఆయన శాపానుగ్రహశక్తి పొందిన మహాతపస్వి. సత్యప్రజ్ఞులు పరతీర్థుల శిష్యులు. ఆయన ఋషులకు కూడా పాఠం చెప్పేటంత ప్రజ్ఞ కలిగినవారు. వ్యాఖ్యానకోవిదులు. వారి శిష్యులు ప్రాజ్ఞతీర్థులు. వారు వేదవేదాంగ పారంగతులు. అపారంగా భగవన్నిష్ఠ పొందిన యోగులు. వేద ప్రవచనాలంటే ఆయనకి మక్కువ ఎక్కువ.

ఆ కాలంలో సంస్థానానికి ముఖ్యకేంద్రం అయోధ్య దగ్గరున్న నందిగ్రామం. అక్కడ మాయావాదుల ఒత్తిడికి గురైనవారు తమ మూలసంప్రదాయాన్ని పోగొట్టుకున్నట్లుగా భావించేవారు. ఆ కారణంగా వాళ్లు నందిగ్రామం వదిలిపెట్టి జగన్నాథ పురివైపు ప్రయాణించారు. అక్కడా ఈ మాయావాదుల బాధ తప్పలేదు.

చివరికి ఇలా కాదనుకుని, ఒక చాతుర్మాస దీక్ష ముగించుకున్నాక, తాము కూడా, మాయావాదుల వేషం ధరించి మళ్లీ నందిగ్రామం వెళ్లారు. అక్కడనుంచి బదరికి చేరి తపస్సులో మునిగిపోయారు. అక్కడే వాళ్లకి తమ గురువులైన సత్యప్రజ్ఞులు దర్శనమివ్వటం, ఓదార్పు పలికి, సందేశమివ్వటం జరిగింది. అక్కడ్నుంచి గురువుల ఆదేశం ప్రకారం, శ్రీప్రాజ్ఞతీర్థులు జగన్నాథపురికి వెళ్లారు. అక్కడ సత్సంప్రదాయాన్ని పాటిస్తూ, తమ

పరంపరను ముందుకు తీసుకువెళ్లి, దీక్ష పొందారు. కాలక్రమంలో ఆ పీఠానికి ఉత్తరాధికారిగా వచ్చినవారు అచ్యుతప్రేక్షులు.

తరువాత కాలంలో కారణాంతరాలవల్ల ఆయన జగన్నాథపురినుంచి కేరళకి వచ్చారు. గురువుల ఆదేశానుసారం ఉడుపిలో స్థిరపడి, అనంతేశ్వరుణ్ణి ఆరాధించడం ఆరంభించారు. ఇంతటి సత్పరంపరలోంచి వచ్చిన గురువులు కనుకనే అచ్యుతప్రేక్షుల దగ్గర సన్యాసదీక్ష స్వీకరించాలని వాసుదేవుడు నిర్ణయించుకొన్నాడు.

నిజానికి ఆ నిర్ణయం అలా జరగటానికి కారణం మరొకటి కూడా.

అచ్యుతప్రేక్షులు చాలా ఆచార వ్యవహారాలను పాటించే వ్యక్తి. నిష్ఠాగరిష్ఠుడు. అయినప్పటికీ ఆయనకి పరిపూర్ణ తత్త్వజ్ఞానం సిద్ధించలేదు. తమ గురువుల అంత్యకాలంలో చెప్పిన మాటలే ఆయనకి జ్ఞాపకం వచ్చేవి.

"అచ్యుతప్రేక్షా! ఇప్పుడు ప్రజలు మాయావాదాన్నే నమ్ముతున్నారు. బ్రహ్మ నిర్గుణుడనీ, జగత్తు అంతా మిథ్య అనీ చెబుతారు. 'అహం బ్రహ్మాస్మి' అని ఉపాసన చేయమంటారు. కాని ఇవేవీ నాకు గానీ, నా గురువులకు గానీ, వారిపైవారికి గానీ సిద్ధికి రాలేదు. సరైన మార్గదర్శనం నాకు జరగలేదు. నువ్వైనా ఆ సిద్ధికోసం సాధన చేయవయ్యా! అందుకోసం భగవంతుణ్ణి త్రికరణశుద్ధిగా ఆరాధించు..." ఇదీ ఆయనకు గురువులు చేసిన బోధ. అప్పట్నుంచీ అచ్యుతప్రేక్షులు ఉడుపికి వచ్చి అనంతేశ్వరుని సేవిస్తున్నారు. ఎప్పటికయినా తనకు గురువులు సూచించిన తత్త్వసిద్ధి జరుగుతుందన్న విశ్వాసంతోనే ఆయన అనంతేశ్వరుడి ఆరాధనలో మునిగిపోయారు. మోక్షసిద్ధి కోసం ఇదే సాధనని ఆయన కొనసాగించారు.

అద్భుతం!

వారి ప్రచండమైన తపస్సుకి, పరిశుద్ధమైన దీక్షకి అనంతాసనుడు ప్రసన్నుడయ్యాడు. ఒక పురుషునిలో ప్రవేశించి, ఇలా సూచించాడు: "అచ్యుతప్రేక్షా, నీకొక అపూర్వమైన శిష్యుడు లభిస్తాడు. అతని వల్లనే నీకు తత్త్వజ్ఞానం సిద్ధిస్తుంది!"

ఎంత ఆశ్చర్యం! ఎక్కడయినా గురువుల వల్ల శిష్యులకు సిద్ధి కలగాలి కదా! కాని ఇక్కడ జరుగుతున్నది వేరు. ఒక ఉత్తమ శిష్యుని మూలంగా గురువుకి తత్త్వజ్ఞానం సిద్ధించబోతోంది. అలాంటి శిష్యుడికోసం అచ్యుతప్రేక్షులు ఎదురుచూస్తున్న సమయంలోనే ఆయన సన్నిధికి చేరాడు వాసుదేవుడు.

వాసుదేవుని చూడగానే సంభ్రమంలో మునిగిపోయారు అచ్యుతప్రేక్షులు. వాసుదేవునిలో ఆయనకి తాను ఎదురుచూస్తున్న 'శిష్యనిరూపంలోని గురువు' కనుపించాడు.

## తల్లిదండ్రుల తపన

వాసుదేవుడు ఇంట్లో చెప్పకుండా వెళ్లిపోయాడు.

వాసుదేవుడు ఇలా ఇంట్లో చెప్పకుండా వెళ్లిపోవటం ఇదే మొదటిసారి కాదు. చిన్నతనంలో చాలాసార్లు జరిగింది. భవిష్యత్తులో కూడా ఇలా ఎప్పుడైనా చేయవచ్చునన్న సంకేతాన్ని ఆ సంఘటనలన్నీ స్పష్టంగా సూచిస్తూనే వచ్చాయి.

ఇప్పుడు వాసుదేవుడు అకస్మాత్తుగా ఇల్లు విడిచి వెళ్లిపోవటంతో తల్లిదండ్రులు ఆదుర్దాగా వెతుక్కుంటూ వెళ్లారు. ఎక్కడికి వెళ్లాడో తెలుసుకున్నారు. ఎందుకు వెళ్లాడో కూడా అర్థమైంది. దుఃఖం, ఆవేదన వాళ్ల మనసుల్ని ఆక్రమించాయి. అచ్యుతప్రేక్షులని కలిసి, తామెవరో ఎందుకు వచ్చారో వివరించారు. ఆయన వాసుదేవుణ్ణి పిలిపించి, తల్లిదండ్రులతో ముఖాముఖీ మాట్లాడించాడు.

కొడుకుని చూస్తూనే వాళ్లలో పుత్రవాత్సల్యం పొంగుకొచ్చింది. "నాయనా, ఇంటికి వెళ్దాం. మాతో వచ్చెయ్" అన్నారు. వాసుదేవుడు అంగీకరించలేదు.

ప్రతిమాలారు.

బుజ్జగించారు.

అనునయంగా చెప్పారు.

అభ్యర్థించారు... ఏం చేసినా వాసుదేవుడు వినలేదు. చివరికి వాసుదేవుడి మనోభావాలను ప్రభావితం చేసేలా అర్థించారు.

"నాయనా, మాకు వృద్ధాప్యం వస్తోంది. ఈ వయసులో మమ్మల్ని వదిలేసి, సన్న్యాసం స్వీకరించడం ధర్మం కాదయ్యా..." అంటూ వేడుకొన్నారు.

వాసుదేవుడు చలించలేదు. "కొడుకు సన్న్యాసదీక్ష తీసుకోటానికి తల్లిదండ్రుల వయస్సెలా అడ్డవుతుంది, అవదు..." అంటూ నిర్ద్వంద్వంగా తిరస్కరించాడు. వాళ్లు చేసేదేమీ లేక, కొడుకు చుట్టూ ప్రదక్షిణ చేసి, చివరిసారిగా మరోసారి అభ్యర్థించారు.

వాసుదేవుడు నవ్వాడు. "మీరు నేను సన్న్యాసం తీసుకోవటాన్ని అంగీకరించలేమంటున్నారు. కాని మీ చర్యలు మాత్రం నా సన్న్యాసదీక్షనే సమర్థిస్తున్నాయి".

వాళ్లకి అర్థం కాలేదు. వాసుదేవుడు వివరించాడు. "చిన్నవాళ్లకి పెద్దవాళ్లు ఎప్పుడు నమస్కరిస్తారు? వారు సన్న్యాసులై వున్నప్పుడు మాత్రమేకదా! అంటే ఇప్పుడు మీరు మీ చర్యల ద్వారా నా సన్న్యాస దీక్షని అనుమతించినట్లే అవుతోంది తండ్రీ."

ఆ తల్లిదండ్రులు ఖాళీ చేతుల్తో వెనక్కి తిరగక తప్పలేదు.

కొన్ని రోజులు గడిచాయి. ఎంతయినా తల్లిదండ్రుల ప్రేమ ఎక్కడికి పోతుంది. దుఃఖంలో మునిగివున్న వాళ్లకి రోజొక యుగంగా గడుస్తోంది. మాటిమాటికి కొడుకు గుర్తుకొస్తున్నాడు. ఉండబట్టలేక మరోసారి ఎలాగైనా సరే కొడుకుని ఒప్పించి తీసుకురావాలని నిర్ణయించుకుని మధ్యగేహుడు బయల్దేరారు.

వాసుదేవుడు గురువులతో కలిసి పర్యటనలో వున్నాడు!. చివరికి వాసుదేవుణ్ణి నేత్రావతీ తీరంలోని కాణ్యూరు దగ్గరున్న కుణ్యాడి మఠంలో బసచేసివున్న అచ్యుతప్రేక్షుల బృందంలో తండ్రి కలుసుకున్నాడు. మరోసారి వాసుదేవుణ్ణి "ఇంటికి తిరిగి వచ్చేయి నాయనా, ఈ సన్యాసదీక్ష విడిచిపెట్టు" అని ప్రాధేయపడ్డారు.

చివరికి, "నువ్వు మా మాట వినకపోతే నేను ఆత్మహత్య చేసుకోవాల్సివస్తుంది వాసుదేవా" అంటూ తండ్రి హెచ్చరించారు. తండ్రి, అలా మాట్లాడుతూ వుండగానే వాసుదేవుడు తన ఉత్తరీయాన్ని చింపి, కౌపీనంగా వేసుకున్నాడు. "నాన్నగారు, ఇదిగో చూడండి. ఇప్పుడు నేను సన్యాసినయిపోయాను. ఇప్పుడేం చేస్తారు! నిజంగా ప్రాణత్యాగం చేస్తారా?' అంటూ తండ్రిని ప్రశ్నించాడు. భట్టు నిరుత్తరుడయ్యారు.

అయినా ఆశ వదల్లేదు. భట్టు చివరి ప్రయత్నంగా కొడుకుని ఒప్పించే ప్రయత్నం చేశారు. "ఇదేం న్యాయమయ్యా! నీకు ముందు పుట్టిన ఇద్దరు మగపిల్లలు బ్రతకలేదు. నువ్వొక్కడివే మాకు మిగిలింది. మాకు నీవు తప్ప వేరే ఎవరు ఆధారం నాయనా? వయసు పైబడుతున్న దశలో వున్న తల్లిదండ్రుల రక్షణకన్నా సన్యాసమే ఎక్కువని ఏ ధర్మశాస్త్రం చెబుతోంది?..."

సన్యసించాలని దృఢదీక్షతో వున్న వాసుదేవుడుకి తల్లిదండ్రుల పట్ల ప్రేమ, గౌరవాలకి కొరతలేదు. కాని అంతకుమించిన సామాజిక బాధ్యత తన ముందుంది.

తండ్రికి జవాబిస్తూ ఇలా అన్నాడు: "మీరు చెప్పే ఈ ధర్మ నిర్బంధం ఇతర కార్యాల విషయంలో వర్తిస్తుంది. కాని సన్యాసానికి కావలసిన అర్హత వైరాగ్యమే తప్ప ఇతర కారణాలు కావని శ్రుతి పేర్కొంటోంది.... సంసార జీవితం పట్ల విరక్తి కలిగితే బ్రహ్మచారి, గృహస్థు – ఎవరైనా సరే సన్యాసం స్వీకరించవచ్చు. ఇందులో ధర్మవిరుద్ధం ఏమీలేదు. కాని మీరు లేవనెత్తిన మీ సమస్య వృద్ధాప్యంలో మిమ్మల్ని చూసుకోడానికి మరొక పుత్రుడు లేడని... సరే! మీ ఆరాటాన్ని అర్థం చేసుకున్నాను. మీకు మాట ఇస్తున్నాను... నాకు

జన్మనిచ్చిన తల్లిదండ్రులు కనుక, మీకు మరో కొడుకు కలిగాకనే నేను సన్యాసం తీసుకుంటాను. సరేనా?"

మధ్యగేహునికి మనసు కొంత కుదుటపడింది... అప్పటికే తనకు వయస్సు పైబడుతోంది. ఈ వయస్సులో మరో కొడుకా? అసంభవం కదా!... ఇలా అనుకోగానే ధైర్యం వచ్చింది. ఈ సారి చొరవచేసి మధ్యగేహుడు మరోమాట అన్నారు.

"నాయనా, శాస్త్రాల్ని అధ్యయనం చేసివుండటం వలన, నువ్వు లేనందువల్ల కలిగే విరహాన్ని నేను భరించగలను. కాని నీ తల్లి సంగతి ఏమిటి? ఆమెకి ఎలా ఊరట కలిగించగలను?"

వాసుదేవుడు తడుముకోకుండా జవాబిచ్చాడు. "అదేనా మీ బెంగ! అయితే అమ్మని ఒప్పించే బాధ్యత నాకొదిలేయండి నాన్నగారూ!" అన్నాడు. ఇంక మధ్య గేహుడికి వాదించటానికి ఇతర కారణాలు కనబడలేదు. ఏమైనా మరోకొడుకు తనకి పుట్టినప్పుడు గదా వాసుదేవుడు సన్న్యసించేది అన్నధైర్యంతో ఇంటి ముఖం పట్టారు.

ఇంటికి రాగానే ఆత్రుతగా ఎదురుచూస్తున్న భార్యకి జరిగిందంతా వివరించారు. "వాసుదేవుడు నిన్ను ఒప్పిస్తానంటున్నాడు. ఏమరిపాటున అంగీకరిస్తావేమో, జాగ్రత్త సుమా" అని హెచ్చరిక చేశారు. ఇద్దరికీ ధైర్యం పెరిగింది. వయసు మళ్ళిన తమకి మరో కొడుకు పుట్టడం అసంభవం. కనుక వాసుదేవుడు సన్యసించడు అని వాళ్ళిద్దరూ గట్టిగా నమ్మారు.

ఇతడు పుట్టడానికి 12 సంవత్సరాలు పట్టింది. అనంతాసనుని ఆరాధించగా ఆరాధించగా ఈ వాసుదేవుడు పుట్టాడు. ఇలా వాసుదేవుడి ఆలోచన్లోనే మునిగిపోయి, తమకు తెలీకుండానే వాయురూపమైన వాసుదేవుణ్ణి స్మరించుకుంటూ ఉండిపోవటంతో, అనతికాలంలోనే వేదవతి గర్భవతి అయింది. మధ్యగేహుడూ, వేదవతీ సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయారు.

అలా చూస్తూండగానే నెలలు నిండాయి. వేదవతి మరో మగపిల్లడికి జన్మనిచ్చింది. ఆ క్షణం నుంచే ఆ దంపతులకు కొత్త సమస్య మొదలైంది.

మరో కొడుకు పుట్టాడని ఆనందపడాలా?

ఇప్పుడిక వాసుదేవుడు సన్యసించి తీరతాడని బెంగపడాలా?

రెండవ కొడుకు పుట్టుక మొదటి కొడుకుని వదులుకోవటానికి కారణమవుతోందా?

కబురు తెలిసింది. వాసుదేవుడు ఇంటికొచ్చాడు. తల్లిదగ్గరకెళ్ళాడు. నమస్కరించాడు. "అమ్మా, నీ కోరిక తీరింది. ఇంక నా సన్న్యాసానికి నువ్వు అడ్డురావు కదా!"

ఆ తల్లి ఏం జవాబు చెప్పాలి? ఇప్పుడు కూడా సన్యాసం వద్దంటే, ఇంక జీవితకాలంలో ఎప్పటికీ తను మా ముఖం చూడడేమో. సన్యసించటానికి అంగీకరిస్తే కనీసం సన్యాసిగానైనా అతని ముఖం చూస్తూండవచ్చు కదా! ఆ సాధ్వి 'వద్దు' అనలేదు, 'సరే' అనలేదు. మౌనంగా ఉండిపోయింది.

ఆ మౌనాన్నే సమ్మతిగా తీసుకుని వాసుదేవుడు తల్లిదండ్రులకు నమస్కరించి, అచ్యుత ప్రేక్షుల దగ్గరకి వెళ్ళిపోయాడు – సన్యాసం స్వీకరించటానికి.

## సన్యాసదీక్ష

**త**త్త్వ ప్రచారం కోసం సన్యాస దీక్ష స్వీకరించాలని వాసుదేవుడు తహతహ లాడుతున్నాడు. తన తత్త్వ జిజ్ఞాసకోసం వాసుదేవుడికి సన్యాసదీక్షనివ్వాలని అచ్యుతప్రేక్షులు ఆరాటపడుతున్నారు.

ఒక శుభ ముహూర్తంలో వాసుదేవుడికి 'పూర్ణ ప్రజ్ఞ తీర్థులు' అని నామకరణం చేస్తూ, దీక్షని ప్రసాదించారు అచ్యుతప్రేక్షులు.

పూర్ణప్రజ్ఞ తీర్థులు అన్న నామధేయం ఋగ్వేదంలోని బళిత్థాసూత్రానికి (దశప్రమతి) వ్యాఖ్యానం. 'దశప్రమతి' అన్న పదాన్ని సార్థకం చేస్తోంది పూర్ణప్రజ్ఞుల దీక్షా స్వీకరణ. ఎందుకంటే – ఆయనకి అప్పుడే పదేళ్ళు (దశవత్సరాలు) నిండాయి.

దండం చేపట్టి, యతివేషం ధరించిన పూర్ణ ప్రజ్ఞుల రూపం అతిత్వరగా చూపరులను ఆకట్టుకుంటూ వచ్చింది.

నిర్మలత్వం, వర్చస్సు, స్థిత ప్రజ్ఞత... మూర్తీభవించిన ఆ ముఖారవిందాన్ని గురించి ఆశ్రమానికి వచ్చివెళ్ళిన వారంతా చెప్పుకునే వారు. సాక్షాత్తు వామనమూర్తే భూమి మీదకి దిగివచ్చాడు అనిపించేటంతటి ఆకర్షణ ఆ ముఖంలో తొంగిచూసేది. అదొక అలౌకిక సహజ సౌందర్య రూపం.

శిష్యునికి సన్యాసధర్మాలు తెలియజేయాలని గురువు అచ్యుతప్రేక్షులు ఆరాట పడుతున్నారు. కాని ఎప్పుడు బోధించాలన్నా, ఆయనకి సంభ్రమాశ్చర్యాలు కలిగించేలా పూర్ణప్రజ్ఞులు ఆశ్రమధర్మాన్ని తుచ తప్పకుండా పాటిస్తున్నారు. ఎవరు ఎవరికి నేర్పుతున్నట్లు?

అలాంటి రోజుల్లో ఒకసారి పూర్ణప్రజ్ఞులు అనంతాసనుడి ఆలయంలో దైవానికి సాష్టాంగ నమస్కారం చేస్తున్నారు. ఆ క్షణంలోనే అక్కడున్న ఒక భక్తునిలో అనంతాసనుడు

ప్రవేశించాడు. ఉద్వేగంతో అతను పూర్ణప్రజ్ఞులను చేయిపట్టుకొని అచ్యుతప్రేక్షుల ముందుకు తీసుకువచ్చి, "అచ్యుతప్రేక్షా, ఇదివరకు నీకు చెప్పాను గుర్తుందా? ఇదిగో, ఈ బాలుడే నీ తత్త్వదీక్ష గురుత్వాన్ని నిలిపే శిష్యశ్రేష్ఠుడు" అన్నాడు.

కొద్ది రోజుల్లోనే పూర్ణప్రజ్ఞునిపట్ల అచ్యుతప్రేక్షులకు విశ్వాసం ఇనుమడించింది. అనిర్వచనీయమైన ప్రేమబంధం పెరుగుతోంది. ఏ గురువుకైనా తన శిష్యుడి ప్రజ్ఞాపాటవాలు ఆనందాన్ని కల్గించేవి, వాత్సల్యాన్ని పెంచేవే అవుతాయికదా! అదే జరిగింది.

నిజానికి సన్న్యాస ఆశ్రమంలో ప్రేమబంధానికి తావులేదు. సర్వసంగపరిత్యాగం అంటే కాషాయదుస్తులు ధరించి, మనసులో మాత్రం ప్రేమానుబంధాలు పెంచుకోవటమా? కాదని అచ్యుతప్రేక్షులకూ తెలుసు. కాని ఎందుకో, ఆయనకు పూర్ణప్రజ్ఞులపట్ల ఆత్మీయతా భావం పెరిగిపోతోంది.

పూర్ణప్రజ్ఞులు సన్న్యాసదీక్ష తీసుకొని 40 రోజులు గడిచాయి. ఒకరోజున పూర్ణప్రజ్ఞులు తన గురుదేవుల్ని సమీపించి, "కాశీకి వెళ్ళి గంగాస్నానం చేయాలని సంకల్పం కలిగింది. అనుమతించండి గురుదేవా" అని అడిగాడు. అచ్యుతప్రేక్షులు మాట్లాడలేకపోయారు. గాఢమైన ప్రేమకారణంగా శిష్యుణ్ణి విడిచిపెట్టి వుండలేనన్న చింత ఒకవైపు, ఒకవేళ 'వద్దు' అంటే, పవిత్ర గంగాస్నానానికి తిరస్కరించి పాపం మూటగట్టుకుంటున్నట్లవుతుందేమోనన్న సందేహం మరోవైపు ఆయన్ని వెంటాడాయి.

ఈ ధర్మసంకటాన్నుంచి ఎవరు తనకు పరిష్కారం చూపించగలరు? గురుదేవులు అనంతాసనుణ్ణి తలుచుకొన్నారు.

అద్భుతం!

అనంతాసనుడు ఒక మనిషిలో ప్రవేశించి, ఆదేశించాడు. "పూర్ణప్రజ్ఞా, నీవు కాశికి పోనఖ్ఖర్లేదు. నీకోసం గంగాదేవి ఈ అనంతసరోవరానికి వస్తుంది. ఇవ్వాల్టినుంచి మూడోరోజున ఇది జరుగుతుంది..."

ఆహా! నేను పూర్ణ ప్రజ్ఞుణ్ణి విడిచివుండనఖ్ఖర్లేదు అన్న ఆనందం అచ్యుతప్రేక్షులను అలరించింది.

అనంతాసనుడు చేసిన ప్రకటన ప్రజల్లో ప్రచారమైపోయింది. అంతే! మూడోరోజు తెల్లవారు ఝామునుంచే జనం అనంతసరోవరం దగ్గర చేరిపోయారు. అందరిలో ఉత్కంఠ. ఏం జరుగుతుంది? గంగ ఇక్కడికి ఎలా వస్తుంది? ఆకాశం నుంచా? కమండలంలోంచా?.. ఎలా, ఎలా?

సూర్యోదయమయింది.

అనంతాసనుడు సూచించిన ముహూర్తకాలం వచ్చేసింది.

ప్రజలంతా ఆదుర్దాగా అనంతసాగరం కేసీ, ఆకాశంకేసీ చూస్తున్నారు... అంతలో...

అందర్నీ సంభ్రమాశ్చర్యాలలో ముంచేస్తూ ఒక్కసారిగా సరోవరానికి ఈశాన్య దిక్కున భూమిని చీల్చుకుని జలధార చివ్వున పైకెగసింది.

ఆహా!

ఎంతటి స్వచ్ఛమైన జలం! అంతటి శుద్ధమైన జలాన్ని ఎక్కడైనా ఎప్పుడైనా చూశామా అన్నంతగా జనం తండోపతండాలుగా ఎగబడ్డారు ఆ ధారని దగ్గర్నుంచి తిలకించటానికి. అదే విష్ణు పాదోదకం అని అంతా విశ్వసించారు. అందరూ ఉత్సుకతతో చూస్తుండగానే ఆ జలధారతో అనంతసాగరం నిండిపోయింది.

కోలాహలం... జయజయధ్వానాల మధ్య అచ్యుతప్రేక్షులు, వారివెనుక పూర్ణప్రజ్ఞులు, ఆ వెనుక ఇతర శిష్యులు, వాళ్ళని అనుసరించి అక్కడ చేరిన ప్రజానీకం అంతా అనంత సాగరంలో చేరిన ఆ జలధారలో తనివితీరా పవిత్రస్నానం చేశారు. పావనులయ్యారు. ఈ పూర్ణప్రజ్ఞుల స్నానంతో ఆ గంగ కూడా పావనమయింది. అందరికీ అర్థమయింది - పూర్ణప్రజ్ఞులను ఆశ్రయిస్తే పావనులమవుతామని! అప్పుడే మరొక విషయం కూడా అందరికీ నిర్ధారితమైంది - భగవంతుడి సంకీర్తన ఎక్కడ జరుగుతూంటుందో అక్కడికి గంగవంటి



శ్రీ మధ్వ సరోవరం (ఉడుపి)

పుణ్యతీర్థాలన్నీ చేరతాయి. అంటే పూర్ణ ప్రజ్ఞులు ఎంతగా భగవంతుని ఆరాధిస్తూ ఉండకపోతే ఈ అద్భుతం ఇలా జరిగి ఉంటుంది?

ఆ అద్భుతం ఫలితంగా అనంతసరోవరం ఆ తరువాతనుండి 'మధ్వసరోవరం'గా ప్రసిద్ధి చెందింది. అప్పట్నుంచి ప్రతి పన్నెండేళ్ళకీ ఒకసారి గంగ మధ్వసరోవరంలోకి ప్రవహిస్తుందని ప్రజల విశ్వాసం.

## వాద వైభవం

ఈ అద్భుత సంఘటనతో పూర్ణప్రజ్ఞుల కీర్తి దశదిశలా వ్యాపించసాగింది.

పదిసంవత్సరాల బాల సన్యాసికి ఇంతటి దైవికశక్తి సాధ్యమా? అన్న సందేహాలు, అనుమానాలు కూడా చాలామందికి కలిగాయి. నమ్మలేని వాళ్ళంతా పూర్ణప్రజ్ఞుల్ని పరీక్షించి తీరాలనుకున్నారు. ఇలాంటి పండితులంతా కలిసి ఒక బృందంగా ఏర్పడ్డారు. తర్కవేదాంత శాస్త్రాల్లో నిష్ణాతుడైన ప్రముఖ వాసుదేవపండితుడి సారథ్యంలో ఈ పండితులు ఆధ్యాత్మిక వాదానికి రావలసిందిగా పూర్ణప్రజ్ఞుల్ని ఉడుపికి ఆహ్వానించారు.

ఆహ్వానం అందుకున్న పూర్ణప్రజ్ఞులు మందహాసం చేశారు. గురుదేవుల ఆశీస్సులందుకొని ఉడుపికి వెళ్ళారు. నిబంధన ప్రకారం – ఓడినవారు విజేతలైనవారికి 'జయపత్రిక'నివ్వాలి. పూర్ణప్రజ్ఞుల గురించి జరుగుతున్న అద్భుత ప్రచారం అంతా అభూత కల్పనగా నిరూపించడానికి పండితులు ఎంచుకున్న మార్గం ఇది.

వాదన ప్రారంభమయింది. పండితుల బృందంలో పండితులు అందరూ వాదించేవారే. వీరి వాదాన్ని నిర్వీర్యం చేసేందుకు ప్రత్యర్థి వర్గంలో వున్నది మాత్రం పూర్ణప్రజ్ఞులు ఒక్కరే.

భగవంతుని ఉనికి ఏది?

ఏ తత్త్వం స్థిరమైంది?

ఏది ఆధారపడదగిన చింతన?

తత్త్వజ్ఞానానికి ఆధారభూతమైన ఏ అంశాలు ఏ మేరకు ప్రామాణికం?...

చర్చ గడుస్తున్న కొద్దీ ఒక్కొక్క పండితుడూ పరాజయం పొందుతూ వచ్చాడు. పూర్ణ ప్రజ్ఞులను ఓడించటం అలావుంచి, పూర్ణ ప్రజ్ఞులు వేసిన ప్రశ్నలకు తడబడటం వారి వంతయ్యింది.

చివరగా వైశేషిక శిరోమణి అని ప్రసిద్ధిచెందిన వాసుదేవ పండితుడు స్వయంగా పూర్ణప్రజ్ఞులతో మూడు రోజులపాటు వాదన సాగించాడు.

**త్రిదినం య ఉపన్యాసం వ్యదదా ద్విద్వాన్ నిరంతరమ్**
**వైశేషికాగ్ర్యో విజితో వాసుదేవాహ్వయో మునా॥**

(సుమధ్వవిజయాభావ ప్రకాశికా)

వాసుదేవ పండితులు సయితం ఓటమిని అంగీకరించి, పూర్ణప్రజ్ఞులను 'జయపత్రిక'తో సత్కరించక తప్పలేదు.

## ఇష్టసిద్ధితో అయిష్టం

పూర్ణ ప్రజ్ఞులు సాధించిన ఈ విజయం గురువైన అచ్యుతప్రేక్షులకు కలిగించిన ఆనందం ఇంతా అంతాకాదు.

ఈ పూర్ణ ప్రజ్ఞుడు ఎంతటి మేధావి?

ఏమా వాగ్ధాటి?

ఏమా పాండిత్యం?... ఇలాంటి ప్రశంసాపూర్వక భావాలతో ఆ గురుదేవులు మరోసారి మనస్సులోనే పూర్ణ ప్రజ్ఞునికి ఆశీస్సులందించారు.

ఆ వెంటనే, అద్వైత సిద్ధాంత గ్రంథం 'ఇష్టసిద్ధి'లోంచి ఎనిమిది ప్రకరణాల పాఠాలను పూర్ణ ప్రజ్ఞునికి బోధించేందుకు అచ్యుతప్రేక్షులు సంసిద్ధమయ్యారు. ఈ 'ఇష్టసిద్ధి' గ్రంథకర్త విముక్తాత్మయతి. ఈయన క్రీస్తుశకం 650 కాలానికి చెందినవాడు. ఆ గ్రంథం పూర్తిగా 'జగత్, మిథ్య ఆత్మ...' వగైరా అద్వైత మతసిద్ధాంత ప్రక్రియలను నిరూపించినది.

గురువుగారు పాఠాలు ప్రారంభిస్తూ తొలి శ్లోకాన్ని తాను చదివి, శిష్యుడిచేత చదివించాడు.

**యాఽనుభూతి రజామేయాఽనంతత్మానంద విగ్రహో**
**మహదాది జగన్మాయాచిత్ర భిత్తిం నమామితామ్॥**

ఆ శ్లోకం పఠిస్తూనే పూర్ణప్రజ్ఞులు సందేహం లేవనెత్తారు.

"గురువర్యా! ఇది ఎలాంటి శ్లోకం? దీనిలోవున్న అక్షరాలు 32. కాని ఈ శ్లోకంలో 32 లోపాలున్నాయి. దీనిని ఎలా అధ్యయనం చేయాలంటారు?"

గురువులు అవాక్కయ్యారు. ఇదేమిటి! తాను అనేకసార్లు ఈ శ్లోకాన్ని పఠించి వున్నా తనకు ఎప్పుడూ తోచివుండని దోషాలు తన శిష్యుడికి గోచరిస్తున్నాయా? శిష్యుడు

ఒక్కొక్క దోషాన్నే విడమర్చి చెబుతుంటే, అచ్యుతప్రేక్షులు వాటిని కొట్టిపారేసే ప్రయత్నాలు చేశారు. కాని, ఒకటి రెండా? 32!

చివరికి, "ఈ దోషాలన్నింటికీ ఈ శ్లోకంలోనే జవాబు వుంది" అన్నారు.

"అలా అయితే, అదేదో ఇప్పుడే వివరించండి గురువర్యా!" అంటూ పట్టుబట్టాడు పూర్ణప్రజ్ఞులు. గురువుకి ఆగ్రహం వచ్చింది. "పూర్ణప్రజ్ఞా, నీకు పాఠం చెప్పే యోగ్యత నాకు లేదు. ఇక మీదట ఈ సాహసం నేను చేయను" అంటూ ఆ చర్చను అక్కడితో నిలిపివేశారు గురువు అచ్యుతప్రేక్షులు.

## ప్రవచన వైభవం

అచ్యుత ప్రేక్షులు పాఠాలను బోధించటం నిలిపేశారు.

కాని, మఠాల్లో బోధన నిలిపేస్తే ఎలా? మఠాలున్నదే బోధన కోసంగదా! మోక్షార్థి అయిన వాడికి శాస్త్ర అధ్యయనం విధిగా వుండితీరాల్సిన లక్షణం. యతులకు మరీ తప్పని సరి.

దాంతో, జ్ఞానార్థులైన మిగతా శిష్యులు పాఠాలు కావాలని వత్తిడి తెచ్చారు. కాని అచ్యుతప్రేక్షులు చెప్పలేరు. చెప్పదలచుకోలేదు. ఇతరులకు అది సాధ్యమూ కాదు. ఈ స్థితిలో పూర్ణప్రజ్ఞులుకి బోధపడింది – "ఇప్పుడిక ఈ బాధ్యత నాది".

ఆయన వెంటనే గ్రంథపఠనం, బోధన ప్రారంభించారు. కాని అక్కడ దొరికినవన్నీ మాయావాద గ్రంథాలే. ముందుగా 'ఇష్టసిద్ధి' గ్రంథంతోనే ప్రారంభించారు. మఠంలో అందరికీ ఉత్సుకత, గ్రామస్థుల్లో కుతూహలం పెరిగిపోయాయి. "పదేళ్ల సన్యాసి ప్రవచనం చేస్తాడట. చూద్దాం, రండి రండి" అనుకుంటూ జనం చేరారు.

పదేళ్ల బాలుడంటే ఋగ్వేదంలో వర్ణించబడిన దశప్రమతి అని వాళ్లు ఊహించలేదు.

పూర్ణప్రజ్ఞుల పాఠం మొదలైంది.

**జ్ఞానశక్తి – అ వ్యక్త – తత్త్వ**
**బుద్ధి+సంకలనశక్తి – మహతత్వ – బ్రహ్మ**

ఓహ్! ఏమా ధారణాశక్తి?

ఎంత అద్భుతమయిన వివరణ?

ఎంతటి అనర్గళమైన వాక్ప్రవాహం?

సంశయానికి అవకాశం ఇవ్వకుండా బోధించే సంప్రదాయానికి విరుద్ధంగా సాగుతోంది ఆ ప్రవచన ప్రవాహం. జ్ఞానం కోసం ఆర్తితో వచ్చిన శ్రోతలందరికీ ప్రతిసందేహానికీ ఖచ్చితమైన సమాధానం ఇస్తూ, గ్రంథాల భావకడలి లోతుల్లోకి చొచ్చుకుపోతున్న ఆ ప్రవచన కౌశలం శ్రోతల్ని అబ్బురపరుస్తోంది. తన్మయుల్ని చేస్తోంది... క్రమంగా పూర్ణప్రజ్ఞుల ప్రవచనాల పటిమ చుట్టుప్రక్కలంతా వ్యాపించి, విద్వాంసులు సయితం అక్కడికి రావటం మొదలైంది.

## శుద్ధపాఠం - భాగవతం

శిష్యుడితో ఎదురైన చేదు అనుభవం దృష్ట్యా పాఠాలు చెప్పటం విరమించుకున్న గురువు అచ్యుతప్రేక్షులు మఠంలో సాయం సమయాల్లో భాగవత ప్రవచనం ప్రారంభించారు. ఈ ప్రవచనానికి మఠంలోని శిష్యులు, విద్వాంసులయిన గ్రామస్థులు శ్రోతలుగా వచ్చి కూర్చుంటున్నారు.

ఈసారి కొత్త సమస్య వచ్చి పడింది. గురువు ప్రవచనం చేస్తున్నప్పుడు ఆయన వివరించే శ్లోకాలకు శిష్యులు సందేహాలు వ్యక్తం చేయడం ఆరంభించారు. "గురుదేవా! మా పుస్తకాల్లో ఆ శ్లోకానికి వివరణ మరోరకంగా వుందే" అని అడుగుతున్నారు. వాళ్ళ పుస్తకాలు తీసి చూస్తే, వాళ్ళు చెప్పింది నిజమే. ఒక్కొక్క పుస్తకంలో ఒక్కోరకమైన వ్యాఖ్యానం. చివరికి అర్థజిజ్ఞాసకన్నా ఈ పాఠ్యజిజ్ఞాస ఎక్కువైంది.

అచ్యుతప్రేక్షులకి ఏం చేయాలో పాలుపోలేదు. మౌనం వహించారు.

ఇప్పుడు మళ్ళీ పూర్ణప్రజ్ఞులు రంగప్రవేశం చేయక తప్పలేదు. ఏది సరైన పాఠమో ఒక్కొక్కటిగా విడమర్చి చెబుతూ నిర్ధారించుకుంటూ వెళ్తున్నారు పూర్ణప్రజ్ఞులు.

"అదెలా చెప్పగలవు? ఇతరుల పుస్తకాలే సరైనవి అయివుండవచ్చు కదా?" అని ప్రశ్నించారు అచ్యుతప్రేక్షులు.

"లేదు గురువర్యా. ఇదే వేదవ్యాసులు రచించిన పాఠం. మిగిలినవన్నీ ఆయా గ్రంథకర్తల అభిప్రాయాలే."

అచ్యుతప్రేక్షులు ఓటమిని అంగీకరించలేదు.

"ఓహో! మీకు వేదవ్యాసులకు సమ్మతమయిన సమగ్రభాగవతం తెలుసునా?... తెలిసుంటే, అదేదో మాకూ చెప్పండి. కనీసం భాగవతంలోని పంచమస్కంధం యొక్క గద్యభాగం చెప్పండి" అంటూ పూర్ణప్రజ్ఞునికి పరీక్ష పెట్టారు.

నిజంగా కూడా, అసలైన విద్వత్ పరీక్ష భాగవతంలోనే ఉంది. అందులోకీ కఠినమైంది పంచమస్కంధం. అందులో చాలాభాగం గద్యమయం. అందుకే దాన్ని చెప్పమన్నారు గురువులు.

పూర్ణప్రజ్ఞులు సంకోచించలేదు. వెంటనే భాగవతంలోని పంచమస్కంధాన్ని అనాయాసంగా వివరించడం ప్రారంభించారు.

ఆశ్చర్యం!

చేతిలో పుస్తకం లేదు.

గతంలో ఆ బాల సన్న్యాసికి ఆ గురువువెన్నడూ బోధించిన దాఖలా లేదు.

అయినా...

భాగవతంలోని పంచమస్కంధం పూర్ణప్రజ్ఞుల నోటివెంట ధారాపాతంగా వచ్చేస్తోంది. గద్యాన్ని ఒప్పచెప్పటమే కాదు, దానికి వివరణ కూడా ఇస్తున్నారు! ప్రతి పదానికీ స్పష్టమైన ఉచ్చారణ, ప్రతి మాటకూ సంశయానికి ఆస్కారంలేని అర్థం...!! వింటున్నవారంతా చేష్టలుడిగి చూస్తూ, వింటూ మైమరచిపోయారు. గురువు అచ్యుతప్రేక్షులు సయితం నిర్ఘాంతపోయారు.

అంతా అయ్యాక, గురుదేవులు సంభ్రమంతో ప్రశ్నించారు. "పూర్ణప్రజ్ఞా, నువ్వే గెలిచావయ్యా... అయితే, నాదొక సందేహం. శైశవదశలో నువ్వు నా దగ్గరకు వచ్చినప్పట్నుంచీ నేటి వరకూ ఎన్నడూ నువ్వు భాగవతం చదవటాన్ని నేను చూడలేదు. నేనూ నీకు బోధించింది లేదు. అయినా అంత అలవోకగా ఎలా పఠించగలిగావ్? ఎక్కడినుంచి నీకీ జ్ఞానం సిద్ధించింది?"

"గురుదేవా, మీరన్నది సత్యం. నేను ఈ జన్మలో భాగవతం చదివివుండలేదు. కాని భాగవతంతోపాటూ ఇంకా అనేక ఇతర గ్రంథాలన్నీ చదివినట్లే నాకనిపిస్తూంటాయి. తలచుకొన్నప్పుడల్లా అవి నా నోటికి వస్తూంటాయి."

అచ్యుతప్రేక్షులకర్థమైపోయింది. పూర్ణప్రజ్ఞుణ్ని గత జన్మ జ్ఞానం వెంటాడుతోంది. గత జన్మలో ఆర్జించిన జ్ఞాన సంపద నేటికీ పూర్ణప్రజ్ఞుణ్ని అంటిపెట్టుకునే వుంది. అందుకే అతడు సర్వజ్ఞుడు.

అలాంటి సర్వజ్ఞుడైన వ్యక్తికోసం అప్పటికి ఎంతోకాలంగా అచ్యుతప్రేక్షులు ఎదురుచూస్తున్నారు. ఆయన సారథ్యంలోని పీఠానికి "నా తదనంతరం ఎవరు?" అన్నది

ఆయన అన్వేషణ. ఆయన ఆశించిన ఉత్తరాధికారి సకల సద్గుణవంతుడు, సర్వజ్ఞుడు అయి వుండాలి. అంటే- శాస్త్ర పరిణతి, వాదనాకౌశలం, తత్త్వదీక్ష, విషయ వైరాగ్యం, వాక్శుద్ధి, తపఃశుద్ధి, అపార లోకజ్ఞానం, విశిష్ట సంయమనం, అపార స్థితప్రజ్ఞత తదితర గుణాలు మేళవించివుండాలి. వీటికి తోడు సర్వాంతర్యామి అయిన శ్రీహరిపట్ల అచంచలమైన భక్తి, సమానులపట్ల మైత్రి, చిన్నవారిపట్ల ఆదరణ... వంటి విశిష్ట తత్త్వం రంగరించివుండాలి.

ఇంతటి విశేష వ్యక్తిత్వం కలిగిన వ్యక్తి మాత్రమే పీఠానికి ఉత్తరాధికారిగా ఎంపిక కాబడతాడు. కాని అంతటి ఉన్నతుడు అంత సులభంగా లభిస్తాడా? లభించకపోతే, పీఠం ఏమవుతుంది? మఠాలు స్వార్థశక్తులకు నిలయాలుగా మారి, పవిత్రతకు బదులు కాలుష్యాన్ని విరజిమ్ముతూ, జ్ఞానంతో ప్రకాశించడానికి బదులు అజ్ఞానాంధకారంతో నిండిపోతాయి. మరి సరైన ఉత్తరాధికారి ఎవరు, ఎలా లభిస్తారు? అన్న చింతన అచ్యుతప్రేక్షుల్ని వెంటాడుతున్నకాలంలోనే ఇలా పూర్ణప్రజ్ఞులు భాగవతాన్ని విపులీకరించడం జరిగింది.

దాంతో, అచ్యుత ప్రేక్షులకు తన సమస్యకు పరిష్కారం దొరికినట్లనిపించింది. గుండెబరువు దిగిపోయింది. "సకల గుణాభిరాముడైన ఈ పూర్ణప్రజ్ఞుడే మాకు ఉత్తరాధికారి" అని మనసులో నిశ్చితాభిప్రాయానికి వచ్చేశారు అచ్యుత ప్రేక్షులు.

## ఆనంద తీర్థులు

ఈ ఆలోచన వచ్చిన దగ్గర్నుంచీ అచ్యుతప్రేక్షులు ఏదో అనిర్వచనీయమైన ఆనందానుభూతికి లోనయ్యారు.

తెలుస్తోంది. ఇది దైవ నిర్ణయం. అందుకే మనస్సుకి ఈ ఉల్లాసం, ఉత్సాహం.

శీఘ్రంగా ఆ ఆలోచనను అమలుచేశారు. ఒక శుభముహూర్తంలో పూర్ణ ప్రజ్ఞుల్ని వేదాంత పీఠం మీద కూర్చోబెట్టి ఉత్తరాధికారిగా పట్టాభిషేకం చేశారు. పూర్ణప్రజ్ఞుల శిరస్సుమీద సాలగ్రామాలను వుంచి, శంఖంతో నీటిని నింపి, పురుష సూక్త మంత్రాలను పఠిస్తూ అభిషేకించారు. ఆ క్షణం నుంచీ పూర్ణప్రజ్ఞుల్ని 'ఆనందతీర్థులు'గా పిలవటం ప్రారంభించారు.

అలా, ఆశ్రమంలో వున్నప్పటి పూర్ణప్రజ్ఞులు అన్న నామం 'దశప్రమతి' అన్న వైదిక నామానికి అర్థమైతే, 'ఆనందతీర్థులు' అనే నామం 'మధ్వ' నామానికి వ్యాఖ్యానమయింది.

'మధ్వ'లైన ఆనందతీర్థులు పీఠాన్ని అధిరోహించిన కొత్తలో ఒక సంఘటన జరిగింది. అచ్యుతప్రేక్షుల మిత్రుడైన యతి ఒకరు తన శిష్యబృందంతో కలిసి అచ్యుతప్రేక్షులను సందర్శించటానికి వచ్చారు. నిజానికి వారు వచ్చింది. – 'ఆనంద తీర్థ'ల్ని కలుసుకోవాలనీ, వీలైతే ఆయనతో తత్త్వ జ్ఞానం గురించి చర్చించి గెలవాలనీ. ఆ యతి వరేణ్యుడు తర్కశాస్త్రప్రవీణుడు.

ఆ ప్రావీణ్యం కొద్దీ సహజమైన ఉత్సుకతతో వారు మధ్వాచార్యులతో చర్చ ప్రారంభించారు. ఆ చర్చ ఇలాసాగింది:

"భేద సాధన అంత జటిలమైన విషయమేమీ కాదు... జీవులు, ఈశ్వరుడు వేరువేరు. ఈశ్వరుడు నియమించేవాడు, జీవులు నియమింపబడేవారు. వారి సంబంధం రాజుకి, ప్రజలకి మధ్య వున్న సంబంధం లాంటిదే..."

పూర్ణప్రజ్ఞులు సుస్పష్టంగా ఈ వాదనను ఖండించారు.

"ఇలా కేవలం అనుమానంతో భేదాన్ని సాధించటం మన తరం కాదు. అలాగే అనుకున్న పక్షంలో – భిన్నత్వ విశేషణం పక్షమయిన భిన్నమా? అభిన్నమా? భిన్నాభిన్నమా? భిన్నమనిపోతే అవస్థాదోషం ప్రాప్తిస్తుంది. అభిన్నమని అంటే విశేషణ విశేష్య భావాలకు అనుపపత్తి. భిన్నాభిన్నమని అంటే వ్యాహతి. పైగా ఏక కాలంలో ఆ ఉభయ దోషాలకు ప్రాప్తి..."

ఈ ఆక్షేపణకు వారు జవాబియ్యలేదు. మరొక అంశాన్ని లేవనెత్తారు.

తమ వాదనకు బలం చేకూర్చటం కోసం యుక్తిని కూడా తమ వాదనలో ప్రయోగించారు.

"ఈ జగత్తు మిథ్య. కంటికి కనుపిస్తోంది కనుక పాదరసం కూడా వెండిలా మెరుస్తుంది. కాని అది ఎలా వెండి (నిజం) కాదో, అలాగే కంటికి కనుపించేదంతా మిథ్య..."

కాని ఈ వాదాన్ని మధ్వాచార్యులు అంగీకరించలేదు. "కంటికి కనుపించేదంతా మిథ్య అనటానికి లేదు. పాదరసం వెండిలా కనుపించటం మిథ్య కావచ్చును. కాని వెండిలా కనబడే వెండి సత్యమే అవుతుంది కదా!... మిథ్య అనబడే ప్రతీదీ మిథ్య అనటం కూడా మిథ్యే..."

పూర్ణప్రజ్ఞులు తర్కాన్ని విశ్లేషణ చేసే విధానం చింతనకి దారి తీసింది. తర్కంతో ఏదైనా సాధించవచ్చు అన్న తార్కిక చింతన అసంబద్ధమైనది. అసలు, తర్కంతో ఏదైనా సాధించవచ్చు అనటంలోనే – అవతలి వాదాన్ని నిరాకరించటం కూడా సాధించవచ్చునన్న అర్థం దాగి వుంది గదా! కేవలం తార్కికంగానే వాదించి అన్నీ గెలవగలమనుకుంటే – ఏం జరుగుతుంది? చిన్నచెట్టు చిన్న పళ్ళు కాస్తే, పెద్ద చెట్టు పెద్ద పళ్ళు కాయాలి గదా! మరి చిన్న, సన్న గుమ్మడిపాదు భారీ పరిమాణపు గుమ్మడికాయను కాస్తుంటే, ఎత్తుగా, గుబురుగా ఎదిగే అశ్వత్థ వృక్షం ఇంకా పెద్ద పళ్ళు కాయాలి గదా! కాస్తోందా! లేకపోగా, అశ్వత్థ వృక్షానికి కాసే పళ్ళు అతి చిన్నవిగా వుంటున్నాయే!... అలాగే, గొర్రెలకి కొమ్ములుంటే, గుర్రాలక్కూడా కొమ్ములు మొలవాలి అని వాదించవచ్చు. సాధ్యమా?

అందుకే, తర్కం ఎంత వాడిగా వున్నా దానికి స్వతంత్రంగా ప్రామాణికంగా నిలిచే శక్తి వుండదు. భౌతిక విషయాల గురించి చర్చించేటప్పుడు, ఇంద్రియవాసనలకు సంబంధించిన విషయాలను చర్చించేటప్పుడు తర్కానికి సంబంధిత విషయాల భౌతిక రూపం ఆధారమవుతుంది. కాని, అతీంద్రియమైన విషయాలపై చర్చ విషయంలో మాత్రం తర్కానికి ఆధారం ఆగమశాస్త్రం. ఇందుకు విరుద్ధంగా చేసే తర్కం కుతర్కం అనిపించుకుంటుంది.

ఆగమం ఆధారంగా మాత్రమే జరిగే తత్త్వ నిశ్చయం ప్రామాణికమైంది. అనుమానం ఎప్పటికీ స్వతంత్ర ప్రమాణం అనిపించుకోదు...

ఇలా 'అనుమానం' గురించి మధ్వాచార్యులు ఇచ్చిన వ్యాఖ్యానం 'ప్రమాణ ప్రక్రియ' గురించి కొత్త వెలుగు చూపించింది. అప్పటివరకూ తర్కమే గొప్పదని భావిస్తూ వచ్చిన వారికి ఆ భ్రమలు తొలగిపోయాయి. ఈ పరిణామం ప్రజలకు శ్రీ పూర్ణప్రజ్ఞుల పట్ల గౌరవాన్ని ఇనుమడింపజేసింది. ఈ వ్యాఖ్యాన రీతితో ప్రభావితులైన ప్రజలు క్రమంగా వారిని 'అనుమానతీర్థులు' అని పిలవటం ప్రారంభించారు. ఆ రకంగా 'కంటికి కనుపించేదంతా మిథ్య' అన్న తర్కం ఆధారంగా ప్రచారంలో వున్న కల్పనా వాదాన్ని ఖండించిన కీర్తి మొదటిసారిగా పూర్ణప్రజ్ఞులదయింది.

### వాది సింహం గ్రామ సింహం

**ఈ** సంఘటన జరిగిన కొన్ని రోజులకే మరొక ప్రజ్ఞావంతులు తన శిష్యుడితో ఉడుపికి వచ్చారు. ఈయన పేరు బుద్ధిసాగర్. బౌద్ధమతస్థుడు. శిష్యుడిపేరు వాదిసింహ. ఈ వాదిసింహుడు స్వతహాగా తార్కికుడు. బుద్ధి సాగరుడితో వాదంలో ఓడిపోవటంవల్ల ఆయనకి శిష్యుడిగా మారాడు. మహా పండితులయిన ఈ గురుశిష్యులిద్దరూ అద్వైతప్రేక్షులను కలిసి తమ వాదాన్ని వినిపించారు.

అచ్యుతప్రేక్షులు ఉత్సాహంతో పూర్ణప్రజ్ఞులికి కబురుచేశారు. అప్పట్లో ఆయన అనంతాసనుడి ఆలయానికి కుడివైపునున్న మఠంలో (ఇప్పుడది భండారకరె మఠం తాలూకు కట్టడంగా చెప్పబడుతోంది) పూర్ణప్రజ్ఞులుకి కబురు తెలిసి, ఆయన సన్నద్ధులై మఠానికి వచ్చే లోపలే ఈ కొత్త గురు శిష్యుల వాదనా కుతూహలం గురించి విన్న విద్యావంతులంతా అక్కడికి చేరుకున్నారు. బుద్ధిసాగరుడు, ఆయన శిష్యుడు అపార ప్రజ్ఞావంతులని వినటంతో, అంతటి పండితులతో బాల మధ్వాచార్యులు ఎలా వాదించబోతున్నారో అన్న ఉత్కంఠ అందరిలోనూ నెలకొంది.

కొంతసేపటికి, తమని తాము జ్ఞానవృద్ధులుగా అభివర్ణించుకున్న పండితులు బుద్ధిసాగర, వాది సింహ ఒకవైపు, కౌమారదశలోకి అడుగుపెడ్తున్న బాల మధ్వాచార్యులు మరోవైపు ఆసీనులయ్యారు. పూర్ణప్రజ్ఞుల్ని చూస్తూనే గురుశిష్యులిద్దరూ ఆనందపడ్డారు. "ఈ బాలకుడా! తలపండిన మాతో తలపడేదీ?" అనుకున్నారు. ఇతన్ని వాదించి గెలవటం చాలా సులభం అన్న నమ్మకం వారిలో బలపడింది.

వాదన ప్రారంభమయింది. ముందుగా బుద్ధిసాగరుని శిష్యుడైన వాదిసింహుడు ప్రారంభించాడు.

క్షణాలు...

నిమిషాలు...

గంటలు...

అతి సునాయాసంగా వాది సింహుడి వాదాన్ని పూర్ణప్రజ్ఞులు ఖండించారు. అందరూ ఆశ్చర్యంలో చూస్తుండగానే పూర్ణప్రజ్ఞులు తను వాదనా పటిమతో వాదిసింహుడి తర్కాన్ని త్రిప్పికొట్టారు. ఈ బాల మధ్వుని విద్వత్తు వాదిసింహునిలో విస్మయాన్నీ, అసూయనీ రేకెత్తించింది. ఈసారి వాదిసింహుడు మరింత పట్టుదలగా మరొక అంశాన్ని తీసుకుని 18 రకాలుగా విశ్లేషిస్తూ పూర్ణప్రజ్ఞుల ప్రతివాదాన్ని ఖండించే ప్రయత్నం చేశాడు. ఆ వాదానికి సమాధానంగా పూర్ణప్రజ్ఞులు 18 వికల్పాలను ఉదహరిస్తూ వాదించారు.

ఏమా వాగ్ధాటి?

ఏమా వాదనా పటిమ?

ఏమా అస్పష్టతలేని భావ ప్రవాహం?...

బాలమధ్వుల వాదనాచాతుర్యం ముందు వాదిసింహుడు తలవంచక తప్పలేదు. చీకటి ఎంత విశాలంగా పరుచుకుని వున్నా ఒక సూర్యకిరణం చాలు గదా దాన్ని చీల్చి వేయటానికి!

అంతే! జీవసింహుడైన మధ్వుల ముందు వాదిసింహుడు గ్రామసింహమై, ఓటమి నంగీకరించాడు. శిష్యుడి ఓటమితో అతడి గురువు బుద్ధి సాగరుడు రంగప్రవేశం చేయక తప్పలేదు. అతను పేరుకు తగినట్లే అపారమైన వాక్చాతుర్యం కలవాడు. కేవలం వాదంతో అనేకచోట్ల అనేకమంది పండితుల్ని ఓడించినవాడు.

ఇప్పుడు బుద్ధి సాగరుడితో శ్రీపూర్ణప్రజ్ఞుల వాదం మొదలైంది. నిమిషాలు... గంటలు... పూర్ణప్రజ్ఞుడి వాదనలో సాగరమంత లోతు వుంది. బుద్ధి సాగరుడు ఎంత వాదించినా పూర్ణప్రజ్ఞులు ఇంకా ఇంకా విజ్ఞాన సాగరలోతుల్లో తన వాదానికి మద్దతునిచ్చే అంశాలతో వాదిస్తున్నారు. గంటలు గడుస్తున్న కొద్దీ బుద్ధి సాగరుడికి తాను చిక్కుల్లో పడుతున్నానా అన్న సంశయం కలిగినట్లయింది.

"పూర్ణ ప్రజ్ఞా! ఈ చర్చ ఇంత త్వరగా తెగేదికాదు. ఈరోజుకి ముగించి, మళ్ళీ రేపు కొనసాగిద్దాం" అన్నాడు బుద్ధి సాగరుడు. బాలమధ్వులు మందహాసం చేశారు. "సరే" అన్నారు. సభ మరునాటికి వాయిదా పడింది...

తెల్లవారింది.

ఆశ్రమం అంతా హడావుడి పడుతున్నారు – రెండో రోజు సభకు త్వరత్వరగా తయారయి వెళ్ళి వినాలని. గ్రామస్థులు సయితం ఇంతటి అర్థవంతమైన చర్చ వినే అదృష్టాన్ని వదులుకోకూడదని త్వరత్వరగా సిద్ధమవుతున్నారు.

కాని...

అతిథి మర్యాదలు చూసే ఆశ్రమవాసి బుద్ధిసాగరుల వారి కుటీరానికి వెళ్ళి చూస్తే..?

అది ఖాళీగా వుంది. గురుశిష్యులిద్దరూ అప్పటికే పలాయనం చిత్తగించారు!

జయాపజయాలు సర్వసాధారణ మైనవి. కాని, పరాజయాన్ని అంగీకరించగల నైతిక స్థైర్యం లేక గురుశిష్యులు రాత్రికి రాత్రే లోకనీతికి విరుద్ధంగా అదృశ్యమయ్యారు.

### తత్త్వబోధనకు నాంది

మఠంలో యథాప్రకారం పూర్ణప్రజ్ఞుల పాఠాలు కొనసాగుతూ వచ్చాయి.

ఒక రోజున పూర్ణప్రజ్ఞులు బ్రహ్మసూత్రాల శంకర భాష్య ప్రవచనం ప్రారంభించారు. ఎన్నోసార్లు నిజానికి అదే శంకర భాష్యాన్ని అంతకుముందు ఎంతోమంది గురువులు ఎన్నోసార్లు బోధించివున్నారు. అప్పటి వరకూ అదే ప్రామాణికమైవుంది.

పూర్ణప్రజ్ఞులు ఒకటికి నాలుగుసార్లు శంకర భాష్యాన్ని పరిశీలించారు. ప్రవచనం మధ్యలో ఆపి కొత్త అంశాన్ని విద్వాంసుల దృష్టికి తీసుకువచ్చారు.

"ఎలాంటి ఆవేశపూరిత భావోద్రేకాలు లేకుండా మనం ఈ బ్రహ్మ సూత్రాలను, శంకరభాష్యాన్ని పరిశీలించినట్లయితే, ఒక్క విషయం స్పష్టంగా బోధపడుతుంది. ఈ సూత్రాలకీ, ఈ భాష్యానికీ పొంతన లేదు. సూత్రం యొక్క భావం ఒకటైతే, భాష్యం ఇస్తున్న వివరం మరో రకంగా వుంది..."

ఇలా అంటూ పూర్ణప్రజ్ఞులు ఆ భాష్యంలో తనకు తోచిన అనేక లోపాలను ఎత్తిచూపించారు. అంతవరకూ తమకు ఆ దోషాలు తోచనందుకు శిష్యులు విస్మయం చెందారు. ఈ లోపాలను పరిహరించడం తమవల్ల కాదని వాళ్ళకి అర్థమైపోయింది. పూర్ణప్రజ్ఞుల్ని అభ్యర్థించారు. "మీరే ఈ లోపాలను చూపారు. కాని బ్రహ్మసూత్రాల నిజమైన భావాన్ని వివరించలేదు. ఆక్షేపణా రహితంగా ఈ సూత్రాలను మాకు వివరించగలరా?"

వాళ్ళ కోరికమేరకు పూర్ణప్రజ్ఞులు స్వయంగా బ్రహ్మసూత్రాలకు అర్థాన్ని, వ్యాఖ్యానాన్ని వివరించడం ఆరంభించారు. సరళమైన శైలి, సులభమైన అన్వయం, శ్రుతి, స్మృతుల సమాఖ్యతో కూడుకొన్న వివరణ పూర్ణప్రజ్ఞుల కంఠం నుండి ధారాపాతంగా వెలువడుతుంటే, వాళ్ళంతా ఆనందసాగరంలో మునిగిపోయారు. మాటల్లో చెప్పలేనంత సంతృప్తి వాళ్ళ గుండెల్లో నిండిపోయింది.

అంతవరకూ వాళ్ళ పాఠంలో పూర్వపక్ష నిరూపణ అంతా విమర్శలతో నిండివుంది. దానికి సిద్ధాంత నిరూపణ జరగలేదు. జరగలేదు అంటే జిజ్ఞాసువులైన వాళ్ళు అడిగి తెలుసుకోవాలి కదా! "నా ప్రష్టః కస్యచిద్రోయాత్".... జిజ్ఞాసతో అడిగితే తప్ప సిద్ధాంతాన్ని ఉపదేశించ కూడదన్నది శాస్త్రనియమం.

కాని ఇప్పుడు వాళ్ళలో ఈ జిజ్ఞాస ప్రారంభమైంది. శ్రోతలందరూ ఒకరకంగా వుండరుకదా! కొంతమంది నిర్మల హృదయంతో క్రొత్త విషయంలో మంచి ఏముంది - అని ఆసక్తితో తెలుసుకోవాలనుకుంటారు. మరికొంతమంది వాళ్ళు విశ్వసించే తత్త్వానికి విరుద్ధంగా ఏమన్నా చెబుతున్నారా, అలా చెబుతుంటే ఎలా ఖండించాలీ... ఇలా ఆలోచించే వాళ్ళయి వుంటారు. ఇద్దరినీ సమాధాన పరిచే ప్రవచన సారథ్య సామర్థ్యం పూర్ణప్రజ్ఞులకి వుంది కాబట్టి తత్త్వ జిజ్ఞాస కలవాళ్ళకి జిజ్ఞాస పెరిగేలా సిద్ధాంత నిరూపణ చేసి, వాళ్ళని తన శిష్యులుగా చేసుకునేవారు. సంకుచిత దృష్టితో కేవలం ఖండించాలని వచ్చిన వాళ్ళని తన వాదనా పటిమతో ఓడించేవారు.

## మధ్యగేహుల మధ్వదర్శనం

ఒకసారి మఠంలో మధ్వాచార్యులు ప్రవచనం చేస్తున్నప్పుడు ఆయన తండ్రి నడిల్లాయరు (మధ్యగేహులు) మఠానికి వచ్చారు.

చాలాకాలమైంది కదా కొడుకుని చూసి! పుత్రవాత్సల్యం ఎక్కడికి పోతుంది? తల్లికి మరీ ఎక్కువ! కొడుకు ఎలా వున్నాడో నన్న ఆదుర్దా కొద్దీ ఆమె భర్తని మఠానికి పంపించింది. మఠాలంటే సన్యాసులకు మఠాలే తప్ప కుటుంబాలు నివసించే సత్రములు కాదు కాబట్టి, ఆమె ఒక్కసారి వెళ్లి కొడుకుని చూసి రమ్మని భర్తని వత్తిడి చేసింది. ఆయనకీ వుంటుంది కదా కొడుకుని గురించి బెంగ!

నడిల్లాయరు మఠానికి వచ్చేసరికి పూర్ణప్రజ్ఞులు ప్రవచనం చేస్తున్నారు. కొడుకుని చూస్తూనే ఆ తండ్రి సంభ్రమానికి గురయ్యారు.

ఆ బాల మధ్వుల ముఖంలో ఏమిటా వర్చస్సు? సూర్యకాంతిలా ప్రకాశిస్తున్న ఆ శరీరకాంతి ఎంత ఆకర్షణీయంగా వుంది? ఆ వాచస్పతి నోటినుంచి ధారాప్రవాహంగా వెలువడుతున్న జ్ఞానబోధ ఎంత మధురంగా ఇంకా ఇంకా వినాలనిపించేలా వుంది!...

అలా వింటూ వింటూ మధ్యగేహులు తననితాను మర్చిపోయారు. మఠానికి రాకముందు వరకూ – సన్యసించినందుకు కొడుకుమీద వున్న కోపం అంతా నీటిబుడగలా కరిగిపోయింది. చిన్నతనంలో చేతిలో ఒక దండం పట్టుకొని, "నేను వైష్ణవమతం స్థాపిస్తాను" అంటూ తిరిగిన కొడుకు రూపం గుర్తొచ్చింది. క్రమంగా నిర్ధారితమవుతోంది – జరుగుతున్న పరిణామాలన్నింటికీ ఏదో అర్థం, పరమార్థం వుండే వుంటుంది.

తత్వ జ్ఞాన జ్యోతిలా ప్రకాశిస్తున్న కొడుకుని తనివితీరా చూసుకొన్నాక, "ఇంతటి జీవోత్తముడికా మేం జన్మనిచ్చాం" అని ఆనందిస్తూ ఇంటి ముఖం పట్టారు మధ్యగేహులు.

## భాష్యం రాయాలి

అచ్యుతప్రేక్షులు తన శిష్యుడైన పూర్ణప్రజ్ఞుడిలోని ప్రజ్ఞాపాటవాలు ఎంతగా మెచ్చుకొంటున్నప్పటికీ, విషయచర్చల సమయంలో విమర్శలు కొనసాగుతూనే వుండేవి. ముఖ్యంగా ప్రవచనాల సమయంలో చెణుకులతో నిండిన వివాదం నడుస్తూ వుండేది.

పూర్ణప్రజ్ఞులది పరిపూర్ణ విశ్వాసంతో కూడిన సిద్ధాంతం. తాను ఏం ప్రవచిస్తున్నాడో దానికి పూర్తి సిద్ధాంత నిరూపణ చేయగల వాదనా పటిమ వుంది. అయితే బ్రహ్మ సూత్రాల మీద శంకరభాష్యం ప్రవచించే విషయంలో బాలమధ్వుల విశ్లేషణ గురువులకి కొత్తగా

తోచేది. ఆ భాష్యానికి అలా విమర్శలు చేయడం, అలాంటి విశ్లేషణలివ్వడం ఇప్పుడు కొత్తగా జరుగుతోంది... గురుశిష్యుల మధ్య ఆరోగ్యవంతమైన సంవాదాలు జరుగుతుండేవి.

చివరికి ఒకరోజు అచ్యుతప్రేక్షులు వుండబట్టలేక అనేశారు: "పూర్ణప్రజ్ఞా, నీకు బ్రహ్మసూత్రాల భావం సుస్పష్టంగా తెలిసినట్లు వాదిస్తున్నావు గదా, ఇంకేం! నువ్వే ఒక భాష్యం రాసేయరాదా!" అది వెటకారమా? ఆదేశమా? పూర్ణప్రజ్ఞులు మాత్రం ఆదేశంగానే తీసుకున్నారు.

అచ్యుతప్రేక్షులకు మరొక శిష్యుడుండేవారు. లికుచ వంశానికి చెందినవారు. పూర్ణప్రజ్ఞుల కన్నా ముందే సన్యసించి, జ్యేష్ఠ యతి అని పిలవబడేవారు. లౌకిక జీవితాన్ని పరిపూర్ణంగా త్యజించిన వైరాగ్యతత్త్వం, సాత్త్విక ధోరణి ఉట్టిపడుతుంటాయి. ఆశ్రమంలోని శిష్యులందరికీ ఆయనే పెద్దవాడయినప్పటికీ, పూర్ణప్రజ్ఞుని పట్ల గౌరవం మెండుగా వుండేది. ఆయన క్కూడా, బ్రహ్మసూత్రాలపై వచ్చిన సారరహిత భాష్యాలపట్ల అసంతృప్తి వుండేది. ఆ అసంతృప్తి ఎక్కడికి దారితీసిందంటే...

ఒకరోజు జ్యేష్ఠ యతి ప్రత్యేకంగా మధ్వాచార్యులతో సమావేశమై, "వ్యాసులవారు ప్రతిపాదించిన సూత్రాల స్ఫూర్తికి విరుద్ధంగా ఏమిటీ భాష్యాలు? ఇవి అవసరమా? మీరు చిన్నవయసులోనే బ్రహ్మసూత్రాలను ఔపోసన పట్టారు. మీరే సరైన భాష్యం రాసి, లోకానికి సన్మార్గ దర్శనం చేయవచ్చుకదా?" అని అభ్యర్థించారు.

ఈ పరిణామాలన్నీ దైవికమైనవనీ, ఈ ఆదేశం ఆ భగవంతుని ఆదేశమనీ ఆనందతీర్థులు భావించారు. ఆ బృహత్ కార్యానికి ఉపక్రమించారు...

అంతే!

మధ్వాచార్యులు తొలి వ్యాఖ్యాన చంద్రికను వెలువరించారు. అందులో జిజ్ఞాసువులైన వాళ్లకి నిజమైన వ్యాససూత్రాల భాష్యం, వ్యాస సమ్మతమయిన వైదిక సిద్ధాంతం కనుపించింది. ఒక్కసారిగా విష్ణుతత్త్వాన్ని ఆవరించివున్న అంధకారం తొలగిపోయి నట్లయింది. తత్త్వజ్ఞాన సంపద కాంతులు నలుదెసలా పరుచుకున్నట్లయింది... మరొక మధ్వమహిమ వెలుగులోకి వచ్చినట్లయింది..!

## వృకోదరులు

**య**తులు నిత్యం సంచారం చేస్తూ ఉండాలి. బలమైన కారణం ఉంటే తప్ప ఒకేచోట ఎక్కువ కాలం మజిలీ చేయరు. చాతుర్మాస్య దీక్ష కాలంలో మాత్రం ఒకేచోట నిలకడగా

వుంటారు. అందుకే వాళ్ళని పరివ్రాజకులంటారు. అచ్యుతప్రేక్షులు ఈ నియమాన్ని విధిగా పాటించేవారు.

ఒకసారి వారు తమ పర్యాయంలో భాగంగా విష్ణు మంగళ క్షేత్రాన్ని సందర్శించారు. ఇది ఇప్పటి కాసరగోడ్ దగ్గర పుణ్యక్షేత్రం. అక్కడ ఒక భక్తుడు అచ్యుతప్రేక్షుల బృందాన్ని భిక్షకు ఆహ్వానించాడు. ఆహ్వానించిన భక్తుడు మధ్వాచార్యులశక్తి గురించి అప్పటికే విని వున్నాడు. మధ్వాచార్యులంటే సకల శాస్త్రకోవిదులనీ, చతుఃషష్టి కళాకోవిదులనీ, అపారమైన యోగశక్తి సముపార్జితులనీ... ఇలా ప్రచారంలో వుండటంతో ఆ భక్తుడికి మధ్వాచార్యులను పరీక్షించాలనిపించింది.

తన ఇంట్లో గురువులకు భిక్ష పూర్తయిన వెంటనే ఆ భక్తుడు రెండువందల పెద్ద అరటిపళ్ళను తెచ్చి మధ్వాచార్యుల ముందుంచి "స్వీకరించండి స్వామీ" అని కోరాడు పూర్ణ ప్రజ్ఞులు మందహాసం చేశారు. అద్భుతం! అంతా చూస్తుండగానే ఆ రెండువందల పళ్ళు ఆరగించారు. ఎవరు చేయగలరిలా? మహాభారత కాలంనాటి భీమసేనుడు తప్ప?

అంతా అయిపోయాక, అచ్యుతప్రేక్షులు సంభ్రమంతో పూర్ణప్రజ్ఞుల్ని ఏకాంతంగా పిలిచి అడిగారు: "పూర్ణ ప్రజ్ఞా, ఏమిటీ విచిత్రం? భోజనానికి ముందు కూడా అసాధ్యమైన విషయాన్ని నువ్వు భోజనం తరువాత సుసాధ్యం చేశావే! పైగా నీ ఉదరం చూస్తే నువ్వసలు భోజనం చేసినట్లే కనుపించటంలేదు. ఎలా సాధ్యం?"

పూర్ణప్రజ్ఞులు దాచుకోకుండా జవాబిచ్చారు: "గురుదేవా! నా జఠరాగ్ని బొటనవేలంత పెద్దది. అది నాకు హితమైనది. ఎంతైనా జీర్ణం చేసుకునే శక్తి దానికుంది..."

అచ్యుతప్రేక్షులకు మహాభారతంలోని భీమసేనుడు గుర్తుకొచ్చాడు. అంతటి అగ్నిని ఉదరంలో కలిగి వుండటం వల్లనే భీముడికి 'వృకోదరుడు' అని పేరు వచ్చింది. ఒకవేళ ఆ వృకోదరుడే ఈ మధ్వాచార్యులా? ... క్రమంగా అచ్యుతప్రేక్షులకు ఏదో ఒక సంశయానికి సమాధానం దొరుకుతున్నట్లనిపిస్తోంది.

సంశయించటానికి కారణం – గురువులు అంతకుముందు విని ఉండటమే తప్ప పూర్ణప్రజ్ఞుడి సామర్థ్యాన్ని చూసివుండలేదు. కాని శైశవదశలోనే ఉలవలు తిని జీర్ణించుకొన్న శక్తి మధ్వాచార్యులకుందని ఆయనకు తెలీదు.

**దక్షిణయాత్ర**

పూర్ణప్రజ్ఞులు దక్షిణ దిగ్విజయ యాత్ర సాగించారు. దారిలో అనేకచోట్ల విభిన్నవాదాలు. పూర్ణప్రజ్ఞులు విశ్వసిస్తున్న తత్త్వం అంతకుముందు వరకూ ఆచరణలో

వున్నతత్త్వాలకు విరుద్ధం. అందువల్ల సహజంగానే ఆయనకి తారసపడిన పండితులూ, విద్వాంసులూ అంతా ఆయన వాదాన్ని ఖండించే ప్రయత్నం చేస్తూ వచ్చారు. ప్రతిచోటా వాదాలు, చర్చలు హోరాహోరీగా సాగాయి. అన్నింటిలోనూ ఆయనదే విజయం.

అలా ఇతర వ్యాఖ్యానాలన్నింటినీ నిర్ద్వంద్వంగా ఖండిస్తూ ఆయన సంచారం కొనసాగించారు. ఆ సంచారం అవిఘ్నంగా సాగింది.

అలా సంచారం చేస్తున్నప్పుడే కేరళ దేశంలోని పయస్వినీ నదిని చూశారు. ఆ నదీతీరమంతా దేవాలయాల మయం. అక్కడ గ్రామాలలో వేదశాస్త్రాలను అధ్యయనం చేస్తున్న బ్రాహ్మణ కుటుంబాలు కనుపించాయి. ప్రకృతిమాత అందమంతా అక్కడ గూడుకట్టుకున్నట్లుగా వుంది... ఆ తీరాన్ని చూస్తూనే, మధ్వాచార్యులు "రాబోయే కాలంలో దుర్గాదేవి ఇక్కడే అవతరిస్తుంది" అని భవిష్యత్ వాణిని ప్రకటించారు...

అలా సంచారం చేస్తూ తిరువనంతపురంలో స్వర్ణమయుడైన అనంతపద్మనాభస్వామి ఆలయాన్ని కూడా దర్శించారు. ఈ ఆలయం 'సిద్ధితో కూడుకున్న మహాక్షేత్రం'. ఒకే ద్వారంలోంచి మొత్తం విగ్రహాన్ని చూడటం సాధ్యం కాదు. మూడు ద్వారాలలోంచి చూస్తేనే మొత్తం మూర్తిని చూడగలుగుతాం.

### కుదిపుస్తూరుని పరాభవం

**తి**రువనంతపురంలో కూడా విద్వాంసుల సభ జరిగింది. అప్పటికే మధ్వాచార్యుల గురించి విస్తృత ప్రచారం జరిగి వుండటం వల్ల అనేకమంది పండితులు ఆసభకు విచ్చేశారు.

అక్కడ కూడా బ్రహ్మసూత్రాల అర్థాల వివరణసాగింది. జీవుడికి, ఈశ్వరుడికి గల భేదాన్ని ఆవిష్కరించటమే వారి వాదన. సకలశాస్త్రాల సారం శ్రీహరి సర్వోత్తమ తత్త్వమే. శాస్త్రప్రతిపాదనకు ఆద్యుడైన బ్రహ్మ శ్రీహరి మాత్రమే అన్నది ఆయన వాదన సారాంశం.

ఆ సభకు వచ్చిన వాదుల్లో కుదిపుస్తూరు ఒకరు. ఆ ప్రాంతంలో ఆయన యతి ప్రముఖుడు. శంకరులవారి పునరవతారంగా ఆయన గురించి ప్రచారంలో వుంది. ఆయనకి మధ్వాచార్యుల వాదన సమర్థనీయంగా అనిపించలేదు. అయినా వాదాన్ని వాదంతో ఎదుర్కోటానికి బదులు ఒక కొత్త వ్యాఖ్యానంతో దాడి చేశారు. "బ్రహ్మ సూత్రాలకు భాష్యం రాయకుండానే సూత్రార్థం చెప్పటం మహా అపచారం" అంటూ ఆయన విమర్శనాస్త్రాలు సంధించారు.

పూర్ణప్రజ్ఞులు ఈ వాదనకి మందహాసం చేశారు. "అలాగే తప్పకుండా. నా ఆలోచనలను మీరు స్పష్టంగా ఆవిష్కరించమంటున్నారు కనుక తప్పకుండా సూత్రాలకు

భాష్యం రాస్తాను. అయితే నా వాదన నేను వినిపించటానికీ భాష్యం రాయటానికీ సంబంధమున్నట్లు నిర్ధారించే రాజశాసనమేదీ లేదు సుమా" అని స్పష్టం చేశారు.

"నిజమేకదా" అనుకున్నారు పండితులంతా. అప్పటికే అద్భుత దేహకాంతిని, శాస్త్రాల్లో వర్ణించిన మహాపురుష లక్షణాలను ఆయనలో చూసిన ఆహూతులంతా సూత్రార్థాన్ని పూర్ణ ప్రజ్ఞులు వర్ణించటమే ఉచితమన్న నిర్ణయానికి వచ్చేశారు.

జ్ఞానానికి, దేహ లక్షణాలకి సంబంధం వుంది అని శాస్త్రాలు పేర్కొంటున్నాయి. దేహం ఎంత సలక్షణంగా వుంటుందో అంతగా ఆ వ్యక్తిలో అంతటి గురుత్వం వుంటుంది. అలాంటి సలక్షణాలు మొత్తం 32. వాటిలో 24 లక్షణాల కన్నా తక్కువ కానివారు 'వేద ద్రష్టలని' పిలవబడతారు. అంతకన్నా ఎక్కువ లక్షణాలు వున్నాయంటే అది దైవత్వానికి సంకేతం.

**వింశలక్షణతోఒ నూనః తపస్వీ బహువేదవిత్ ।**
**వేద ఇత్యేవ యం పశ్యేత్ స వేదో జ్ఞాన దర్శనాత్॥**

విష్ణుతత్త్వాన్ని బ్రహ్మాండ పురాణం స్పష్టంగా నిర్వచించింది. ఇరవై ఎనిమిది లక్షణాలు పొందినవారు గరుడ, శేష, రుద్రులు. 32 లక్షణాలు పొందినవాళ్ళు సాక్షాత్తూ ఋజువులు. బ్రహ్మావాయువులు ఋజుపుంగవులు. అంతటి విశిష్ట లక్షణమే పూర్ణప్రజ్ఞుల వ్యక్తిత్వం. అందుకే అక్కడి పండితులు ఆయన్ని స్తుతించారు.

కాని ఈ విషయాలేవీ తెలుసుకునేందుకు కుదిపుస్తూరు ప్రయత్నించలేదు. ఆ కోరిక కూడా లేదు. తనకు తెలిసిందే లక్షణమన్న విశ్వాసం కలవారు.

పూర్ణప్రజ్ఞులు చిరునవ్వుతో చెప్పారు. "మీ హృదయం ఎంత విశాలమయిందో చూడండి. అది సలక్షణం కాదు దుర్లక్షణం". కాని ఈ వ్యాఖ్యను కుదిపుస్తూరి సహృదయంతో స్వీకరించలేకపోయారు. పైగా "పూర్ణప్రజ్ఞుడి దండాన్ని ముక్కలు చేస్తాను" అని శపథం చేసి మరీ అక్కడ్నుంచి నిష్క్రమించారు.

ఆ తరువాత పూర్ణ ప్రజ్ఞులు సందర్శించిన క్షేత్రం కన్యాకుమారి. ఇది మూడు సముద్రాల సంగమం కావటం వల్లా, స్వయంగా ఆవిర్భవించిన కన్యాకుమారి (పార్వతీదేవి) క్షేత్రంగా ప్రచారంలోకి రావటం వల్లా అత్యంత విశిష్టమైన ప్రదేశమైంది.

వాదిరాజులవారి వర్ణన ప్రకారం కన్యాకుమారి సాక్షాత్తూ మహాలక్ష్మి. బలరామదేవుడు ఈ ప్రాంతంలో తీర్థయాత్ర చేసినట్లుగా భాగవత పురాణంలో వుంది. అందులో ఇంకా ఇలా చెప్పబడివుంది. అరణ్యవాసకాలంలో అర్జునుడు ఒక ఏడాదిపాటు తీర్థయాత్ర చేసి,

చివరికి సుభద్రాదేవిని పరిణయమాడతాడు. ఆ తీర్థయాత్రలో భాగంగా ఈ ప్రాంతాన్ని సందర్శిస్తాడు. అప్పుడు సాగర సంగమంలో స్నానం చేస్తున్నప్పుడు అయిదు మొసళ్ళు అతని పాదాలు పట్టుకుంటాయి. ఒక బ్రాహ్మణుడి శాపం వల్ల మొసళ్ళుగా మారిన అప్సరస్త్రీలు అక్కడ అర్జునుడి పాదాలు పట్టుకోగానే శాపవిముక్తి చెందారు. అర్జునుడే కాదు, భీమసేనుడు మిగతా పాండవులు కూడా మరో సందర్భంలో ఆ ప్రాంతాన్ని సందర్శించారు.

ఆ తీర్థంలోనే ఇప్పుడు మధ్వాచార్యులు కూడా స్నానం చేశారు. ఆ తీర్థానికి పవిత్రత పెరిగింది.

## రామేశ్వరంలో చాతుర్మాస్యం

**చా**తుర్మాస్య దీక్షా కాలం సమీపించేనాటికి పూర్ణప్రజ్ఞుల వారు రామేశ్వరం చేరుకున్నారు.

బంగాళాఖాత తీరంలోని రామేశ్వరం విచిత్రమైన విశిష్టమైన క్షేత్రం. రాముడి వలన వైష్ణవులకు, శివుడివలన శైవులకు కూడా ఇది ప్రీతిపాత్రమైన క్షేత్రం. ఇక్కడ రామేశ్వరుడి రూపంలో వెలసిన లింగం శ్రీరాముడు ప్రతిష్ఠించింది.

రామేశ్వరంలో చాతుర్మాస్య దీక్ష కాలంలో పూర్ణప్రజ్ఞులు నిత్యం ప్రవచనాలు సాగించారు. రావణ సంహారంలో శ్రీరాముడి నిర్దోషిత్వాన్ని, గుణ పూర్ణత్వాన్ని నిర్ధారించే బ్రహ్మసూత్రాలను ప్రతిపాదించటం ఆయన ప్రవచనాల లక్ష్యంలో ఒకటి. సమీపంలోని ధనుష్కోటికి వెళ్ళి సేతువు నిర్మాణం జరిగినచోట స్నానం చేశారు... రామాయణంలో ఆ సేతువు నిర్మాణ కాలంలో హనుమంతుడి సారథ్యంలో రామనామస్మరణతో ప్రతిధ్వనించిన, పునీతమైన ప్రదేశం అదే. ఇప్పుడు మళ్ళీ మధ్వాచార్యులు...

చాతుర్మాస్య కాలంలో ప్రతిరోజూ విద్వాంసులతో సభ జరిగేది. ఆ సభలకు వివిధ శాస్త్రాలలో నిష్ణాతులైన పండితులొచ్చేవారు. వాళ్ళంతా తలపండినవారే. ఎప్పటిలాగే ప్రతిసభలోనూ వాదోపవాదాలు జరిగేవి. చివరికి విజయం పూర్ణప్రజ్ఞుల్నే వరించేది. క్రమంగా మధ్వాచార్యులు నిజంగా పూర్ణ ప్రజ్ఞులే అన్న విషయం ఆ పండితులక్కూడా నిర్ధారితమవుతూ వచ్చింది.

ఆ సమయంలోనే కుదిపుస్తూరి కూడా రామేశ్వరం వచ్చి చాతుర్మాస్య దీక్షలో కూర్చొని, మధ్యమధ్యలో మధ్వాచార్యుల శిష్యులను పిలిపించి సూటిపోటి వ్యాఖ్యానాలు సంధిస్తుండే వారు. నేరుగా మధ్వాచార్యులతో ఎందుకు తలపడరు?

ఒక సమయం వచ్చింది. మధ్వాచార్యులకు కుదిపుస్తూరి ఎదురుపడ్డారు. మధ్వాచార్యులు నిలదీశారు. "నా దండం ముక్కలుచేస్తానని ప్రతిజ్ఞ చేశావు కదా! ఇదిగో దండం. దీనిని విరగ్గొడుతావా? లేక నీ అజ్ఞానాన్ని అంగీకరిస్తావా?..."

నిజానికి పూర్ణ ప్రజ్ఞులకు కావలసింది కుదిపుస్తూరిని అవహేళన చేయటంకాదు. కాని అతనిలోని 'అర్థరహితమైన శపథాలు చేసే అసుర ప్రవృత్తిని తొలగించటం'. కాని... ఈ ప్రయత్నాలేవీ ఫలించలేదు. కుదిపుస్తూరి రామేశ్వరంలోని పండితులకు పూర్ణప్రజ్ఞుల గురించి ప్రతికూల ప్రచారం చేయటం ప్రారంభించారు. కాని అప్పటికే పూర్ణ ప్రజ్ఞుల ప్రవచనాల వల్ల ప్రభావితులైన పండితులు అప్పటికప్పుడే మధ్వాచార్యుల దగ్గర శిష్యరికం స్వీకరించారు. కుదిపుస్తూరి ప్రచారం గాలి బుడగలా తేలిపోయింది.

చాతుర్మాస్యం పూర్తికాగానే మధ్వాచార్యులు ఉడుపికి వెళ్తూ వెళ్తూ మధ్యలో శ్రీరంగంలో విడిది చేశారు. పురాణాలలో చెప్పబడిన అష్ట స్వయంవ్యక్తక్షేత్రాలలో మొదటిది శ్రీరంగం. ఇక్ష్వాకుల కులదేవత అయిన శ్రీరంగనాథుడు ఇక్కడి దైవం. శేషతల్పం మీద పవళించి వుండే శ్రీమహావిష్ణువు మూర్తి ఇక్కడ శోభస్కరంగా దర్శనమిస్తూంటుంది. విభీషణుడు నిత్యం ఈ మూర్తిని గుప్తంగా ఆరాధించేవాడని చెబుతారు. సప్త చిరంజీవులలో ఒకడుగా ఖ్యాతిచెందినవాడు విభీషణుడు. అలాంటి చిరంజీవులలో ఒకరు హనుమంతుడు.

శ్రీరంగనాథుడి దివ్యమంగళ రూపాన్ని ఎన్నిసార్లు ఎంతసేపు చూసినా తనివితీరదు. కావేరి తీరంలో వెలసినందువల్ల ఆ నదిగాలుల చేత నిత్యం సేవింపబడుతుంటాడు. చల్లటిగాలి అంటే పవనుడు. అలా వాయుదేవుడి చేత నిత్యం సేవించబడుతుండేవాడు.

శ్రీరంగనాథుని దర్శించి, శ్రీరంగంలోకూడా పండితోత్తములతో వాదోపవాదాలు చేసి, తాను ప్రతిపాదిస్తున్న తత్త్వ సారంపై వారిని ఒప్పించి, తిరుపతి పుణ్యక్షేత్రానికి బయల్దేరారు మధ్వాచార్యులు.

## తిరుపతిలో ఆనందతీర్థులు

**భూ**లోక వైకుంఠంగా ప్రసిద్ధిపొందిన పుణ్యక్షేత్రం తిరుపతి. స్వయంగా ఆవిర్భవించిన ఎనిమిది క్షేత్రాల్లో ఇదికూడ ఒకటని ద్వాదశ పురాణాల్లో, పంచరాత్ర పురాణాల్లో వర్ణించబడింది. అంజనాదేవి హనుమంతుణ్ణి పుత్రునిగా పొందడంకోసం పన్నెండు సంవత్సరాలు ఇక్కడే తపస్సు చేసిందని కూడా చెప్తారు.

భారతంలో అరణ్యవాసకాలంలో అర్జునుడు తన తీర్థయాత్రల్లో భాగంగా ఈ తిరుమలకొండల క్షేత్రాన్ని దర్శించాడని కూడా పురాణాల్లో చెప్పబడింది. 'చతుర్యుగ

పర్వతము' (నాలుగు యుగాలుగా విలసిల్లుతున్న పర్వతం) అని కూడా ఈ తిరుమలక్షేత్రానికి పేరు. ఈ కొండమీద స్వామిపుష్కరిణి అన్ని తీర్థాల్లోకి అత్యంత అధికమైనదని చెప్తారు. రామకృష్ణుల రూపానికి ప్రతిగా భగవంతుడిక్కడ శ్రీనివాసులు అనే పేరుతో వెలిశాడు. వైష్ణవయతులలోగానీ, హరిదాసుల్లోగానీ జ్ఞానులని చెప్పబడే వారెవరైనాగాని ఈ క్షేత్రాన్ని సందర్శించని వారు ఎవరూ లేరు. ఇక్కడ శ్రీనివాసుడికి జరిగే బ్రహ్మోత్సవాలలో స్వయంగా బ్రహ్మదేవులే పాల్గొంటారని ప్రతీతి. భారతదేశంలో జరిగే మహోత్సవాలలో ముఖ్యమైనది. ఈ తిరుమలక్షేత్రంలో శ్రీనివాసుణ్ణి కూడా మధ్వాచార్యులు దర్శించారు. ఆ స్వామి దర్శనంతో పరవశించి అనేక విధాలుగా స్తుతించారు.

**ఆనంద తీర్థ వరదే దానవారణ్యపావకే।**
**జ్ఞాన దాయిని సర్వేశే శ్రీనివాసేఽ స్తుమే మనః॥**

(తీర్థ ప్రబంధకము)

అక్కడనుండి సమీపాన ఉన్న సువర్ణముఖీ నదీ తీరాన ఒకప్పటి అగస్త్యాశ్రమానికి వెళ్లారు.

త్వం చాపి గచ్ఛ శైలేంద్రం పూర్వం స్వర్ణముఖీతటే ।
యత్ర బ్రహ్మశిలా నామ సరిన్మధ్యే చ వర్తతే ॥
అగస్త్య తపసా పశ్చాత్ గయాసాన్నిధ్యమత్ర వై ।
వాదా ఈశాన విష్ణ్వాది దేవానాం తత్ర సంతి హి॥
యతి రూప్యా మాతరిశ్వాఽ ష్టావింశ తిమే కలౌ ।
అవర్తీయ వసత్యత్ర మధ్వనామా వరం విభేః ॥
అవాప తపసా పుణ్యః ప్రీత్యా చాగస్త్యయోగినః ।
తత్స్వాపితాలయే పుణ్యే చాతుర్మాస్యం కరిష్యతి ॥
శుకః శ్రోష్యతి సచ్ఛాస్త్రం పద్మతీర్థాదిహాగతః ॥

ఈ ఆధారాలన్నీ బ్రహ్మపురాణంలో ఉదహరించబడ్డాయనే శ్రీ విజయేంద్రస్వాములు రచించిన మధ్వాధ్వకంటకోద్ధారంలో ధ్రువపరచబడింది.

ఒకప్పుడు అగస్త్యముని తపస్సువల్ల ఆ సువర్ణముఖి నదీ తీరానికి గయ సాన్నిహిత్యానికి ఉన్న పవిత్రత చేకూరింది. ప్రజల కోరికమేరకు మధ్వాచార్యులు ఆ సువర్ణముఖీ తీరంలో బ్రహ్మశిల అనే ప్రదేశంలో చాతుర్మాస దీక్ష చేపట్టారు.

ఎప్పటిలాగానే చాతుర్మాస దీక్షలో జ్ఞానకార్యం కూడా మొదలైంది. మధ్వాచార్యులు ప్రవచనాకౌశల్యంతో చుట్టుపక్కల ప్రాంతాల నుంచి కూడా అనేకమంది పండితులను,

ఆస్తికులను ఆకర్షించారు. ఆశ్చర్యకరమైన విషయమేమిటంటే, ప్రతిరోజు ఆయన ప్రవచనాన్ని విని ఆనందించే శ్రోతల్లో ఒక సన్యాసి అపారమైన తేజస్సుతో వెలిగిపోతున్నారు. ఆయన అత్యంత శ్రద్ధతో ప్రవచనాన్ని వింటూ ఆనందపరవశుడవుతున్నారు. చాతుర్మాస్యం జరిగిన నాలుగు మాసాల్లోనూ ఒక్కరోజు కూడా మానకుండా ఆయన ప్రవచనానికి హాజరయ్యేవారు.

ఇంతకీ ఆయన ఎవరు?

చాతుర్మాస్య దీక్ష ముగింపుకు వచ్చిన రోజున మధ్వాచార్యులు ఆయన్ని శ్రోతలకు పరిచయం చేశారు. "వీరు శుక ముని. రుద్రదేవుని అవతారం. ఈయన భాగవత పురాణ ప్రసారం చేయటంలో నిష్ణాతులు. ఈయన నివాసం పద్మసరోవరం దగ్గర ఒక ఆశ్రమం. కేవలం బ్రహ్మసూత్రాల అర్థాన్నీ, విశిష్టతనూ తెలుసుకోవాలనే కోరికతో ప్రతిరోజూ ఇక్కడకు వస్తున్నారు."

ఆ పరిచయ వాక్యాలతో శ్రోతలు "మధ్వాచార్యుల మహిమ ఎంత గొప్పది?" అని ఆనందపడ్డారు.

## శ్రీ మూష్ణంలో దండతీర్థం

స్వయంగా ఆవిర్భవించిన క్షేత్రాల్లో శ్రీమూష్ణం ఒకటి. ఇక్కడ భగవంతుడు వరాహరూపంలో దర్శనమిస్తాడు. మూలవిగ్రహం భూవరాహమూర్తి అయితే, ఉత్సవమూర్తి మాత్రం యజ్ఞవరాహం. మధ్వాచార్యులు ఈ యజ్ఞవరాహాన్ని సందర్శించి ఇలా స్తుతించారు:

> **తస్య యజ్ఞ వరాహస్య విష్ణోరమిత తేజసః ।**
> **ప్రణామం యే ప్రకుర్వంతి తేషామపి నమోనమః ॥**

అక్కడ నిత్య పుష్కరిణీ అత్యంత పురాతన సరోవరాల్లో ఒకటి. దాని విశిష్టత ఏమిటంటే, ఆ పుష్కరిణి తీరంలో అశ్వత్థ వృక్షముంది. ఆ వృక్షం యొక్క నీడ పుష్కరిణి నేలమీద పడటం వల్ల ఆ నీటికివచ్చిన పవిత్రత ఎంత గొప్పదంటే, అందులో స్నానం చేస్తే సమస్త వ్యాధులూ హరించుకుపోతాయని పురాణాల్లో ఉంది.

అలా వివిధ పుణ్యక్షేత్రాల్ని దర్శించడం ద్వారా ఒక భాగవతదర్శనం చేశారు మధ్వాచార్యులు. అప్పటినుంచి ఎవరు ఏ తీర్థం సందర్శించినా అవి పురాణాల్లోవి మాత్రమే అయి ఉండాలి అన్న నియమాన్ని సూచించారు. తన సుదీర్ఘ దక్షిణ భారతయాత్రలో పుణ్యక్షేత్రాల్లో నివసిస్తున్న సాధుసంతతికి తత్వాన్ని బోధిస్తూ తన అవతార కార్యాన్ని నిర్వహించుకునేవారు.

అప్పట్లో ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. మధ్వాచార్యులు ఎప్పటిలాగానే ఒకరోజున భిక్షకు వెళ్లారు. యతులు ప్రతిరోజూ భిక్ష చేసిమాత్రమే భుజించాలి. వాళ్లకి సొంతంగా వంట చేసుకునే హక్కు లేదు. ఎందుకంటే, వంటావార్పు పెట్టుకుంటే జ్ఞానసాధన కుంటుపడుతుంది. సన్యాసాన్ని సాగించేదే జ్ఞానకార్యం కోసం. బ్రహ్మచారుల జ్ఞానకార్యం జ్ఞానాన్ని ఆర్జించటంకోసం. సన్యాసుల జ్ఞానకార్యం జ్ఞానాన్ని సమాజమంతా ప్రసన్నం చేయటం కోసం. అందువల్ల వారు మధుకరవృత్తి సాగిస్తుంటారు.

ఇందులో ఆసక్తికరమైన విషయమేమిటంటే, ఒక సన్యాసి తన మొత్తం భిక్షని ఏదో ఒక ఇంటినుంచే అడిగి తీసుకుని పోకూడదు. ఏడు ఇళ్లు తిరిగి భిక్ష స్వీకరించాలి. ప్రతిరోజూ ఒక కొత్తఇల్లు వెతుక్కుంటూ ఉండాలి...

అలాంటి సమయంలో ఒక ఇంటికి భిక్షకు వెళ్లినపుడు ఆ ఇంటామె దూరంనుంచి మంచినీటిని చాలా ప్రయాసపడి మోసుకొస్తున్న దృశ్యాన్ని మధ్వాచార్యులు చూశారు. ఆమె గర్భిణి. ఆమె ఇల్లు ఎత్తైన ప్రదేశంలో ఉంది. ఆమె మధ్వాచార్యుల్ని చూస్తూనే భక్తిపూర్వకంగా స్వాగతిస్తూ ప్రార్థించింది : "ఈ ప్రాంతంలో నాకూ మిగతావాళ్లకూ కూడా నీటి ఎద్దడి ఎక్కువగా ఉంది. ఇందువల్ల అందరం బాధపడుతున్నాం. ఇదే సమయంలో నా భర్త ఊర్లో లేరు. అందువల్ల మీకు భిక్ష నేను వెంటనే ఏర్పాటుచేయలేక పోయాను. క్షమించండి".

మధ్వాచార్యుల హృదయం ఆమెపట్ల జాలి, కరుణతో నిండిపోయింది. ఆయన వెంటనే తన చేతిలోనున్న దండంతో నేలను కొట్టారు.

అద్భుతం!

ఆయన దండంతో కొట్టినచోట నేల పగిలి జలం చివ్వున పైకెగసింది. చూస్తూండగానే అక్కడ దండతీర్థం ఉద్భవించింది. అలా మధ్వాచార్యులు సృష్టించిన దండతీర్థాల్లో ఇది మూడవది. ఇప్పటికీ శ్రీ మూష్ణంలో ఊరుబయట వృత్తాకార బాటలో ఈ దండతీర్థం కనిపిస్తుంది. (పురాతన కాలంలో దాని ఒడ్డున ఒక మారుతీమందిరాన్ని కూడా నిర్మింపచేశారు.) అప్పటికి ఆ ప్రజలకి ఆ నీటి సమస్యకు శాశ్వత నీటిపరిష్కారం లభించింది.

**జనస్య కృష్ణాద్విముఖస్య దైవా దధర్మశీలస్య సుదుఃఖి తస్య ।**
**అనుగ్రహాో యేహ చరంతి మానం భూతాని భవ్యాని జనార్దనస్య ॥**

భాగవతము (3/5/3).

నిజానికి ఆ మహిళ సామాన్య వ్యక్తికాదు. ఆ రూపంలో నున్న వసుపత్ని, కారణాంతరాలవల్ల భూలోకంలో జన్మించింది. మధ్వాచార్యుల సంచారకాలంలో ఇలా లోకోద్ధారణకు ఆమె కారణమయింది.

## వరాహమంత్రాల ఆవిష్కరణ

శ్రీమూష్ణంనుంచి వెళ్లేటప్పుడు ఆయనకొక యోగి కనపడ్డాడు. అతను వరాహస్వామి ఉపాసకుడు. చాలా త్వరగా వరాహమంత్రాల్ని నేర్చుకున్నాడు. మంత్రశాస్త్రకోవిదుడు కూడా. అతను తెలుసుకున్న వరాహమంత్రాల సంఖ్య 30. అందువల్ల అతన్ని అహంకారం ఆవరించింది. మధ్వాచార్యుల్ని చూసిన వెంటనే అతను తన మంత్రసామర్థ్యం గురించి గర్వంగా చెప్పుకున్నాడు.

మధ్వాచార్యులు మందహాసం చేస్తూ, “స్వామీ! నీకు అన్ని వరాహమంత్రాలు తెలుసుండటం చాలా గొప్ప విషయం. అది నీ భాగ్యంకూడా. కాని నిజానికి వరాహ మంత్రాల సంఖ్య ఇంకా చాలా ఉంది...”

ఈ మాటలు వింటూనే ఆ యోగికి గర్వభంగం అయింది. తనకు తెలిసినదానికన్నా ఎక్కువ వరాహమంత్రాలున్నాయనీ, వాటిని ఎరిగిన స్వాములు ఎదురుగా ఉన్నారని స్పృహ కలగటంతో అతనికి ప్రపంచం కొత్తగా తెరుచుకున్నట్లు అయింది. అతని మంత్రసిద్ధికి ఫలితంగా అతనికి మధ్వదర్శనభాగ్యం కలిగింది. మధ్వాచార్యులు ప్రపంచాన్ని చూస్తున్నటువంటి అనుపమానమైన యోగులు. తత్త్వజ్ఞానంతోపాటు, తంత్రశాస్త్రం కూడా ఆయనకి కొట్టినపిండి. అయితే ఆ తంత్రశాస్త్రం యొక్క విశ్వరూపాన్ని అక్కడ ప్రకటించటం అసాధ్యమైనది. ఆయనకు తారసపడిన యోగి ఒక్క వరాహమంత్రాల్లో మాత్రమే సిద్ధి పొంది ఉంటే, వీరు సకలమంత్రాల్లోనూ సిద్ధి పొందిఉన్నారు.

మధ్వాచార్యులు తెలుసుకొన్న మంత్రాల సంఖ్య ఏడుకోట్లు అని మంత్రాలయ రాఘవేంద్రస్వామి తమ ప్రాతఃసంకల్ప గద్యంలో వర్ణించారు.

(సంసిద్ధ సప్తకోటి మహామంత్రాణామ్)

## విష్ణు సహస్రనామ శతార్థ కథనం

తిరిగి పయస్వినీ నదీతీరంలోని ఆదూరు చేరుకున్నారు. అక్కడ మహాలింగేశ్వరాలయం ఉంది. ఆ ఆలయానికి అపారమైన ఖ్యాతి ఉంది. మార్గమధ్యంలో అనేక

దివ్యక్షేత్రాలను సందర్శిస్తూ వెళ్తూంటే, దారిలో ఆయనను చూసిన ప్రజలు ఆ వర్చస్సుకి సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయారు. అంతటి తేజస్విని గురించి అంతకుముందు వాళ్లెప్పుడూ వినివుండలేదు, చూసీ ఉండలేదు.

అయితే అప్పటికే ఆయన గురించి విని వున్న విద్వాంసులు చాలామంది ఆడూరుకి చేరుకున్నారు. వాళ్లు సామాన్య పండితులు కారు. శిక్ష, వ్యాకరణ, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిష్యము, కల్పము అనే ఆరు కోణాల్లోనూ ఋగ్వేద, యజుర్వేదాలను ఔపోసన పట్టినవాళ్లు. వేదార్థ నిర్ణయంలో సునిశితమైన అధ్యయనం చేసినవాళ్లు.

కళాపూర్ణ చంద్రుడిలా భాసిస్తున్న మధ్వాచార్యుల ముఖారవిందం, బంగారంలాంటి శరీరఛాయ, అసాధారణ వాగ్ధాటి వాళ్లని విపరీతంగా ఆకర్షించాయి.

విద్వత్‌సభ ప్రారంభమయింది. రత్నాల్లాంటి విద్వాంసుల మధ్య పూర్ణచంద్రుడి కాంతితో మధ్వాచార్యులు... మెల్లగా విద్వాంసుల ప్రతినిధి ఒకాయన లేచి నిలబడ్డారు. మధ్వాచార్యుల నుద్దేశించి ఇలా అన్నారు.

"ఆర్యా! ఐతరేయ శ్రుతిలో ఉన్న ఈ సూక్తం అర్థం మీ ద్వారా వినాలని మాకు కోరికగా వుంది. అనుగ్రహించండి..."

అలాంటి శ్రోతలు ఉన్నప్పుడు చేసే ప్రవచనమే కదా జ్ఞానకార్యం. మధ్వాచార్యులు చెప్పడం ప్రారంభించారు... గంభీరమైన స్వరం, శిక్షాశాస్త్రానికి అనుగుణమైన ఉచ్చారణలతో ఆ తేజస్వి ఆ సూక్తానికి అర్థాన్ని, వ్యాకరణాది వ్యాఖ్యానాన్ని వ్యక్తం చేస్తూంటే – విద్వాంసులైన శ్రోతలంతా చెవులప్పగించి వింటూ పరవశించిపోయారు.

ఆ ప్రవచనంతో శ్రోతలంతా తన్మయత్వం చెందారు.

"ఎంతటి అపూర్వమైన అర్థం చెప్పారు. ఈయన బృహస్పతి వంటివాడు కనుకనే ఇలా అర్థం చెప్పగలిగారు" అంటూ ఆనందపడ్డారు. అయినప్పటికీ వాళ్లకి అప్పటికే తెలిసివున్న మరొక అర్థం సంగతి ఏమిటి? వాళ్లు ఈ సందేహం లేవనెత్తారు.

మధ్వాచార్యులు వివరణ ఇచ్చారు. "అవును, మీరు విన్న అర్థమూ వుంది, నేను చెప్పిన అర్థమూ ఉంది. ఈ రెండింటికి భిన్నమైన మరొక అర్థం కూడా ఉంది. ఇది వైదిక సాహిత్యపు గొప్పదనం. కనిష్ఠ అర్థాలు మూడు. వేదాలకన్న గొప్పది మహాభారతం. దానికి పదేసి అర్థాలు ఉన్నాయి. ఇక విష్ణుసహస్ర నామాల్లో ప్రతి నామానికీ కనీసం వంద అర్థాలు ఉన్నాయి..."

ఈ వివరణ అంతా పండితులను సంభ్రమాశ్చర్యాలలో ముంచింది. ఒకపక్కన వాళ్లకి మధ్వాచార్యుల వాదాన్ని గెలవాలని ఆరాటం, మరొపక్క "ఇంతటి లోతైన భావార్థాలు ఈయనకు మాత్రమే తెలుసునుగదా!" అన్న ఆశ్చర్యం.

అయినా వారు వదల్లేదు. "మీ వాదాన్ని నమ్మటం ఎలా?" అని ప్రశ్నించారు.

మధ్వాచార్యులు మందహాసం చేశారు. "సరే, నేను వివరిస్తాను. నేను వివరించిన దానిని మీరు నాకు ఒప్పగించాలి. అలా చేయగలిగితే మీరే గెలిచినట్లు" అన్నారు.

ఇంతమంది పండితులం ఉండగా అదేమంత కష్టమైన విషయం – అనుకున్నారు. ఆ షరతుకి అంగీకరించారు.

మధ్వాచార్యులు తమ అర్థవివరణ ప్రారంభించారు. ముందుగా విష్ణుసహస్ర నామాల్లో 'విశ్వం' అన్న పదం తీసుకున్నారు.

ఆ వివరణ ఇలా సాగింది.

'విశ్‌ప్రవేశే' అన్న ధాతువునుంచి విశ్వశబ్దం ఉత్పన్నమయింది. దానికి అర్థం 'విష్ట'. అంటే జ్ఞానరూపం. ఇదే పదం – 'టు ఓశ్విగతి వృద్ధ్యోః' అన్న మరో ధాతువుకి కూడా మూలం. దానివల్లనే దీని అర్థం 'వినాశ్వయతి' అయింది. వినాశ్వయతి అంటే – గరుత్మంతుని మూలంగా సంచరించేవాడు, నిత్యపూర్ణుడయినవాడు అని విశేషణం.

'విశ్వ' శబ్దానికి మరికొన్ని అర్థాలు కూడా ఉన్నాయి.

'విశ్వ' అన్నది వాయుదేవుడి పేరు. వాయుదేవుడి అంతర్యామి అవటంవల్ల విష్ణువుని 'విశ్వ' అంటారు. 'విశ్వ' అన్నది భగవంతుని విశ్వ, తైజస, ప్రాజ్ఞ, తురీయ అన్న నాలుగు రూపాలలో మొదటిది. ఆ విశ్వరూపంతో భగవంతుడు చైతన్య ప్రేరకుడుగా ఉన్నాడు...

...ఇలా సాగిపోతోంది మధ్వాచార్యుల వారి అర్థ వివరణ. అదొక అనర్గళమైన భాషణా ప్రవాహం. విద్వాంసులు వింటున్నారు. క్రమంగా మధ్వాచార్యులు ఇస్తున్న అర్థాల సంఖ్య పెరిగిపోతోంది. వాళ్లలో వాటిని జ్ఞప్తికుంచుకునే శక్తి తగ్గుతోంది.

ప్రతి పదానికి అనేక అర్థాలు. ప్రతి అర్థానికి వ్యాకరణంలో గల ఆధారాలు, శ్రుతిస్మృతుల సంవాదం... సాగిపోతూనే వుంది. అప్పటికే యాభై అర్థాలు పూర్తిచేశారు. ఇంకా ముందుకు వెళ్తూనే ఉన్నారు.

క్రమంగా ఆ పండితులలో అప్పటివరకూ తమకు ఉందనుకున్న పాండితీ ప్రకర్ష పట్ల ఆత్మవిశ్వాసం సన్నగిల్లుతోంది. తాము ఔపోసన పట్టిన వేద వేదాంగాల, తర్కవేదాంతాది

శాస్త్రాల విజ్ఞానం ఏ మూలలకు పోయిందో అర్థంకావట్లేదు. కాని తమకు తెలియని విజ్ఞాన సముద్రపులోతుల్ని మధ్వాచార్యులవారు మథించారని మాత్రం అర్థమవుతోంది.

ఒక దశలో – వాళ్లంతా ఒకరి మొహాలొకరు చూసుకొని, మౌన సంకేతాలు చేసుకుంటూ లేచి నిల్చొన్నారు. మధ్వాచార్యులకు నమస్కరించారు.

"ఆచార్యా! దేవతలకు మాత్రమే సాధ్యమయినంతటి అపూర్వ ప్రతిభ మీది. ఇది సాధారణ మనుషులకు సాధ్యమయ్యే విషయం కాదు. మీరు సర్వజ్ఞులని మాకు అర్థమైంది. మిమ్మల్ని పరీక్షించాలనుకోవడం మా అవివేకం. దయచేసి మమ్మల్ని క్షమించండి..." అంటూ వారు మధ్వాచార్యుల వాదాన్ని అంగీకరించారు. ఆయనకు శిష్యులయ్యారు. పండితమండలి అంతా మూకుమ్మడిగా మధ్వాచార్యులకు శిష్యులుగా మారిన ఈ సన్నివేశం పూర్ణప్రజ్ఞుల మరో విజయం.

అలా విష్ణు సహస్రనామమే సర్వశ్రేష్ఠమైన సహస్రనామం అని మధ్వాచార్యుల వాదనతో నిర్ధారణ అయింది. సహస్ర నామాల్లో ప్రతిపాదించబడిన విష్ణువే సర్వోత్తమ దేవత అని కూడా నిరూపితమైంది.

మధ్వాచార్యుల నుంచి విష్ణుసహస్రనామార్థ నిధిని సంపాదించుకున్న విద్వాంసులంతా కలిసి తమ దగ్గరే భిక్ష స్వీకరించవలసిందిగా ఆ గురువును కోరారు. దానికి మధ్వాచార్యులు ఇలా జవాబిచ్చారు:

"ఇక్కడ శ్రీమహావిష్ణువుయొక్క దేవాలయమే లేదుకదా! అలాంటి స్థలంలో భిక్ష స్వీకరించకూడదన్నది మా వ్రతం..."

వాళ్లకి అర్థమయింది. వెంటనే వాళ్లంతా కలసి మధ్వాచార్యుల్నే అర్థించారు. "ఆచార్యా! మీరే ఇక్కడ విష్ణువుని ప్రతిష్ఠించండి. ఈ ప్రదేశాన్ని వైష్ణవక్షేత్రం చేయండి. ఆలయం నిర్మించే బాధ్యతను మాకు వదిలేయండి..."

వాళ్ల కోరిక ప్రకారమే విష్ణుప్రతిష్ఠాపన అక్కడ మధ్వాచార్యుల చేతులమీదుగా జరిగింది. అదొక చారిత్రాత్మక దైవ ఘటన.

## శ్రీకృష్ణ మంత్రం

ప్రతిక్షణం మనం అనేక పాపాలు చేస్తూంటాం. ఈ పాపాల్నుంచి విముక్తి పొందటానికి అనంతుడ్ని స్మరించాలి. సర్వపాపాలకి ప్రాయశ్చిత రూపమైన గాయత్రి మంత్రమే అనంతుడ్ని ధ్యానించటానికి ఉపకరించే బీజమంత్రం. శ్రీ మహావిష్ణువు

సర్వవ్యాపితుడు. గాలి, వెలుతురు, నీరు తదితర ప్రకృతి స్వరూపాలన్నిటినీ ఇచ్చినవాడు. కాబట్టి ప్రతి జీవికీ అతనే ఆరాధ్యుడు. ఇవన్నీ గ్రహించడానికి ప్రేరేపించే శక్తినిచ్చేవాడు కూడా అతడే.

మన పాపాల్ని హరించేవాడూ, అందుకోసం మన మనసును తనవైపు ఆకర్షించేవాడూ కూడా శ్రీకృష్ణుడే. అందుకే శ్రీకృష్ణ మంత్రాన్ని పఠించడంద్వారా మన పాపాలన్నిటినీ నివారించగలుగుతాం.

...ఇలా అరక్షరాల శ్రీకృష్ణమంత్రాన్ని మధ్వాచార్యులు వారందరకీ ఉపదేశించారు.

## దాన సూక్తం - జ్ఞానదానం

పయస్వినీ నదీతీరంలో ఇంకో దేవాలయం ఉంది. అక్కడికి కూడా పూర్ణప్రజ్ఞులు వెళ్లారు. ఎప్పటిలాగానే పండితులూ పామరులూ మధ్వాచార్యులను చూడటం కోసం అక్కడకు చేరారు.

పండితులు ఇలాంటి సభకు రావటానికి కారణం కేవలం పాండిత్యంలో మధ్వాచార్యులవారి శక్తిని పరీక్షించడంకోసం కాదు. వారు చాల ఉదారంగా సంభావన ఇస్తారుకనుక, తమ పాండిత్యాన్ని ప్రదర్శించి ఆ సంభావన స్వీకరించాలన్న కోరిక.

ఒక తత్త్వాన్ని సమాజమంతా ప్రసరింపచేయటంలో విద్వాంసుల పాత్ర తప్పనిసరి. సత్కర్మల్లోకానీ జ్ఞానకార్యంలో కానీ, విద్వాంసులు పాల్గొనాలంటే ముందు వారి జీవనోపాధికి లోటులేకుండా ఉండాలి. కడుపులో ఆకలి రగులుతుంటే జ్ఞానం ఎలా ఉత్పన్నమవుతుంది, జ్ఞానకార్యం ఎలా సాధ్యపడుతుంది? పాఠం, ప్రవచనం, సంశోధన, లేఖనం, విమర్శ మొదలైన జ్ఞానకార్యాలు చేయటానికి అతిముఖ్యమైన సాధనం మనసు. మనసులో ఆకలి మూలంగా, దారిద్ర్యం మూలంగా అసంతృప్తి, నిరాశ నిండిపోయి ఉంటే, జ్ఞానకార్యం ఎలా సాధ్యపడుతుంది? కాబట్టి ఆర్థికంగా నిలబడగలిగితేనే జ్ఞానకార్యంలో విద్వాంసులు పాల్గొనగలుగుతారు.

గురుశిష్య పరంపర బోధనావిధానంలో గురువునుంచి శిక్షణ పొందిన తరువాతనే శిష్యులు గురుదక్షిణ సమర్పించుకుంటారు. అంతేకాని ఇప్పటిలాగా ముందు ఫీజులు చెల్లించి తరువాత పాఠాలు చెప్పించుకోవటంకాదు. దీని నేపథ్యంలో పండితులను వారివారి పాండిత్యస్థాయికి తగినట్లుగా పారితోషికాలిచ్చి గౌరవించే బాధ్యత రాజులకు, మఠాలకు ఉంది. అయితే రాజులందరికీ ఇలాంటి విద్వత్‌పోషణ కార్యక్రమాలపట్ల ఆసక్తి ఉంటుందని

చెప్పలేం. కాబట్టి మఠాలు నిరంతరం పండితులను ప్రోత్సహించే కార్యక్రమాలను సాగిస్తూ ఉంటేనే వాళ్లద్వారా జ్ఞానకార్యం సజావుగా జరిగే అవకాశం ఉంటుంది.

అందుకే విద్వత్‌సభలకు వచ్చే పండితులకు మధ్వాచార్యులు ఉదారంగా సంభావన ఇచ్చేవారు. ఈ అభ్యాసం ప్రజల్లో ఆస్తికత్వం పెరగటానికి దోహదపడ్తుండేది.

మొత్తంమీద పూర్ణప్రజ్ఞుల సభలు ఎప్పుడూ విద్వాంసులతో కిటకిటలాడుతూనే ఉండేవి. అయినప్పటికీ ఈ సారి అసూయాపరులైన ఒక పండితబృందం దూరప్రాంతాల నుంచి మరింత విద్వాంసులైన వారిని రప్పించి పూర్ణప్రజ్ఞులతో వాదనలోకి దింపారు. వచ్చినవాళ్లు గెలిస్తే ఆ ఘనత మనకు దక్కుతుంది, ఓడిపోతే ఆ అవమానం వాళ్లకి మిగులుతుంది - అని ఆ పండితబృందం భావించారు.

ఒక తెల్లవారుఝామున పూర్వప్రజ్ఞులతో పండితుల వాదన ప్రారంభమైంది. చర్చకు వాళ్లు ఎంచుకున్న సూక్తం ఋగ్వేదంలోని దానసూక్తం.

న వా

........

దాతను ప్రశంసించడం దాతకాని వారిని నిందించడం ఆ సూక్తంయొక్క తాత్పర్యం. నిజానికి పూర్ణప్రజ్ఞులు యతులు. యతులు దానం చేసి తీరాలని ఎక్కడా లేదు. కాని సర్వసంగ పరిత్యాగులైన యతులు విద్యాదానం, అభయదానం ఎక్కువగా చేస్తూంటారు... ఈ కారణంగా ఆ సూక్తంయొక్క అర్థం అంతలోతుగా పూర్ణప్రజ్ఞులకు తెలియదనే ఆ పండితబృందం భావించింది.

అర్థవివరణ ప్రసంగంలో ఒకచోట 'ప్రణీయాత్' అనే క్రియాపదం 'పృణ' అనే ధాతువునుంచి ఉత్పన్నమయినది అని మధ్వాచార్యులు పేర్కొన్నారు. ప్రతివాది అయిన విద్వాంసుడు దిక్కు తోచక దానికి వ్యాఖ్యార్థం చేసి తప్పించుకోవాలని ప్రయత్నం చేశాడు. "ఈ క్రియాపదానికి ధాతువు 'పృణ్' కాదు, 'ప్రజో'..." అని వాదించారు.

పూర్ణప్రజ్ఞులు నవ్వుతూ "ఓయి మూర్ఖా! పృణయాత్ అనే పదానికి ప్రజోధాతువు ఎలా మూలం అవుతుంది? నీకు ప్ర మొదలైన అక్షరాల పరిశీలన లేదు. ఇవాల్టి నుంచి ఒక పనిచేయి. ఇసకలో 'ప్ర ప్రా ప్రి ప్రీ' అనే వర్ణాల్ని అభ్యాసం చేయడానికి ప్రయత్నం చేయి" అంటూ మందలించారు. పండితబృందం కేసి చూసి ఒక చిర్నవ్వు నవ్వారు. ఈ సంఘటనతో అక్కడ చేరిన పండితులందరికీ తమకు తెలియని విషయాలు చాలా ఉన్నాయని తెలిసింది.

వాళ్లు తమ తప్పు తెలుసుకుని, తమని మన్నించాల్సిందిగా కోరుతూ మధ్వాచార్యుల్ని ప్రార్థించారు. వాస్తవానికి ఇలాంటి విద్వత్ సభలు శాస్త్ర విచారణకేకానీ, వితండవాదానికి కాదు.

### అపాల అంటే?

**మ**రో రోజు మరొక సభలో కూడా పూర్ణప్రజ్ఞుల్ని ఎలా గైనా వాదనలో జయించాలనే కోరికతో ఒక విద్వాంసబృందమొచ్చి కూర్చొంది. ఎప్పటిలాగానే ఒక సూక్ష్మార్థం ఎంచుకొని దానికి వివరణ చెప్పమని సవాలు చేశారు.

ఒక వైదికసూత్రంలో 'అపాల' అనే యువతి ఇంద్రుణ్ణి ఆరాధించి, ఆయన అనుగ్రహం వల్ల అపూర్వమైన శరీరకాంతిని పొందింది. ఇక్కడ ప్రస్తావించిన అపాల శబ్దాన్ని వివరిస్తూ, దానికి 'అతితరుణి' అనే అర్థాన్ని పూర్ణప్రజ్ఞులు తెలిపారు. కాని విద్వాంసులబృందం దానికొప్పుకోలేదు. అపాల అంటే 'శ్విత్రిణి' (కుష్ఠురోగి) అని వాదించారు.

మధ్వాచార్యులు వాళ్ల వాదనని నిర్ద్వంద్వంగా త్రోసిపుచ్చుతూ, ఇలా అన్నారు. "మీకు వైదికసాంప్రదాయ పరిజ్ఞానం తగినంతగా లేదు. అందుకే ఈ పదానికి అపార్థం చెప్తున్నారు. వేదార్థ సంప్రదాయం తెలిసిన వాళ్లకి నేను చెప్పిన అర్థం యొక్క వివరణ తెలుస్తుంది". అప్పుడు విద్వాంసులు "దీన్ని మేం తెలుసుకోవడమెలా?" అని ప్రశ్నించారు.

మధ్వాచార్యులు కొద్దిక్షణాలు ఆలోచించి "మరి కాసేపటికి ఇక్కడికి ఒక వేదవిద్వాంసుడు వస్తాడు" అన్నారు. ఆ విద్వాంసుడి లక్షణాలు, ఆయన ఉనికి తదితర లక్షణాలన్నీ చెప్పారు. కొంతసేపటికి ఖచ్చితంగా ఆ పోలికలున్న విద్వాంసుడొకాయన మధ్వాచార్యుడు చెప్పిన దిక్కునుంచే వచ్చాడు. ఈ పండితులంతా తమ ప్రశ్నల్ని ఆయనకు సంధించారు. ఆ తేజస్వి, 'అపాల' అనే పదానికి అర్థం 'అతి తరుణి' అని స్పష్టం చేశాడు.

దీంతో మధ్వాచార్యులు జ్యోతిషశాస్త్రజ్ఞులు కూడా అని ఆ పండితులకు అర్థమైంది. అందుకే అప్పట్నుంచీ మధ్వాచార్యులను సర్వజ్ఞులని కూడా పిలుస్తుంటారు.

ఆ తరువాత కూడా చాలా సభల్లో ఇలానే జరుగుతూ వచ్చింది. సభ మొత్తం ఒక్కటే మధ్వాచార్యులకు ప్రశ్నలు సంధిస్తూఉండేది. ఏ శాస్త్రంలో విషయమైనా, ఎంతటి జటిలమైన విషయమైనా పూర్ణప్రజ్ఞులు ఇచ్చే సమాధానాలు ఆ విద్వాంసుల్ని నిశ్చేష్టుల్ని చేస్తున్నాయి.

## మళ్ళీ ఉడుపి

ఇలా పూర్ణ ప్రజ్ఞులు చేసిన దక్షిణదేశ సంచారం ఒక దక్షిణ దిగ్విజయంగా భాసిల్లింది.

ఆయన జిజ్ఞాసువులకు జ్ఞాన సంపద పంచారు. విద్వాంసులైన వారిని సంభావనలతో గౌరవించారు. ప్రతి సభలోనూ భగవత్తత్త్వం యొక్క మహిమని శ్రోతల మనసుకెక్కేలా విడమరచి చెప్పారు. దీంతో పాండిత్యం యొక్క పరమార్థం తత్త్వ సాక్షాత్కారమే తప్ప కేవలం చర్చకోసం చర్చ జరపటంకాదు అన్న సత్యాన్ని పండితులచేత అంగీకరింపజేశారు...

ఈ పరిణామంతో పూర్ణప్రజ్ఞులు నిర్వహించే సభలకు ప్రచారం విస్తృతంగా పెరిగింది. ఎంతో దూరప్రాంతాలనుంచి కూడా విద్యార్థులు వచ్చి, వారి ప్రబోధంతో ప్రభావితులై వారికి శిష్యులుగా మారిపోతూ వచ్చారు. క్రమంగా రాజులు సయితం ఈ తత్త్వబోధనల వల్ల ప్రభావితులై తమ కర్తవ్యాన్ని గ్రహిస్తూ వచ్చారు. అనేక కొత్త ప్రదేశాలలో విష్ణ్వాలయాలు వెలిశాయి. విష్ణుపూజ మాహాత్మ్యం విస్తృతంగా ప్రచారంలోకి వచ్చింది...

నిజానికి ఉత్తర దిక్కు ఉత్తర మీమాంసకు, ఉత్తమ సిద్ధాంతానికి, ఉత్తమ విచారానికి సంకేతం. ఇందుకు విరుద్ధంగా దక్షిణదిక్కు దుర్విచారాలకు, ధన మీమాంసలకు సంకేతం. అసలు దక్షిణదిక్కు అంటే నరకానికి దారి. కాని మధ్వాచార్యుల దక్షిణ దిగ్విజయంతో దక్షిణ భారతం అంతా జ్ఞాన వాయువులు వీచసాగాయి. మధ్వాచార్యులు వాయుదేవుడి అవతారం కనుకనే ఇలా జరిగింది - అని జ్ఞానులు విశ్లేషించటం ఆరంభమయింది.

## గీతాభాష్యం

ఆమోద యోగ్యమైన తత్త్వసిద్ధాంతం ఏదో, తిరస్కరించాల్సిన దుర్మతం ఏదో విద్వాంసులకందరికీ అర్థమయ్యేలా, వాళ్లని ఒప్పిస్తూ దక్షిణ దిగ్విజయం సాగించాక, పూర్ణ ప్రజ్ఞులు ఉడుపికి వెళ్లారు. అక్కడ సుందరదేవుల మందిరాల్లో కొలువై వున్న శ్రీహరిని కొలిచారు.

ఆ కాలంలో వేదవిద్య పరిస్థితి మహాభారతంలోని కౌరవసభలో ద్రౌపదీ మానభంగం పరిస్థితే. భీష్ముడు, ద్రోణుడు, ధృతరాష్ట్రుడు, గాంధారి ప్రభృతులు ఎలాగైతే ఆ మానభంగాన్ని నిలువరించలేకపోయారో అలాగే వేదవిద్య అవమానించబడుతోంది. విదురుడివంటి కొందరు సజ్జనులు మాత్రమే ద్రౌపదీమానభంగాన్ని ప్రతిఘటించే ప్రయత్నం చేశారు కదా! చివరికి భీముడు ప్రతిజ్ఞ చేసేదాకా ఆ మానభంగం నడిచింది. అలాగే మధ్వాచార్యులు కూడా వేదవిద్య పరిరక్షణ కోసం భీషణ ప్రతిజ్ఞ చేశారు.

వేదవిద్యకు రక్షణకవచం బ్రహ్మసూత్రాలు. కాని వాటిపై వచ్చిన భాష్యాలు ఆమోదయోగ్యం కాదు. మరి నిజమైన సూత్రభాష్యాలు ఎక్కడున్నాయి?... వాటి రచన ఇప్పుడు జరగాల్సి వుంది అని భావించారు పూర్ణప్రజ్ఞులు. ఈ కార్యసాధనకోసం బదరీకి వెళ్లి శ్రీవేదవ్యాసుల అనుమతి తీసుకోవాలి అని కూడా నిర్ణయించుకున్నారు.

అయితే వేదవ్యాసులను సందర్శించినప్పుడు వారికి కానుకగా ఏమివ్వాలి? వేదవ్యాసుల రచనల్లో మేరు పర్వతం వంటిది మహాభారతం. అందులోని గీతకు భాష్యం రాస్తే...?

అనుకున్న వెంటనే ఒక శుభముహూర్తంలో గీతకు భాష్యరచనను ప్రారంభించారు మధ్వాచార్యులు. అదే ఆయన చేసిన మొదటి శాస్త్ర రచన. అందులో గీత యొక్క విశిష్టతను ఉపోద్ఘాతంగా వర్ణించారు. గీతలో అనేక ముఖ్యశ్లోకాలకి ఇతర గ్రంథాలలోని వ్యాఖ్యానాలతో సమన్వయపరుస్తూ ఆ రచన సాగటంతో ఆ గీతాభాష్యం ఒక విశిష్టగ్రంథంగా రూపొందింది.

గురువుల దగ్గరికి వెళ్లారు పూర్ణప్రజ్ఞులు.

"గురుదేవా, నేను బదరీ యాత్రకి వెళ్లాలనుకుంటున్నాను. అనుమతించండి" అని కోరారు.

ఆ మాటతో గురువు నిరుత్తరులయ్యారు. ఏమని చెప్పాలి? వెళ్లమనా? వద్దనా? వెళ్లమందామంటే, పూర్ణప్రజ్ఞుడు దూరంగా వెళ్లటం వల్ల కలిగే వెలితిని తాను తట్టుకోగలడా? తత్త్వప్రసాదం యొక్క జ్ఞాన సందేశంగా జరిగే తీర్థయాత్రను తాను వ్యతిరేకించటం భావ్యమా! పైగా ఉడుపిలోనే దండతీర్థ సృష్టిద్వారా గంగావతరణాన్ని సాధించిన లోకోత్తర మహనీయుడు తన అనుజ్ఞ కోరితే కాదనటమా?...

గురుదేవునికి మనసంతా వ్యాకులమయింది.

అర్థం చేసుకున్న పూర్ణప్రజ్ఞులు తాను రచించిన గీతాభాష్యాన్ని గురుదేవులకిచ్చారు.

"గురువర్యా! నేను వచ్చేవరకూ ఈ గీతాభాష్యాన్ని పరిశీలించండి. ఇది ఇక్కడ వున్నంత వరకూ నేను మీ సన్నిధిలో వున్నట్లే" అన్నారు.

ఆ గీతా భాష్యం చూడగానే గురువులకి తమ శిష్యుడైన పూర్ణ ప్రజ్ఞుడి ప్రజ్ఞాపాటవాలు మరింత స్పష్టంగా విస్తృతంగా అవగతమయ్యాయి. మారు మాట్లాడకుండా అనుమతిచ్చారు. "భగవంతుడైన పురుషోత్తముడు సదా నిన్ను వెన్నంటి వుండుగాక" అని అచ్యుతప్రేక్షులు ఆశీర్వదించారు. ఆనాటి నుంచే పూర్ణ ప్రజ్ఞులకు పురుషోత్తమతీర్థులు అన్న నామధేయం కూడా సార్థకమైంది.

పూర్ణప్రజ్ఞులు తమ శిష్యులతో సహా బదరీ యాత్రకు బయల్దేరారు.

అప్పటికే ఆయన దగ్గర శిష్యరికం స్వీకరించిన వారిలో సత్యతీర్థులు కూడా ముఖ్యులు. నిజానికి ఆయన అచ్యుతప్రేక్షుల దగ్గర సన్యాసదీక్ష తీసుకున్నారు. అయితే శాస్త్రాధ్యయనం అంతా పూర్ణప్రజ్ఞుల దగ్గరే చేసివుండటం వల్ల ఆయనతోపాటు బదరియాత్రకు శ్రీకారం చుట్టారు.

ఉడుపి నుండి బదరీకి కాలినడకన యాత్ర చేయటమంటే ఆ రోజుల్లో దుస్సాధ్య మయిన విషయం. అనేక నదుల్ని, కాలవల్ని దాటాలి. కొన్నిచోట్ల కీకారణ్యంలోంచి ప్రయాణించాలి. ఎండల్లో మాడిపోతూ, వర్షంలో తడిసిపోతూ, వణికిపోతూ, అడవుల్లో క్రూరమృగాల్ని తప్పించుకుంటూ, దోపిడీదొంగల వీర విహారాన్ని తట్టుకుంటూ మధ్వాచార్యులు తన శిష్యబృందంతో సహా బదరీ నారాయణుని దగ్గరకు యాత్ర సాగించారు.

తన అపార శిష్యబృందంతో మధ్వాచార్యులు దుస్సాధ్యమైన బదరియాత్రా మార్గంలో అనేక పుణ్యక్షేత్రాలు సందర్శించారు. అనేక తీర్థాలలో స్నానం చేశారు. దారిపొడవునా దేవతా వర్చస్సుతో వెలిగిపోతున్న మధ్వాచార్యులను సందర్శించటానికి, వారి ప్రబోధాలు విని తరించటానికి తండోపతండాలుగా పండితులు, పామరులు వచ్చేవారు.

తాళపత్రాలపై లిఖితమైన గ్రంథాలను సేకరించటం, వాటిని నిక్షిప్తపరచటం మధ్వాచార్యుల విశేష లక్షణం. తమ బదరీ యాత్రలో సయితం ఆయన ఈ కార్యాన్ని కొనసాగిస్తూనే వచ్చారు. దక్షిణ దిగ్విజయ యాత్రలోనే వేలకొద్ది తాళపత్ర ప్రతులను సేకరించారు. ఇక బదరీయాత్రలో వాటి సంఖ్య పెరిగిపోయింది.

మధురా, మాయా... అంటూ మనం ప్రాతఃకాలంలో స్మరించుకునే సప్తమహా క్షేత్రాలలో మాయాక్షేత్రమే హరిద్వార్. ఇక్కడ్నుంచి ఎగువకు వెళ్తే బదరీలో దర్శనమిచ్చే దైవమే శ్రీమన్నారాయణుడు.

ఈ హరిద్వార్ గురించి ప్రచారంలో వున్న పురాణగాథల్లో కొన్ని...

....భారతంలో శంతనుడు గంగను చూసి, మోహించింది ఇక్కడే.

దేవవ్రతుడయిన భీష్ముడు గంగానదికి బాణాలతో ఆనకట్ట నిర్మించింది ఇక్కడే.

విదురుడికి, మైత్రేయుడికి సంవాదం రూపంలో శ్రీమద్భాగవతం ఆవిష్కరణ జరిగిన పవిత్ర స్థలం ఇదే.

అజామిళుడు విష్ణుదూతల ప్రమేయం వల్ల యమభటుల నుంచి విముక్తి చెందాక, సుదీర్ఘంగా తపస్సు చేసి మోక్షాన్ని సాధించిన విశిష్టక్షేత్రం ఇదే.

అరణ్యవాసంలో వున్న అర్జునుణ్ణి ఈ గంగలో స్నానమాచరిస్తున్నప్పుడే నాగకన్య ఉలూచి చూసి మోహించి, తమలోకానికి తీసుకువెళ్లి, అతని సంపర్కంతో ఇరా అనే పుత్రుణ్ణి కన్నది...

ఈ విశిష్ట క్షేత్రంలో మధ్వాచార్యులు విడిదిచేశారు. పవిత్ర గంగాజలాలలో స్నానం చేశారు.

## బదరి వైశిష్ట్యం

భరతఖండంలో కెల్లా పురాతన పుణ్యక్షేత్రం బదరీ. ఎత్తైన కొండలమీద వుంది. ఎంత ఎత్తులో వుందో అలాగే ఆ క్షేత్రమహిమ కూడా అంతటిలోత్తైనది. భాగవతంలో దీన్ని భరతఖండపు ఆధ్యాత్మిక రాజధానిగా వర్ణించారు. లోకశిక్షణ కోసం శ్రీహరి ఇక్కడ తపస్సు చేసిన కారణంగా ఇది నారాయణ క్షేత్రం అని పిలవబడుతోంది.

నారాయణమందిరం వున్న పర్వతాన్ని నారాయణ పర్వతం అంటారు. దానికి ఎదురుగా వున్న పర్వతాన్ని నరపర్వతం అంటారు. ఆది శేషావతారమయిన 'నరుడు' తపస్సు చేసిన స్థలం. నారాయణ పర్వతానికి కుడివైపునున్నది ఊర్వశీ పర్వతం. ఒకసారి నారాయణుడి తపస్సుని భంగం చేయటం కోసం ఇంద్రుడు సృష్టించిన అప్సరసలు, కాముడు, వసంతుడు మొదలైన వారంతా తమ ప్రయత్నంలో విఫలమవుతారు. అప్పుడు నారాయణుడు తన తొడమీద స్పృశించటం ద్వారా అసంఖ్యాకంగా అప్సరస్త్రీలను సృష్టిస్తాడు. వాళ్లలోకెల్లా ఊర్వశి విశేష కీర్తికలది. ఆమె జనించిన స్థలమే ఊర్వశీపర్వతం.

నారాయణుడి మందిరానికి ముందే అలకనంద ప్రవహిస్తూ ఉంటుంది. దీని తీరంలోనే శివుని చేతినుంచి విడిపోయిన బ్రహ్మకపాలం ఉంటుంది. ధృవుడు, పృథువు మొదలైన చక్రవర్తులు తమ అంత్యకాలంలో ఇక్కడే తపస్సుచేసి సద్గతులు పొందారు. ఇంకా కర్ణుడు, ఘంటా కర్ణుడు అనే పిశాచాలకు శ్రీకృష్ణుడు ముక్తినిచ్చింది కూడా ఇక్కడే.

దీనికి సమీపంలోనే పాండురాజు వుండేవాడు. అక్కడే పంచపాండవులు జన్మించారు. భీముడి స్పర్శతో నూరుముక్కలయిన శతశృంగపర్వతం కూడా ఇక్కడే వుంది.

బదరీదాటి ముందుకు వెళ్తే అక్కడ వ్యాసగుహ వుంది. దీన్నే వ్యాసాశ్రమం అంటారు. భాగవతం రచింపబడింది కూడా ఇక్కడే. వ్యాసుల వారు భారతాన్ని చెప్పుకుంటూ వెళ్లిపోతే,

అంతే వేగంతో గణేశుడు మహాభారతాన్ని లిఖించిన ప్రాంతం ఇదే అనటానికి సంకేతంగా ఒక గణేశ ఆలయం కూడా ఇక్కడ వుంది.

అలకనందా, సరస్వతి నదుల సంగమమయిన కేశవ ప్రయాగ అక్కడ దర్శనమిస్తుంది. సరస్వతి నది ఎత్తునుంచి క్రిందకి ఉరికే స్థలంలో ఒక బండలాంటి వంతెన వుంటుంది. దీనిని భీమసేతు అంటారు. భారతంలో మహా ప్రస్థాన కాలంలో సరస్వతీనదికి సేతువుగా భీమసేనుడు వుంచిన పర్వతమే ఈ భీమసేతు. నారదుడు కూడా ఇక్కడే శ్రీహరిని ధ్యానించి, హరితత్త్వ ప్రసారకుడనిపించుకొన్నాడని భాగవత పురాణం వర్ణించింది.

... ఇన్ని కారణాలచేత ఆధ్యాత్మిక సాధనకు అత్యంత మహత్తు కలిగిన క్షేత్రంగా బదరీని భక్తులు నిత్యం స్మరిస్తుంటారు.

## గీతాభాష్య సమర్పణ

ఇంతటి దివ్యక్షేత్రమైన బదరీ చేరాక, మధ్వాచార్యులు తాను రచించిన గీతాభాష్యాన్ని నారాయణుడి పాదాలకు సమర్పించారు.

సాష్టాంగ నమస్కారం చేశారు.

మనసారా స్తుతించారు.

ఆ నారాయణుడి సన్నిధిలోనే గీతాభాష్య ప్రవచనం చేశారు. వారి శిష్యులు, ఇంకా ఆ క్షేత్రానికి చేరుకున్న అనేకమంది భక్తులు ఆ గీతాభాష్య శ్రవణజలధిలో ఓలలాడారు. తరించారు. తీర్థమంటేనే శాస్త్రం. దాన్ని అవలోకించటమే తీర్థయాత్ర.

గీతాభాష్యంలో మొదటి మంగళశ్లోకం:

**దేవం నారాయణం నత్వా సర్వదోష వివర్జితమ్ ।**
**పరిపూర్ణం గురూశ్చాన్యాన్ గీతార్థం వక్ష్యామి శక్తితః ॥**

అంటే –

"సర్వదోషాలకు అతీతమైనవాడు, గుణపూర్ణుడు అయిన నారాయణుడికి నమస్కరించి, గురువులైన శ్రీవేదవ్యాసులకు వందనం చేసి, యథాశక్తితో గీతార్థాన్ని వివరిస్తాను".

అద్భుతం! ప్రవచనం పూర్తికాగానే పూర్ణప్రజ్ఞులకు నారాయణుడి పలుకులిలా వినిపించాయి.

"నీ భాష్యం ప్రశంసనీయం. 'యథాశక్తితో' అనటం నీ వినయానికి తగినమాట... కాని, నీ శక్తి అపారమైనది. పూర్ణ ప్రజ్ఞుడవైన నీవు ఇక్కడ రచించింది అత్యల్పం. నీ శక్తి బహిర్గతం కావాలి. కనుక 'శక్తితః' (యథాశక్తితో) అన్న పదానికి బదులుగా 'లేశతః' అని మార్చు..."

ఆహా!

గీతను ప్రతిపాదించిన నారాయణుడే ఆ భాష్యాన్ని మెచ్చి అనుగ్రహించారే! ఈ గ్రంథానికి ఇంతకంటే సార్థకత ఏముంది?

ఇలాంటి ప్రశంస మహాభారతంలో శ్రీకృష్ణుడి నుంచి భీమసేనుడికే లభించింది. ఉద్యోగ పర్వంలో శ్రీకృష్ణుడు పాండవుల తరపున కౌరవుల వద్దకు రాయబారానికి వెళ్లేటప్పుడు కృష్ణుడికి వీడ్కోలు చెప్పే సమయంలో భీముడు కల్పించుకొని అంటాడు.

"ఈ ప్రపంచంలో ఇంద్రుడు మొదలైన దేవతలు సహా ఎవ్వరూ నా బాహుబలానికి సాటిరారు. బ్రహ్మాండాన్ని చీరేటంతటి సామర్థ్యం నాకుంది..."

అది విని శ్రీకృష్ణుడు అంటాడు:

"భీమసేనా, అది సత్యమే. అయినప్పటికీ నీ శక్తి నువ్వు చెప్పినదానికన్నా వేయిరెట్లు అధికమని నాకు తెలుసు. నువ్విప్పుడు చెప్పుకొన్నది లేశతః మాత్రమే..."

**యత్కించాత్మని కళ్యాణం సంభావయసి పాండవ ।**
**సహస్రగుణ మప్యేతత్త్వయి సంభావయామ్యహమ్ ॥**

శ్రీ కృష్ణుడినుంచి ఇంతటి ప్రశంస పొందిన పాండవుడు భీమసేనుడు ఒక్కరే. ఇప్పుడు మళ్లీ ఆ భాగ్యం మధ్వాచార్యులదే... ఇలాంటి అనేక దృష్టాంతాల చేత మధ్వాచార్యులే ఆ భీమసేనుడు అని నిస్సంశయంగా నిరూపితమైంది.

వాయుపుత్రుడైన భీమసేనుడుకి సయితం తన పూర్తి శక్తిని ప్రదర్శించడానికి అప్పుడు రాని అవకాశం ఇప్పుడు మధ్వాచార్యుల అవతారంలో వచ్చింది. ఇప్పటికీ ఈ గీతాభాష్య ప్రవచనం వారి మూలశక్తిలో ఒక అంశం మాత్రమే.

మధ్వాచార్యులు తమ శిష్యబృందంతో పాటు విడిది చేశారు బదరీ నారాయణ దేవస్థానం లోపలి ప్రాకారంలోని అనంత మఠంలో.

ఆ రాత్రి అందరూ గాఢనిద్రలో వున్న సమయంలో శ్రీవేదవ్యాసులు అక్కడికి వచ్చారు. ఆయన నేలమీదకొట్టి, "పూర్ణప్రజ్ఞా, మీ గీతాభాష్య ప్రవచనం మరొకసారి చేయండి" అన్నారు. ఈ మాటలు నిద్రపోతున్న శిష్యుల క్కూడా వినబడ్డాయి.

పూర్ణప్రజ్ఞులు లేచి కూర్చున్నారు. వ్యాసులవారి ఆదేశంతో మరొకసారి గీతాభాష్యాన్ని సమగ్రంగా ప్రవచించారు. ఈసారి తన భాష్యంలో - మొదట్లో వచ్చే మంగళశ్లోకంలో 'శక్తితః' అన్న పదానికి బదులుగా 'లేశతః' అని ప్రయోగించారు.

ఎంతటి భాగ్యం?

మధ్వాచార్యులవారి గీతాభాష్యానికి సాక్షాత్తూ భగవంతుని ఆమోద ముద్ర లభించింది. ఈ పాఠప్రవచనాలు శ్రీహరికి అత్యంత ప్రీతికరమైనవన్న విషయం ఈ సంఘటనతో నిర్ధారణ అయింది. గీతను మొదటిసారిగా శ్రీహరి నుంచి (శ్రీకృష్ణుని అవతారంలో) విన్నవాడు అర్జునుడు మాత్రమే కాదు, అర్జునుడి రథంపైన ధ్వజం మీద ఉపవిష్టుడైన వాయుపుత్రుడు - హనుమంతుడు కూడా. ఇప్పుడు అదే గీతాభాష్యాన్ని రచించే అవకాశం మళ్లీ మధ్వాచార్యుల అవతారంలోని వాయుదేవుడికి లభించింది.

**జ్ఞాననిధి**

బదరీ నారాయణుడి సన్నిధిలో పూర్ణప్రజ్ఞుల సాధన ఎలా సాగుతోందంటే...

ప్రతిరోజూ సూర్యోదయకాలంలో హిమంలా వుండే అలకనంద జలాల్లో పూర్ణ స్నానం చేసేవారు. పూర్ణస్నానం అంటే ఒకసారి మునగటం కాదు. సదాచార స్మృతిలో పేర్కొన్న విధంగా అనేక మంత్రాల్ని పఠిస్తూ అనేకసార్లు నీటిలో మునిగి లేవాలి. చివరగా పూర్తిగా నీటిలో మునిగివుండి, మూడుసార్లు అఘమర్షణ సూక్తం పఠించాలి!

పూర్తిగా నీటిలో మునిగివుండి, సూక్తాన్ని పఠించటమంటే... సాధారణ మనుష్యులకు సాధ్యపడే విషయమా? శ్వాసని బంధించగలమా? పూర్ణప్రజ్ఞులు వాయుదేవుడి అవతారం అయివుండకపోతే ఇది సాధ్యమా?

సాధన అక్కడి వరకే పరిమితం కాలేదు. పూర్ణ స్నానం చేశాక, ఆహ్నికం, దేవతార్చన వుంటాయి. భోజనం మానేశారు పూర్తిగా నిరాహారులయ్యారు. దీనికి తోడు మౌనవ్రతం పాటిస్తున్నారు. ప్రవచనాలు నిలిపేశారు. ఇలా నిరాహార ఉపవాసంతో కూడిన మౌనాన్ని 'కాష్ఠమౌనం' అని శాస్త్రాలు అభివర్ణిస్తున్నాయి. అన్ని రకాల ప్రాణులదేహాలు ఇలా 'నిరాహార మౌన' దశలో వుండటమనేది జరిగేది శరీరంలోంచి వాయుదేవుడు వెళ్లిపోయినప్పుడు (కాష్ఠంమీదకి శరీరం చేరినప్పుడు) మాత్రమే.

కాని ఇదేమిటి? నెలరోజులపాటు చల్లగా మంచులా వుండే అలకనంద జలాల్లో తెల్లవారుఝామున పూర్ణస్నానం చేయటం, రోజంతా ఉపవాసం వుండటం, మౌనవ్రతం

సాధించడం...! సామాన్య మానవులకు సాధ్యమా? వాయుదేవుడి అవతార పురుషులు కనుక పూర్ణ ప్రజ్ఞుల సాధన అలా సాగింది.

48 రోజుల కాష్ఠమౌనవ్రత సాధన తరువాత ఒక రాత్రి అకస్మాత్తుగా ఆ మఠంలో కళ్లు మిరుమిట్లు గొలిపే కాంతి ప్రవేశించింది. ఆ ఆవరణ అంతా ఆ కాంతి పరుచుకుంది. శిష్యులందర్నీ సంభ్రమాశ్చర్యాలలో ముంచేస్తూ, ఆ కాంతిని చీల్చుకుని ఒక పవిత్రమూర్తి పూర్ణప్రజ్ఞులకు దర్శనమిచ్చింది.

ఆయనే వ్యాసభగవానుడు!

శిష్యులకు అర్థమవుతోంది – ఏదో దివ్యశక్తి అక్కడికి వచ్చింది. కాని వాళ్లకి ఏమీ వినబడటంలేదు.

ఆ మూర్తిని చూస్తూనే పూర్ణ ప్రజ్ఞులు నమస్కరించారు. వేద వ్యాసులు పూర్ణ ప్రజ్ఞుల్ని ఆశీర్వదించారు.

"పూర్ణ ప్రజ్ఞా, సమయం వచ్చింది. నువ్వు చేయాల్సింది చాలా వుంది. ఇక ఉత్తర బదరీలోని మా ఆశ్రమానికి విచ్చేయ్ నాయనా" అంటూనే, అంతర్థానమయ్యారు. మరుక్షణం ఆ మఠంలో ఆ కాంతి కూడా మాయమైపోయింది.

వేదవ్యాసుల ఆదేశంమేరకు మధ్వాచార్యులు ఉత్తర బదరీకి బయల్దేరారు. వెళ్లబోతూ శిష్యులకు ఒక సందేశం ఇచ్చారు. మౌనవ్రతంలో వుండటం వల్ల శిష్యులకు ఇలా రాసి చూపించారు.

**నేదృశం స్థల మలం శమలఘ్నం నాస్యతీర్థసలిలస్య సమం వా**
**నాస్తి విష్ణు సదృశం ననుదైవం నాస్మదుక్తిసదృశం హితరూపమ్**

(యాతి తావదధునైవ జనోఽ యం వ్యాసరూప మజితం ప్రదిదృక్షుః
అప్రజేదిహ నవా స హి వేద స్వస్తి వోఽ స్త్విత్తి యయా వథ మధ్వః)

"ఈ బదరీ అంతటి పాపనాశకక్షేత్రం మరొకటి లేదు. విష్ణువంతటి పావనమైన దైవం ఇంకొకరు లేరు. మామాటలంతటి హితవచనం ఇంకొకటి లేదు...

మేము ఇప్పుడు వ్యాసరూపుడైన భగవంతుణ్ణి చూడటానికి వెళ్తున్నాం. మళ్లీ ఎప్పటికి తిరిగొస్తామన్నది ఆయన ఇష్టం... మీకు మంగళమవుగాక."

శిష్యులంతా అవాక్కయ్యారు. గురువులు వ్యాసాశ్రమానికి వెళ్లటం ఎంత ఆనందం కలిగిస్తోందో, తాము గురువుని విడిచి వుండాల్సి వస్తుందన్న భావం అంతకన్నా ఎక్కువగా

వాళ్లని దుఃఖంలో ముంచేసింది. ఆ గురువుపట్ల వాళ్లకి గల భక్తిభావం అంతటి పరిశుద్ధమైనది, పవిత్రమైనది.

**గురువుల వెనుక ఎవరువెళ్లారు?**

శిష్యుల కళ్లల్లోంచి బెంగ, విచారం కన్నీటిరూపంలో కారుతుండగా పూర్ణప్రజ్ఞులు ఉత్తర బదరీకి ప్రయాణమయ్యారు.

ఆ శిష్యులలో ఒకరు సత్యతీర్థులు. గురువు పాదాల దగ్గర కూర్చొని మూడుసార్లు ఐతరేయ శ్రుతిని విన్న అదృష్టవంతులు. ఆయనకి జ్ఞానం పెరుగుతున్న కొద్దీ గురుభక్తి ఇనుమడిస్తూ వచ్చింది. అందుకే గురువు ఒంటరిగా ఉత్తర బదరీకి ప్రయాణం కావటాన్ని జీర్ణించుకోలేక, ఆయన వెంట తానూ నడక సాగించారు.

ఎత్తుపల్లాలు, దొర్లిపడే బండరాళ్లూ, చలిగాలులూ, మంచు వర్షం... ఇలాంటి వాతావరణంలో ఎత్తైన ఆ పర్వతశ్రేణి వాలులో ఆ గురుశిష్యులు సాగిపోతున్నారు. ఒక వైపు కొండచరియలు జారిపడేలా భయపెడుతున్న పర్వతాలు, మరోవైపు పచ్చటి పొలాలతో నిండిన లోయలు... వాటిని అలాగే దాటుకుంటే ఎత్తైన మార్గాన్ని సునాయాసంగా ఆరోహిస్తూ, లోయలాంటి చోట కిందకు దిగుతూ, మళ్లీ ఎక్కుతూ, రాళ్ళూ రప్పలూ, పాములూ, తేళ్లూ వంటి విషప్రాణులన్నీ తప్పించుకుంటూ క్లిష్టమయిన పాదయాత్ర చేస్తున్నారు గురుశిష్యులు.

అకస్మాత్తుగా గురువుకి వెనుకగా నడుస్తున్న సత్యతీర్థులకు తల తిరిగినట్లనిపించింది. చాలా ఎత్తుకి నడవటం వల్లనేమో శరీరం ఆయాసపడుతోంది. ముందునడుస్తున్న గురువుని కేకవేసి చెప్పే శక్తికూడా లేకుండాపోతోంది. కాని ఆయన ఆందోళన తన గురించి కాదు. గురువు ఒంటరిగా వెళ్తున్నారే, ఆయనకి రక్షణగా వెళ్ళాల్సిన తాను వెనుకబడిపోతున్నానే అన్నదే ఆదుర్దా. గురువు రక్షణ కోసం దైవప్రార్థన చేశారు.

సూర్యాస్తమయమవుతోంది. సత్యతీర్థులు చేసిన దైవప్రార్థన పూర్ణప్రజ్ఞుల మనసుకి సోకింది. అప్పటి వరకూ తన ప్రయాణ వైభవం తిలకిస్తూ వచ్చిన శిష్యుని కోసం వెనక్కి తిరిగారు. చాలా దూరంలో కనుపిస్తున్నారు సత్యతీర్థులు. చెయ్యెత్తి "వెనక్కి తిరిగి వెళ్ళు" అంటూ సైగ ద్వారా ఆదేశించారు పూర్ణప్రజ్ఞులు.

గురువు ఆదేశాన్ని శిరసావహించారు. అంతే! మరుక్షణం సత్యతీర్థుల ప్రయాణ బడలిక అంతా మటుమాయమైంది. వెనుదిరిగి నిమిషాల్లో ఇతర శిష్యబృందం దగ్గరకు

చేరుకున్నారు. గురు అనుగ్రహం ఎంతగొప్పది? సత్యతీర్థుల ద్వారా వాయుదేవుడి అవతారమైన గురువుల శక్తి సామర్థ్యాలు వాళ్ళకి అవగతమయ్యాయి. మళ్ళీ మళ్ళీ సత్యతీర్థుల్ని అడిగి చెప్పించుకున్నారు వాళ్ళంతా గురువుల పాదయాత్ర వైభవాన్ని.

గురువుకి మాత్రం ఆ పర్వతశ్రేణుల్లో ముందుకి సాగుతున్న కొద్దీ మార్గం దుర్గమంగా ఉంది. అయినా పూర్ణ ప్రజ్ఞుల ప్రయాణం ఆగలేదు. వారికి అలసట అనిపించలేదు. విరామం కోసం ఎక్కడా విడిది చేయలేదు. ఎలాంటి శీతోష్ణ పవనాలకీ ఆయన చలించలేదు. ఈ శక్తి ఎవరికి ఉంటుంది?

మహాభారతంలో ఆ దారి వర్ణన వుంది. భీమసేనుడు సౌగంధికాపుష్పాల కోసం వెళ్ళాడు. మళ్ళీ ఇప్పుడు మధ్వాచార్యులు వెళ్తున్నారు. అతి సునాయాసంగా ఆ దుర్గమ మార్గంలో పోగలిగినవాడు మహాభారతకాలంలో భీమసేనుడు. మళ్ళా ఈ కలి యుగంలో మధ్వాచార్యులు!

శరవేగంతో మధ్వాచార్యులు నడుస్తూంటే దూరంగా హిమాలయ పర్వతశ్రేణి కనుపించింది. ఆ పర్వతశ్రేణిలోని భగవంతుడి విభూతి రూపాన్ని చూశారు. నమస్కరించారు.

## వ్యాసాశ్రమంలో వ్యాస శిష్యులు

పూర్ణప్రజ్ఞులు హిమాలయ ఉత్తర దిశకు చేరారు. అక్కడే ఉత్తరబదరీ ఉంది. బదరీ వృక్షాల మధ్య ఉండటంచేత 'బదరీ' అని పిలబడుతోంది. వేదవ్యాసులు ఇక్కడ దర్శనమివ్వటమే విశేషం. అందుకే వారిని బాదరాయణులు అంటారు.

పూర్ణప్రజ్ఞులు వ్యాసాశ్రమంలో ప్రవేశించగానే అక్కడ అంతా పరమయోగులైన ఋషి పుంగవులు శ్రీవ్యాసుల సేవ చేస్తున్నారు. వారు అపార తేజస్సుతో ప్రకాశిస్తున్న పూర్ణ ప్రజ్ఞులను చూస్తూనే సంభ్రమంలో మునిగిపోయారు.

ఏమా వర్చస్సు!

అలా అందరు చూస్తూండగానే పూర్ణ ప్రజ్ఞులకు అక్కడ బదరీ వృక్షం క్రింద వేదికపై ఆసీనులై వుండి సూర్యకాంతితో వెలిగిపోతున్న వేదవ్యాసులు దర్శనమిచ్చారు. వ్యాసమహర్షిని చూస్తూనే పూర్ణ ప్రజ్ఞులు పులకించిపోయారు. మనసారా ధ్యానం చేశారు. వేదాలను, సనాతన ధర్మాన్ని పరిరక్షించిన అవతారపురుషునిగా స్తుతించారు. సాష్టాంగ ప్రణామం చేశారు.

వేదవ్యాసులు వాత్సల్యంతో పూర్ణప్రజ్ఞులను పైకి లేపి ఆలింగనం చేసుకున్నారు! ఆ ఆలింగనం దృశ్యం శ్రీరామ-హనుమంతుల సంగమంలా, శ్రీకృష్ణ-భీముల సంగమంలా గోచరించింది అక్కడున్న ఋషి పుంగవులందరికీ. ఆ వాత్సల్యం, ఆ ఆదరణ చూసి, "ఈయన వ్యాసులవారికి తమ పుత్రులైన శుకమహామునికంటే ఎక్కువగా గోచరిస్తున్నారు సుమా" అనుకున్నారు.

పూర్ణప్రజ్ఞులు సకల శాస్త్రకోవిదులు. ఆయనకి తెలియని శాస్త్రం లేదు. అయినా వేదవ్యాసుల్ని గురువుగా స్వీకరించారు. వ్యాసమహర్షి కూడా ఆ భక్తి ప్రపత్తుల్ని, వినయాన్ని హర్షిస్తూ, ఉపదేశం ఇచ్చారు. ఆ వ్యాసోపదేశంతో పూర్ణప్రజ్ఞుల జ్ఞాననిధి మరింత సంపన్నమయింది.

అందుకే, మనకి తెలిసిన విషయమే అయినా మనకన్నా ఉత్తములైన వాళ్ళు చెబుతుంటే వినాలి. అలా వింటేనే మన జ్ఞానం సుసంపన్నమవుతుంది.

### నారాయణుని ఎదుట నరోత్తముడు

కొన్ని రోజుల తరువాత ఒకసారి వేదవ్యాసులవారు మధ్వాచార్యులను మరొక చోటుకి తీసుకెళ్ళారు. అది నారాయణాశ్రమం.

అక్కడ శ్రీనారాయణుని దివ్యరూప సాక్షాత్కారం జరిగింది.

ఆహా... ఆ రూపాన్ని చూడగానే మత్స్యకూర్మాది అవతారాల లీలలన్నీ పూర్ణప్రజ్ఞుల కళ్ళముందు మెదిలాయి. వ్యాసమహర్షిని చూసినప్పుడు కలిగిన పులకింత వంటి మహత్తర అనుభూతికి లోనయ్యారు.

"ఆహా, ఏమి నాభాగ్యం!

ఒక ప్రక్కన వ్యాసభగవానుని, ఎదురుగా నారాయణ రూపంలో శ్రీహరిని ఏకకాలంలో వీక్షించగలుగుతున్నాను? ఇది కలా? నిజమా?..." అనుకుంటూ అపూర్వ ఆనందాతిశయంలో ఓలలాడారు మధ్వాచార్యులు. అందుకే ఆయన జీవోత్తములు.

ఆ ఆనందావేశంలో నారాయణుని ఇలా స్తుతించారు.

**పరమాత్మనే సతతమేకరూపిణే దశరూపిణే శతసహస్ర రూపిణే ।**
**అవికారిణే స్ఫుటమనంత రూపిణే సుఖచిత్సమస్తతనవే నమో నమః ॥**

...అలా స్తుతిస్తూ శ్రీనారాయణుని సమీపించారు.

శ్రీవ్యాస నారాయణులు ఆలింగనాదులతో ఆశీనులయ్యారు. వారిద్దరికీ సాష్టాంగ నమస్కారం చేసి మధ్వాచార్యులు కూడా ఆశీనులయ్యారు.

అప్పుడే నారాయణుల నుండి ఆదేశాన్ని అందుకున్నారు పూర్ణప్రజ్ఞులు.

"...ఇది రహస్యమైన కార్యం. మీ అవతారం యొక్క మహత్తరకార్యం ఇది. సజ్జనులకు ముక్తిమార్గం చూపించేలా బ్రహ్మసూత్రాలకు భాష్యాన్ని మీరిప్పుడు రచించాలి... శ్రుతి, స్మృతుల సత్సిద్ధాంతాలు ఆ మూలకంగా వెలుగులోకి రావాలి..."

అది వింటూనే మధ్వులు వినయంగా విన్నవించుకున్నారు. "మీ ఆదేశాన్ని పాటించాలంటే నేనిక్కడ్నుంచి వెళ్ళిపోవాలి. మీ విరహాన్ని భరించలేను. అది నాకు సాధ్యంకాదు. నేనిక్కడ ఉండి మిమ్మల్నిద్దర్నీ సేవించి తరించే భాగ్యం కావాలని కోరుకుంటున్నాను... అయినా నేను వెళ్ళి భాష్యం రాస్తే దానిని తెలుసుకునే అర్హత ఎంతమందికుంటుంది! అనర్హులకు తత్త్వాన్ని తెలపటం అంటే కుక్కకు హవిస్సువేసినట్లే కదా..."

శ్రీనారాయణులు మందహాసం చేశాడు. "ఈ కలికాలంలో సజ్జనుల సంఖ్య తగ్గటం నిజమే. అయినా జిజ్ఞాసువులు లేరనటం సరికాదు. మీ శాస్త్రవచనాలతో వారిని పవిత్రుల్ని చేయండి... బ్రహ్మసూత్రాలకు భాష్యరచన వెంటనే ప్రారంభించండి..."

ఆ పవిత్రక్షేత్రాన్ని, అక్కడ ఆ ఇద్దరు భగవత్‌రూపాల్ని వదిలి వెనక్కి వెళ్ళటం మధ్వులకు ఇష్టంలేదు! కాని ఇది శ్రీనారాయణుడి ఆదేశం!

ఆ ఆదేశాన్ని మధ్వాచార్యులు శిరసావహించారు. మరోసారి సాష్టాంగ నమస్కారం చేసి, వేదవ్యాసులతో కలిసి, వ్యాసాశ్రమానికి చేరుకున్నారు.

కొన్నాళ్ళపాటు అక్కడే ఉన్నారు. వేదవ్యాసుల వారితో అనేక తత్త్వరహస్యాల గురించి ముచ్చటించారు! సందేహ నివృత్తి చేసుకున్నారు. సంతృప్తి చెందాక, శెలవు తీసుకుని తిరుగు ప్రయాణం ప్రారంభించారు... మళ్ళీ అదే దుర్గమమైన మార్గం. రాళ్ళూ, రప్పలూ, లోయలూ, ఎత్తులూ, క్రూరమృగాలు, విష సర్పాలూ... అన్ని దాటుకుంటూ కాలినడకన మళ్ళీ అనంతమఠానికి చేరుకున్నారు మధ్వాచార్యులు.

అక్కడ సత్యతీర్థుల సారథ్యంలో గురువుకోసం కళ్ళుకాయలు కాచేలా ఎదురుచూస్తున్న శిష్యులందరిలోనూ ఆయన్ని చూడగానే ఒక్కసారిగా ఉత్సాహం, ఉద్వేగం ఉప్పొంగాయి. ఆ ఆనందోత్సాహాలను - లంకను చూసి తిరిగి వచ్చిన హనుమంతుణ్ణి చూసినప్పటి

వానరుల ఆనందహేలతో పోల్చినా, శమంతకమణి సాధించి తెచ్చిన కృష్ణుని చూసినప్పుడు యాదవులకు కలిగిన సంతోషతరంగాలతో పోల్చినా సరిపోదు.

ఎదురుచూస్తున్న గురువు తిరిగివచ్చారన్న ఆనందానికి అవధులే లేవు.

## వృకోదరుని భిక్షవైభవం

బదరీలో అగ్నిశర్మ, మరో అయిదారుగురు బ్రాహ్మణ కుటుంబాలకు మధ్వాచార్యులను భిక్షకు ఆహ్వానించాలని కోరికగా ఉంది. ఉత్తరబదరీకి వెళ్ళకముందు మధ్వాచార్యులు కాష్ఠమౌనవ్రతంలో ఉండటం వల్ల సాధ్యపడలేదు.

"ఏమైనాసరే ఇప్పుడు మీరు మా అభ్యర్థన కాదనరాదు. దయచేసి మా భిక్షను స్వీకరించండి" అంటూ వారు ఒత్తిడి చేశారు. మళ్ళీ మళ్ళీ అర్థించారు.

వారి అభ్యర్థనలోని పవిత్రత మధ్వాచార్యులను కదిలించింది. భిక్షకు అంగీకరించారు.

"అయితే మీలో ప్రతి ఒక్కరూ మాకూ, మా పరివారానికి సరిపడే ఆహారాన్ని సిద్ధంచేసి తీసుకురండి. మేము శ్రీహరికి సమర్పించాక దాన్ని స్వీకరిస్తాం..."

అలాగే ప్రతిఒక్కరూ మొత్తం బృందానికి సరిపడే ఆహారాన్ని తయారు చేసుకున్నారు. అందరూ ఆ ఆహారాన్ని అనంతమఠానికి తీసుకువచ్చారు.

"కాని ఏ ఒక్కరు తెచ్చిందైనా అందరికీ సరిపడేలా ఉన్నప్పుడు, ప్రతిఒక్కరూ విడివిడిగా మొత్తం బృందానికి కావలసినంత ఆహారపదార్థాలను తీసుకువచ్చామే! ఈ పదార్థాలన్నీ ఎలా ఖర్చవుతాయి?..."

ఈ సందేహం ఆ విప్రుల్ని వెంటాడింది. మధ్వాచార్యులు ఆ ఆహారపదార్థాన్ని శ్రీహరికి నివేదించాక, శిష్యులకు సరిపడా వేరుచేసి ఇచ్చాక, అప్పుడొక అద్భుతం జరిగింది!

మిగిలిన మొత్తం ఆహారపదార్థాల్ని మధ్వాచార్యులు ఒక్కరే సునాయాసంగా ఆరగించారు!

ఆహా! తెలిసింది... భీమసేనుడే వచ్చి ఆరగిస్తున్నాడని అందరికీ అర్థమై పోయింది.

భీమసేనుడే కాకపోతే శైశవదశలో ఉలవలు తిని హరాయించుకుగలిగేవారా?

అచ్యుతప్రేక్షులతో కలిసి భిక్షకు వెళ్ళిన చోట భోజనం చేశాక 200 అరటిపళ్ళు తినగలిగేవారా?

ఇప్పుడిలా ఇంత భోజనం...??

ఈ శక్తినే వేదాలు 'పితుమాన్' అని ప్రశంసించాయి.

## బ్రహ్మ సూత్ర భాష్య రచన

శిష్యులందరి సమక్షంలో మధ్వాచార్యులు తమ శిష్యుడైన సత్యతీర్థుల్ని ఆదేశించారు.

"సత్యతీర్థా, లిఖించండి..."

అంతే! అలా ప్రారంభమైన బ్రహ్మసూత్ర భాష్య రచన నిరాటంకంగా గురుశిష్య సమన్వయంతో సాగిపోయింది.

బ్రహ్మసూత్ర భాష్యం పూర్తయ్యేదాకా గురు శిష్యులకు ప్రథమ, ద్వితీయ, తృతీయ... వగైరా అన్ని ప్రాధాన్యతలూ బ్రహ్మసూత్ర రచన మాత్రమే.

...చివరికి బ్రహ్మసూత్ర భాష్య రచన పూర్తయింది. అప్పటి వరకూ ఎంతమంది బ్రహ్మ సూత్రాలకు భాష్యం రాసివున్నారో లెక్కిస్తే, ఈ రచన ఇరవై రెండవది. కాని ఇది ఒక్కటి మాత్రమే బ్రహ్మసూత్రాలకు యథార్థ భాష్యాన్ని అందించిన రచన.

వేదాంత సాహిత్యానికి బ్రహ్మసూత్రాలు ఆదిదంపతులవంటివి. సమస్త వేదార్థాలకు నిర్ణయం ఇవే. సమస్త శాస్త్రాల సారం ఇవే.

బ్రహ్మ సూత్రాలు మొత్తం నాలుగు అధ్యాయాలుగా ఉన్నాయి. ప్రతి అధ్యాయానికి నాలుగు పాదాలు. మొత్తం సూత్రాలు 564.

ఎంత చిన్నది ఈ బ్రహ్మసూత్ర కోశం!

కాని...

సమస్త శాస్త్రాల అర్థాలకు ఇది మాత్రమే మార్గదర్శి.

సకల శాస్త్రార్థమైన మహాభారతసారం మొత్తం చిన్న భగవద్గీతలో ఇమిడ్చినట్టే, అంతకన్నా చిన్నదైన బ్రహ్మ సూత్రాలలో వేదాలు మొదలైన సకల శాస్త్రాల సారాన్ని ఇమిడ్చారు వేదవ్యాసులు.

ఏమిటి ఈ బ్రహ్మసూత్రాల సారాంశం?

శ్రీహరి అనంత కళ్యాణ గుణ పరిపూర్ణుడు, సకలదోషరహితుడు అన్నదే సారాంశం. ఈ భాష్యం ఏం చెబుతోంది:

జ్ఞానులైన భక్తులను మోక్షంతో కరుణించటం...

ఆ కటాక్ష సిద్ధి...

ప్రతి విషయానికీ వేదవాక్యాల సంవాదం...

స్మృతి వాక్యాల వివరణ...

అత్యంత సముచితమైన యుక్తి వైభవం...

సామాన్యులక్కూడా అర్థమయ్యే సరళత...

విధ్వంసాలకు దొరకని గాంభీర్యం, ప్రసన్న శైలి...

సకల లక్షణాలతో కూడుకొన్న తత్త్వజ్ఞాన ఖని...

దేవశ్రేష్ఠులు సయితం ప్రశంసించే విశిష్టత...

...ఇలాంటి అపూర్వ స్వరూపంతో అంతకు ముందు కాలాల్లో వెలువడిన భాష్యాలకు "సమాధానమా" అన్నట్లుగా, ఎన్నితరాలకైనా ఎలాంటి తత్త్వపరిశోధనలకైనా నిలబడగల సంపూర్ణతతో ఈ కృతి రూపొందింది.

సత్యతీర్థులు ఎంత అదృష్టవంతులు! అంతటి మహత్కృతిని లిఖించే భాగ్యం ఆయనకే గదా దక్కింది. పవిత్ర గంగాతీరంలో విష్ణుదేవాలయం నిర్మించిన పుణ్యం వల్లనా ఆ అదృష్టం వరించింది? మధ్వాచార్యులకు వెన్నంటి బదరికీ వెళ్ళినందుకా ఆ సువర్ణావకాశం లభించింది?

భాష్యం రాయడమే మహా అదృష్టమైతే భాష్యకారులుగా మధ్వాచార్యులు ఎంతటి పుణ్యాత్ములయి ఉండాలి! అందుకే వారిలో సునాయాసంగా సముద్రాన్ని లంఘించి లంకను చేరిన హనుమంతుడు, సౌగంధికా పుష్పాన్ని ద్రౌపదికోసం సాధించి తెచ్చిన భీమసేనుడు కనుపిస్తారు.

## గంగాతీరం నుంచి గోదావరి తీరానికి

బ్రహ్మసూత్రాలకి భాష్యరచన పూర్తికాగానే మధ్వాచార్యులు అనంతమఠం నుంచే నారాయణుడికి నమస్కారం చేసి, తిరుగు ప్రయాణం ప్రారంభించారు.

గంగానదికి మరోరూపమైన గోదావరీ తీరానికి చేరుకున్నారు. ఎక్కడి గంగాతీరం? ఎక్కడి గోదావరి? పైగా కాలినడకన! అలా మధ్వాచార్యుల భాష్యరచన జరిగింది గంగాతీరంలో అయినప్పటికీ అది ప్రకాశించింది మాత్రం గోదావరీ నదీ తీరంలోనే.

అదెలా జరిగిందంటే...

గోదావరీ తీరం పాండిత్యానికి ప్రసిద్ధి చెందింది. వేదవేదాంగాలను అధ్యయనం చేసిన విద్వాంసులకు నెలవు గోదావరీ తీరం. గోదావరి జలాలు ధాన్యం పండించి ప్రజలకు కడుపు నింపుతుంటే ఈ విద్వాంసులు జిజ్ఞాసువులైన ప్రజల మస్తిష్కాల్ని జ్ఞానబోధతో నింపేవారు. అలాంటి పండితులతో నిండిన ఒక విద్వత్ సభ గోదావరీ తీరంలో ఉండేది.

ఆ సభలో ఉద్దండులైన పండితులు ఉన్నారు. దానికి సారథి శోభనభట్టు. ఆయనకి చతుర్దశ విద్యల్లోనూ అపారమైన పాండిత్యముంది.

పూర్ణప్రజ్ఞులు ఆ సభకి వెళ్లటానికి ముందే ఆయన గురించి విస్తృతంగా అక్కడ పండితుల్లో ప్రచారం జరిగింది. దాంతో తాము విన్న ప్రజ్ఞాపాటవాల కారణంగా పూర్ణప్రజ్ఞుల (ఆనందతీర్థులు) పట్ల గౌరవం పెంచుకున్న పండితులు కొంతమంది అయితే, అసూయను పెంచుకున్న వాళ్లు మరికొంతమంది. ఎలాగైనా సరే ఆనందతీర్థుల్ని తత్త్వచర్చలో గెలవాలని వాళ్లంతా సిద్ధమయ్యారు.

చర్చ ప్రారంభమయింది. చర్చనీయాంశం ఏమిటనేది ఆ పండితుల ఇష్టానికే మధ్వాచార్యులు వదిలేశారు. అలా వాళ్లు తమతమ ఇచ్ఛానుసారం తత్త్వజ్ఞానానికి సంబంధించిన ప్రశ్నలు వేయటం, వాటికి పూర్ణప్రజ్ఞులు సమాధానం ఇవ్వటం.

ఇలా చర్చ సాగుతోంది...

వాళ్లు ఏ శాస్త్రం గురించి ఎలాంటి ప్రశ్నలు వేసినా, వాటికి వాళ్లందర్నీ దిగ్భ్రమ పరిచేలా మధ్వాచార్యులు జవాబిస్తున్నారు.

ప్రశ్నలు సంధించేవాళ్లు అనేకమంది. ఏ శాస్త్రంమీద ఎలాంటి ప్రశ్నలు ఎన్ని వచ్చినా, సమాధానం ఇచ్చేదిమాత్రం ఒక్క ఆనందతీర్థులే.

చివరికి చర్చ అలా సాగి... సాగి... అంతకుముందు అనేక సభల్లో జరిగినట్లే ఈ సభలో కూడా పూర్ణప్రజ్ఞుల జ్ఞాన సంపత్తిని పండితులు అంగీకరించకతప్పలేదు. ఓడిపోయినవారంతా పూర్ణప్రజ్ఞుల్ని సర్వజ్ఞులుగా గుర్తించి గౌరవించారు.

"మీకు మీరే సాటి" అంటూ కీర్తించి నమస్కరించారు.

### శోభనభట్టుల శరణాగతి

పండితసభకు హాజరైన శోభనభట్టు ఆ కాలంలో మహా పండితులలోకెల్లా దిగ్గజంగా కీర్తించబడుతున్న వ్యక్తి. తర్కశాస్త్రం, వేదాలు, వేదాంతం, మహాభారతం తదితర పురాణాల్లో

శాస్త్రాల్లో ఆయనకుగల ప్రతిభ అసాధారణం. అంతటి శోభనభట్టు సహితం మధ్వాచార్యులతో సంవాదంలో పరాజయం పొందారు. ఆ పరాజయంతో మధ్వాచార్యునిలో తనను ఉద్ధరించగల గురువుని శోభనభట్టు గుర్తించారు.

అంతే! ఆ మరుక్షణమే మధ్వాచార్యుల దగ్గర శిష్యరికం స్వీకరించి, వారి బ్రహ్మసూత్రాల భాష్య ఉపదేశం పొందటానికి ఆయన ముందుకొచ్చారు. ఆయన అభ్యర్థనని మధ్వాచార్యులు ఆమోదించి, బ్రహ్మసూత్ర భాష్యాన్ని ఉపదేశించారు.

పూర్ణప్రజ్ఞుల నోటినుండి వెలువడిన బ్రహ్మసూత్ర భాష్యాన్ని నేరుగా విని తరించిన భాగ్యశాలిగా శోభనభట్టు ఆనందంతో పరవశించి పోయారు. సత్యతీర్థులు బ్రహ్మసూత్ర భాష్యానికి ప్రథమలేఖకులైతే, శోభనభట్టులు ప్రథమ శ్రోతలయ్యారు.

## మధ్వశాస్త్ర వైభవం

**మ**ధ్వ సిద్ధాంతం తామరపువ్వుల్లోని మధువులాంటిది. రాజహంసలు ఆ మధువుని పానం చేశాక మరొక రకం పుష్పాల వంక చూస్తాయా?

శోభనభట్టు మధ్వసిద్ధాంత మాధుర్యాన్ని, మానవ జీవితానికి మధ్వ సిద్ధాంత ప్రయోజనాన్ని ఆకళింపు చేసుకున్నారు. పరవశించారు. ఈ ఆనందాన్ని జిజ్ఞాసువులైన ప్రజలందరికీ పంచాలనుకొన్నారు... మధ్వాచార్యుల దగ్గర దీక్ష స్వీకరించి, ఆయన ఆదేశం మేరకు మధ్వసిద్ధాంత ప్రచారయాత్ర ప్రారంభించారు.

శోభనభట్టు మహావిద్వాంసుడు కావటంవల్ల ఎక్కడ విద్వత్ సభలకి వెళ్లినా ఆయనకి ప్రవేశం సులభంగా లభిస్తోంది. అలాంటి ప్రతి సభలోనూ ఆయన మధ్వసిద్ధాంతాన్ని ప్రతిపాదించడం ప్రారంభించారు. ఆ సిద్ధాంతాన్ని ఆమోదించలేని వారు వేసే ప్రశ్నలకు ఆయన ఇచ్చే వివరణ ఆకాశ జలపాతంలా ఉండేది. సంతృప్తి చెందిన విద్వాంసులంతా ఆయన బోధనలకు శ్రోతలుగా మారిపోయేవారు. ఉద్దేశపూర్వకంగా వ్యతిరేకించే వారికి వారు – సమాధానం చెప్పలేనంత క్లిష్టప్రశ్నలు వేసి నిష్క్రమింపచేసేవారు.

నిజానికి మధ్వసిద్ధాంతం అపురూపమైన దక్షిణావృత శంఖం లాంటిది. ఈ శంఖం సున్నపుబట్టీ వాడికి దొరికితే సున్నపు పొడి చేయాలని ప్రయత్నిస్తాడు. అది పగలకపోతే నిరుపయోగం అనుకొని అవతల పారేస్తాడు. అదిగో అలాగే, మధ్వసిద్ధాంతం విలువ తెలీనివాళ్లు "నిరర్థకం" అని వదిలేసేవారు.

కాస్తో కూస్తో దక్షిణావృత శంఖం విలువ తెలిసిన వాడు దాన్ని డబ్బున్నవాడికి అమ్మి సొమ్ము చేసుకుంటాడు.

అలాగే శోభనభట్టుల ద్వారా మధ్వసిద్ధాంత సారాన్ని గ్రహించినవాళ్లు ఉపన్యాసాలు చెప్పి సొమ్ము చేసుకునేవారు. వాళ్లకి లౌకిక ప్రయోజనం సిద్ధించినా, పరలోకసిద్ధి లభించదు.

అదే, దక్షిణావృతశంఖం విలువ తెలిసిన ఒక మహారాజు చేతిలో ఆ శంఖం పడితే ఏం చేస్తారు? పూజాగృహంలో వుంచుకొని, భక్తిశ్రద్ధలతో పూజిస్తారు. తద్వారా సకల సంపదలని, భగవదనుగ్రహాన్ని పొందుతారు. ఇలా ఆ శంఖం విలువ తెలిసినవాళ్లు దాన్ని తమ ఆధ్యాత్మిక శక్తి పెంచుకోటానికి ఉపయోగించుకుంటారు.

...ఇటువంటి అనేక ఉపమానాలతో నిండిన భాషణా చాతుర్యంతో శోభనభట్టులు మధ్వసిద్ధాంతాన్ని విద్వాంసులలో ప్రచారం చేస్తూ వచ్చారు. మధ్వ భాష్యానికి ప్రథమ శ్రోతా ఆయనే, ప్రథమ ప్రసారకులూ ఆయనే. భగవదనుగ్రహానికి ఆయన పాత్రుడయ్యాడు. మధ్వాచార్యుల ద్వారా సన్న్యాసదీక్ష స్వీకరించారు. మధ్వాచార్యుల చేత 'పద్మనాభ తీర్థులు' అని పిలువబడ్డారు.

ఆ రోజునుంచి ఆయన పేరు పద్మనాభతీర్థులే. తరువాతకాలంలో ఈయన మధ్వాచార్యుల వారి బ్రహ్మసూత్రాల భాష్యానికి 'సత్తర్కదీపావళీ' అనే టీకా సమకూర్చటం ద్వారా 'ప్రథమ మాధ్వటీకాకారులు' గా ప్రచారంలోకి వచ్చారు.

**తిరిగి ఉడుపికి**

పూర్ణప్రజ్ఞులు గోదావరీ తీరంనుంచి మళ్లీ ఉడుపికి ప్రయాణమయ్యారు. దారిలో జిజ్ఞాసువులు ఎదురైన చోటల్లా తమ సిద్ధాంత ప్రసారకార్యం సాగిస్తూనే వచ్చారు.

తెరిచిన మనస్సుతో వారి బోధలు విన్న వాళ్లంతా మధ్వసిద్ధాంతం పట్ల ఆకర్షితులవుతున్నారు. వారి మహిమలలోని ఆధ్యాత్మిక శక్తికి అబ్బురపడుతున్నారు. నలుగురితో తమ విస్మయానందాల్ని పంచుకుంటున్నారు... ఎటొచ్చీ తమకు తెలిసింది మాత్రమే 'సత్యం' అన్న అహంకారంతో విర్రవీగుతున్న పండితులు మాత్రం మధ్వసిద్ధాంతాన్ని వమ్ము చేయలేకపోయినప్పటికీ, దాన్ని అంగీకరించలేకపోతున్నారు. క్రమంగా మధ్వసిద్ధాంతం తెలుగు ప్రాంతమంతా కూడా విస్తరించింది.

మధ్వాచార్యులు ఉడుపికి చేరుకున్నారు.

శిష్యుణ్ణి చూడగానే అచ్యుతప్రేక్షులకు పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్లయింది. ఆయన ఆనందానికి అవధుల్లేవు.

తన శిష్యుడు బ్రహ్మసూత్రాలకు భాష్యం రాశాడు అన్న భావన ఆయన్ని మరింత ఆనందసాగరంలో ముంచేసింది.

బ్రహ్మసూత్రాలకు వారు రాసిన భాష్య ప్రతి వారి గురువైన అచ్యుతప్రేక్షులకు, ఇతర జ్యేష్ఠయతులకు లభించింది. ఏ భాష్యం రాయవలసిందిగా తాను పూర్ణప్రజ్ఞుణ్ణి కోరివున్నాడో ఆ భాష్యం చేతికి లభించేసరికి అచ్యుతప్రేక్షులు ఉబ్బితబ్బిబ్బయ్యారు.

ఆ భాష్యాన్ని ఆసాంతం చదివారు. ఆనందపరవశులయ్యారు.

అయినప్పటికీ ఆయనకు కొన్ని సందేహాలుండిపోయాయి. తన ప్రియశిష్యుడు బ్రహ్మసూత్రాలకు రాసిన భాష్యం గతంలో తాను అభ్యసించిన భాష్యానికి భిన్నంగా ఉంది. అనేక అంశాల విషయంలో తన శిష్యుడి ఆధ్యాత్మిక అధ్యయన శక్తి ఆమోదయోగ్యంగా ఉన్నప్పటికీ కొన్ని అంశాల విషయాల్లో సందేహాలుండిపోయాయి. పూర్ణప్రజ్ఞుల్ని అడిగి ఈ సందేహాలకు సమాధానం తెలుసుకోవాలని అచ్యుతప్రేక్షులు ఆరాటపడ్డారు.

ఒక శుభముహూర్తాన పూర్ణప్రజ్ఞులతో అచ్యుతప్రేక్షులు సమావేశమయ్యారు. బ్రహ్మసూత్రాల భాష్యం విషయంలో తనకు కలిగిన సందేహాల్ని ఒక్కొక్కటిగా మధ్వాచార్యుని ఎదుట పెట్టారు. మధ్వాచార్యులు అత్యంత ఓర్పుతో వాటన్నింటికీ సమాధానాలిచ్చారు. "ఇంకా అడగండి గురుదేవా!" అంటూ గురువునే కొసరి కొసరి అడిగించుకొని మరీ సందేహ నివృత్తి చేసిన అసాధారణ ఆధ్యాత్మిక శక్తి పూర్ణప్రజ్ఞులు.

అంతే!

అచ్యుతప్రేక్షకులు ఆనాటినుంచి పూర్తిగా మధ్వసిద్ధాంత ప్రసారకులయిపోయారు.

ఆశ్రమంలోని జ్యేష్ఠయతులంతా ఆ భాష్యం చదివి పరవశించిపోయారు. ఆనాటినుంచి ఆ భాష్యామృతాన్ని మాత్రమే వారు తమ శిష్యులకు పంచడం ప్రారంభించారు.

**అణు భాష్య రచన**

ఇక అచ్యుతప్రేక్షులైతే మధ్వాచార్యులు రచించిన బ్రహ్మసూత్ర భాష్యాన్ని చదివినకొద్దీ భక్తి సాగరంలో మునిగిపోతున్నారు.

క్రమంగా ఈ బ్రహ్మసూత్ర భాష్యం పఠనం అచ్యుతప్రేక్షులకు నిత్యపారాయణ గ్రంథం అయిపోయింది. వందసార్లు గాయత్రి జపం చేస్తే వచ్చే ఫలం ఒక్కసారి బ్రహ్మసూత్రాల ప్రత్యక్ష పారాయణంతో సమానం. నిజానికి గాయత్రి మంత్రం సకల వేదాల పారాయణ ఫలం. అందుకే జిజ్ఞాసువులు గాయత్రి మంత్రాన్ని అనునిత్యం జపిస్తారు. అంతకుమించింది బ్రహ్మసూత్ర భాష్య పఠనం. అలాంటి భాష్యం ద్వారా బ్రహ్మసూత్రాలను పఠించటం ముముక్షువులకు – మోక్షానికి నిచ్చెన వంటిది. అందుకే ఈ భాష్యపారాయణ

అచ్యుతప్రేక్షులకు నిత్యవిధి అయిపోయింది. బ్రహ్మసూత్రాలను ఈ భాష్యం సహితంగా పారాయణ చేస్తేనేగాని ఆహారం స్వీకరించనంతటి నిష్ఠని అచ్యుతప్రేక్షులు పాటిస్తున్నారు.

ఒకసారి – ఏకాదశినాడు ఉపవాసం చేశారు. మర్నాడు సూర్యోదయ సమయంలో ద్వాదశి ఘడియల్లో ఉపవాసాన్ని విరమించి ఆహారం తీసుకోవాల్సి ఉంది. కాని బ్రహ్మసూత్ర భాష్యపారాయణ చేయకుండా, ఉపవాసాన్ని విరమించే అవకాశం లేదు. పోనీ బ్రహ్మసూత్ర భాష్యం పూర్తిగా పారాయణ చేశాకే ఉపవాసదీక్ష విరమిద్దామా అంటే, వ్యవధి సరిపోవట్లేదు. సమయం తక్కువ. ద్వాదశి ఘడియలు వెళ్లిపోతాయి. ఏకాదశీ ఉపవాస ఫలం దక్కదు.

అదొక ధర్మసంకటం!

నిష్ఠాగరిష్ఠులైన వాళ్లందరికీ సహజంగా ఎదురయ్యే ధర్మసంకటాల్లో ఇదొకటి. ఏం చేయాలి?

గురువుల సంకటస్థితిని మధ్వాచార్యులు అర్థం చేసుకున్నారు. "గురుదేవా, చింతించకండి. ఈ బ్రహ్మసూత్ర భాష్యాన్ని మరొక చిన్నగ్రంథంలో కూడా ఇమిడేలా నేను రచిస్తాను" అన్నారు. అలాగే చేసి ఇచ్చారు.. అంతే! అప్పట్నుంచి అచ్యుతప్రేక్షులకు అదే నిత్యపారాయణ గ్రంథం అయిపోయింది. అదే తరువాతి కాలంలో 'సంగ్రహభాష్యం' అనీ, 'సంక్షేపభాష్యం' అనీ అనుభాష్యమనీ ప్రసిద్ధి చెందింది.

ఇలా సంక్షేపంగా విస్తారంగా రాయటమనేది వేదవ్యాసుల శైలి. అందుకే మధ్వాచార్యులను 'అభినవ వేదవ్యాసులు' అంటారు.

## ఆచారపరమయిన గ్రంథాలు

కొన్ని గ్రంథాలలో ఆచారం గురించి ఉంటే జ్ఞానం గురించి ఉండదు. జ్ఞానం గురించివుంటే ఆచారం గురించి ఉండదు. ఈ రెండూ లేని శాస్త్రాలు చాలావున్నాయి. కాని ఈ రెండూ ఒక పక్షికి రెండు రెక్కల వంటివి. ఏ ఒక్క రెక్క లేకపోయినా పక్షి ఎగరగలదా! అలాగే ఆధ్యాత్మిక సాధనకు ఈ రెండూ అవసరం. రెండూ కలిపి సాధన చేస్తేనే ఆధ్యాత్మిక దర్శనం జరుగుతుంది.

శ్రుతి స్మృతి రచన ద్వారా ఆధ్యాత్మిక సాధనకు మార్గదర్శనం చేస్తూనే, పరిశుద్ధమైన ఆచార వ్యవహారాల గురించి తెలియజెప్పే ఒక ఆచార సంహితను కూడా మధ్వాచార్యులు రచించారు. ఈ ఆచారాలు బాహ్యము, ఆంతరంగికము అని రెండు రకాలు. మానసిక పరిశుద్ధత అంతరంగ ఆచారం అయితే, ఊర్ధ్వపుండ్ర, ధారణ, తప్తముద్రధారణ మొదలయినవి బాహ్య ఆచారాలు.

వైష్ణవదీక్షకు ఇది అత్యంత ముఖ్యమైన విధి అనిపించుకున్నది. మధ్వసిద్ధాంత సాధకుడైన ప్రతి వ్యక్తికీ నుదుటిమీద ఊర్ధ్వపుండ్రధారణ నిత్యవిధి. భుజాలమీద తప్తముద్రలను ముద్రించుకొనటం వార్షికవిధి. ప్రతి ఆషాఢ శుద్ధ ఏకాదశి నాడు గానీ, అది తప్పితే భాద్రపదశుద్ధ ఏకాదశినాడు, లేదా కార్తీక శుద్ధ ఏకాదశి నాడు ఈ తప్తముద్రలను ధరించాలి. తప్తముద్రలను ధరించిన క్షణంనుంచే దీక్ష ప్రారంభమయినట్లు. నామకరణం, బాలాది సంస్కారం కార్యక్రమాలలో కూడా తప్తముద్రధారణను ఒక ప్రధాన అంగంగా నిర్దేశించారు.

ఇదే సమయంలో దైనందిన సదాచారాలను గురించి వివరించే 'సదాచార స్మృతి' అనే గ్రంథాన్ని రచించారు. నాలుగు ఆశ్రమాలకు – అంటే, బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసాశ్రమాలను ఆచరించాల్సిన విధులను ఈ స్మృతిలో సమగ్రంగా వివరించారు.

ఇవేకాక, యతులు ఆచరించాల్సిన దీక్షావిధులను, వారి నిత్యపూజా, సాధన విధులను వివరిస్తూ యతి 'ప్రణవకల్పం' అనే రచనను, 'సన్న్యాస పద్ధతి' అనే రచనను మధ్వాచార్యులు అందించారు.

ఈ మూడు కృతులు వైష్ణవుల సదాచారాలను స్పష్టీకరించే కృతులు.

## ద్వాదశ స్తోత్రం

**మా**నవజన్మ ఒక్కటి మాత్రమే మోక్షాన్ని సాధించడానికి అవకాశమిచ్చింది. అసలు తత్త్వజ్ఞానాన్ని సంపాదించడమన్నది మానవజన్మలో మాత్రమే సాధ్యం కూడా. కాని ఆ తత్త్వజ్ఞానం ఎలా వస్తుంది?

ఈ జ్ఞానాన్ని సంపాదించాలంటే, ఉత్తమ శాస్త్రాలుండాలి, ఉత్తమ గురువులుండాలి, ఆ గురువులు బోధించినప్పుడు విని తెలుసుకోవాలి. వాటిని విని తెలుసుకొనేందుకు సహకరించే ఆరోగ్యముండాలి, గురువుల్ని గౌరవించే స్థోమత ఉండాలి... ఇలా అనేక సదుపాయాలు ఉంటే తప్ప తత్త్వజ్ఞానాన్ని సాధించడం సాధ్యపడదు. ఇది అందరికీ లభ్యమయ్యే అదృష్టం కాదు కదా!

ఇలాంటి వసతులతో నిమిత్తం లేకుండా ప్రతి మనిషీ సులువుగా తత్త్వజ్ఞానాన్ని ఆర్జించేలా ఎలా చేయాలి – అని మధ్వాచార్యులు తపించారు. ఆ తపనలోంచి ఆయనకొక పరిష్కారం లభించింది. అదే ద్వాదశస్తోత్ర రచన.

## శ్రీకృష్ణ విగ్రహప్రాప్తి

ఒకరోజు వేకువజామునే లేచి సముద్రతీరానికి వెళ్లి, సముద్ర స్నానం చేసి ప్రాతఃసంధ్యాదికాలు ముగించుకొని ఆ తీరంలోనే కూర్చొని ద్వాదశస్తోత్ర రచనను మధ్వాచార్యులు ప్రారంభించారు.

ఒక అకుంఠిత దీక్షతో ద్వాదశస్తోత్ర రచన సాగుతోంది. ఆ రోజు ఒక పర్వదినం అవటంవల్ల అనేకమంది ప్రజలు కూడా వచ్చి మధ్వాచార్యులతోపాటు సముద్రస్నానం చేశారు. ప్రశాంతమైన ప్రాతఃకాలం, భక్తి ప్రపత్తులు ప్రసరించటానికి అనువైన సమయం.

అలాంటి నేపథ్యంలో మధ్వాచార్యులు నిరాటంకంగా ద్వాదశస్తోత్రంలోని ఐదు అధ్యాయాల రచన పూర్తి చేశారు. ఆరో అధ్యాయం ప్రారంభం కాబోతోంది. అంతలో...

సముద్రంలో ద్వారకనుంచి సరుకులు తీసుకువస్తున్న ఒక నావ మధ్వాచార్యులు కూర్చున్న తీరం వెంబడి వెళ్తూండగా, అకస్మాత్తుగా విపరీతంగా ఈదురుగాలులు వీచడం మొదలయ్యింది. ఆ ఈదురుగాలులకు తోడు పెను కెరటాలు ఎగిరెగిరి పడుతున్నాయి. దాంతో నావ అటూఇటూ ఊగిపోసాగింది. నావని సురక్షితంగా తీరానికి చేర్చాలని నావికులు చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. క్రమంగా నావలోకి నీళ్లు చేరటం ఆరంభమయ్యింది. ఏ క్షణాన్నయినా నావ మునిగిపోతుందేమో అన్న భయాందోళనలు ఆ నావికులందరినీ చుట్టుముట్టాయి. భయం, బెంగ, ఆందోళనలలో మునిగిపోయిన ఆ నావలోని వ్యాపారి చిట్టచివరిసారిగా తనను కాపాడేవారు ఎవరన్నా ఉన్నారా అనుకుంటూ ఆ తీరంకేసి చూసి ప్రార్థన చేశాడు.

అప్పుడే అతనికి తీరంలో ఎత్తైన ప్రదేశంలో కూర్చొని రాసుకుంటున్న ఒక మహా తేజస్వి దర్శనమైంది. ఆయనే మధ్వాచార్యులు. ఆయన ముఖవర్చస్సును దూరం నుంచి చూస్తూనే ఆ వ్యాపారిలో ఆశ జనించింది. ఒక్కసారిగా రెండు చేతులూ ఎత్తి గట్టిగా కేక వేస్తూ అభ్యర్థించాడు. 'రక్షించండి మహాప్రభో! రక్షించండి!'.

ద్వాదశస్తోత్ర రచనలో లీనమైపోయినప్పటికీ మధ్వాచార్యుల చెవులను తాకింది ఆ ప్రార్థన. అప్రయత్నంగా అటుకేసి తల తిప్పారు. జాలి పడ్డారు. వెంటనే తన కండువాని నావకేసి విసిరినట్టు గాలిలోకి విసిరి వెనక్కి తీసుకున్నారు.

అంతే! ఆ క్షణం వరకు సముద్రంలోకి మునిగిపోతుందా అన్నట్లుగా ఊగిపోయిన నావ ఒక్కసారిగా స్తబ్ధతకు వచ్చింది. ఎవరో తాళ్లు పట్టి లాగినట్టుగా ఆ నావ ఆ తీరం

కేసి తోసుకొచ్చింది. నావలోని నావికులందరూ సురక్షితంగా ఒడ్డుకు చేరారు. ఆ నావని నడిపిస్తున్న వ్యాపారి వడివడిగా మధ్వాచార్యుల్ని సమీపించి సాష్టాంగనమస్కారం చేశాడు. రకరకాలుగా స్తుతించాడు.

"స్వామి, నా వద్ద ఉన్నటువంటి అమూల్యమైన వస్తువును ఏదైనా మీకు సమర్పించుకోవాలని కోరికగా ఉంది. ఏమిమ్మంటారో సెలవీయండి"

మధ్వాచార్యులు చిరునవ్వు నవ్వి చివరికి అతని కోరికని మన్నించారు. "అయితే నువ్వు నాకు ఇవ్వాలనుకుంటున్న బహుమతిగా నీ నావలో ఉన్న రెండు గోపీచందనం గడ్డలు ఈయగలవా?" అని అడిగారు. వ్యాపారి ఆశ్చర్యపోయాడు. గోపీచందనం అనేది ద్వారకలో ఎక్కడపడితే అక్కడ దొరికే మట్టి. పడవలో సరుకుల్ని దించేటప్పుడు, ఎక్కించేటప్పుడు బరువు సమతూకం తప్పిపోకుండా గోపీచందనం గడ్డల సాయంతో నౌకలో అటూఇటూ బరువును నియంత్రిస్తుంటారు. అలాంటి గోపీచందనం గడ్డల్ని స్వామీజి కోరటం ఆ వ్యాపారికి సుతరామూ నచ్చలేదు. అతనెంత ప్రార్థించినా మధ్వాచార్యులు ఆ గోపీచందనానికి మించిన బహుమతిని దేన్నీ కోరలేదు.

చివరికి ఆ వ్యాపారి గోపీచందన గడ్డలు మధ్వాచార్యులకి సమర్పిస్తూ "వీటి విశేషమేంటో నాకు కూడా సెలవీయండి స్వామీ!" అని అడిగాడు. మధ్వాచార్యులు చిరునవ్వు నవ్వుతూ, "ఆ గడ్డలను నువ్వే చూడు" అంటూ నీళ్లతో కరిగించారు.

అద్భుతం!

ఒక గడ్డనుంచి బలరాముల విగ్రహం బయటపడింది. బలరామ విగ్రహ ప్రతిష్ఠ అక్కడే జరిగింది. అది ఇప్పటి వడబండేశ్వర దేవాలయం. మరో గడ్డలోంచి శ్రీకృష్ణుని విగ్రహం బయటపడింది. అక్కడ ఉన్న ప్రజలంతా సంభ్రమాశ్చర్యాల్లో మునిగిపోయారు. శ్రీకృష్ణ విగ్రహ దర్శనంతోనే ఆనందోత్సాహంతో శ్రీ మధ్వాచార్యులు ద్వాదశస్తోత్రంలోని 6వ అధ్యాయం దశావతారాన్ని వర్ణించారు. అక్కడ్నుంచి మధ్వాచార్యులు శ్రీకృష్ణుల విగ్రహం తీసుకుని స్తోత్రపఠనం చేస్తూ ఉడుపికి ప్రయాణమయ్యారు. శ్రీకృష్ణ ప్రాప్తి తరువాత ద్వాదశస్తోత్రాన్ని పరిసమాప్తి చేశారు. అందుకే ద్వాదశస్తోత్రం అత్యంత పవిత్రమైంది. అపూర్వమైన సిద్ధి కలిగింది. అమృతరూప మైనటువంటి శ్రీకృష్ణుడి ఆగమనానికి కారణమైంది కనుక అది 'విషహారస్తోత్రం'గా కూడా ప్రసిద్ధి చెందింది.

పండితుల విశ్లేషణ ప్రకారం శ్రీకృష్ణ విగ్రహ ప్రాప్తి ఘటన అంతా ఒక ఆధ్యాత్మిక పరిణామం. ఆ నావికుడు సంసార సముద్రంలో మునిగితేలుతున్న మానవజీవనానికి

సంకేతం. అతను కూర్చున్న నావ ఆ సంసారసాగరంలో తేలుతున్న శరీరం. అతన్ని అంటిపెట్టుకునుండే విషయ సుఖాలే ఈదురుగాలులు. వాటినుంచి విముక్తిపొంది సంసార సాగరాన్ని దాటడానికి అతనికి స్వశక్తి సరిపోదు, అందుకే సహాయం కోసం అన్వేషిస్తాడు. ఆ సమయంలో తీరంలో కూర్చున్న మధ్వులు ఈ సంసారసాగరమనే అపాయానికి అతీతమైన వాయుదేవుడ్ని ప్రార్థించారు. ఆ అభయహస్త ముద్రే అతని నావ. అతన్ని సరకులతో పాటు సురక్షితంగా ఒడ్డుకు చేర్చింది. ఆ నావలో ఉన్న సరుకులు అతని సాధనానికి సంకేతం. అతను నావలో పెట్టుకున్న గోపీచందనం గడ్డలు కర్మసిద్ధి కోసం వైష్ణవులు తప్పక ధరించాల్సిన ఊర్ధ్వపుండ్ర కారక సంకేతాలు. వాటివల్లనే అతడు మధ్వానుగ్రహ ప్రాప్తిని పొందగలిగాడు. వాయుదేవుడికి అత్యంత ప్రియమైంది భక్తుల వైష్ణవ దీక్షయే. అదే గోపీచందనం గడ్డలో శ్రీకృష్ణ విగ్రహ రూపంలో మధ్వాచార్యులకి దర్శనమిచ్చింది.

**'విష్ణుభక్తిర్హి సర్వేషాం సద్గుణాం స్వలక్షణమ్'**

కథా లక్షణము శ్లో-9

## శ్రీకృష్ణుని విగ్రహ రహస్యం

వాస్తవానికి జరిగిందేమిటి?

శ్రీకృష్ణుని విగ్రహం నావలో వస్తోందని మధ్వాచార్యుల దివ్యదృష్టికి తోచింది. దాన్ని ఆహ్వానించడానికే ఆయన ద్వాదశస్తోత్రాన్ని రచిస్తూ, సముద్రం వైపుగా వెళ్లారు.

ఆ శ్రీకృష్ణ విగ్రహం సామాన్యమైంది కాదు. ఒకసారి దేవకీదేవి శ్రీకృష్ణున్ని ప్రార్థించిందట, "కృష్ణా! చిన్నప్పుడు నీ లీలలు చూసే భాగ్యం యశోదకు కలిగినట్టుగా నాకు కలగలేదు. వాటి గురించి వినివినీ ఎప్పటికైనా చూడాలని నా మనస్సు ఉవ్విళ్లూరుతోంది. చూపించవా కృష్ణా!".

కృష్ణుడు అనుగ్రహించాడు.

మరుక్షణంలో తాను శైశవదశలో కృష్ణుడుగా మారిపోయాడు.

ఆ శిశువు తప్పటడుగులు వేస్తూ నడిచాడు.

దేవకీదేవి తొడమీద కూర్చున్నాడు.

ఆమె స్థన్యంలో పాలు తాగాడు.

కేరింతలు కొట్టాడు.

వెన్నకుండ పగలగొట్టి వెన్న తిన్నాడు.

వంటినిండా రాసుకున్నాడు.

పాము, తాడు పట్టుకుని మజ్జిగ చిలికినట్టు నృత్యం చేశాడు...

ఆ చేష్టలన్నీ చూసి దేవకీదేవి పరవశించిపోయింది.

ఇదంతా గమనించిన రుక్మిణికి తన పతిదేవుడి శైశవరూపాన్ని ప్రపంచమంతా చూసి తరించాలని అనిపించింది. వెంటనే విశ్వకర్మను పిలిపించి, శైశవకృష్ణుని విగ్రహం తయారుచేయించింది. ముందుగా తానే సకల వైభవాలతో ఆ విగ్రహాన్ని పూజించింది. తరువాతి కాలంలో కృష్ణావతారం ముగిశాక ద్వారక సముద్రంలో మునిగిపోయేముందు అర్జునుడు ఆ విగ్రహాన్ని తీసుకువెళ్లి రుక్మిణివనంలో స్థాపించాడు.

కాలక్రమంలో అది నేలలోని గోపీచందనం గడ్డల్లో కూరుకుపోయి ప్రపంచానికి కనిపించకుండా పోయింది. అయితే నావికులు తమ నావల్లో సమతూకాన్ని పాటించడం కోసం గోపీచందనం గడ్డల్ని మోసుకెళ్లే అలవాటు ప్రకారం కృష్ణవిగ్రహం ఉన్న గోపీచందనం గడ్డల్ని కూడా నావలోకి చేర్చారు. వాటి విలువ తెలియకుండానే ఆ గడ్డలను తీసుకెళ్లే భాగ్యం ఆ వ్యాపారికి లభించింది. వాటినే మధ్వాచార్యులకి అర్పించి కృతార్థుడయ్యాడు.

దేవశిల్పి అయిన విశ్వకర్మ చేత తయారుచేయబడి, రుక్మిణీదేవి చేతులమీదుగా అర్చించబడి ఉండటంవల్ల అది అత్యంత విశిష్టమైన విగ్రహంగా గుర్తింపు పొందింది. తిరిగి మధ్వాచార్యుల చేతులమీదుగా ఆ విగ్రహం ఉడుపిలో ప్రతిష్ఠింపబడింది.

అలాంటి నేపథ్యంలో ద్వాదశస్తోత్రం రచించబడటంవల్ల స్తోత్రవాఙ్మయంలో ఈ ద్వాదశస్తోత్రానికి అపూర్వమైన స్థానం లభించింది. సంస్కృత వాఙ్మయంలో విష్ణు సహస్రనామం తరువాత అంతటి అర్థవైభవంతో నిండిన కృతి ద్వాదశస్తోత్రం మాత్రమే.

## శ్రీ కృష్ణ విగ్రహ ప్రతిష్ఠాపన

మధ్వాచార్యులు శ్రీకృష్ణుని ప్రతిమను తమ శిష్యులచేత మధ్వసరోవరంలో కడిగించారు. తరువాత స్వయంగా తానే అభిషేకించారు.

అప్పుడు అనూహ్యంగా ఏం జరిగిందంటే...

మధ్వాచార్యులు అభిషేకించటానికి ముందు నలుగురు శిష్యులు సునాయాసంగా ఎత్తిన ఆ కృష్ణుని విగ్రహాన్ని మధ్వాచార్యులు అభిషేకించిన తరువాత 30 మంది కలిసినా ఎత్తడం సాధ్యంకాలేదు! మధ్వాచార్యుల స్పర్శతో ఆ విగ్రహంలో శ్రీకృష్ణుని దివ్యశక్తి పరిపూర్ణంగా ఉండిపోయింది.

ఒక శిల భగవంతుడి పీఠంమీద ప్రతిష్ఠింపబడాలంటే, అనేక లక్షణాలు కావాలి. శిల దొరికే స్థలం, శిలయొక్క లక్షణం, శిలనుంచి వచ్చే నాదం, శిలను తీసుకొచ్చే క్రమం, ప్రతిష్ఠ చేసే ముహూర్తం, పాల్గొనే ఋత్విక్కులు, పఠించే మంత్రాలు, ప్రతిష్ఠాపన తిథి, ప్రతిష్ఠాపనాక్రమం, ముఖ్యంగా ప్రతిష్ఠాపకుని సిద్ధి మొదలైనవి. ఇన్ని లక్షణాల సమన్వితమైన కారణంగా ఉడుపిలో మధ్వాచార్యులు చేసిన శ్రీకృష్ణుని విగ్రహప్రతిష్ఠ లోకోత్తరంగా నిలిచిపోయింది.



ఉడుపి శ్రీకృష్ణుడు

మంత్ర తంత్ర విధులన్నీ క్షుణ్ణంగా తెలిసినవ్యక్తి కావటం వల్ల మధ్వాచార్యులు అత్యంత శాస్త్రోక్తంగా శ్రీకృష్ణ విగ్రహాన్ని విళంబి నామ సంవత్సర మాఘ శుక్ల తదియనాడు (క్రీ.శ. 1238) ఉడుపిలో ప్రతిష్ఠింపచేశారు. ఆ నాటి నుంచి ఉడుపి ప్రాంతపు యాజ్ఞికులందరూ పూర్ణప్రజ్ఞులు అవలంబించిన విధానాల్నే అనుసరించడానికి అలవాటు పడ్డారు.

## యజ్ఞ వైభవం

ఉడుపిలో శ్రీకృష్ణ ప్రతిష్ఠాపన చేశాక, మధ్వాచార్యులు ఒక విశిష్టమైన యాగాన్ని తలపెట్టారు.

లోకకళ్యానికి యజ్ఞసిద్ధి అత్యంత పావనమయిన సాధనం కదా!

కాని మధ్వాచార్యులు తలపెట్టిన యజ్ఞ నిర్వహణ తీరుని ప్రశ్నించే వాళ్ళు తయారయ్యారు. మరడిత్తాయ అనే ఛాందసవాది తన శిష్యబృందంతో కలిసివచ్చి, ఈ యజ్ఞ నిర్వహణ తీరుతెన్నుల్ని ఖండించటం ప్రారంభించాడు. యజ్ఞ యాగాదుల నిర్వహణలో తనకు తెలిసిందే శాస్త్రం అన్న భ్రమ అతనిది. ఇప్పుడు యజ్ఞం సజావుగా సాగాలంటే అతని ఆటంకాన్ని తొలగించుకోవడం అత్యవసరం.

మరడిత్తాయ బృందానికి యజ్ఞయాగాదుల నిర్వహణలో విధివిధానాలు తమకే తెలుసుననీ, ఈ విషయంలో తమకున్నంత జ్ఞానంగానీ, పరిజ్ఞానంగానీ మధ్వాచార్యుల వారికి లేదనీ అపారమైన విశ్వాసం.

ఇది సహజమైన విషయమే. సాధారణంగా వేదాలను అధ్యయనం చేసినవారికి వేదాంగాల పరిజ్ఞానం ఉండదు. వేదాలను పనసల వారీగా వల్లెవేసే వారందరికీ వాటి అర్థం తెలియకపోవచ్చు. తాము అత్యంత నిష్ఠాగరిష్ఠులమని చెప్పుకునే వైదికులకు సయితం బ్రహ్మసూత్రాల వంటి నిర్ణాయకశాస్త్ర గ్రంథాల పరిచయం వుండకపోవచ్చు. ఒకవేళ ఇలాంటి గ్రంథ పరిజ్ఞానం పుష్కలంగా ఉన్నా, అలాంటి వాళ్లకి ఆచారాలు తెలిసుండక పోవచ్చు, తెలిసినా పాటిస్తూ ఉండకపోవచ్చు. వేదాలు చదివి అర్థం చేసుకోగలిగిన వాళ్లకి ఇతిహాస పురాణాల మీద ఆసక్తి ఉండకపోవచ్చు. ఒకవేళ వాటిని బాగా చదివి జీర్ణం చేసుకుని ఉన్నా అటువంటి వాళ్లకి వేద వాఙ్మయం మీద ఆసక్తి ఉండదు. యజ్ఞయాగాల్లో ఆసక్తిలేని వైదికులు కొందరు. ఆసక్తి వున్నా, శాస్త్రజ్ఞానం, శబ్దజ్ఞానంలేని వాళ్లు కొందరు. సాధారణంగా యాజ్ఞికులు అనిపించుకొన్న వారికి ఏకదేశ జ్ఞానమే తప్ప తంత్రశాస్త్రజ్ఞానం అసలుండకపోవచ్చు.

కాని మధ్వాచార్యులు ఇందుకు పూర్తిగా భిన్నమైన విశిష్టమైన జ్ఞానాన్ని సముపార్జించారు. వేదాల్లో, వేదాంగాల్లో ఇతిహాస పురాణాల్లో, వ్యాకరణ మీమాంసల్లో, కావ్యాల్లో, మంత్రతంత్రాలలో, యజ్ఞయాగాల నిర్వహణలో... ఇలా అన్ని రకాల జ్ఞానశక్తి మూర్తీభవించిన సకలశాస్త్ర కోవిదుడైన మధ్వాచార్యులకు మరడిత్తాయ బృందాన్ని నిరోధించడం కష్టంకాలేదు.

మరడిత్తాయ లేవనెత్తిన అన్ని ఆక్షేపణలకు ఆయన సమాధానమిచ్చి, అతన్ని మారు మాట్లాడనీయకుండా చేశారు. మరడిత్తాయ బృందంలోని పండితులందర్నీ చర్చలలో జయించి, తాను చేపట్టిన యజ్ఞకార్యానికి అడ్డంకి తొలగించుకున్నారు.

అంతే! యజ్ఞకార్యం నిర్విఘ్నంగా సాగిపోయింది.

మధ్వాచార్యులు అంతటి అసాధారణ ప్రజ్ఞావంతులు కనుకనే వారిని "నచమధ్వసమో గురుః" అని ప్రాజ్ఞులు గౌరవించారు.

ఆ యజ్ఞానికి యజమానిగా వ్యవహరించి దీక్ష తీసుకున్నది గురుపుత్రులైన వాసుదేవాచార్యులు. అతనికి పుట్టుకతో వచ్చిన తలనొప్పిని శాశ్వతంగా నిర్మూలించి, అతనికి పూర్వ జన్మస్మృతి కలిగేలా ఒకప్పుడు అనుగ్రహించిన మధ్వాచార్యులు ఇప్పుడు తాను చేసిన యజ్ఞానికి అతడినే యజమానిని చేయడం ఎంతటి విశిష్టమైన విషయం!

ఆ యజ్ఞానికి హోతృ (కర్త) స్థానాన్ని అలంకరించిన వారు స్వయంగా మధ్వాచార్యులే. దాంతో ఆ యజ్ఞానికి అపూర్వవైభవం చేకూరింది. యాజ్య, అనుయాజ్య, ప్రవర్గ్యవిభవ, అభీష్టన మొదలైన ఉచ్చారణలతో ఆయన ఆ మాతృస్థాన స్థాయిని మహోన్నతంగా మలిచారు.

యజ్ఞం యొక్క ప్రయోజనం సిద్ధించటమనేది ఆ యజ్ఞాన్ని చేసిన యజమాని, కర్త (పురోహితుడు) ఎంతటి ఆత్మశుద్ధితో అచంచలమైన దీక్షతో చేశారూ అన్నదాన్ని బట్టి ఉంటుంది. ఇప్పుడు చేసింది మధ్వాచార్యులు. ఎంత అద్భుతంగా, నియమ నిష్ఠలతో ఎంత విజయవంతంగా చేశారంటే –

ఒకసారి దేవతలు వేగంలో అందరికన్నా శ్రేష్ఠుడయినవాడే సోమపానాన్ని సేవించటానికి అర్హుడైన దేవత అని పరీక్ష పెట్టారు. అప్పుడు మూడుసార్లు వాయుదేవుడు ఇతర దేవతలను జయించి, సోమపాన అర్హతని సాధించాడు. అందుకే ఆయన్ని 'ప్రథమ సోమపానార్హ దేవత' అంటారు. ఆ వాయుదేవుడే ఇప్పుడు మధ్వాచార్యులు అని శిష్యులందరికీ దృష్టాంతాలతో నిర్ధారణ అయింది. అందుకే ఈ యజ్ఞం అత్యంత విజయవంతంగా శరవేగంతో సాగిపోయింది.

## తంత్రసార సంగ్రహం

శ్రీకృష్ణుని ప్రతిష్ఠ సమయంలో మరడిత్తాయ ఆక్షేపణలకు ప్రధానంగా అవకాశమిచ్చిందల్లా తంత్రశాస్త్రాన్ని స్పష్టంగా విడమర్చి చెప్పే గ్రంథం లేకపోవటమే కదా!

ఈ ఆలోచన మధ్వాచార్యులను వెంటాడింది. మానవ జీవితానికి ఆధ్యాత్మిక చింతన ఎంత అవసరమో, ఆచార వ్యవహారాలు కూడా అంతే అవసరం. ఇవి రెండూ ఒక పక్షికి రెండు రెక్కల వంటివి. ఏ రెక్క లేకపోయినా పక్షి జీవితం నిరర్థకమే కదా!

ఆధ్యాత్మిక చింతనకి సంబంధించి అప్పటికే తాను బ్రహ్మసూత్ర భాష్యాన్ని రచించటం జరిగింది. ఎటొచ్చీ తంత్రశాస్త్ర స్వరూపాన్ని వివరించే రచన జరగలేదు. నిజానికి 'తంత్రసారం' అనేది విష్ణురూపంలో భగవంతుడు ప్రపంచానికి అందించినదే. కాని గ్రంథరూపంలో అందుబాటులో లేకుండాపోయింది. అందువల్ల అవైదిక అభ్యాసాలే ఆధ్యాత్మసిద్ధి అని ప్రజలు భ్రమపడే పరిస్థితి నెలకొంది. ఈ పరిస్థితి నుంచి సమాజాన్ని కాపాడాలి – అని మధ్వాచార్యులు తీర్మానించుకున్నారు.

అలా తీర్మానించుకున్న మరుక్షణంలోనే తంత్రశాస్త్ర విశ్వరూపావిష్కరణకు ఒక మహోన్నత కృతి రచన ఆరంభించారు.

ఇది ఒక అద్భుతమైన రచన. భారతీయ సంస్కృతిలో అపురూపమైన నిధిగా చెప్పదగిన రచన ఇది.

అష్ట మహామంత్రాలు,

వాటిని జపించే విధి విధానాలు,

దేవతార్చన విధానం,

ఇతర పూజాభ్యాసాలు,

హోమ హవన మాహాత్మ్యం,

ప్రతిమ నిర్మాణం,

దేవాలయ నిర్మాణం,

విగ్రహ ప్రతిష్ఠ నిర్మాణం,

జీర్ణోద్ధారణ,

సంప్రోక్షణ,

తత్త్వన్యాసం,

మాతృకాన్యాసం... మొదలైన తంత్రశాస్త్రంలోని అన్ని ఆచార వ్యవహారాలని ఈ గ్రంథంలో ఆవిష్కరించారు.

అద్భుతం!

తంత్రశాస్త్ర గ్రంథాలన్నింటిలోకి ఈనాటికీ తలమానికంగా భాసిస్తున్నది ఈ 'తంత్రసార సంగ్రహం'.

**మళ్లీ బదరికి**

ఉడుపిలో శ్రీకృష్ణ ప్రతిష్ఠ మధ్వాచార్యుల చేతులమీదుగా జరగటం దైవనిర్ణయం. దైవాంశ సంభూతులకు తప్ప – ఎవరికైనా అలా సాధ్యపడుతుందా?

ద్వారక నుండి ఆ విగ్రహం ఆగమనం, ఉడుపిలో ఆ ప్రతిష్ఠ... ఊహ కాదు, పురాణం కాదు. చరిత్ర.

ఆ విగ్రహ ప్రతిష్ఠతో ఇనుమడించిన పూర్ణప్రజ్ఞుల ఆధ్యాత్మిక శక్తి తంత్రశాస్త్ర రచన విశ్వరూపం'కి దారి తీసింది. ఇక్కడితో మధ్వుల ఆధ్యాత్మిక జీవనక్రమంలో ఒక కీలక దశ గడిచింది.

ఒకప్పుడు ఏ బదరిలోనైతే వేదవ్యాసుల - శ్రీనారాయణుల ఆశీస్సులతో తాను బ్రహ్మసూత్ర భాష్యరచనకు ఉపక్రమించారో, తిరిగి ఆ బదరికే వెళ్లి శ్రీమన్నారాయణుడికి తాను పూర్తిచేసిన బ్రహ్మసూత్ర భాష్య రచనను సమర్పించుకోవాలని మధ్వులు సంకల్పించారు.

యాత్రకి అంతా సిద్ధమైంది.

పూర్ణప్రజ్ఞులు మళ్లీ బదరికి వెళ్తున్నారన్న వార్త శిష్యులందరికీ తెలిసిపోయింది. ఏర్పాట్లన్నీ చకచకా జరిగిపోయాయి.

యాత్రకి బయల్దేరేముందు - మధ్వులు తమ దివ్యశక్తితో భవిష్యద్దర్శనం చేశారు.

దాని ఫలితమే నలుగురు బాలబ్రహ్మచారుల చేత సన్న్యాస దీక్ష స్వీకరింపచేయడం.

ఒక శుభ ముహూర్తంలో - హృషీకేశ తీర్థులు, నరసింహతీర్థులు, జనార్దన తీర్థులు, ఉపేంద్ర తీర్థులు అన్న పేర్లతో నలుగురు బాల బ్రహ్మచారులు మధ్వుల ఆశీస్సులతో సన్న్యాసదీక్ష స్వీకరించారు. మధ్వుల వెంట బదరి యాత్రలో వాళ్లు కూడా పాల్గొన్నారు. మరోసారి సత్యతీర్థులు కూడా మధ్వుల వెంట వెళ్లారు. ఈ సన్న్యాసదీక్షకి ముందు మధ్వులకు జరిగిన భవిష్యద్దర్శనం ఎలాంటిదో లోకానికి తెలియటానికి కొన్ని సంవత్సరాలు పట్టింది... ఈ నలుగురు బాల సన్న్యాసులే తరువాత కాలంలో నాలుగు మధ్వపీఠాలకు - పలిమారు, అడమారు, కృష్ణాపురం, పుత్తిగ - ప్రథమ పీఠాధిపతులుగా శోభించారు.

## ఈశ్వరదేవుడి అనుభవం

మధ్వులు బదరియాత్ర ప్రారంభించిన తొలి రోజుల్లో ఒక విచిత్రమైన సంఘటన జరిగింది.

ఎంత దూరమైనా కాలి నడకనే ఆ యతులు యాత్ర సాగిస్తున్నారు. ఒక రాజ్యం దాటి మరొక రాజ్యం, అది దాటి మరొక రాజ్యం... అలా యాత్ర సాగుతూనే వుంది.

అంతలో...

అదొక రాజ్యం. దానికి రాజు ఈశ్వరదేవ. మహా పిసినారి. ప్రజలకోసం మంచిపనులు చేశానన్న కీర్తి కావాలి. కాని ఖజానాలోంచి ఒక్క నాణెం కూడా బైటకు

రాకూడదు. ఈ లోభిత్వం కొద్దీ అతను చేసే ప్రతి పనికీ ప్రజల శ్రమని ఉచితంగా దోచుకోవాలనుకునేవాడు. తన రాజ్యంలో పౌరులైతే ఎదురు తిరగొచ్చు. పైగా తనకి కీర్తి రావలసింది వాళ్ల దగ్గరే కదా! అందుకని తన రాజ్యంలో గుండా ప్రయాణించే పరదేశీయుల చేత ఈ చాకిరీ చేయించేవాడు.

అలా ఒక పెద్ద చెరువు తవ్విస్తున్నాడు. ప్రజల కోసమే. కాని చాకిరీ మాత్రం పరదేశీయులది. ఆ రాజ్యంలోంచి పయనించే పరదేశీయులు ఒక రోజంతా ఆ చెరువు తవ్వే పని చేస్తే గాని రాజ్యాన్ని దాటడానికి లేదు. అదే దారిలోంచి మధ్వులు తమ శిష్యులతో వెళ్తుంటే – రాజభటులు అడ్డగించారు. నిబంధనల ప్రకారం ఒక రోజంతా చెరువు తవ్వేపని చేయాల్సిందేనన్నారు.

శిష్యులు ఆ రాజభటులకు వివరించారు. "యతులు నీళ్లు చేదరు, గోతులు తవ్వరు, వంట చేయరు, ఆఖరికి పువ్వులు కూడా కోయరు. ఎందుకంటే క్రిమికీటకాలకు కూడా మావల్ల ప్రాణహాని జరక్కూడదన్నది మా నియమం..."

కాని రాజభటులు వదల్లేరు. రాజు గారికి కబురు వెళ్లింది. ఆయన స్వయంగా వచ్చి యతులైనా, దేవతలైనా తమ రాజ్యంలోంచి వెళ్ళే ఎవరైనా సరే చెరువు తవ్వి తీరాల్సిందేనన్నారు.

మధ్వులు చిరునవ్వు నవ్వారు. ఈశ్వర దేవుని కళ్లల్లోకి సూటిగా చూస్తూ చెప్పారు. "రాజా! మేం గతంలో ఎప్పుడూ ఇలాంటి పని చేసి వుండలేదు. నీవే ఒక్కసారి ఆ పని చేసి మాకు చూపించు. మేం కూడా ప్రయత్నిస్తాం..."

"ఓస్, ఇంతేనా! అయితే చూడు" అంటూ ఈశ్వరదేవుడు గోతిలోకి దిగాడు. గునపంతో తవ్వాడు. పారతో మట్టితీసి గట్టుమీద పోశాడు.

మళ్లీ తవ్వాడు, మట్టిబైట పోశాడు.

మళ్లీ తవ్వాడు, మళ్లీ మట్టిని... అలా పోయటం మొదలు పెట్టినవాడు తల ఎత్తకుండా చేస్తూనే ఉండిపోయాడు. రాజభటులు చేష్టలుడిగి చూస్తూండిపోయారు.

మధ్వుల శిష్యులకు అర్థమైపోయింది. గురువులు 'వశిత్వం' అనే యోగసిద్ధిని ప్రయోగించారు. ఎన్నో సిద్ధశక్తుల్ని తనలో ఇముడ్చుకున్న దైవశక్తి గురువుది. ఆ రాజులో వున్న రాక్షస ప్రవృత్తిని నిర్మూలించడం కోసం గురువు సిద్ధశక్తిని ప్రయోగించారు.

మధ్వుల బృందం తమ యాత్రని యథాతథంగా కొనసాగించారు.

## గంగానది మీద నడక

మధ్వుల బృందం గంగానదిని చేరుకుంది. గంగ నిండుగా ప్రవహిస్తోంది.

గంగ ఎప్పుడూ అంతే. వర్షాకాలంలో అనేక ఉపనదుల్లోంచి వచ్చి చేరే నీటితో నిండుగా ప్రవహిస్తుంది. వేసవిలో హిమాలయాల్లో కరిగిన మంచు గంగలో ప్రవహిస్తుంది. అలా ఏడాది పొడవునా ఆ ప్రవాహం నిరంతరంగా సాగుతూనే ఉంటుంది. అందుకే 'గంగా ప్రవాహం' అనే పద ప్రయోగం అనేక ఉపమానాలలో వాడుతుంటాం.

మధ్వుల బృందం గంగాతీరం చేరేసరికి పడవలున్నాయి. కాని అవి నడవటంలేదు. శత్రుభయంతో అవతలి ప్రాంతపు సుల్తాన్ గంగానదిలో పడవలు నడపటం ఆపేయమన్నాడు. మరి గంగను దాటేదెలా?

శిష్యులు పడవల మీద దాటగల ప్రత్యామ్నాయాలన్నీ విచారించి, విఫలమయ్యాక గురువు గారికి పరిస్థితిని వివరించారు.

మధ్వులు చిరునవ్వు నవ్వారు.

"బెంగపడవద్దు. పడవలు లేనంత మాత్రాన మన బదరి యాత్ర ఆగిపోదు. రండి" అంటూ ముందుకు దారితీశారు. గురువు ఆదేశం మేరకు శిష్యులు ఆయన వెనకే ఆయన అడుగుల్లో అడుగులు వేస్తూ వరుసగా నడవటం మొదలుపెట్టారు.

మధ్వులు నీటి అంచుకి చేరగానే తన వెనకే ఉన్న మొదటి శిష్యుడి చెయ్యి పట్టుకున్నారు. ఆ శిష్యుడు తన వెనుకవున్న సహ శిష్యుడి చెయ్యి పుట్టకున్నాడు... అలా అందరూ గొలుసు కట్టులా చేతులు పట్టుకున్నాక, మధ్వులు గంగా జలాల మీద తొలి అడుగు వేశారు... మలి అడుగువేశారు.

అద్భుతం : పరమాద్భుతం!

ఆ అడుగు నీళ్లల్లో దిగలేదు. నేల మీద వేసినట్లే నీటిమీద నిలబడింది.

అంతే!

మధ్వులు తన పదచలనాన్ని ఆపలేదు. అలాగే ఆయన చేయి పట్టుకుని ఒకళ్ల వెనకాల ఒకరుగా నడుస్తున్న శిష్యబృందం కూడా అతి సునాయాసంగా గంగా జలాల మీద నేలమీదే నడిచినంత సునాయాసంగా నడిచేస్తున్నారు.

శిష్యులకి అర్థమైపోయింది. గురువు తన జలస్తంభన సిద్ధి ప్రభావంతో గంగాజలం మీద నడుస్తున్నారు, నడిపిస్తున్నారు. వాళ్లకి గురువులో దాగివున్న భీమసేనుడు స్ఫురించాడు.

కురుక్షేత్ర సంగ్రామం చివరలో జలస్తంభనసిద్ధితో కొలనులో అట్టడుగున్న దాక్కున్న దుర్యోధనుణ్ణి బయటకు ఈడ్చి అతని తొడలు పగలగొట్టిన భీమసేనుడే కదా ఈ మధ్వులు!

మధ్వులు, ఆయన శిష్యులు అతి సునాయాసంగా గంగానదిని దాటేశారు.

కాని, మరో సమస్య ఎదురైంది. మధ్వుల బృందం తీరం చేరకముందే ఒడ్డునున్న సుల్తాన్ సైనికులు వీళ్లని శత్రువులుగా అనుమానిస్తూ, "కొట్టండి, చంపండి" అంటూ కేకలు వేస్తూ గంగా ప్రవాహంవేపుకి పరుగెత్తుకు రాసాగారు.

మధ్వులు ఆ సైనికుల తొందరపాటుని గ్రహించారు. "మూర్ఖులారా! మమ్మల్ని కొట్టాలని నీళ్లల్లో దూకితే చచ్చిపోతార్రా రాకండి. అయినా, మేం వస్తున్నదే మీ రాజుని చూడాలని. ఎందుకురా మామీద కత్తులు దూస్తారు" అంటూ హెచ్చరించారు.

అలా హెచ్చరించి ఉండకపోతే వాళ్లంతా ఆ గంగా ప్రవాహంలో దూకి ఏమైపోయివుండేవారో!

ఆ హెచ్చరికతో సైనికులు ఆగిపోయారు. మధ్వుల బృందం తీరం చేరేదాకా అలా ఉండిపోయారు. తీరం చేరాక కూడా మధ్వులు సుల్తాన్ ఉండే కోట కేసి నడుస్తుంటే సైనికులంతా మంత్ర ముగ్ధులై ఆయన వెనకాలే వినయంగా నడక సాగించారు.

కోట దరిదాపుల్లోకి వెళ్లేసరికి ఈ విచిత్రదృశ్యాన్ని కోట బురుజు మీంచి చూస్తున్న యవనరాజు సంభ్రమానికి గురయ్యాడు.

"ఏమిటిదీ! గంగానదిలో నేను పడవలు నిలిపివేయించాను గదా! వీళ్లు నదిని ఎలా దాటారూ? నదిని ఎవరు దాటొచ్చినా చావగొట్టి చెవులు మూసే నా సైనికులు అంత వినయంగా ఎలా మారిపోయారు?... అసలు ఎవరువీళ్లు? ఎక్కడ్నుంచి ఎక్కడికి వెళ్తున్నారు?..."

సుల్తాన్ వెంటనే కోట దిగి వచ్చి తనకు కలిగిన సందేహాలన్నింటినీ మధ్వుల ముందు కుమ్మరించాడు.

**యవన భాషలోనే జవాబు**

మధ్వులు ఆకాశంలో ప్రకాశిస్తున్న సూర్యుణ్ణి చూపించారు.

"రాజా! సమస్త విశ్వాన్ని నడిపించేది ఆ భగవానుడు. ఆయనే మా సిద్ధికి మూలం. అతని అనుగ్రహంతో మేము ఏదైనా సాధించగలిగిన శక్తివంతులమై ఉంటాం... ఇప్పుడు

మా పయనం ఉత్తర దిక్కుకి..." అంటూ ఆ యవనరాజుకి యవన భాషలోనే సమాధానమిచ్చారు.

ఆశ్చర్యం!

ఎంత సునాయాసంగా యవనభాషలో ఆ రాజుకి జవాబిచ్చారు. తమ గురువు సర్వశాస్త్ర పారంగతులు మాత్రమే కాదని సర్వభాషా ప్రవీణులు కూడా అని శిష్యులు ఆనంద పరవశులయ్యారు.

మధ్వులు నిర్భయంగా, సూటిగా, ధాటిగా ఇచ్చిన సమాధానంతో సుల్తాన్ నిరుత్తరుడయ్యాడు. క్రమంగా అతని మనస్సులో "ఈయన సామాన్యమానవుడు కాదు. ఏదో దైవశక్తి ఈయన్ని ఆవహించివుంది" అన్న భావం మొలకెత్తసాగింది.

ఉత్సుకత ఆపుకోలేక మళ్లీ మధ్వుల్ని అడిగాడు. "నొసటి మీద మీరు ధరించిందేమిటి?"

అతడు అడిగింది ఆ యతుల నుదుటిమీద గల అక్షత (మధ్వతిలకం) గురించి. మధ్వులు చిరునవ్వుతో, "మీ చేతిలో వున్న గదయే మా నుదుటిమీద ఉన్నది" అన్నారు. అంటే! ఈ అంగార అక్షతలు శత్రువినాశనానికి శస్త్రాల లాగా పనిచేస్తాయని ఆ యవనరాజుకి స్పష్టంచేశారు.

శిష్యులకు రావణసభ తలుపుకొస్తోంది. సీతను వెతుకుతూ వెళ్లిన పవన తనయుడైన హనుమంతుణ్ణి రావణుడి సైనికులు బంధించబోయారు. బ్రహ్మాస్త్రం పట్ల గౌరవంతో సైనికుల వెంట రావణ సభలో అడుగుపెట్టాడు. హనుమంతుడు తాను ఒక్కడే అయివుండికూడా అక్కడ, రావణ మహారాజు వేసే ప్రశ్నలకు ఎంత నిర్భయంగా, నిక్కచ్చిగా జవాబులిచ్చాడు? ఆ వాయుదేవుడే ఈ మధ్వులు కాకుంటే అంతటి ధైర్యసాహసాలు ప్రదర్శించగలరా?

కొద్దిపాటి సంభాషణతోనే యవనరాజు మధ్వులపట్ల ఆకర్షితుడయ్యాడు. అతని మనసులో మొలకెత్తిన ఆరాధనా బీజం చెట్టుగా ఎదిగిపోయింది. మధ్వులకు ప్రణమిల్లాడు.

"స్వామీ, పూజ్యులయిన మీవంటి వారు మా రాజ్యంలో ఉండటం, మాకు శ్రేయస్కరం. ఇక్కడే వుండిపొండి. మీకు మా రాజ్యంలో సగభాగాన్ని సమర్పించుకొంటాం..."

ఎంతలో ఎంత మార్పు!

మధ్వులు అంగీకరించలేదు. యవనరాజు ఎంతగా ప్రాధేయపడినా ఆయన సున్నితంగా త్రోసిపుచ్చారు. శిష్యులతో మధ్వయాత్ర బదరిదిశగా కొనసాగింది.

## బందిపోట్ల దాడి

గంగానది దాటారు. చంబల్‌లోయ దాటాలి.

చంబల్ లోయ దట్టమైన అడవులతో నిండి వుంటుంది. బందిపోట్లకి కొదవలేదు. కాని కాలి నడకన వెళ్లాలంటే చంబల్ లోయ దాటాల్సిందే.

అకస్మాత్తుగా మధ్వుల బృందాన్ని బందిపోట్లు చుట్టుముట్టారు. శిష్యులు గురువు కేసి చూశారు. ఆయన చిరునవ్వుతోనే వారికి ధైర్యం చెప్పారు. తమ భుజం మీద వస్త్రాన్ని ఒక మూట లాగా చేసి తిప్పటం మొదలుపెట్టారు. బందిపోట్లకి ఆ మూటలో అపారసంపత్తి ఏదో ఉందన్న భ్రమని కల్పించారు. అక్కడ్నుంచి "ఆ మూట నాది" అంటే "కాదు నాది" అంటూ బందిపోట్లు తమలో తాము వాగ్యుద్ధానికి దిగారు. క్షణాల్లో ఆ వాగ్యుద్ధం వాళ్లల్లో వాళ్లే ముష్టి ఘాతాలతో కొట్టుకునే దాకా వెళ్లింది.

నిశ్శబ్దంగా మధ్వులు, శిష్యులు అక్కడ్నుంచి నిష్క్రమించారు.

ఈ సంఘటనలో శిష్యులు తమ గురువు వద్ద మరో నిగూఢశక్తిని కన్గొన్నారు. వస్త్రాన్ని ఒక మూటగా చేసి అదేదో సంపదమూటగా బందిపోట్లని భ్రమింపచేసిన శక్తి తమ గురువులది. ఇదొక సంకల్పశక్తి సిద్ధి.

నిజానికి పూర్ణప్రజ్ఞులు చిన్నతనంలో తండ్రికి అప్పిచ్చిన ధనికునికి చింతపిక్కలిచ్చి నప్పుడే, ఆ ధనికుడికి అవి నాణాలుగా కనుపించాయి గదా! అంటే ఈ శక్తి ఇప్పుడు కొత్తగా వచ్చింది కాదు!

## దొంగల పలాయానం

మరోసారి మరో అడవిలో దొంగలముఠా చుట్టుముట్టింది. వాళ్ల చేతుల్లో విల్లంబులున్నాయి. బాకులున్నాయి. చాలా క్రూరంగా కనుపిస్తున్నారు. వీళ్ల మీద పడి చంపి దోచుకోవటమే వాళ్ల లక్ష్యం.

వాళ్లని చూస్తూనే పూర్ణప్రజ్ఞులు తమ శిష్యుల నుద్దేశించి ఇలా అన్నారు:

"మీలో ధైర్యం, సాహసం వున్న వాళ్లు ముందుకు రండి..."

ఒక శిష్యుడు ముందుకు వచ్చాడు. అతడే ఉపేంద్ర తీర్థులు.

"వెళ్లు. ముందుకి ఉరికి వాళ్లని రెచ్చగొట్టు. వాళ్లు నీతో యుద్ధానికి దిగేలా చెయ్యి..." అని ఆదేశించారు. ఆదేశిస్తూనే క్షణకాలంపాటు కళ్లు మూసుకున్నారు. ఉపేంద్రతీర్థులు

మరి ఆలోచించలేదు. దొంగలు చాలామంది, తానొక్కడే ఏం చేయగలడు?... అలాంటి సందేహం అతనికి కలగలేదు. గురువు ఆశీర్వాదం తీసుకొని ఒక్కసారిగా దొంగల నాయకుడి మీదకి ఉరికాడు.

కాలసర్పమే మీదకి ఉరికినట్లు ఆ దొంగల నాయకుడికి ఒళ్లు జలదరించింది. రెండే రెండు ఘాతాలతో వాడి నడ్డి విరిచి, వాడి చేతుల్లో ఆయుధాలు లాక్కున్నాడు ఉపేంద్రతీర్థులు. ఆ నాయకుడు కుప్ప కూలిపోయాడు. అంతే! ఆ ఒక్క సంఘటనతో నిర్ఘాంతపోయిన మిగతా దొంగలు క్షణాల్లో కాలికి బుద్ధి చెప్పారు.

ఒక్క రక్తపు బొట్టు కూడా చిందకుండా దొంగల్ని తరిమికొట్టారు ఉపేంద్రతీర్థులు.

## చోరుల్లో పరివర్తనం

**మరో**సారి మరో కీకారణ్యంలోంచి వెళ్తున్నప్పుడు గుంపులు గుంపులుగా వున్న దొంగల కంటపడింది మధ్వులబృందం. దొంగలు నాలుగువైపుల నుంచి తరుముకొచ్చారు - "కొట్టండి, చంపండి" అని కేకలు వేస్తూ.

తీరా దగ్గరకొచ్చాక చూస్తే మధ్వులబృందంలో సభ్యులంతా బండరాళ్లల్లా కనుపించారు.

"అరె, వీళ్లు మనుషులు కాదురా, రాళ్లు," అని నవ్వుకుంటూ వెళ్లిపోయారు. అయినా అనుమానం తీరక కొంతదూరం వెళ్లి వెనక్కి తిరిగిచూశారు. అప్పుడు మాత్రం ఈ బృందంలో అందరూ మనుషులే కనుపించారు.

"అరేయ్, వీళ్లు మనుషులేరా, రండి రండి" అంటూ పరుగెత్తుకొచ్చారు. తీరా దగ్గరకొచ్చాక చూస్తే మళ్లీ బండరాళ్లే కనుపించాయి.

...ఇలా భ్రమించడం, దూరంనుంచి చూసి మళ్లీ పరుగెత్తుకు రావటం మళ్లీ మళ్లీ మళ్లీ జరిగింది. క్రమంగా ఆ దొంగలందరికీ అర్థమైంది. 'వీళ్లు సామాన్య మానవులు కాదు. ఎవరో అసాధారణ స్వాములు!' అంతే! వాళ్లకి సాష్టాంగ నమస్కారం చేశారు.

"స్వామీ! మీరే మా పాలిట దైవం. మాకు మంచి మాటలు బోధించి తరింపచేయండి" అని ప్రార్థించారు.

శరణు పొందిన వారిని ఆదరించడం పూర్ణప్రజ్ఞుని ఔన్నత్యం. అనుగ్రహించారు. ఆ దొంగలంతా ఆయన అనుగ్రహంతో, ఆశీస్సులతో పరివర్తన చెందారు. ధార్మిక జీవనానికి శ్రీకారం చుట్టారు.

## సత్యతీర్థులు - పులి

మధ్వాచార్యుల బృందం అలాగే ప్రయాణిస్తూ హిమాలయ పర్వత శ్రేణులను చేరింది. ఆ పర్వతశ్రేణుల్లోనే పవిత్ర బదరి క్షేత్రముంది. ఆ పర్వతాల వాలుల్లో సాగిపోతున్న ఆ గురుశిష్యుల బృందాన్ని అకస్మాత్తుగా ఒక పులి చూసింది.

ఒక్కసారిగా గాండ్రించింది.

పూర్ణప్రజ్ఞులబృందానికి ముందు గురువుల దేవతార్చన పెట్టెను పట్టుకుని సారథిలా నడుస్తున్న సత్యతీర్థులను ఆ పులి లక్ష్యంగా చేసుకుంది. సత్యతీర్థులు మధ్వాచార్యుల శిష్యాగ్ర గణ్యుల్లో ఒకరు. తమ గురువు రచించిన బ్రహ్మసూత్ర భాష్యానికి మొదటి ప్రతిని తయారుచేసిన పుణ్యశాలి. అలాంటి సత్యతీర్థుల మీద ఆ పులి ఒక రాక్షసుడి మాదిరిగా విజృంభించింది. (రాక్షసుడే ఆ రూపంలో వచ్చాడా!)

కొద్ది అడుగుల దూరంలో వస్తున్న పూర్ణప్రజ్ఞులు ఈ పులి సత్యతీర్థుల మీదకి దూకటాన్ని గమనించారు. ఒక్క ఉదుటున రెండంగలు ముందుకురికి తన శిష్యుడి మీదకి లంఘించిన ఆ పులి నెత్తిన తన అరచేతితో ఒక్కసారిగా చాచి ఒక దెబ్బ కొట్టారు. అంతే! ఆ ఒక్క దెబ్బకి రాక్షసపులి కుప్ప కూలిపోయింది.

వెనకనుంచి ఈ సంఘటన చూస్తూ సంభ్రమాశ్చర్యాలకి గురయిన శిష్యులకి ఆ క్షణంలో – మహాభాగవతంలో జడభరతుని చంపడానికి వెళ్లిన వృషలరాజు భద్రకాళి చేతిలో చావు దెబ్బ తిన్న సన్నివేశం గుర్తుకొచ్చింది. అసాధారణమైన సమయస్ఫూర్తినీ, గురినీ, సాహసాన్నీ వాళ్లు తమ గురువులో దర్శించారు. వాళ్లకి తమ గురువులు జగత్‌గురువులైన ప్రాణదేవులనీ, వారిని ఆశ్రయించినవారు ఎప్పటికీ సురక్షితులేననీ మరోసారి నిర్ధారణ అయింది.

## బ్రహ్మసూత్ర భాష్యం సమర్పణం

బదరి క్షేత్రం ప్రారంభంలో బదరీనారాయణ దేవస్థానానికి బయట ఉన్న అనంతమఠంలోనే ఈ సారి కూడా మధ్వాచార్యులు బస చేశారు. తగిన విశ్రాంతి తీసుకున్నాక శిష్యబృందాన్నంతా అక్కడే ఉండమని చెప్పి తాను మాత్రం బ్రహ్మసూత్ర భాష్య కృతులను తీసుకొని గతంలో లాగానే అత్యంత దుర్గమమైన దారిలో ఉత్తర బదరికి ప్రయాణమయ్యారు.



శ్రీ వ్యాసనారాయణులతో శ్రీ మధ్వాచార్య

ముందుగా శ్రీ వ్యాసనారాయణులను దర్శించారు. "స్వామి, మీ ఆదేశం మేరకు నేను రచించిన బ్రహ్మసూత్ర భాష్యం ఇదే" అంటూ దానిని వ్యాసనారాయణులకు సమర్పించారు. అంటే గతంలో దక్షిణ బదరిలో తమ మొదటి రచన అయిన గీతాభాష్యాన్ని శ్రీమన్నారాయణునికి సమర్పించిన మధ్వాచార్యులు ఇప్పుడు తమ బ్రహ్మసూత్ర భాష్యాన్ని ఉత్తరబదరిలో వ్యాసనారాయణులకి సమర్పించారు.

## 'వ్యాస ముష్టిల' ప్రాప్తి

వ్యాసనారాయణులు సంతృప్తితో పూర్ణప్రజ్ఞులను ఆశీర్వదించి తత్త్వోపదేశం చేశారు. ఈ ఉపదేశంతో లోకోద్ధారణ చేయవలసిందిగా ఆదేశించారు.

"కాని స్వామీ, ఇక్కడ ఈ పవిత్ర గంగానదినీ, గంగాజనకులైన మిమ్మల్నీ వదలి వెళ్లడానికి నాకు మనసు రావటంలేదు" అని మధ్వులు విన్నవించారు.

"ఆ సమస్య నీ కెన్నటికీ రాదు. ఈ క్షణం నుంచీ నీవు స్నానం చేసే ప్రతి జలంలోనూ గంగ ఉంటుంది... అని, చేతిలో యిసుక తీసుకొని, గట్టిగా గుప్పిలి బిగించి గుండ్రటి రాళ్లగా చేసి, ఈ ముష్టిరాళ్లలో రమాసమేతునిగా నేను నిత్యం నీతోనే ఉంటాను" అంటూ ఎనిమిది శిలలను అందజేశారు. వాటినే వ్యాసముష్టి అంటారు. ఇప్పటికీ ఈ వ్యాసముష్టిలను ఉత్తరాది మఠంలో పూజా సమయంలో చూడవచ్చు.

## మహాభారత తాత్పర్య నిర్ణయం

వ్యాసాశ్రమం నుంచి మధ్వులు బయలుదేరబోయేముందు శ్రీ వ్యాసనారాయణులు వాత్సల్యంతో బృహత్తర బాధ్యతను అప్పగించారు. అదే వేదాలను అధ్యయనం చేయలేని జిజ్ఞాసువులకు సహితం జ్ఞానం, ముక్తి లభించడానికి వీలుగా మహాభారతాన్ని సరళమైన భాషలో సమగ్రంగా రచించే బాధ్యత.

“మేము రచించిన మహాభారతంలో కౌరవులను చంపి రాజసూయ యాగంలో నా అగ్రపూజకు కారణమైన భీమసేనుడే నీవు. నా వలెనే మహాభారతాన్ని సంపూర్ణంగా చూసినవాడవు నీవు. కనుక నా మనోభావాలన్నీ నీకు తెలుసు. నా కృతులు కూడా నీకే బాగా అర్థమవుతాయి. అందుకే సమస్త ప్రజల ఉద్ధరణకు కారణమయ్యేలా ముక్తికి సోపానమయ్యేలా మహాభారత తాత్పర్యనిర్ణయాన్ని నీవు చేయాలి. ఈ కలియుగంలోనే మిథ్యాజ్ఞానం వలన అలముకుంటున్న అంధకారాన్ని నాశనం చేసే బాధ్యత నీదే” అంటూ శ్రీ వ్యాసనారాయణులను ఆదేశించారు.

(ఆ తరువాతి కాలంలో శ్రీ మధ్వులు రచించిన మహాభారత తాత్పర్య నిర్ణయం వారి కృతులన్నిటిలోకి అత్యంత విస్తారమైందిగా ప్రముఖమైందిగా ప్రాచుర్యం పొందింది. నాటినుంచి మధ్వులు ‘శ్రీ అభినవ వేదవ్యాసులు’ అయ్యారు.)

## హృషీకేశంలో వందనం

వ్యాస నారాయణుల ఆశీస్సులందుకుని పూర్ణప్రజ్ఞులు దక్షిణబదరికి వచ్చారు. చాలా రోజుల తరువాత తాము ఎదురుచూస్తున్న గురువుల దర్శనంతో శిష్యులు ఆనంద పారవశ్యులయ్యారు. వారి ఉత్సుకత తీరేలా వ్యాసనారాయణుల దర్శనం, సంభాషణ, ఆదేశాలను శిష్యులకు వివరించారు మధ్వులు.

బదరి నుంచి తిరిగి వెళ్తూ దారిలో హృషీకేశంలో మధ్వాచార్యుల బృందం విడిది చేసింది.

అక్కడ హృషీకేశుడి రూపంలో వెలసిన శ్రీమహావిష్ణువు ఆలయం ఉంది. ‘భరత’ అన్న పేరుతో ఆ ఆలయం ప్రసిద్ధి చెందింది. ‘భరత’ ఆలయం అనగానే అపార్థం చేసుకొనే ప్రమాదం ఉంది. పద్మ పురాణంలోని శ్లోకాలలో ఇచ్చిన వివరణ ప్రకారం – భగవంతుడైన హృషీకేశమూర్తి జగత్తునంతా భరించేవాడు కావటం వలన ఆ ఆలయానికి ‘భరత’ అనే పేరు వచ్చింది. భారత ఉపఖండంలో గల ఒకే ఒక్క హృషీకేశ ఆలయం ఇది.

హృషీకేశంలో ఒక రోజు మధ్వాచార్యుల ప్రవచనం నడుస్తోంది. మధ్యలో ఉండగా ఒక గుర్తు తెలియని బ్రాహ్మణుడు వచ్చి, మధ్వాచార్యులకు ప్రమాణం చేసి, తన దగ్గర భిక్ష స్వీకరించాలని కోరాడు. మధ్వులు అంగీకరించారు.

అంతే! క్షణాల్లో ఆ విప్రుడు అదృశ్యమయ్యాడు. అందరికీ ఆశ్చర్యం! మధ్వులు మందహాసం చేసి చెప్పారు: "ఆ వచ్చింది రుద్రదేవుడు."

కొద్ది సేపటికి మరొక బ్రాహ్మణుడు వచ్చి మధ్వాచార్యులకు పాదాభివందనం చేసి అర్థించాడు.

"స్వామీ, మిమ్మల్ని మా ఇంటికి భిక్షకు ఆహ్వానించవలసిందిగా, నా గురువులు ఆదేశించారు. మీరు దయతో మా భిక్ష స్వీకరించాలి..."

ఆ సభలో వున్న వాళ్లందరికీ స్పష్టమైపోయింది. గురువుల పట్ల వాళ్ల విశ్వాసం, భక్తి ఇనుమడించాయి. రుద్రదేవుడికిచ్చిన మాట ప్రకారం ఆ విప్రుని భిక్షను పూర్ణప్రజ్ఞులు స్వీకరించారు.

## మరోసారి గంగను దాటడం

తిరిగి గురుశిష్య బృందం దక్షిణభారతదేశంలోని ఉడుపికి ప్రయాణమైంది. మళ్లీ గంగ దాటాలి. అప్పుడు కూడా శత్రువుల భయం చేత పడవలు నడవడం లేదు. హిమాలయాలు దిగి కీకారణ్యాలు దాటి గంగానది దగ్గరికి వచ్చేసరికి సూర్యాస్తమయ సమయమయింది. ఇప్పుడెలా? వెనకాలా కీకారణ్యం! ముందా పడవలు లేని గంగానది! ముందుకీ పోలేం, వెనక్కి పోలేం... అని శిష్యులు సందిగ్ధంలో పడ్డారు. గతంలో తమ గురువులో తాము ఒక వాయుదేవుణ్ణీ, ఒక హనుమంతుణ్ణీ, ఒక భీమసేనుణ్ణీ చూసిన సంగతి వారు మర్చిపోయారు.

వాళ్లు ఆ మీమాంసలో ఉండగానే మధ్వులు చకచకా గంగ మీద నడచి వెళ్లిపోయారు. మరోసారి గురువుల జలస్తంభన శక్తిని శిష్యులు సంభ్రమంతో తిలకించారు. వాళ్లు అలా చూస్తుండగానే ఆయన గంగమీద నడిచి వెళ్తూ వెళ్తూ కనుమరుగయ్యారు.

క్షణాల్లో గంగానదిపై గురువు ఉనికి కనబడకుండా పోవటం శిష్యుల్ని దుఃఖంలో ముంచేసింది. కానీ... మధ్వాచార్యులు అతి సునాయాసంగా గంగను దాటి అవతలి తీరం చేరుకున్నారు. అలా గంగమీద నడచి వస్తున్న మధ్వాచార్యుల్ని చూసి – ఆ తీరంలో పండితులతోనూ, ప్రజలతోనూ విడిది చేసి ఉన్న రాజు అవాక్కయ్యాడు. వాళ్ల కళ్లను

వాళ్లు నమ్మలేకపోయారు. కాని రాజుకర్థమైంది- ఈయనెవరో ఒక మహానుభావుడు, ఒక అద్భుతవ్యక్తి, ఒక దైవికశక్తి. వెంటనే రాజు తన పరివారంతో సహా పూర్ణప్రజ్ఞులకు ఎదురువెళ్లి ప్రణామం చేసి స్వాగతం పలికాడు. గురువు ఆదేశం మేరకు తన భటులతో పడవలను అవతలి ఒడ్డుకు పంపించి అక్కడ నిరీక్షిస్తున్న శిష్యుల్ని కూడా సురక్షితంగా ఇవతలి ఒడ్డుకు చేర్పించాడు.

నది దాటుతున్నంతసేపూ తమ గురువులు కనబడకుండా పోయారన్న దిగులుతో, దుఃఖంలో మునిగిపోయిన శిష్యులు నది దాటగానే అక్కడ కనిపించిన దృశ్యం చూసి ఆశ్చర్యానందాలలో మునిగిపోయారు. అక్కడ బ్రహ్మసభలాంటి అద్భుత సభ. శ్రోత్రియులైన పండితులు శ్రోతలుగా ఉన్న ఆ సభలో తమ గురువైన ఆనందతీర్థులు బ్రహ్మ దేవుడిలా కనిపించారు. 'ఆహా! బ్రహ్మనే ఇక్కడ చూస్తున్నామా' అన్న సంభ్రమానికి వాళ్లు లోనయ్యారు.

## గంగచే గురువందనం

గంగానది దాటి చాలా ముందుకి వెళ్లాక మధ్వాచార్యులు మొదట సందర్శించింది హస్తినాపురం.

అది ఆయన ద్వాపరయుగంలో యువరాజుగా భీమసేనుడు 36 సంవత్సరాలు పాలించిన కార్యక్షేత్రం.

ధర్మరాజు మహారాజుగా అర్జునుడు ఇతర పాండవులు వారి ఆజ్ఞలను పాటించే వారుగా, శ్రీమహావిష్ణువు శ్రీకృష్ణుడుగా, వేదవ్యాసుడుగా, పరశురాముడిగా సందేశమిచ్చి అనుగ్రహించిన స్థలం.

తాము భీముడు రూపంలో దుర్యోధనుడు, దుశ్శాసనుడు తదితర కౌరవ వినాశనానికి ప్రతిజ్ఞ చేసిన స్థలం.

వ్యాసులవారి నేతృత్వంలో పాండవులు ఒక్కొక్కరూ మూడు మూడు చొప్పున పదిహేను అశ్వమేథ యాగాలను నిర్వహించిన యజ్ఞమంటప క్షేత్రం.

పక్కనే గంగానది ప్రవాహంతో పరమపావనమైన క్షేత్రం.

...మధ్వాచార్యుల ముఖంలో ఉట్టిపడుతున్న తేజస్సుతో ప్రభావితులైన ఆ ప్రాంత ప్రజలంతా వారిని అక్కడే చాతుర్మాస దీక్షను పాటించవలసిందిగా అభ్యర్థించారు. వారి కోరిక మన్నించి ఆయన అక్కడే తమ చాతుర్మాస దీక్షను ప్రారంభించారు.

అకస్మాత్తుగా ఒకరోజు గంగానది నుండి జలప్రవాహం ఒక కాలవగా ప్రవహించి పూర్ణప్రజ్ఞులు బసచేసి ఉన్న మఠం మీదుగా సాగింది. ఆ ప్రవాహం ఆ మఠం చేరుకున్న మరుక్షణంలో ఆ ప్రవాహం నుంచి ఒక దివ్యతేజస్సు పైకెగసి మధ్వాచార్యుల పాదాలను తాకి అదృశ్యమైంది. ఆ ప్రవాహం అలా ముందుకి సాగిపోయింది. ఇది చూస్తున్న శిష్యులకు విషయం చాలా సునాయాసంగా అవగతమైంది. శ్రీ వ్యాసనారాయణుల అనుగ్రహాన్ని పొందిన మధ్వాచార్యులను విడిచి ఉండలేక గంగానది స్వయంగా తమ గురువున్న చోటుకే ప్రవహించింది. భక్తితో వారంతా గంగానదికి నమస్కరించారు.

## ఉపనిషత్తులకు భాష్యం

మధ్వాచార్యులు రచించిన బ్రహ్మసూత్ర భాష్యం జిజ్ఞాసువులైన పండిత వర్గాల్లో అత్యంత ప్రాచుర్యం పొందింది. ఈ భాష్య విశిష్టత భారత ఉపఖండంలో నాలుగుమూలలా వ్యాపించింది.

ఈ నేపథ్యంలో జ్ఞానార్థులైన కొందరు, వేదార్థాన్ని వివరించే ఉపనిషత్తులకు కూడా భాష్యాలను రచించవలసిందిగా మధ్వాచార్యులను ప్రార్థించారు. ఈ ఉపనిషత్తులకు స్పష్టమైన భాష్యాన్ని రచించని పక్షంలో అద్వైతులు వాటిని అద్వైతపరంగానే వ్యాఖ్యానించే ప్రమాదముందని వారు భావించారు.

మధ్వాచార్యులు వాళ్ల కోర్కెను మన్నించారు. అలా మొత్తం పది ఉపనిషత్తులకు సమగ్రమైన భాష్యాన్ని మధ్వాచార్యులు ఈ సమాజానికి అందించారు. వాటిలో మొట్టమొదటిదైన ఐతరేయ భాష్యాన్ని తన గురువైన తోటింతిల్లాయర్ చేత ఆవిష్కరింప చేశారు. ఋగ్వేదం యొక్క ఉపనిషత్తుగా జగత్ ప్రసిద్ధి చెందిన ఈ ఉపనిషత్ భాష్యాన్ని మొట్టమొదటగా విని తరించినవారు సత్యతీర్థులు.

అలాగే గీతార్థ సారాన్ని కూడా సమగ్రంగా తెలుసుకోవాలని శిష్యులు వ్యక్తం చేసిన ఆరాటానికి సమాధానంగా 'గీతా తాత్పర్యనిర్ణయం' అనే రచనను కూడా మధ్వాచార్యులు ఈ సమాజానికి అందించారు. గీతాభాష్యం గురించి వేదవ్యాసులు చేసిన, లేశతః అన్న భావానికి సూచనగా, తన పాండిత్య ప్రకర్ష గీతపై కొత్త వివరణలు, ప్రమాణాలు ఇచ్చి, ఎవరికీ ఆయనశక్తి యందు సంశయం లేకుండా చేశారు. ఆ విధంగా భగవద్గీత మీద గీతాభాష్యం, గీతాతాత్పర్య నిర్ణయం అనే రెండు గ్రంథాలను రచించిన ఒకే ఒక్క భాష్యకారులు మధ్వాచార్యులు.

హస్తినా పురంలో చాతుర్మాస దీక్ష పూర్తిచేసుకుని కాశీ పుణ్య క్షేత్రానికి బయలుదేరారు మధ్వాచార్యులు. ఈ పుణ్యక్షేత్రంలో మాత్రమే గంగ ఉత్తరదిశగా ప్రవహిస్తూంటుంది. అందుకే అక్కడ గంగకు అత్యంత మాహాత్మ్యం ఉందని వేదకాలం నుంచి చెప్పబడుతోంది.

అనేక ప్రాచీన కథల్లో కాశీరాజు ప్రస్తావన ఉంటుంది. మహాభారతంలో కూడా భారతీదేవి కాశీరాజు కుమార్తెగా కాళి అనే పేరుతో జన్మించిందనీ, కాళి తన స్వయంవర మంటపంలో అనేకమంది ఇతర మహారాజులను కాదని భీమసేనుణ్ణి మాత్రమే వరించిందనీ, ఇది సహించలేక జరాసంధుడు యుద్ధానికి వచ్చాడనీ, భీమసేనుడు అతన్ని పరాభవించి రెండు చేతుల్తో ఎత్తి గంగానదిలో పడేశాడనీ చెప్పబడింది.

ఈ క్షేత్రంలో ప్రవేశించేనాటికి మధ్వాచార్యుల వయసు 50 సంవత్సరాలకి దగ్గరగా ఉంది. ప్రజల దృష్టిలో ఆయన వయసు మీరుతున్న వాడికింద లెక్క. శిష్యులంతా సహజంగానే యవ్వనంలో ఉన్నారు. అంత వయసులో కూడా మధ్వాచార్యులు ఎంత దూరమైనా కాలినడకతోనే వెళ్తున్నారు. కాని శిష్యుల్లో – గురువుగారికి వయసు మళ్లుతోందనీ, తాము వయసులో ఉండటంవల్ల శక్తిమంతులమై గురువును జాగ్రత్తగా చూసుకుంటున్నామనీ... ఇలాంటి భావాలు పెరుగుతూ వస్తున్నాయి.

పూర్ణప్రజ్ఞులకు తన శిష్యుల మనోభావాలు తెలుసుకోవడం కష్టమా!

అకస్మాత్తుగా ఒకరోజు వాళ్లందర్నీ దగ్గరికి పిలిచారు. "మీరంతా వయసులో ఉన్నారు. నా వయసును బట్టి నాలో శక్తి ఏవన్నా తగ్గిందా అని నాకు సందేహం కలుగుతోంది. ఒకసారి దీనిని నిర్ధారించుకోవాలనుకుంటున్నాను. అందుకోసం మీరంతా కలసి నాతో పోరాడాలని నా కోరిక... గురువులు అని సంకోచం లేకుండా నామీద మీ పూర్ణ శక్తిని ప్రయోగించండి..." అంటూ ప్రోత్సహించారు.

ఈ సంఘటన శిష్యులకి మింగుడు పడలేదు. తాము మనసులో ఏమనుకుంటున్నామో అది గురువులు గ్రహించేశారు అన్న భావన వాళ్లల్లో అపరాధభావనను పెంచింది. ఏమయినా గురువు ఆదేశాన్ని ధిక్కరించే ప్రశ్న లేదు. గురువు చెప్పినట్లుగా అందరూ కలసి గురువుమీద పోరాటానికి దిగారు. తమ శక్తిని సంపూర్ణంగా వినియోగించి పోరాడారు.

ఆశ్చర్యం! ఆయనతో పోరాటంలో కొద్ది నిముషాల్లోనే వాళ్లందరూ అలసిపోయారు. కింద పడిపోయారు. మధ్వాచార్యులు చిరునవ్వు నవ్వుతూ "రండి, మీ శక్తి ఇంకా ఎంత ఉందో చూపించండి" అంటూ వాళ్లని ఎంత ప్రోత్సహించినా వాళ్లు లేవలేకపోయారు.

వాళ్లకి మరోసారి తమ గురువులో ఒక భీమసేనుడు, ఒక హనుమంతుడు కనిపించారు. తమ తప్పు తెలుసుకున్నారు.

"స్వామీ! మీ శక్తికి సాటిలేదు. మమ్మల్ని క్షమించండి" అంటూ ప్రాథేయపడ్డారు. వాళ్ల ప్రార్థన విని కరుణతో – వాళ్లని చావగొట్టిన తన చేతిని గురువు వెనక్కి తీసుకున్నారు. అప్పటివరకూ గురువుల ఆధ్యాత్మిక, మంత్ర తంత్ర జ్ఞానశక్తిని మాత్రమే చూసి ఉన్న శిష్యులకి ఈ సంఘటనతో మధ్వాచార్యుల యొక్క దేహదార్ఢ్యం కూడా పరిపూర్ణంగా అర్థమైంది.

## యమపురికి వెళ్లిన ఇంద్రపురి

కాశీలో ఇంద్రపురి అనే పేరుగల ఒక సన్యాసి ఉండేవాడు. ఇతర మతసిద్ధాంతాల్ని ఖండించడంలో అతను చాలా పేరుమోసినవాడు. తెలిసిన వాళ్లెవరూ అతనితో వాగ్యుద్ధానికి దిగరు. ఆ గర్వంతోనే అతను ఒకసారి మధ్వాచార్యులు ఉన్నచోటికి వచ్చి ఆయనతో వాదానికి దిగాడు. అదెలా జరిగిందంటే...

ఒకరోజు తన ధార్మికప్రసంగంలో మధ్వాచార్యులు, "మోక్షానికి సాధనం జ్ఞానం. అలాగే జ్ఞానానికి సాధనం కర్మ. అపరోక్షజ్ఞానికి కర్మతో పని లేదు. అతను చేసే కర్మ ఆనందాతిశయానికి మాత్రమే కారణమవుతుంది" అని చెప్తుండగా ఇంద్రపురి అడ్డు తగిలాడు.

"మీరు చెప్పే దాని ప్రమాణం ఏమిటి?" అని అడిగాడు. దానికి మధ్వాచార్యులు కృష్ణసంహిత మొదలైన గ్రంథాల్లోని వ్యాఖ్యాలను ఉదహరిస్తూ, అతని సంశయాన్ని నివృత్తి చేశాడు. పూర్ణప్రజ్ఞులు ఇచ్చిన వివరణను అతను నిరాకరించలేకపోయాడు. కాని ఓటమిని అంగీకరించి శరణు పొందటానికి అతను ఇష్టపడలేదు. అందుకే అసందర్భంగా మరో ప్రశ్న వేశాడు. "జ్ఞానం అనే పదానికి అర్థమేమిటో చెప్పండి?"

ఇంద్రపురి తన ఓటమినుంచి తప్పించుకోవడం కోసం అసందర్భ ప్రస్తావన చేస్తున్నాడని గమనించిన పూర్ణప్రజ్ఞులు, "నువ్వు జ్ఞానివై ఉంటే ఆ జ్ఞానపదానికి అర్థం తెలిసుంటుంది. నువ్వు జ్ఞానివి కాకపోతే అది తెలుసుకొనే అవకాశమే నీకు లేదు. అందువల్ల ఈ ప్రశ్నే అనుచితం" అంటూ ఖండించారు. వాస్తవానికి ప్రశ్న ప్రామాణికమై ఉండాలంటే స్వవ్యాహృతి, అసంగతి, సిద్ధార్థత, వైఫల్యం అనే నాలుగు లక్షణాలను కలిగి ఉండాలి. ఆ లక్షణాలు లేకపోతే ప్రశ్న అడగటమే అవివేకం... ఈ పరిణామంతో ఇంద్రపురి సిగ్గుతో తల వంచక తప్పలేదు. దీంతో కాశీ క్షేత్రంలో కూడా మధ్వాచార్యులు వైష్ణవవేదాంత

విజయపతాకాన్ని ఎగురవేసినట్లయింది. అప్పట్నుంచి కాశీక్షేత్రంలో ఆయన అనేక సభల్లో పాల్గొన్నారు. ప్రతి సభలోనూ వేదవ్యాస నిరూపితమైన వైదిక సిద్ధాంతాన్ని బోధిస్తూ వచ్చారు.

"జగత్తులో సృష్టి, స్థితి మొదలైన అన్నిరకాల పరిణామాలకి ముఖ్య కారణం భగవంతుడే... అతని వల్లనే అతని గురించే వేదాలు తదితర శాస్త్రాలన్నీ ఉద్భవించాయి. అతను సర్వవ్యాపితుడు... అతడు నిరంతర జ్ఞానానందమయ స్వరూపుడు. అతను ప్రతి జీవిలోనూ బింబరూపుడుగా ఉంటాడు... దుష్టులను నాశనం చేస్తాడు. ముక్తియోగులను పాలిస్తాడు... అతనికి సమానమైన వాళ్లు గానీ, అతనికన్నా అధికులైన వాళ్లు గానీ ఏ కాలంలోనైనాగానీ ఎక్కడైనాగానీ లేరు... అతడు అనంతగుణపూర్ణుడు మాత్రమే కాదు. సత్త్వరజస్తమో గుణరహితుడుగా ఉంటాడు... అతడు అందరికన్నా విలక్షణుడు... సర్వోత్తముడు..." ఇలా నిరంతర ప్రవాహంలా సాగుతున్న ధార్మికప్రసంగాలతో మధ్వాచార్యులు మాయావాద సమస్తశాస్త్రాల్ని అవైదికాలని నిరూపించారు. ఆయన ప్రతి ప్రసంగంలోనూ, ప్రతి చర్చలోనూ విషయమూ, ఆలోచన, యుక్తి, ఉదాహరణ, సంశయము, పూర్వపక్షం, సిద్ధాంతం, ప్రయోజనం అనే ఎనిమిది లక్షణాలు నిండి ఉండేవి. అందువల్ల ఆయన భాషణలు విన్నవాళ్లంతా చేతులు జోడించి అభినందిస్తూ ఉండేవారు. వారి వాక్చాతుర్యం శరత్కాలంలో చంద్రుడి వెన్నెల్లా అందరినీ ఆకట్టుకుంటూ ఉండేది.

## కురుక్షేత్ర వర్ణన

**మ**హాభారతంపై ఆయన చేసిన ప్రసంగాల్లో కురుక్షేత్రం గురించి వర్ణించేటప్పుడు విని తీరాలి. కురుక్షేత్రంలో భీకరమైన పోరాటం జరుగుతున్నప్పుడు పద్ధెనిమిది రోజుల్లో అక్షౌహిణుల సైన్యాలను సంహరించిన రణరంగం ఎలా ఉండేదో కళ్లకు కట్టినట్లు వర్ణించేవారు. శ్రీకృష్ణుడు అర్జునుడికి గీతోపదేశం చేసిన ధర్మక్షేత్రం, పరశురాముడి రూపంతో అస్త్రోపదేశం పొందిన భీష్మ, ద్రోణ కర్ణులంతటి అసామాన్య యోధుల సాహసాన్ని రుచి చూసిన యుద్ధభూమి, పాండవులు అసాధారణ శక్తిసామర్థ్యాలను ప్రదర్శించిన రణక్షేత్రం... ఇవన్నీ మధ్వాచార్యుల ప్రసంగాల్లో వింటూ శ్రోతలు తమ కళ్లముందు ఆయా దృశ్యాలను ఊహించుకుంటూ తన్మయులైపోయేవారు.

ముఖ్యంగా కురుక్షేత్రంలో భీమసేనుని పాత్ర గురించి వర్ణించేటప్పుడు మధ్వాచార్యుల ముఖంలో వింతకాంతి ప్రకాశించేది. భీముడే తమ ఎదురుగా వచ్చి దుశ్శాసనుడి గుండె చీల్చి రక్తాన్ని పానం చేస్తున్నాడా అన్నట్లుగా - శ్రోతలకి గగుర్పాటిచేది. భీమసేనుడి

గురించి చెబుతున్న ప్రతిసారీ మధ్వాచార్యుల చూపుల్లో తీక్షణత, మాటల్లో ధాటి, శరీరంలో ఉద్రేకం – భీమసేనుడే ఎదురుగా వచ్చి కూర్చున్నాడన్న మహత్తర భావనలో శ్రోతల్ని ముంచెత్తేవి.

ఒకరోజు సత్యతీర్థుల సారథ్యంలో శిష్యులంతా చేరి మధ్వాచార్యుల్ని ప్రార్థించారు. "భీమసేనుడుగా కురుక్షేత్ర సమరంలో మీరు ప్రయోగించిన ఆయుధాల్ని చూడాలని మేమంతా ఉవ్విళ్లూరుతున్నాం స్వామీ!"

పూర్ణప్రజ్ఞులు చిరునవ్వు నవ్వి, 'ఫలానా ప్రదేశానికి వెళ్లి చూసిరండి' అని సూచించారు.

విచిత్రం!

గురువు చెప్పిన చోటికి వెళ్లి చూస్తే అక్కడ వాళ్లకి వాళ్ల ఊహకందనంత బృహత్ ఆకారంలో ఉన్న గద కనిపించింది. వాళ్లంతా సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయారు. ఆ గదను ఆశ్చర్యంతో చూసి, తిరిగివచ్చిన సత్యతీర్థుల్ని ఉద్దేశించి మధ్వాచార్యులు చెప్పారు – "ఆ యుద్ధంలో ఒక రాజుగా మీరు కూడా పాల్గొన్నారు". విస్మయంతో సత్యతీర్థుల నోటివెంట మాట రాలేదు. కొద్దిసేపటికి తేరుకుని, "అప్పుడు నేను ఉపయోగించిన ఆయుధాన్ని చూడవచ్చునా స్వామీ?" అని ప్రశ్నించారు. పూర్ణప్రజ్ఞులు మరోసారి చిరునవ్వు నవ్వి మరో స్థలానికి వెళ్లి చూడమని శాసించారు. అలాగే సత్యతీర్థులు వెళ్లారు. అక్కడ మరో బృహత్ ఆయుధాన్ని చూశారు. వర్ణించలేని విస్మయంలో మునిగిపోయారు.

**కపట మారీచుని కథ**

**ఇం**కో విచిత్రమైన సంఘటన జరిగింది. ఒక సంచారంలో వాళ్లంతా తపస్సులో కూర్చున్న వ్యక్తిని చూశారు. 'ఆహా! ఎంతటి నిష్ఠతో ఇతను తపస్సు చేస్తున్నాడు' అనుకున్నారు శిష్యులు.

వాళ్ల మనోభావాల్ని క్షణాల్లో చదివేశారు మధ్వాచార్యులు. వెంటనే ఆయన హెచ్చరిక చేశాడు. "అతను నిజమైన తపస్వి కాదు. ఒక కపటి. అతనొక రాక్షసుడు. రాబోయే కల్పంలో మారీచుడిగా జన్మించాలనే కోరికతో అతను తపస్సు చేస్తున్నాడు..."

గురువులు చెప్పిన మాటలపట్ల సంశయం లేకపోయినప్పటికీ ప్రత్యక్షంగా అర్థం చేసుకుని సంతృప్తి చెందాలన్న కోరిక శిష్యులలో కలిగింది. అప్పుడు వాళ్లంతా ఆ తాపసి దగ్గరికి వెళ్లి పరీక్షించారు. వాళ్ల శక్తియుక్తుల్ని ప్రదర్శించి అతి సులభంగా వాళ్లు తెలుసుకున్న

వాస్తవం ఏమిటంటే – అతను రాక్షసప్రవృత్తి నిండిన కపట తాపసి మాత్రమే. గురువు చెప్పిన మాటలు బలపడ్డాయి. ఇటువంటి గోముఖవ్యాఘ్రాల వల్ల సమాజానికి హాని కలిగే ప్రమాదం ఉండటంవల్లే గురువు ఆ హెచ్చరిక చేశాడని శిష్యులకు అర్థమైంది.

## భారీ భోజనం

ఆ తరువాత మధ్వాచార్యులు దక్షిణానికి ప్రయాణించారు. 'ఇఘవాత' క్షేత్రాన్ని సందర్శించారు.

పరశురాముడు ఒక పరశురామక్షేత్రాన్ని నిర్మించటం కోసం తన గొడ్డలిని ప్రయోగించి సముద్రాన్ని వెనక్కి జరిపిన క్షేత్రం 'ఇఘవాత'. ఆ క్షేత్రాన్ని చేరిన వెంటనే ఆ క్షేత్ర మాహాత్మ్యాన్ని ప్రస్తుతిస్తూ పూర్ణప్రజ్ఞులు స్తుతి చేశారు.

అప్పటికే మధ్వాచార్యుల శక్తి సామర్థ్యాల గురించి విని వున్న ఆ ప్రాంతపు రాజు ఆయన్ని పరీక్షించాలన్న కోరికతో ఒక వెయ్యి 'రాజకేళి' అరటిపళ్లు పంపించారు. "స్వామి వారి గౌరవార్థం మా ప్రభువులు పంపుకున్న కానుక" అంటూ రాజాధికారులు బండి మీద రాజకేళి పళ్లు మోసుకొచ్చారు. మధ్వాచార్యులు మందహాసం చేశారు. ఆ మధ్యాహ్నం భోజనం చేశాక, మొత్తం 'రాజకేళి' పళ్లను సునాయాసంగా తృప్తిగా భుజించారు. ఈ వింతని చూసిన ప్రజలకి మధ్వులలో భీమసేనుడే ద్యోతకమయ్యాడు.

అక్కడ్నుంచి మధ్వులు గోవాకి వెళ్లారు. అక్కడ శంకర అనే బ్రాహ్మణుడు 4000 బృహత్కేళి అరటిపళ్లను, 30 కుండల పాలను మధ్వులకు బహూకరించారు. ఎప్పటిలాగానే, పూర్ణప్రజ్ఞులు తమ శిష్యబృందం చూస్తూండగానే మొత్తం 4000 అరటిపళ్లను అనాయాసంగా తినేశారు. 30 కుండల పాలను త్రాగేశారు. భీమసేనుణ్ణి చూసినంత సంబరపడిపోయారు శిష్యులు, భక్తులు.

విచిత్రమేమిటంటే ఎంత భుజించినా పూర్ణప్రజ్ఞుల ఉదరం ఏమీ తిననట్టే లోపలికి ఉండేది. అయినా శైశవ దశలోనే ఉలవలు తిని హరాయించుకున్న వ్యక్తికి ఇలాంటి భోజనాలు ఒక లెఖ్కా!

## రాజు కుతంత్రం

మధ్వాచార్యుల మంత్రతంత్ర శక్తులను తెలుసుకున్న ఆ ప్రాంత రాజు ఆయన్ని తన రాజ్యంలోనే ఉండిపోయేలా చేయాలనుకున్నాడు.

ఒకరోజు తమ కోరికని వెల్లడిస్తూ మధ్వాచార్యులకు ఆహ్వానం పంపాడు. కాని మధ్వులు అందుకంగీకరించలేదు. రాజుకి కోపం వచ్చింది. "నేనడిగితే కాదంటాడా" అన్న ఆగ్రహంతో మధ్వాచార్యుల్ని ఆయన ఉన్న చోటునే బందీ చేయటానికి నిర్ణయించు కున్నాడు. ఆయన ఉన్న బస చుట్టూ భటులను కాపలా పెట్టాడు. నిజానికి రాజుకు కావలసింది మధ్వాచార్యుల అనుగ్రహం, రక్షణ. అవి కోరటానికి భిన్నంగా ఆయన్నే బందీ చేయటానికి చూశాడు. మధ్వులు సర్వజ్ఞులు, సర్వశక్తిమంతులు కనుక తన శిష్యులందరినీ రోజుకొక్కరుగా అక్కడనుంచి అదృశ్యం చేసి బయటకి పంపించేశారు. కొన్ని రోజుల తర్వాత "ఇప్పటికైనా ఈ స్వామి నా కోరికలు అంగీకరించటానికి సిద్ధపడి ఉంటాడు" అని భావించిన రాజు మధ్వాచారుల్ని చూడటం కోసం ఆ విడిదికి వచ్చాడు. కాని అక్కడ తన భటులు తప్ప ఒక్క శిష్యుడు కూడా కనిపించలేదు. నిర్ఘాంతపోయిన రాజు విడిది లోపలికి వెళ్లి మధ్వాచార్యులని పరామర్శించబోయాడు.

అప్పటికే అతని కుతంత్రాన్ని అర్థం చేసుకున్న మధ్వాచార్యులు, "నువ్వు ఇక్కడనుంచి బయటికి వెళ్లిన వెంటనే మరణించక తప్పదు" అని హెచ్చరించాడు. ఒక్కసారిగా రాజుకి తను చేసిన అపరాధం తెలిసివచ్చింది. వెంటనే మధ్వుల పాదాలపై పడి తనను క్షమించవలసిందిగా పదేపదే అర్థించాడు.

"నువ్వు అభ్యర్థిస్తున్నావు కనుక నీకు ఆరు మాసాలు జీవనదానం చేస్తున్నాను. తరువాతైనా నీ వంచనకు తగిన శిక్షగా నువ్వు మరణించకతప్పదు" అంటూ అప్పటికప్పుడే మధ్వాచార్యులు అక్కడనుంచి లిప్తకాలంలో అదృశ్యమయ్యారు.

సరిగ్గా ఆరు మాసాలు గడచిన వెంటనే రాజు మరణించి, అతని రాజ్యం, కోశం శత్రువుల వశమయ్యాయి.

### సంగీత కౌశలం

అక్కడినుంచి పశుపే అనే ప్రదేశానికి మధ్వుల బృందం బయలుదేరి వెళ్లింది.

పశుపేలో ఉండగా ఒకరోజు మధ్వాచార్యుల్ని ధార్మికభాషణ ముగిశాక సభికులు ఒక విచిత్రమైన కోర్కెను కోరారు. "మిమ్మల్ని సకలశాస్త్ర కోవిదులు, సకల కళాకోవిదులు అని అందరూ అంటూంటారు. సంగీతకళలో మీ నైపుణ్యాన్ని చూడాలని మా కోరిక... మా ప్రాంతంలో చాలా కాలంగా పుష్పవృక్షాలు పుష్పించటం లేదు. మీ శ్రావ్యమైన గానంతో ఆ చెట్లు పుష్పించేలా చేయాలని మా ప్రార్థన" అని అభ్యర్థించారు.

వారి కోర్కెను మధ్వులు మన్నించారు. క్షణాల్లో వారి గాత్రకచేరీ ఏర్పాటయింది. పూర్ణప్రజ్ఞుల గానాలాపన మొదలైంది. క్రమంగా వారి గానమాధుర్యంలో సభికులు పరవశమైపోసాగారు.

ఓహ్!

ఏమా గాన మాధుర్యం! ఏమా శ్రావ్యత!

శ్రీకృష్ణుడి వేణుగానానికి గోపికలంతా పరవశించిపోయినట్లుగా మధ్వాచార్యుల గానప్రవాహంలో అక్కడి సభికులంతా తన్మయత్వంతో ఓలలాడారు... అలా ఎంత సేపు గడిచిందో వారికే తెలియదు. కాని, ఆ గానం ముగిసేసరికి ఆ పరిసరాల్లో ఉన్న చెట్లన్నీ పుష్పించి అక్కడ ప్రజలందరికీ కన్నుల విందు చేశాయి.

"అద్భుతం! పరమాద్భుతం" అంటూ జనమంతా ఆనందంతో నృత్యాలు చేశారు, కేరింతలు కొట్టారు.

వాళ్లల్లో సంగీతప్రియులైన జిజ్ఞాసులు చొరవగా ముందుకు వచ్చి, "స్వామీ, ఇంతటి విద్వాంసులు మీరు. సంగీత శాస్త్రానికే కొత్త ఒరవడినే దిద్దగలిగినవారు మీరు. మా యందు దయతో ఒక సమగ్ర సంగీత గ్రంథాన్ని రచించి ఇచ్చి మమ్మల్ని తరింపచేయండి" అని అంటూ విన్నవించుకున్నారు.

అర్హులైన వారి కోరికని మధ్వులు ఎలా నిరాకరించగలరు? చిరునవ్వుతో అంగీకరించారు. అంతే. కొద్ది రోజుల్లోనే ఒక విశిష్ట సంగీతగ్రంథాన్ని రచించారు. (ఆ రచన ఇప్పుడు లభించటంలేదు. దాని ప్రతి శ్రీ పురందరదాసు వంటి గాన కోవిదులకు లభించి ఉండవచ్చు.)

రెండవ బదరి యాత్రనుంచి తిరిగివస్తూ దారిలో వేరు వేరు మజిలీలలో ఇలాంటి అద్భుతాలను చూపిస్తూ, మధ్వాచార్యులు రజతపీఠపురం చేరారు.

## పద్మనాభ తీర్థులైన శోభనభట్టులు

రజతపీఠానికి చేరిన కొద్ది రోజులకి గతంలో గోదావరి తీరంలో మధ్వాచార్యులవద్ద శిష్యరికం స్వీకరించి బ్రహ్మసూత్ర శ్రవణం చేసిన శోభనభట్టులు గురువు దగ్గరకి వచ్చారు. అప్పటికే ఆయన విద్వత్‌సభలలో మధ్వసిద్ధాంతాన్ని విస్తృతంగా ప్రచారం చేసి ఉన్నారు.

వస్తూనే మధ్వాచార్యులకు సాష్టాంగ ప్రణామం చేశారు. ఆయన కోర్కెను తెలుసుకున్న గురువు ఆయనకి 1358లో – పింగళినామ సంవత్సర వైశాఖ శుద్ధ సప్తమినాడు

కణ్వతీర్థంలో సన్యాసదీక్ష ఇచ్చి అనుగ్రహించారు. అప్పటినుంచి శోభనభట్టులు పద్మనాభతీర్థులుగా ఆశ్రమనామం స్వీకరించారు. ఆయన జన్మ ఎంతటి సార్థకమైనదంటే, తరువాత రోజుల్లో కమలనాథ తీర్థులు, పంకజ తీర్థులు, నీరజనాభ తీర్థులు మొదలైన పేర్లతో ఆయన ఖ్యాతి పొందారు.

మధ్వాచార్యుల ఆదేశం మేరకు శ్రీ చెన్నకేశవస్వామి క్షేత్రమైన బేలూరుని పద్మనాభతీర్థులు తమ ప్రధాన కార్యక్షేత్రంగా చేసుకున్నారు. గురువు ఆదేశం మేరకు వారి బ్రహ్మసూత్ర భాష్యానికి సత్‌త్తర్కదీపావళి అనే టీకను రచించి బ్రహ్మసూత్రభాష్య ప్రథమ టీకాకారులు అనిపించుకున్నారు. ఎవరైతే భక్తి, విరక్తి, నిత్యసేవ, చిత్తశుద్ధి మననం, శ్రవణం తదితర గుణాల్ని కలిగి ఉంటారో వారంతా మధ్వాచార్యుల అనుగ్రహానికి అర్హులయ్యేవారు. అటువంటి వారికి రహస్యఉపాసన క్రమాన్ని ఆయన బోధించేవారు. ఆ రకంగా పద్మనాభతీర్థుల విద్వత్ వారిని ప్రథమ విద్వత్తిమింగళంగా చేసింది. వారి ప్రవచనాలు మితవాదులకు సింహగర్జనలాగా వినిపించాయి. అటువంటి వాక్‌చాతుర్యంతో తత్త్వ ప్రచార కార్యక్రమాన్ని సాగిస్తూ వచ్చారు.

జ్ఞానసముద్రం అని చెప్పదగిన పద్మనాభతీర్థుల వారి అనువ్యాఖ్య అనే టీక 'సన్యాయ రత్నావళి' అనిపించుకున్నది. మధ్వాచార్యుల శిష్యుల్లోకెల్లా అతి ఎక్కువ కృతులకు వ్యాఖ్యానం రాసిన మహనీయుడుగా కూడా పద్మనాభతీర్థులు విశిష్ట గౌరవాన్ని పొందారు. వారు రాసిన వ్యాఖ్యానాల్లో – మధ్వుల దశప్రకరణాలు, బ్రహ్మసూత్ర భాష్యం, అనువ్యాఖ్యానం, గీతాభాష్యం, గీతాతాత్పర్యం మొదలైన పధ్నాలుగు కృతుల వ్యాఖ్యలు మాత్రమే ఇప్పటికి లభ్యమవుతున్నాయి.

వారి మధ్వసిద్ధాంత సేవలను జయ తీర్థులు, వ్యాసతీర్థులు మొదలైన వారంతా 'ద్వైతసిద్ధాంత విద్వద్విభూతులు' అంటూ తమ కృతుల్లో స్తుతించారు. ప్రాచీన టీక కారుల్లో అగ్రస్థానం పద్మనాభ తీర్థులదే.

## నరహరి తీర్థులు

మధ్వాచార్యులు రెండవసారి బదరి యాత్ర పూర్తిచేసి ఉడుపికి వెళ్తున్నప్పుడు ఒక విద్వాంసుడు వారిని సందర్శించాడు. వయసులో చిన్నవాడైనప్పటికీ అతను అనేక శాస్త్రాల్లో అప్పటికే ప్రావీణ్యత సంపాదించుకున్నాడు.

మధ్వాచార్యులను దర్శించుకుని ఆయన పాదాలవద్ద కూర్చుని వేదరహస్యాలను తెలుసుకోవాలన్న జిజ్ఞాసను అతను వ్యక్తం చేశాడు. అతని యోగ్యతను గమనించి

మధ్వాచార్యులు అతని శిష్యునిగా స్వీకరించి తత్త్వోపదేశం చేశారు. శోభనభట్టుకి సన్న్యాసదీక్షనిచ్చిన కొన్ని సంవత్సరాల తరువాత ఇతనికి కూడా మధ్వులు దీక్షను ప్రసాదించారు. వారే నరహరితీర్థులు

## శేషదేవులు

ఒకరోజు సాయంత్రం చీకటిపడ్డాక పూర్ణప్రజ్ఞుల ప్రవచనం సాగుతోంది. అది కృష్ణపక్షం కావటంవల్ల ఆకాశంలో ఎక్కడా వెన్నెల కనిపించటంలేదు. చమురు దీపాల వెలుగులో సభ సాగుతున్నది. వాతావరణం ఎలా ఉన్నప్పటికీ ప్రవచనం ఆగకూడదు అన్నది శాస్త్ర నియమం.

అలా సాగుతున్న ప్రవచనం పూర్తయ్యే సమయానికి అకస్మాత్తుగా ఆకాశంనుంచి ఒక పెద్ద వెలుగు కిందకి వచ్చి ఆకాశంలోకి ఎగిరిపోయింది. అందరికీ ఒక్కసారిగా కళ్లు మిరుమిట్లు గొల్పినట్లు అయింది. సభికులంతా సంభ్రమాశ్చర్యాలతో గురువునడిగారు:

"ఏమిటీ విచిత్ర కాంతి గురుదేవా!"

మధ్వాచార్యులు చిరుదరహాసంతో చెప్పారు, "ఇది ఆదిశేషుడి శరీరకాంతి. వారు ప్రతి నిత్యమూ సనక సనందనాదుల సమేతంగా మా ప్రవచనం వినడానికి వస్తున్నారు. అలా వస్తున్న సంగతి మీ అందరికీ తెలిసేలా ఇప్పుడు తమ ప్రకాశాన్ని తేటతెల్లం చేశారు. అందరూ ఒక్కసారి ఆకాశంలోకి చూడండి. ఆదిశేషులు తిరిగి వెళ్తున్న సంగతి కూడా మీకు తెలుస్తుంది..."

వారంతా ఆకాశంలోకి చూశారు. ఆ అద్భుతదృశ్యం కనిపించింది. ఆ దృశ్యాన్ని చూసి తమనుతాము మైమరిచిపోయారు. అప్పటికి వాళ్లకి అర్థమైంది. వారు ప్రతిరోజూ చూస్తున్న మధ్వాచార్యులు సామాన్య గురువులు కాదు. విశ్వగురువులని.

మధ్వాచార్యులు గతంలో తిరుపతి దగ్గర సువర్ణముఖి నదీ తీరంలో బ్రహ్మశిలా ప్రదేశంలో చాతుర్మాస దీక్షను పాటించినప్పుడు ప్రతిరోజు మధ్వుల ప్రవచనం వినటానికి సాక్షాత్ శుకమునే వచ్చేవారు అని శిష్యులు జ్ఞాపకం చేసుకున్నారు. అలా వెళ్తున్న శేషదేవులతో పాటు వచ్చిన సనకాదులు ఆదిశేషుణ్ణి అడిగారు. "మీ అంతటి వారు పూర్ణప్రజ్ఞుల ప్రవచనాన్ని వింటున్నారు కదా! దాని గొప్పదనమెంతటిదీ, దాని స్వరూపమెంతటిది?"

శేషదేవులు వివరించారు. "పూర్ణప్రజ్ఞులు మా చేతకూడా పూజలు అందుకోగల వాయుదేవులు. వారి సిద్ధాంతం ఇహలోకంలో సకలసంపదలకు కారణమైనట్లే పరలోక

సుఖానికీ, ముక్తికీ కూడా అదే సాధనం. ఈ సిద్ధాంతాన్ని నమ్మినవాళ్లకి భగవంతుడు తన లోకమైన వైకుంఠాన్నే పణంగా రాసి ఇవ్వవచ్చు కూడా. అంతటి విశిష్టమైనది మధ్వ దర్శనం".

## మధ్వశాస్త్ర పఠనం - వైకుంఠప్రాప్తి

"వైకుంఠాన్ని మించిన పరలోకం ఇంకొకటి లేదు. వైకుంఠప్రాప్తి పొందిన వారికి ముసలితనం లేదు, చావు పుట్టుకలు లేవు, దుఃఖం లేదు, ఆవేదన లేదు... అలాంటి వైకుంఠప్రాప్తికి సోపానం మధ్వశాస్త్ర శ్రవణం..."

వైకుంఠం భగవంతుని నిలయం. దానికదే సాటి. అంటే అటువంటి దింకొకటి లేదని అర్థం. ప్రళయకాలంలో లయం చెందని లోకమదొక్కటే. అందులోని భవనాదులు అనుపమం. రత్నఖచిత స్వర్ణమయాలు. అనాదికాలం నుండి ముక్తులైన జీవులప్రాప్త స్థానమైప్పటికీ దానికి పరిమితి లేదు. ఎన్ని బ్రహ్మకల్పాలు గడిచినా, ఎప్పటికీ ముందు రాబోయే ముక్తులకు కావల్సిన సదుపాయాలు. నక్షత్రమండలంలో చంద్రుని స్థానం వలె, ఆ ముక్తస్థానంలో భగవంతుని మందిరం ఆ వైకుంఠనాథుని గుణగణాలు వర్ణించడానికి, రమాబ్రహ్మాదులకు కూడా సాధ్యం కాదు. ఈ వైకుంఠంలో ముక్తుల సుఖసంతోషాలు ఊహాతీతం. రోగాలకూ, ముసలితనానికీ, పుట్టుక చావులకు అక్కడ అవకాశం లేదు. లేశమైనా దుఃఖం లేని ప్రదేశం... అక్కడ ముక్తులు అప్రాకృతదేహాలు కలిగి నిత్యయవ్వనులుగా ఉంటారు. వారివారి యోగ్యతానుసారం పూర్ణానంద అనుభవం పొందుతుంటారు – ఆ ముక్తులలో కూడా తారతమ్యం – వారి ఆనందానుభవంలో కూడా తారతమ్యం ఉంది – కాని ప్రతి జీవికి పూర్ణానందం కనుక; ఇతరులతో పోల్చుకొనడంగాని, తనకు ఇతరులకంటె తక్కువ ఎక్కువల భావం కాని, దాని వల్ల కలిగే అసూయాలోపాలు వుండవు. అందరికీ వారివారి పరిధిలో సంపూర్ణానందానుభవం... ముక్తులకు సంకల్పమాత్రాన సర్వసుఖాలు, సర్వ అప్రాకృత ఆనందానుభవాలు... కోరిన ఋతువుల వాతావరణానుభూతి కలుగుతుంది... స్త్రీ భోగమూ అప్రాకృతము. భగవంతుని ఎల్లప్పుడూ చూస్తూ ఆనందాతిశయంలో వుంటారు. సంకల్ప మాత్రాన కోరికలు తక్షణం పూర్ణంగా పొందే స్థితి.

ఈ వైకుంఠానికి మించిన లోకమే వేరొకటి లేదని వేదాలు ఘోషిస్తున్నాయి. ఆధ్యాత్మికసాధనా గమ్యం – ఈ ముక్త స్థానమే! ఈ మోక్షప్రాప్తికే. మధ్వశాస్త్ర పఠనం, ద్వైత సిద్ధాంత తత్త్వవిచారం, శ్రీమధ్వులు సూచించిన ఆచార విచారాల ఆచరణ శ్రీహరి అనుగ్రహానికి ఆధారం. శ్రీహరి అనుగ్రహంతోనే అపరోక్ష జ్ఞానం. ఆ తర్వాత మోక్షప్రాప్తి.

కనక మధ్వశాస్త్ర జ్ఞానం, ద్వైత వైష్ణవ జీవనవిధానం... ప్రతిజీవికి ఆవశ్యకం.

ఈ నమ్మకం క్రమంగా మధ్వాచార్యుల ప్రవచనాలు విన్న ప్రతివారికీ కలుగుతోంది. వారి సిద్ధాంతం అయస్కాంతంలా ప్రజల్ని ఆకర్షిస్తోంది.

**దుష్ట కూటమి**

ఆ కాలంలో అద్వైత దర్శనాలలో ప్రముఖులైన వాళ్లు ఇద్దరుండేవారు – పద్మతీర్థులు, పుండరీక పురి. వీళ్లల్లో పద్మతీర్థులు చోళదేశంలో భైరవి ఉపాసనతో మంత్రతంత్రాల్లో ప్రావీణ్యం పొందారు. అద్వైత సిద్ధాంత ప్రచారంలో మహాదిట్ట.

మధ్వాచార్యుల ప్రవచనాలకు కలుగుతున్న విశేషప్రచారం, వారి సభలకు వస్తున్న జనసందోహం అద్వైత ప్రబోధకులెవరికీ మింగుడు పడలేదు. మధ్వ సిద్ధాంతం విశ్వసించదగింది కాదనీ, ఆ సభలకి వెళ్లద్దనీ తాము ఎంతగా ప్రచారం చేస్తున్నా ప్రజలు తండోపతండాలుగా మధ్వాచార్యుల సభలకి తరలి వెళ్తూండటం వాళ్లకి అపరిమితమయిన అసంతృప్తిని, అసూయని కలిగిస్తోంది. అద్వైత సిద్ధాంతాన్ని మధ్వాచార్యులు బాహాటంగా ఖండిస్తున్నారు.

అద్వైతులు వేసే ప్రశ్నలకి ఆయన సునాయాసంగా జవాబులిస్తూ మధ్వసిద్ధాంతాన్ని మరింత నిర్ధారిస్తున్నారు. ఆయన తిరిగి వేసే ప్రశ్నలకి తాము సమాధానాలివ్వలేక పోతున్నారు... ఈ పరిస్థితి వాళ్లని రోజురోజుకీ క్రుద్ధుల్ని చేస్తోంది.

అనేకసార్లు అద్వైతసిద్ధాంత ప్రచారకులంతా – పద్మతీర్థులు, పుండరీక పురిల సారథ్యంలో సమావేశమై – తమలో తాము మధ్వసిద్ధాంత ప్రసార ఉధృతిని ఎలా తట్టుకోవాలీ అంటూ తలలు బద్దలుకొంటున్నారు... అద్వైత సిద్ధాంతం ప్రతిపాదించే బ్రహ్మనిర్గుణత్వ వాదాన్ని మధ్వులు బ్రహ్మగుణ పూర్ణత్వ ప్రతిపాదకమయిన శాస్త్ర వాదనలతో ఖండిస్తున్నారు. బ్రహ్మ నిర్గుణుడవటం ఎప్పటికీ అసాధ్యం అంటూ నిరూపణలు చేస్తున్నారు... ఈ మధ్వసిద్ధాంత ప్రచార హోరుకి అడ్డుకట్ట వేయకపోతే అద్వైతసిద్ధాంతం పూర్తిగా కనుమరుగైపోయే ప్రమాదముంది అంటూ వాళ్లు ఒక నిశ్చితాభిప్రాయానికి వచ్చేశారు.

వీళ్లకి మధ్వసిద్ధాంతం మీద ఆగ్రహానికి తోడు పాలన, వశీకరణం, స్తంభన, విద్వేషణం, ఉచ్చాటనం, మారణ అనే ఆరు రకాల వైదిక కర్మలలో అపార నైపుణ్యం వుంది. ఈ తమ నైపుణ్యాన్ని ప్రదర్శించి ఎలాగైనా గ్రామగ్రామానా మధ్వ సభలను

అడ్డుకోవాలనీ, మధ్వులను అవమానింప జేయాలనీ, వారి తత్త్వ ప్రసారానికి ఆధారమైన గ్రంథాలను తస్కరించాలనీ... ఇలా మాయోపాయాలను ప్రయోగించాలన్న కృతనిశ్చయంతో వాళ్లు రంగంలోకి దిగారు.

## వేద ఘోష

ఆ నిర్ణయం ప్రకారం వాళ్లంతా పుండరీకపురిని అడ్డం పెట్టుకొని మధ్వాచార్యులను వాదానికి పిలిచారు. మధ్వాచార్యుల ప్రజ్ఞముందు పుండరీకపురి నిలబడగలడా లేదా అన్న కనీస ఆలోచన కూడా వాళ్లు చేయలేదు. నిజానికి మధ్వాచార్యులకు పుండరీక పురితో వాదానికి దిగటమంటే ఒక ఏనుగు దోమతో పోటీపడుతున్నట్టే. అయినా మధ్వులు వాదాన్ని అంగీకరించారు.

విద్వత్‌సభ ఏర్పాటయింది. పండితుల సమావేశంలో మధ్వాచార్యులు వేదఘోష ప్రారంభించారు. పనస పనసకు వ్యాఖ్యానం ఇస్తూ మధ్వాచార్యులు చేస్తున్న వాగ్ధాటి చూస్తుంటే సాక్షాత్తూ వ్యాసదేవులే కిందకు దిగి వ్యాఖ్యానం చేస్తున్నట్లుగా ఆ సభలో కూర్చున్న పండితులకనిపిస్తోంది. శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిష్యము, కల్పము అన్న వేదాంగాలు సహితం ఎంత మాత్రమూ అభ్యంతరం వ్యక్తం చేయలేని రీతితో ఆయన వేదఘోష–వ్యాఖ్యానం సాగింది. విద్వాంసులంతా పరవశించిపోయారు.

మధ్వాచార్యుల వేద పఠనం – వ్యాఖ్యానం తరువాత పుండరీకపురి వంతు వచ్చింది.

పుండరీక పురి వేద పఠనం ప్రారంభించాడు. ఋగ్వేదంలోని మొదటిసూక్తంలోని 'అగ్నినా రయి మశ్నవత్' అన్న దానిని 'అగ్ని నారయమశ్నవత్' అని తప్పుగా ఉచ్చరించడంతో వేద పండితులంతా ఘొల్లున నవ్వారు. పులితోలు ధరించినంతమాత్రాన నక్క పులి అవుతుందా? పుండరీక పురి సామర్థ్యం బయట పడేసరికి కొందరు అతన్ని 'మాయాగోమాయు' అనేశారు.

## పద్మతీర్థుల పలాయనం

ఆ వేళకి ముందుగా అనుకున్నవిధంగా అద్వైత పండితులు కొంతమంది పద్మతీర్థుల నేతృత్వంలో మధ్వాచార్యుల గ్రంథాలను అపహరించారు.

విషయం బయటపడిన తరువాత మధ్వాచార్యులు అక్కడినుండి ఏకవాటి అనే నగరం వెళ్లి అక్కడికి తనతో పోటీకి రావలసిందిగా పద్మతీర్థుల్ని ఆహ్వానించారు.

దానికి పద్మతీర్థులు జవాబిస్తూ "ప్రశ్నించగల విద్వాంసుల్ని పిలవండి. వాదనకొస్తాను" అన్నారు.

దానికి మధ్వులు జవాబిస్తూ "సరే. ప్రశ్నించేవాళ్ల సమక్షంలోనే మీరు పరాభవం పొందుతారు. నన్ను ప్రశ్నించేందుకు మీరు కూడా విద్వాంసుల్ని పిలుచుకోవచ్చు".

"నా శాస్త్రం సామాన్యమైంది కాదు. అది అన్నివైపులా వ్యాపించి ఉంది".

"మీ శాస్త్రం కొన్నిచోట్ల వ్యాపించి ఉండవచ్చు. కానీ మా శాస్త్రం మూడు లోకాల్లోను వ్యాపించి ఉంది".

"మీరు చాలా తప్పుగా మాట్లాడుతున్నారు. వాస్తవం ఏమిటో నా అంతర్యామికి తెలుసు".

తక్షణమే మధ్వులు విస్మయం వ్యక్తం చేస్తూ "ఎంత ఆశ్చర్యకరమైన విషయం. మీరు అంతర్యామిని అంగీకరించిన పక్షంలో మీరు నియమింపబడిన వ్యక్తి మాత్రమే అని ఒప్పుకోవాలి. అయినా మీరు అంతర్యామి అని మాట్లాడినంతనే మా శాస్త్రాలను ఒప్పుకున్నట్లయింది. దీన్నిబట్టి మీతో సహా మూడు లోకాల్లోనూ మా శాస్త్రం వ్యాపించి ఉందనే నిరూపితమవుతోంది" అన్నారు.

ఈ వ్యాఖ్యతో పద్మతీర్థులు నిరుత్తరుడయ్యాడు.

### తత్త్వజ్యోతి

ఏమైనా ఇద్దరినీ పరీక్షించగల పండితసభ ఏర్పాటయింది. ఆ సభలో వారిద్దరి మధ్యా శాస్త్రీయ వాగ్వాదం సుదీర్ఘంగా నడిచింది... కాని చివరికి పద్మతీర్థులు పరాజితులు కాకతప్పలేదు. (ఆ సందర్భంగా మధ్వాచార్యులు చేసిన వాదాలన్నీ ఉపన్యాస రూపంగా సంకలనం చేయబడ్డాయి. అదే 'వాద' అన్న రచనగా ప్రసిద్ధి చెందిన తత్త్వజ్యోతికృతి. మధ్వాచార్యుల గ్రంథాల్ని దొంగిలించిన పద్మతీర్థులు ఆ రకంగా పూర్ణప్రజ్ఞుల ముందు బందీకాక తప్పలేదు. మొత్తంమీద పుండరీక పురి, పద్మతీర్థుల సామర్థ్యంలో అద్వైతవాదులు చేసిన వాదాలన్నీ పరాభవం పొందాయి.

ఆసక్తిగల విషయమేమిటంటే మధ్వులు ఆ వాదన సమయంలో ఎటువంటి వాగ్యుద్ధాలకీ అవకాశం ఇవ్వకుండా ఎదుటివారి వాదాలని తిరస్కరిస్తూ, వారిని పరాభవించి, పలాయనం చేయడానికి వీలు లేకుండా సభలో పండితుల సమక్షంలో తమ వాదాన్ని

నిరూపిస్తూ వచ్చారు. మధ్వుల ఈ విజయానికి సంకేత సూచకంగా ఒక జయ స్తంభాన్ని స్థానికులు ఏర్పాటుచేశారు. అక్కడే ఒక భవ్యవిష్ణు దేవాలయాన్ని కూడా నిర్మించారు.

## కూడిపాడిలో చాతుర్మాస్య దీక్ష

అప్పటికి చాతుర్మాస్య దీక్ష కాలం సమీపించింది. దీక్ష కాలంలో యతులు ఒకేచోట స్థిరంగా ఉండి దీక్ష పాటించాలనే నియమం ప్రకారం మధ్వాచార్యులు కర్నాటకలోని కూడిపాడిలో చాతుర్మాస్య దీక్షని ప్రారంభించారు.

## అపూర్వ గ్రంథాలు

ఆ దీక్షాకాలంలో పాఠ ప్రవచనాలు జరుగుతుండగా మధ్వుల శిష్యులు మాయావాద మతాల విమర్శలను విపులంగా అర్థం చేసుకోవడానికి చాలా కష్టపడుతున్నారు. వాళ్ల ఇబ్బందిని గుర్తించిన మధ్వాచార్యులు అప్పటికప్పుడే సరళమైన భాషలో మాయావాద సిద్ధాంతాలపై విమర్శను రచించడం ప్రారంభించారు.



శ్రీ మధ్వాచార్యులు పాఠ ప్రవచనాలు చేసిన పవిత్రపీఠం (కొడిపాడి)

అలా మూడు చిన్న గ్రంథాలను రచించారు. అద్వైత వేదాంతాన్ని విభిన్న కోణాల్లో సమగ్రంగా విమర్శించే కృతి మొదటిది. ఉపాధిఖండనం, మాయావాద ఖండనం, ప్రపంచ మిథ్యాత్వానుమాన ఖండనం అనే ఈ మూడు కృతులే ఇప్పుడు 'ఖండన త్రయం'గా ప్రసిద్ధి చెందాయి. చిన్నవైనప్పటికీ ఆ మూడు కృతులు అద్వైత వాదాన్ని కూలంకషంగా ఛిన్నాభిన్నం చేసే అసాధారణమైనవి. ఉపాధి ఖండనంలో అద్వైతమతం యొక్క (సంసారానికి కారణమైన) మాయాప్రక్రియని సవిస్తరంగా ఖండించారు. ప్రపంచ మిథ్యత్వానుమానంలో సర్వతోముఖ విమర్శ చేస్తూ సకల దోషాలకీ అత్యుత్తమ నిదర్శనంగా రూపొందించారు. విచిత్రానుమానం అనేది నిరూపించే కృతి.

అలాగే మధ్వ సిద్ధాంతాన్ని సంగ్రహంగా అందించేలా తత్త్వసంఖ్యానం అనే కృతిని అందించారు. స్వతంత్ర, అస్వతంత్ర అనే తత్త్వ విభజన తత్త్వశాస్త్ర ఇతిహాసంలో కొత్త

పంథా. మధ్వతత్త్వవిభాగానికి ఆధారంగా తత్త్వవివేకం అనే మరో కృతిని కూడా పూర్ణప్రజ్ఞులు అందించారు. అది విష్ణువు నుండి సంక్రమించిన తత్త్వవివేకం అనే కృతి యొక్క శ్లోకం నుంచి సంగ్రహించబడింది. ఈ రెండు కృతుల అధ్యయనం ద్వైత సిద్ధాంత సంబంధిత ప్రమేయ శాస్త్రాల సారాన్ని అందిస్తాయి. చూడటానికి చిన్నగా అనిపిస్తాయి కానీ శైలి, సరళతల విషయంలో వీటికివే సాటి.

అలాగే ప్రమాణశాస్త్రానికి సంబంధించి ప్రమాణలక్షణం, కథాలక్షణం అనే రెండు రచనలు కూడా చేశారు. ప్రమాణలక్షణమంటే వేదవ్యాసులు రాసిన బ్రహ్మతర్కం యొక్క సమగ్ర చిత్రం. పరీక్ష, నిదర్శనం మొదలైన సమగ్ర అంశాలను నిరూపించేది ఈ గ్రంథం. కథా లక్షణమనేది 25 శ్లోకాలతో నిండి వేదాంతచర్చ స్వరూపాన్ని చూపించే కృతి.

వాదం, జల్పం, వితండ అనే కథాప్రభేదాలతో చర్చయొక్క విధి విధానాల్నీ, ప్రశ్నించే వాళ్ల లక్షణాన్నీ సదాగమాల వివరాల్నీ స్ఫుటంగా తెలిపేలా మరో విశిష్టమైన 'ప్రమాణ లక్షణం' అనే కృతిని కూడా ఆయన అందించారు. యిటువంటి ప్రమాణ ప్రమేయ విశ్లేషణ యింకే దార్శనికులూ చేయలేదు... మధ్వులు తప్ప. అద్వైతదర్శనం భాట్టమీమాంసకుల ప్రయాణప్రక్రియను, విశిష్టాద్వైతదర్శన- ప్రాభాకర మీమాంసను అలవర్చుకున్నారే తప్ప, వారిదైన ప్రమాణ మీమాంసలేదు. కాని ద్వైతదర్శనం అలా కాదు. ఇలా ప్రమాణ లక్షణం, కథాలక్షణం, ఖండనత్రయం రచించాక వాటిలోని వాదసారళ్యాన్ని అందరికీ అర్థమయ్యేలా ఒక మార్గదర్శకకృతిని కూడా రచించారు. అదే 'విష్ణుతత్త్వ వినిర్ణయం' అని, 'ప్రకరణరాజు' అని ఖ్యాతి పొందింది. దానిలో 'అహం బ్రహ్మాస్మి', 'తత్త్వమసి' మొదలైన సకల అద్వైత బోధనల్నీ చూపించే స్తుతి వ్యాఖ్యలన్నీ ఎలా పరస్పరం విభేదిస్తాయో వివరించే వర్ణనలే విస్తారంగా ఉన్నాయి...

చాతుర్మాస్య దీక్ష పూర్తయింది. కార్తీక పౌర్ణమినాడు కూడిపాడి నుండి బయలుదేరడానికి సిద్ధమయ్యారు. ఆ రోజు పద్మతీర్థులు భయంతో కాసరగోడలోనే కావ్‌మఠం వైపు పలాయనం చేశారు. అప్పటికి గ్రామస్థులంతా కలసి అతను అపహరించిన గ్రంథాలన్నిటినీ తిరిగి మధ్వాచార్యులకు సమర్పించటానికి వచ్చారు. కాని మధ్వులు అలా స్వీకరించక ఆ విషయం ఆ ప్రాంత రాజు దృష్టికి వెళ్లేలా చేసి అంతటి హేయమైన చర్యకు మరోసారి ఎవ్వరూ పాల్పడకుండా జాగ్రత్త తీసుకోవలసిందని సందేశం ఇచ్చారు. ఆ తరువాత అక్కడనుండి సహ్యాద్రి ప్రాంత శిష్యుల కోరికమేరకు మధ్వాచార్యులు ఆ ప్రాంతానికి వెళ్లారు.

## యమక భారత రచన

పూర్ణప్రజ్ఞులు పాల్గొన్న ఒక నిండు పండితసభలో కవులు కొందరు ఒక కోరిక కోరారు. "మీరు ఊహాతీతమైన శాస్త్రపాండిత్యాన్ని కలిగి ఉన్నారు. ఇదే ప్రావీణ్యాన్ని కావ్యాల విషయంలో కూడా చూడాలని మా కోరిక".

ఇలా అడిగిన వాళ్లల్లో మధ్వాచార్యుల పట్ల అసూయతో మండిపోతున్నవాళ్లు కూడా ఉన్నారు. అప్పటికప్పుడే మధ్వాచార్యులు తమ కావ్యప్రతిభని కూడా అసాధారణమైన రీతిలో ప్రదర్శించారు.

ధ్యాయేత్తం పరమానందం యన్మాతా పతిమవాదపరమానందమ్।
ఉజ్ఝితపరమానం దంపత్యద్యాద్యాశ్రమైః సదైవ పరమానందమ్॥

...ఈ శ్లోకంతో ప్రారంభించి మహాభారతంలోని కృష్ణుని సర్వోత్తముడుగా సమర్థించేలా కావ్యగానం చేశారు. ప్రతి శ్లోకంలోనూ ఒక యమకం. ఒక్కొక్క శ్లోకంలోను ఒక్కో రకమైన యమకం. ఇలా యమకాలంకారాలతో 18 పర్వాల మహాభారత సౌందర్యాన్ని 81 శ్లోకాల్లో వర్ణిస్తూ ఆయన కావ్యగానం చేస్తే సభంతా ముగ్ధమైపోయింది.

అలాగే సభని ఆశ్చర్యానందాలలో ముంచిన మరో శ్లోకం ఇలా ఉంది.

భా భా భా భా భా భా భా భా భా భా భా భా భా భా ।
భా భా భా భా భా భా భా భా భా భా భా భా భా భా ॥

ఇదొక అద్భుతమైన యమకాలంకార శ్లోకం. సంస్కృత సాహిత్యంలో ఇదొక అనుపమానమైన రచన. సభ కోరిక మేరకు ప్రతి ఒక 'భా' అక్షరానికి పూర్ణప్రజ్ఞులు కొత్త కొత్త అర్థాలు తెలుపుతూ భగవంతుని యొక్క గుణవైభవాన్ని వర్ణించారు. ఆ సభలో ఉన్న అష్టశిష్యులు హృషీకేశ తీర్థులు, నరహరి తీర్థులు అప్పటికప్పుడే గురువుల మహాభారత వివరణని లిఖించారు. దాన్ని యమకభారత వ్యాఖ్యానంగా చేశారు. నరహరి తీర్థుల ఆ రెండు టీకలు ఇప్పుడు లభ్యమవుతాయి. హృషీకేశ తీర్థుల వివరణ ఆయన లిఖించిన ప్రతిలో ఉంది.

## నరహరితీర్థులకి రాజ్య భారం

పద్మనాభ తీర్థుల తరువాత శిష్యత్వం స్వీకరించిన నరహరితీర్థులకు మధ్వసిద్ధాంత అధారం పట్ల అపారమైన కోరిక ఉండింది.

మధ్వాచార్యులు దాన్ని గుర్తించి, "నువ్వు కళింగ ప్రాంతంలోనే తత్త్వప్రచారం చేస్తూ శ్రీహరిని ఆరాధించు. ఏదో ఒక సమయంలో నీకు అక్కడి రాజ్యాధిపత్యం లభిస్తుంది. రాజు లేకుండా పోయి అరాచకం ఏర్పడినప్పుడు అలా ప్రాప్తమవుతుంది. అప్పుడు నువ్వు సమర్థవంతంగా పాలించి, దేశాన్నీ, ప్రజల్ని రక్షించాలి... సన్న్యాసికి రాజ్యభారం ఏమిటి అనే సందేహం వద్దు. ధర్మం దారి తప్పుతున్నప్పుడు సమర్థులైనవాళ్లు ఎవరైనా సరే పాలించవచ్చు. లేకపోతే భగవంతుడు మెచ్చడు....మా అనుగ్రహం ఎప్పటికీ రక్షణ కవచంలా మిమ్మల్ని కాపాడుతుంది. ఆ రాజ్యానికి తగిన ఉత్తరాధికారి దొరికినప్పుడు ఇక్కడికి వచ్చేయండి. అలా వచ్చేటప్పుడు అక్కడ కోశాగారంలో ఉన్న మూల సీతారామ ప్రతిమల్ని కూడా తీసుకురండి. ఆ విగ్రహాలు స్వయంగా సీతారాముల చేత బ్రహ్మదేవుడికి అనుగ్రహించబడి పూజించబడినవి. హనుమంతుడిగా ఉన్నప్పుడు మేం వాటిని పూజించాం. ఇప్పుడు గజపతి కోశాగారంలో ఉన్న ఆ విగ్రహాలు మీ ద్వారానే మళ్లీ నాకు లభిస్తాయి..."

గురువు ఆజ్ఞను శిరసావహించి నరహరితీర్థులు కళింగదేశానికి ప్రయాణమయ్యారు. నరహరి తీర్థులు కళింగ దేశానికి వెళ్లిన కొంత కాలానికి గురువు చెప్పిన పరిస్థితి ఏర్పడింది. రాజు సంతానహీనుడై చనిపోయాడు. ఏ క్షణంలోనైనా శత్రువులు దాడి చేస్తారేమోనన్న భయం పట్టుకుంది వాళ్లకి. రాజపత్ని ఒకామె గర్భిణిగా ఉన్నప్పటికీ తక్షణమే అధికారంలోకి రావటానికి అర్హులైనవాళ్లెవరూ కనపడలేదు. ఆ సమయంలో వాళ్ల దృష్టి మధ్వసిద్ధాంతాన్ని ప్రచారం చేస్తున్న నరహరి తీర్థులమీద పడింది.

అప్పటి పరిస్థితిలో రాజ్యభారాన్ని నిర్వహించవలసిందిగా మంత్రులు వెళ్లి నరహరి తీర్థుల్ని ప్రార్థించారు. ఆయన వారి ప్రార్థనను అంగీకరించి రాజ్యభారాన్ని స్వీకరించారు. ప్రపంచ చరిత్రలో రాజైన సన్న్యాసి బహుశా నరహరితీర్థులు ఒక్కరే. ఇదంతా మధ్వానుగ్రహం వల్లనే జరిగిందని నరహరి తీర్థులకు అర్థమయింది.

## దేశమరాజు ప్రార్థన

సహ్యాద్రి ప్రాంతంలో మధ్వాచార్యులుండగా జయసింహ రాజు పంపిన రాయబారి ఒకరొచ్చి నమస్కరించి "రాజాజ్ఞ ప్రకారంగా మీ గ్రంథ భాండాగారాన్ని మీకు తిరిగి ఇవ్వటానికి ఏర్పాటు చేశాం. దయచేసి మీరు స్వయంగా వచ్చి స్వీకరించవలసింది" అని ప్రార్థించారు. వాళ్ల ప్రార్థన మేరకు పూర్ణప్రజ్ఞులు కాసరగోడకు ప్రయాణమయ్యారు.

అలా ప్రయాణం చేస్తూ తనతో వాదానికి దిగిన దుర్వాదులందరినీ ఓడిస్తూ వెళ్లారు.

కాసరగోడ దగ్గర లోనే మధూర అనే దేవాలయంలో రాత్రికి బస చేశారు. తెల్లవారు ఝామునే ప్రాతఃసంధ్య కార్యక్రమం ముగించుకుని మధ్వాచార్యులు బయలుదేరారు. ఒక శిష్యుడు తులసిమాలను గురువు మెడలో అలంకరింపచేస్తే, మరొకరు శుచిగా గురువుల దేవతార్చన పెట్టెను తలమీద పెట్టుకున్నారు. ఇంకొకరు ఆయన దండకమండలాల్ని పట్టుకున్నారు. ఇంకొక యువశిష్యుడు గురువుల గ్రంథభారాన్ని స్వీకరించాడు. దేవస్థానం గంట గణగణ మోగింది. అదే ఆదేశంగా భావించి పూర్ణప్రజ్ఞులు ప్రయాణం ప్రారంభించారు. ఒక శిష్యుడు ఆయనకి తెల్లటి గొడుగు పట్టాడు. మరొక శిష్యుడు ఆయన ముందు కూర్చుని ఆయనను తన భుజాలమీద కూర్చుని పెట్టుకుని నడవటం ఆరంభించాడు. చూడటానికి అతడు గురువుని మోస్తున్నట్లుగా అనిపిస్తుంది కానీ భరించేవాడు, కూర్చున్నవాడు... అన్నీ కూడా ముఖ్య ప్రాణులే. అసంఖ్యాకంగా ప్రజలు వారి వెనుక వెళ్తున్నారు.

వాళ్ల రాకను తెలుసుకొని జయసింహ రాజు తానే స్వయంగా వచ్చి, వాహనం దిగి కాలి నడకన పూర్ణప్రజ్ఞుల దగ్గరికి వచ్చి సాష్టాంగ నమస్కారం చేశాడు. అనంతరం వారిని ముందుంచుకొని గజ, తురగ వగైరా వాహనాలతో ఊరేగింపుగా విష్ణుమంగళ దేవస్థానానికి తీసుకువెళ్లారు.

అప్పటికక్కడ ఒక పెద్ద జనసాగరం ఎదురుచూస్తోంది. ఎక్కడెక్కడి జనం తేజోమూర్తులైన మధ్వాచార్యులను చూడటానికి గుమిగూడారు. వారి శిష్యవర్గం గురువులు రచించిన ద్వాదశస్తోత్రం మొదలైన కృతులు పాడుతూ, నర్తిస్తున్నారు. జయసింహ రాజు ప్రజల తోపులాటని సహిస్తూ వారి వెనకాల వినయంగా నడుస్తూ వస్తున్నారు.

ఆ ప్రజాసమూహం మధ్యలో ఎర్రటి పాదాలతో సింహ గాంభీర్యంతో బంగారపు శరీరఛాయతో, ఉదయిస్తున్న సూర్యుడి కిరణాల రాశిలా ప్రకాశిస్తున్నారు మధ్వాచార్యులు. దైవత్వం ఉట్టిపడుతున్న ఆ తేజోమూర్తిని చూసి అందరూ భక్తి పారవశ్యంలో తేలియాడుతున్నారు.

అందరికీ ఆయన్ని దగ్గరి నుంచి చూడాలనే. కాని జనాల్ని తోసుకునిముందుకు వెళ్లే శక్తి అందరికీ లేదు. ముఖ్యంగా వృద్ధులు, మహిళలు, పిల్లలు ముందుకు పోలేక పోతున్నారు.

ప్రజల మనసు గ్రహించిన మధ్వాచార్యులు తక్షణమే ఒక విశిష్టమైన యోగశక్తిని ప్రదర్శించారు.

అద్భుతం!

ప్రతి ఒక్కళ్లకీ తమ ఎదురుగా మధ్వాచార్యులు నిలబడ్డారా అనిపించింది. ఆయన వక్షస్థలం పైభాగం ప్రతి ఒక్కళ్లకీ కళ్లెదురుగా స్పష్టంగా కనబడుతుంటే తన్మయత్వంతో 'ఆహా!' అనుకుంటూ నమస్కరిస్తూ మురిసిపోయారు. ఇలాంటి సకల సిద్ధుల సాకారమూర్తి మధ్వాచార్యులు మాత్రమే. జరిగిందేమిటో తెలుసుకున్న తరువాత ప్రజలంతా 'యుగ పురుషులు'గా పూర్ణప్రజ్ఞుల్ని కీర్తించారు.

మధ్వాచార్యుల ప్రశస్తి విస్తృతంగా దేశమంతా పాకింది. వాళ్లు వెళ్లిన ప్రతిచోటా వారిని చూడటానికి ప్రజలు తండోపతండాలుగా వచ్చేవారు. వారిని చూసిన వెంటనే "మనం విన్న దాని కంటే ఎంత ఉన్నతమైన స్వామి వీరు" అని ఆశ్చర్యానందాలలో మునిగిపోయేవారు.

## భాగవత ప్రవచనం

మధ్వాచార్యులు తమ చాతుర్మాస దీక్ష ప్రారంభంలో సాగించిన ఆధ్యాత్మిక సభలన్నీ సత్వరహితంగా సభికులకి తోచేవి. వారి ప్రవచనంలో ప్రధాన విషయం శ్రీ మద్భాగత పురాణం. ఆ పురాణమంతా శ్రీకృష్ణుని జీవిత చరిత్రే. పురాణ శ్రవణం వల్ల కలిగే ఫలం ముక్తి. పురాణాన్ని చదివే బాధ్యత శిష్యాగ్రేసరులైన హృషీకేశ తీర్థులది. హృషీకేశ తీర్థులు శ్రావ్యంగా శ్లోకాలు చదువుతుంటే గంభీరంగా మధ్వాచార్యులు ప్రవచనం చేసేవారు. సరస్వతీ కటాక్షులు కనుక వారి వాగ్ధాటి, విషయ వర్ణన, స్ఫుటమైన భావవ్యక్తీకరణ శ్రోతలైన పండిత పామరులను ఆనందసాగరంలో ముంచెత్తుతుండేవి.

## భాగవత తాత్పర్యం

ప్రతిరోజు మధ్వాచార్యుల నోటివెంట భాగవత పురాణం వింటూ వచ్చిన జిజ్ఞాసువులు మధ్వాచార్యులను ప్రార్థించారు. "భాగవతాది పురాణాలన్నీ కూడా ఎంతో జటిలమైనవి.

వాటి యథార్థ పరిజ్ఞానం వేదాల తాత్పర్యాన్ని అర్థం చేసుకోవడానికి అపారంగా ఉపకరిస్తాయి. అయితే ఇవి సామాన్యులకు క్లిష్టమైనటువంటి భాషలో వ్యాసులవారు రచించినవి. వీటి మర్మం పామరులకు అర్థమయ్యేలా పురాణాలకు కూడా ఒక భాష్యాన్ని రచించాలి".

మధ్వులు ఆలస్యం చేయలేదు. వ్యాసదేవులను స్మరించుకొని శ్రీమద్భాగవత తాత్పర్య నిర్ణయాన్ని రచించారు. నిజానికది సమగ్ర పురాణ ప్రపంచ విశ్లేషణ.

## త్రివిక్రమ పండితులు

లికుచ వంశం అనేది అప్పటి విద్వాంసుల వంశాల్లో ఒకటి. తపస్సు, కవిత్వం మొదలైన సద్గుణాలకి నిలయమని ఆ వంశానికి పేరు. ఆంగీరస గోత్రీకులైన ఆ వంశస్థుల్లో సుబ్రహ్మణ్య పండితులని ఒక జ్ఞాని ఉండేవారు. ఆయన భార్య ఎంతో అనుకూలవతి. వారిదెంతో అన్యోన్యమైన దాంపత్యమైనప్పటికీ వారికి పుట్టిన పిల్లలందరూ వెంటవెంటనే చనిపోతూ ఉండేవారు. విధి ఎంత విచిత్రమైంది!

వాళ్లకి ఎప్పటికన్నా తమకి ఒక కొడుకు పుట్టాలని కోరిక. ఆమెకు శ్రీకృష్ణుడంటే మహా భక్తి. తన కోర్కె నెరవేరడం కోసం హరిహరు (శంకర నారాయణ) లను సేవించాలని నిశ్చయించుకున్నారు. అలా వాళ్లిద్దరూ స్థిరమైన మనస్సుతో, అకుంఠిత దీక్షతో శంకర నారాయణుల్ని సేవించారు. శ్రీహరి సర్వోత్తముడైతే హరుడు మనోనియామకుడైన విద్యా దేవత. వాళ్లిద్దరి అనుగ్రహంతో సుబ్రహ్మణ్య దంపతులకి ఒక కొడుకు పుట్టాడు. ఆ పిల్లవాడిలో గోచరించిన అపూర్వ లక్షణాలను బట్టి అతనికి 'త్రివిక్రమ' అని పేరు పెట్టారు. కొన్ని మాసాల్లోనే మరో కొడుకు పుట్టాడు. ఈ కుర్రవాడికి 'శంకర' అని పేరు పెట్టారు.

వయసు వస్తున్నకొద్దీ వాళ్లిద్దరిలోని అసాధారణ ప్రతిభ నలుగురినీ ఆకర్షించేది. త్రివిక్రముడిది విచిత్రమైన కావ్యప్రతిభ. అతని మొదటి మాటే ఒక కావ్యం. చిన్న వయస్సులోనే త్రివిక్రముడు రచించిన 'ఉషాహరణం' అనే కావ్యం విద్వాంసుల ప్రశంసల నందుకొంది. యుక్తవయసు వచ్చేనాటికే అతడు త్రివిక్రమ పండితుడుగా గుర్తింపు పొందాడు.

కవిత్వంలో లాగానే వేదాంతంలో కూడా అపారమైన జ్ఞానాన్ని త్రివిక్రమ పండితులు సంతరించుకున్నాడు. ఒకరోజు అతడి గురువులు అద్వైత వేదాంత పాఠం చెప్తున్నప్పుడు అతను ప్రశ్నించాడు. "ఈ మాయ పరికల్పన తర్కసమ్మతమైంది. కాని ఏ విధంగానూ దీన్ని ఒప్పుకోవడానికి సాధ్యం కావటంలేదు. దీనికి మీరేమైనా వివరణ ఇవ్వగలరా..."

ఇలా త్రివిక్రముడు సంధించిన ప్రశ్నలకు గురువు ఆనందపడుతున్నారు కానీ, సమాధానం చెప్పలేకపోతున్నారు. అలాంటి రోజులలోనే ఒకసారి భాను అనే ప్రాభాకర మత పండితుడొకడు త్రివిక్రముడితో పోటీలో ఓడిపోయాడు.

అద్వైత మతంలో ఒక లక్షా ఇరవై ఐదు వేల గ్రంథాలు ప్రచారంలో ఉన్నాయి. విచిత్రమేమిటంటే, అన్ని గ్రంథాల్లోనూ త్రివిక్రముడికి అసాధారణమైన పాండిత్యం అబ్బింది. యుక్తవయసులోనే 'విద్వత్‌శేఖరుడు' అనిపించుకున్నాడు. తండ్రికి కొడుకు పట్ల అవ్యాజ్యమైన ప్రేమ, అభిమానం. ఒకరోజు తండ్రి కొడుకును పిలిచి "భగవంతుడు నిర్గుణుడు అని ఆరాధించడం శోభస్కరం కాదు. ముక్తి అనేది జ్ఞానము, ఆనందము మొదలైన గుణాలతో కూడి ఉండేది. నిర్గుణోపాసన వల్ల అంతటి ముక్తి సాధ్యపడదు. అలాంటి ముక్తి సాధించాలంటే గుణపూర్ణుడైన వాసుదేవుణ్ణే భజించాలి. నువ్వు కూడా అలానే చేయి." ఇది అచ్యుతప్రేక్షులు వారి అంత్యకాలంలో గురువులకిచ్చిన సందేశాన్ని జ్ఞప్తికి తెస్తుంది. అంటే ఆలోచించినవారికి బ్రహ్మ నిర్గుణాత్మకమైన వాదన నచ్చదు.

ఒకవైపు మాయావాద దుర్ఘటం అనే భావాలు, మరోవైపు నిర్గుణబ్రహ్మ కల్పనను నిరాకరించాలన్న తండ్రి ఆదేశం. ఎటూ తేల్చుకోలేని స్థితి. ఈ దశలో ఆయన నిర్గుణోపాసన ప్రతిపాదించే మాయావాదుల వాదాన్ని మరోసారి అధ్యయనం చేశారు.

త్రివిక్రమ పండితులు ఇలా డోలాయమాన స్థితిలో ఉన్న సమయంలో అతని తమ్ముడు శంకర పండితులు మధ్వుల ప్రవచనం వల్ల ప్రభావితులై ఆయన శిష్యరికం స్వీకరించారు.

ఒక శుభ ముహూర్తంలో త్రివిక్రమ పండితునికి వివాహం జరిగింది. గృహస్థాశ్రమ ధర్మాచరణ అంతా సజావుగానే సాగుతోంది. కాని... "ఏ వాదం సరైనది? ఏ సిద్ధాంతాన్ని నేను అనుసరించాలి" అన్న విషయంలో సందిగ్ధ స్థితి మాత్రం మనసులోంచి తొలగిపోలేదు.

అనేకసార్లు ఈ విషయం మీద మనస్సు కల్లోలానికి గురయ్యేది. ఏది?, ఏది సరైన మార్గం? ఏ తత్త్వాన్ని నేను అనుసరించాలి?... అన్న ప్రశ్న మస్తిష్కాన్ని తొలిచేస్తూ ఉండేది.

"వేదాల అర్థం తెలుసుకోవాలంటే వేదవ్యాసులు రచించిన బ్రహ్మ సూత్రాలే ఆధారం. వాటి సహకారం లేకుండా వేదాలు తదితర శాస్త్రాల మూల స్వరూపాన్ని తెలుసుకోలేం... కాని బ్రహ్మసూత్రాల అర్థం తెలుసుకోవాలంటే వాటిమీద భాష్యం అధ్యయనం చేయాలి. అయితే ఏ భాష్యాన్ని అధ్యయనం చేయాలి? బ్రహ్మసూత్రాల మీద ఒక భాష్యం కాదు, శంకరభాష్యం మొదలుకొని చాలా భాష్యాలు వచ్చాయి. వీటిలో ఒక దానికీ మరొక

దానికీ పొంతన లేదు. ఇంత పరస్పర వైరుధ్యం వున్న భాష్యాల్లో ఏ భాష్యం ప్రామాణికమని చెప్పగలం?... పోనీ, అన్నీ అధ్యయనం చేద్దామంటే అది పూర్తిగా మరింత గందరగోళ స్థితివైపు పయనించటం మాత్రమే అవుతోంది... ఇదంతా ఎందుకు? కొన్ని తరాలుగా పరంపరగా వచ్చింది కాబట్టి శంకరభాష్యం ఒక్కటే చదివితే సరిపోతుందేమో! మరి దానికి విరుద్ధంగా వచ్చిన భాష్యాలన్నీ అర్థరహితమేనా?... పోనీ భాష్యాల సంగతి పక్కన పెట్టి నేరుగా ఉపనిషత్తుల అధ్యయనం సాగిస్తే?... అదెలా సాధ్యం? బ్రహ్మసూత్రాలు తదితర శాస్త్రాలలో ప్రతిపాదించబడిన మార్గాన్ని కాదని మరో రకంగా ముక్తి ఎలా సాధ్యపడుతుంది?... జ్ఞానము, ఆనందము తదితర గుణాల పూర్ణస్వరూపుడు, సర్వవ్యాపితుడు, సర్వ శక్తిమంతుడూ, సర్వజగత్తుకీ ఆధారభూతుడూ అయిన భగవంతుణ్ణి ఉపాసించటమే శాస్త్ర సమ్మతం. అంతటి విశ్వరూప శక్తిని నిరాకారుడని ఎలా భావించటం? అతడు ఎలాంటి ఆకారమూ లేని ప్రకాశం మాత్రమే అన్న మాట నమ్మదగినదేనా?... లేదంటే, ప్రకాశం లేని స్వరూపాన్ని ఉద్దేశించే బ్రహ్మోపాసన సాగిద్దామా అంటే, అది అంధకారాన్ని ఉపాసించటమే అవుతుంది కదా! అందువల్ల లభించే ముక్తిని అంధ తమస్సే అనాల్సి వస్తుంది కదా!..." ...ఇలా అనేకసార్లు తర్జన భర్జన పడ్డాడు.

చివరికి, "బ్రహ్మ నిర్గుణత్వవాదన సంతృప్తికరంగా లేదు. ఇందుకోసం మనకి కావలసిన స్మృతిపరమైన సదాచారాన్ని ఆచరిస్తూ, వేద, పురాణ, భారత, భాగవతాలను అధ్యయనం చేస్తూ వాటిల్లోంచి మనకి అర్థమయినంత అర్థం చేసుకొని ముకుందుణ్ణి గుణపూర్ణుడని ఉపాసించటమే ఉత్తమం" అన్న నిర్ణయానికి వచ్చాడు త్రివిక్రమ పండితుడు... అప్పట్నుంచి అలానే చేయటం ఆరంభించాడు.

అలాంటి రోజుల్లో ఒక రోజున పూర్ణప్రజ్ఞుల గురించి వినటం తటస్థించింది. త్రివిక్రముడిలో జ్వలిస్తున్న తత్త్వవిచారం అతణ్ణి మధ్వుల ప్రవచనం వినేలా చేసింది. అదెలా జరిగిందంటే...

అద్వైతమత పండితులంతా కలిసి త్రివిక్రమ పండితుడి దగ్గరకి వెళ్లారు. "స్వామీ! పూర్ణప్రజ్ఞులనే మహా చతురుడొకరు, పరంపరాగతంగా వస్తున్న మన అద్వైత సిద్ధాంతాన్ని ఒక సాధారణ మాయావాదంగా వర్ణించి ఖండిస్తున్నారు. మీరు మహాపండితులు. మీరు తప్ప పూర్ణప్రజ్ఞుల్ని ఎదిరించి, ఓడించగలవారు లేరు. మీరు చొరవ తీసుకుని మధ్వాచార్యుల్ని తత్త్వసిద్ధాంత వాదనలో ఓడించి పరంపరాగతంగా వస్తున్న అద్వైతవాద సౌధాన్ని కాపాడాలి..." అంటూ అభ్యర్థించారు.

త్రివిక్రమ పండితుడికి తెలీదు – తాను నిజంగా మధ్వుల్ని గెలవగలడో లేదో. ఏం చేయాలి? ఇంతలో ఒక సభలో మధ్వుల శిష్యులు తారసపడ్డారు. చర్చ జరిగింది. త్రివిక్రమ పండితుల వాగ్ధాటి ముందు వాళ్లు నిలవలేకపోయారు. అద్వైత పండితులు హర్షధ్వానాలు చేశారు. ఇక మధ్వుల్ని కూడా త్రివిక్రమ పండితులు సునాయాసంగా జయించేస్తారన్న నమ్మకం వాళ్లలో పెరిగింది.

కాని, త్రివిక్రమ పండితుడికి అలా అనిపించటం లేదు. ముందుగా నేను మధ్వమత గ్రంథాలను చదివి అర్థం చేసుకోకుండా, మధ్వులతో వాదానికి దిగటం ఎలా సమంజసం? అనుకున్నారు.

వెంటనే తమ్ముడైన శంకర పండితుల్ని అడిగారు. "నువ్వు మధ్వులకి ప్రియశిష్యుల్లో ఒకడివి కదా! మధ్వ మత గ్రంథాలను చదివే అవకాశం నాకు కల్పించగలవా?"

నిజానికి తమ్ముడికి గల ఒక బాధ్యత మధ్వ భాండాగారాన్ని పరిరక్షించటం. సులువుగానే త్రివిక్రమ పండితుల అధ్యయనం ప్రారంభమయింది. (శంకర పండితుల పట్ల మధ్వులకున్న పూర్ణవిశ్వాసం ఎలాంటిదంటే, ఆయన తన దగ్గర శిష్యరికం తీసుకున్నప్పటికీ శంకర పండితుని పేరు మార్చుకోమని చెప్పలేదు. అలాగే కొందరు అద్వైతులు తమ గ్రంథాల్ని కొన్నింటిని తస్కరించినప్పటికీ, శంకర పండితుల మీద నింద పడనీయలేదు. పైగా జయసింహ రాజు నుండి గ్రంథాలు తిరిగి వచ్చాక వాటి బాధ్యతను మళ్లీ శంకర పండితులకే అప్పగించారు. ఎంతటి ఔన్నత్యం?)

త్రివిక్రమ పండితులు ప్రతిరోజూ రాత్రి పూట ఇంట్లో అందరూ నిద్రపోయాక మధ్వమత సిద్ధాంత గ్రంథాలను అధ్యయనం చేయసాగారు.

ఒక రోజు...

రెండు రోజులు...

రోజులు గడుస్తున్న కొద్దీ గ్రంథాల లోతుల్లోకి వెళ్తున్నకొద్దీ తనలో ఇంత కాలంగా సాగుతున్న సందిగ్ధస్థితికి తెరపడుతున్నట్లనిపిస్తోంది. తాను ఎదుర్కొంటున్న అనేక ప్రశ్నలకి సమాధానం దొరుకుతున్నట్లనిపిస్తోంది... క్రమంగా సందిగ్ధపొరలు తొలగిపోతున్నాయి.

ఆ గ్రంథాల్లోని అర్థాల విశిష్టత, నిరూపణా విధానం, స్పష్టత, నిరంతర ప్రమాణాలతో కూడిన ఉదాహరణలు... ఒక్కొక్కటిగా త్రివిక్రమ పండితుల తత్త్వ విచారానికి మార్గదర్శనం చేస్తూ వచ్చాయి. వాటి ప్రతి వాక్యంలోనూ ప్రస్ఫుటమవుతున్న భగవత్తత్త్వం వారి మనస్సుని

ఆకర్షిస్తూ వచ్చింది. లోతుల్లోకి వెళ్లిన కొద్దీ వెదుకుతున్నదేదో లభిస్తోందన్న ఆనందం, పారవశ్యం త్రివిక్రమ పండితుల్ని ఆవహించాయి.

ఆ అధ్యయనంలో త్రివిక్రమ పండితుడికి తన తండ్రిగారు ఇచ్చిన సందేశమాహాత్మ్యం అర్థమయింది... "భగవంతుడి యొక్క గుణ పూర్ణత్వాన్ని ఉపాసించటమే పరమపద సోపానం. భగవంతుణ్ణి నిర్గుణుడిగా ఎంచి ఉపాసించటం అర్థరహితం..."

ఒక్కసారిగా అంధుడికి చూపువచ్చినంత ఆనందం త్రివిక్రమ పండితుడిలో పరవళ్లు త్రొక్కింది.

జ్ఞానోదయమైంది.

"మధ్వులే నా స్వరూపోద్ధారక గురువులు" అన్న నిర్ణయం మనసులో మొలకెత్తింది.

అలా నిర్ణయించుకున్నాక మధ్వాచార్యుల దర్శనానికి త్రివిక్రమ పండితులు సన్నద్ధమయ్యారు. ఈ వార్త తెలిసిన అద్వైత పండితులంతా మధ్వాచార్యుల్ని వాదంలో ఓడించడానికే త్రివిక్రమ పండితులు వెళ్తున్నారని సంబరపడ్డారు.

త్రివిక్రమ పండితుల మనస్సులో వున్నది వేరు. "నేను నేరుగా మధ్వులతో వాగ్వాదానికి దిగటంవల్ల వారి గ్రంథాల్లో చదివిన సంగతులను వారి ముఖతః ఉపదేశంగా పొందటం సాధ్యపడుతుంది. కనుక ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలి..."

**రాజసభలో గ్రంథాల సమర్పణ**

సరిగ్గా ఇదే సమయంలో-

జయసింహరాజు ఆహ్వానం మేరకు మధ్వాచార్యులు కాసరగోడ చేరుకోవటం, అక్కడ గతంలో పద్మతీర్థులు ప్రభృతుల చేత తస్కరించబడిన మధ్వగ్రంథాలను తిరిగి పూర్ణప్రజ్ఞులకు అందించేందుకు రాజు ప్రజా దర్బారు నిర్వహించటం జరుగుతోంది.

జయసింహరాజు తాను కంబళీ ప్రాంత పాలకుడైనప్పటికీ ఎంతో వినయ విధేయతలతో మధ్వాచార్యులకి స్వాగతం పలికి, ప్రజలు, పండితుల సమక్షంలో ఆయనకి ఉపచారాలు చేయటం, నిండుసభలో తాను సంరక్షిస్తూ వున్న మధ్వగ్రంథాల భాండారాన్ని ఆయనకి వినమ్రంగా స్వాధీనపరచటం... అతనినొక ఆదర్శపాలకుడిగా చరిత్రలో నిలిపాయి.

మధ్వుల ఆదేశంతో శంకర పండితులు ఆ గ్రంథాలను స్వాధీన పర్చుకున్నారు.

## రాజసభలో గురురాజులు

పండితులు ప్రజలు పాల్గొన్న ఆ సభలో మధ్వాచార్యుల పాదాల దగ్గర జయసింహ రాజు కూర్చుని వున్నారు. సభ జరుగుతున్న ప్రదేశం త్రివిక్రమ పండితులుండే విష్ణుమంగళ గ్రామానికి ఒకటి-రెండు మైళ్ల దూరం మాత్రమే.

ఏ మధ్వ గ్రంథాలు చదవటం వల్ల తనలో తత్త్వ విచారానికి సంబంధించిన డోలాయమాన పరిస్థితి మబ్బులు విడిపోయినట్లు విడిపోయి, దిశానిర్దేశం జరిగిందో ఆ గ్రంథాల సృష్టికర్తని చూడటానికి త్రివిక్రమ పండితులు మహోత్సాహంతో ఆ సభకి విచ్చేశారు.

నిండు సభలో బ్రహ్మతేజస్సు ఉట్టిపడుతున్న పూర్ణప్రజ్ఞులను చూడగానే త్రివిక్రమ పండితులకి శరీరంలో అణువణువూ భక్తి ప్రపత్తులతో పులకించిపోయింది. ఆ క్షణంలో మధ్వుల పాదాల వద్ద కూర్చొని ఉపచారాలు చేస్తున్న జయసింహ రాజునుద్దేశించి త్రివిక్రమ పండితుల నోట ఆశువుగా ఒక ఆశీఃశ్లోకం వెలువడింది.

స్వః సుందరీ భుజలతా పరిరంభణీధోః పారందరీభజంతి యం భజతాం భుజిష్యా
ఆనందతీర్థ భగవత్పాద పద్మరేణుః స్వానందదోభవతు తే జయసింహ భూప॥

(జయసింహ రాజా! ఆనందతీర్థ భగవత్పాదుల పాదపద్మముల ధూళి మీకు ముక్తిని కరుణించనీ; ఇది ఇంద్రుడంతటి పరమ శ్రేష్ఠులకు లభించే మహా భాగ్యం.)

అలా మధ్వ సిద్ధాంత గ్రంథాలు ఆకళింపు చేసుకోవడం ద్వారా మధ్వతత్త్వం వైపు ఆకర్షితుడైన అద్వైత పండితుడు త్రివిక్రమ పండితులు.

## చాతుర్మాస్య దీక్ష

చాతుర్మాస్యకాలం సమీపించటంతో ఈ సారి చాతుర్మాస్యదీక్షను విష్ణుమంగళంలోనే సాగించవలసిందిగా జయసింహరాజు మధ్వులను అర్థించాడు. పూర్ణప్రజ్ఞులు అంగీకరించారు. రాజు ఆనందంతో ఉబ్బితబ్బిబ్బయ్యాడు.

దీక్షకాలంలో - ప్రతి నిత్యం సుప్రభాత సమయంలో తీర్థ స్నానం, తరువాత జపం, నిత్యానుష్ఠానం, పద్మాసన స్థితిలో నారాయణ ధ్యానం... మధ్వాచార్యుల నిత్యకృత్యం.

గురువు అడుగుజాడల్లో శిష్యులు తమ జపాది ఆహ్నికాలు సాగిస్తున్నారు. శ్రేష్ఠమైన సేవలో శిష్యులు తరిస్తున్నారు. శిష్యులలో ఎవరైనా తమ కర్తవ్య నిర్వహణలో బద్ధకించినా

వాళ్లని మందలించటానికి బదులు వారి పట్ల గురువు ప్రదర్శించే సానుభూతి వారికి గురువు పట్ల భక్తి పెరగటానికి కారణమయ్యేది.

జ్ఞానాసక్తులైన వారికోసం నిత్యం శిబిరంలో జ్ఞానకార్యం నడిచేది. మఠాల్లో జ్ఞానకార్యం సాగుతుంటేనే సమాజానికి మఠాలు దిశానిర్దేశం చేయగలిగి ఉంటాయి. మఠంలోని సన్న్యాసులు సమాజానికి ఆదర్శప్రాయులు కాగలుగుతారు.

అనుదినం దేవస్థానానికి కుడివైపునున్న చక్రతీర్థంలో స్నానం చేసి, అనుష్ఠానం పూర్తి చేసుకుని, మధ్వాచార్యులు పూజ ప్రారంభించే ముందు, నిర్మాల్య విసర్జన పూజ ప్రారంభించేవారు. ఆ నిర్మాల్య పుష్పాలలో నెయ్యిలా ఘనీభవించిన పదార్థాన్ని శిష్యులు గమనించేవారు. నిజానికి అది అమృతమనీ, పూజ ప్రభావంవల్ల అమృతం నిర్మాల్యంలో చేరుతోందనీ తెలిసినప్పుడు శిష్యులు సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయేవారు. మధ్వాచార్యుల ఆచారం ప్రకారం సూర్యోదయానికి ముందే దేవుని ప్రతిమ దగ్గరుండే నిర్మాల్యాన్ని విసర్జించాల్సి ఉంది. నిర్మాల్యాన్ని విసర్జించాక నిర్మాల్య తీర్థాన్ని పూర్ణప్రజ్ఞులు తమ శిష్యులకిచ్చే వారు... శాస్త్రాలలో చెప్పినదాని ప్రకారం, నిర్మాల్యతీర్థ సేవనం పన్నెండేళ్ల ఉపవాస వ్రతానికి సమానం.

ఈ కార్యక్రమం ముగిశాక, గురువు యోగపీఠంపై కూర్చొని ప్రవచనం ప్రారంభించేవారు. ప్రతి ప్రవచనమూ ఓంకారంతో ప్రారంభమయ్యేది. ప్రవచనం మధ్యలో శిష్యులు లేవనెత్తే సందేహాలకు అప్పటికప్పుడే వివరణలిస్తూ సమాధాన పరిచేవారు. అలా మిట్టమధ్యాహ్నం దాకా ఆ ప్రవచనం సాగుతుండేది.

ఆ తరువాత మధ్యాహ్న స్నానం. రెండవ బదరియాత్రలో భగవంతుడిచ్చిన వరం ప్రకారం వారు స్నానం చేసే ప్రతి తీర్థంలోనూ గంగ అంతర్లీనంగా ప్రవహించేది.

స్నానం చేశాక వారి నుదుట ఊర్ధ్వపుండ్రాలు, ఇరుభుజాలమీద శంఖుచక్రాలు ఆకాశంలో సూర్యుడిలా ప్రకాశిస్తూ ఉండేవి. అక్కడ్నుంచి వారు మఠం ఆవరణలోకి వస్తున్నప్పుడు ప్రజలకు వారిని చూడగానే స్వచ్ఛందంగా దారి విడవాలనిపించేటంతటి వర్చస్సు వారి మొహంలో తొంగి చూసేది.

గురువు మఠంలో ప్రవేశించే ముందు శిష్యులొకరు వారి పాదాలను శుచిగా కడిగేవారు. ఆ పాదోదకాన్ని శిష్యులంతా భక్తితో శిరస్సున జల్లుకునేవారు.

మధ్వులు పూజకు కూర్చునే సమయానికి ఒక యతి శిష్యులు శుద్ధ జలాన్ని కలశంలో తీసుకువస్తే ఆ జలాన్ని శంఖంలో నింపి దాంతో మధ్వులు భగవంతునికి అభిషేకం

చేసేవారు. అభిషేకం అయ్యాక గంధం, తులసి, పుష్పాలతో భగవంతుణ్ణి పూజించేవారు. క్రమంగా షోడశోపచార పూజలు పూర్తిచేసి ఆరు ఇతర ఉపచారాలను కూడా సమర్పించేవారు. ప్రతి పూజలోనూ 'అహింస, సత్యం, అస్తేయం, బ్రహ్మచర్యం, అపరిగ్రహం, శౌచం, తుష్టి, సర్వసమర్పణ' అనే ఎనిమిది భావాలు తొంగిచూసేవి. పూజ పూర్తయ్యాక మధ్వులు గంధాక్షతలు ధరించి మందహాస ముఖంలో ఆసీనులయ్యేవారు. 'శ్రీహరి ప్రీతుడు' అయిన ఆ అపూర్వ తేజోమూర్తిని చూడటం కోసం భక్తులు ప్రతిరోజు అర్రులు చాచేవారు.

భోజనమయ్యాక రత్నకంబళి వేసిన పీఠంమీద కూర్చొని సభామంటపంలో వేదశాస్త్ర సంభాషణలతో విద్వాంసుల్ని ఆనందపరుస్తూ శాస్త్రచర్చ చేసేవారు. అలా వ్యాఖ్యానం చేస్తున్న మధ్వాచార్యుల్ని చూసి ప్రజలు వేదవ్యాసదేవులే దిగివచ్చారు కదూ! అనుకుంటుండే వారు. ఆ తర్వాత మళ్లా పాఠ్యప్రవచనముండేది. సూర్యాస్తమయ సమయానికి ప్రవచనం ముగించి సంధ్యాకాల కృత్యాలను సాగించేవారు. ఆ కార్యక్రమం పూర్తవగానే మళ్లా భాగవతం తదితర పురాణాల ప్రవచనం చేసేవారు. హృషీకేశతీర్థులు చదువుతుంటే మధ్వాచార్యులు ప్రవచనం సాగించేవారు.

### ప్రవచన వైభవం

విష్ణుమంగళానికి సమీపంలో కుడిత్ అనేది వేరొక గ్రామం. ఒకరోజు ఆ ప్రాంతవాసులు వచ్చి తమ ఊరివారికి కూడా మధ్వాచార్యుల ఉపదేశం వినే భాగ్యం కలిగించాలని ప్రార్థించారు.

వాళ్ల కోర్కె మేరకు మధ్వులు కుడిత్‌లో బ్రహ్మసూత్ర భాష్య ప్రవచనం సాగిస్తూంటే అప్పుడే అక్కడికి త్రివిక్రమ పండితులు కూడా వచ్చి శ్రోతల్లో కూర్చున్నారు. ఆ ప్రవచనాన్ని విన్న మరుక్షణమే పూర్ణప్రజ్ఞుల దగ్గర శిష్యత్వం స్వీకరించాలని త్రివిక్రమ పండితులు నిశ్చయించుకున్నారు.

మధ్వాచార్యుల ప్రవచనం యుద్ధ శిబిరాల నుండి బయటకు వచ్చే సేనల్లాగా అనిపించేవి. చతురంగ సేనల్లాంటి వారి ప్రవచనంలో బ్రహ్మసూత్రాలే రథం, వేదాలే ఏనుగులు, యుక్తులే పదాతులు, కృతులే అశ్వాలు, ధ్వనులే మేఘ గర్జనలు.

ఓహ్! అద్భుతమైన ప్రవచన ప్రవాహం.

శ్రీహరి పదకమలాల్ని ఆశ్రయించి, బ్రహ్మదేవులచే పూజింపబడి, రుద్రదేవులచే లాలింపబడినట్లుగా గంగా ప్రవాహంలాంటి మధ్వాచార్యుల ప్రవచన ప్రవాహం పండిత పామరుల్ని సయితం భక్తిసాగరంలో ఓలలాడిస్తోంది.

మధ్వాచార్యుల ప్రవచనం ఇలా సాగుతోంది:

"... నారాయణుడే పరదైవం. అనంతమైన గుణాల పరిపూర్ణ రూపం నారాయణుడు. అందుకే ఆయన్ని బ్రహ్మ అంటాం. సకల వేదాలు ప్రతిపాదించే రూపం ఆయనే. ఈ జగత్తు యొక్క సృష్టి, స్థితి, లయ కారకుడూ, నియమనం, జ్ఞానం, అజ్ఞానం, బంధం, మోక్షం అనే సకల స్థితిగతుల కారకుడూ ఆయనే. ఆయన సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు, సర్వ వ్యాపితుడు, సర్వతంత్ర స్వతంత్రుడు. రామాయణ, మహాభారత భాగవతాది సకల శాస్త్రాలు ఆయన సర్వోత్తమతత్త్వాన్నే చాటుతున్నాయి... శాస్త్ర శబ్దాలలాగానే ముల్లోకాల్లోని శబ్దాలు ఆయన మహిమలనే పాడుతున్నాయి. సకల వర్ణాత్మక శబ్దాలు, భేరీనాదం, సముద్ర ఘోష, పక్షుల కిలకిలారావాలు మొదలైన ధ్వని నిండిన శబ్దాలన్నీ ఆయన గొప్పతనాన్నే ప్రతిపాదిస్తున్నాయి...

"అతని పత్ని మహాలక్ష్మి గగనానికి, జడ ప్రకృతికి తదితరాలన్నిటికి అభిమాని అయి, దేశకాలాది వ్యాప్తిలో ఆయనకి సమానురాలనిపించుకొన్నది. గుణపరిపూర్ణత్వంలో మాత్రం భగవంతుని తర్వాతే. బ్రహ్మవాయు మొదలైన ఋజువులు, గరుడశేషాద్రి తదితర అనంత జీవులలో భగవంతుడైన శ్రీహరికి దాసానుదాసులు. ఆయన మాత్రం ఎప్పటికీ నాశము లేనివాడే. ఇతరులు మాత్రం ఎల్లప్పుడూ అస్వతంత్రులే... ఏ ఇతర దేవతలని స్తుతించే శాస్త్రాలలోని వాక్యాలయినా వారి అంతర్యామి అయిన శ్రీహరికే చెందుతాయి. అందరిలో వుంటూ వారి వారి చేత వివిధ కార్యాలు చేయించేవాడు ఆయనే. వారందరిలో తారతమ్యం ఉంది. సమస్త దేవతలను, గురువులను, భగవంతుని పరివారాన్ని తారతమ్య క్రమంలో ఆరాధించటం ముక్తికి సాధనం...

"కొంతమందికి జగత్తు మిథ్య. మరి కొందరికి జగన్నాథుడు మిథ్య. అయినా జగత్తు సత్యమైనది. దాని నియామకుడైన జగన్నాథుడు కొందరికి నిరాకారుడుగా, కొందరికి సాకారుడుగా అనిపిస్తాడు. అయినా ఆయన ప్రాకృతాకార రహితుడవటం వల్ల నిరాకారుడు. జ్ఞానం, ఆనందం మొదలైన అప్రాకృత ఆకారం వుండటం వల్ల సాకారుడు. కొంతమంది దృష్టిలో బ్రహ్మ సగుణుడు, మరికొందరికి నిర్గుణుడు. ఆయన మాత్రం జ్ఞానం, ఆనందం మొదలైన అనంత గుణాల పూర్ణరూపుడు కావటం వల్ల సగుణుడు, సత్త్వ, రజస్సు, తమస్సు అనే ప్రాకృత గుణాలకు అతీతుడు కనుక నిర్గుణుడు...

"ఆగమాలు రెండు రకాలు - పౌరుషేయాలు, అపౌరుషేయాలు. మానవుడివల్ల సృష్టించబడినవి పౌరుషేయాలయితే, అట్లా కానివి అపౌరుషేయాలు. వేదాలు అపౌరుషేయాలు. కాని మహాభారత, భాగవత గాథలు పౌరుషేయ ఆగమాలు. ముఖ్యంగా

మహాభారతం పౌరుషేయం అయినప్పటికీ వేదాలకన్నా ఎక్కువ. కారణం - అది వేదాలను ప్రతిపాదించిన భగవంతుడి విశిష్టకృతి కావటమే... మహా భారతంలో కూడా భగవద్గీత, విష్ణుసహస్రనామాలు అత్యంత శ్రేష్ఠమైన భాగాలు. భగవద్గీత అనేది భగవంతుని సందేశం అయితే, విష్ణుసహస్ర నామాలు భగవంతుని స్తోత్రాలు. ...ఆగమాలలో పరస్పర విరోధం లేదు. అయితే వాటి తాత్పర్యం గ్రహించాలంటే వాటిని ఉపక్రమ, ఉపసంహార మొదలైన తాత్పర్య నిర్ణాయక లింగాల నేపథ్యంలో సమన్వయం చేసుకోవాలి... సమాధి, దర్శనం, గుహ్యం అన్న భాషాత్రయంతో కూడుకొన్న వాటిని సరిగ్గా అర్థం చేసుకొంటే వాటిల్లో ఏకత కనబడుతోంది... ఇవన్నీ చెప్పేది శ్రీహరి సర్వోత్తమ తత్త్వాన్నే.

"ఆగమాలలో పరస్పర విరోధం లేనట్టే ఆ ఆగమాలను తెలుసుకొన్న ఋషిమునుల తత్త్వ విచారాలలో విరోధాలుండవు. శాస్త్రీయ జ్ఞానంతో అర్థం చేసుకుంటే సకల జ్ఞానుల మూలభూత దర్శనం ఒకే రీతిగా ఉంటుంది. శాస్త్ర సమ్మతమైన నిత్యకర్మానుష్ఠానం లాగా సత్యధర్మాల అనుష్ఠానం కూడా ముక్తికి ఆవశ్యకం. సూక్త ప్రయత్నానికి భగవదనుగ్రహం తప్పనిసరిగా లభిస్తుంది. అంతటి భగవంతుని ఆరాధనే సకల సాధకుల అత్యంత మూలభూతమయిన గురి...

"చార్వాకులు ప్రత్యక్షాన్ని మాత్రం ఒప్పుకుంటారు. బౌద్ధులు, జైనులు వేదాల్ని ఒప్పుకోరు. సాంఖ్యం, యోగం, న్యాయవైశేషికులు వేదాలు ఒప్పుకున్నా వాటి పరమ ప్రామాణికాల్ని ఒప్పుకోరు. న్యాయవైశేషికులకు యుక్తి మాత్రమే పరమప్రమాణం. అయితే యుక్తి ఎప్పటికీ స్వతంత్ర ప్రమాణం అనిపించుకోదు. యుక్తి ప్రకారం గుమ్మడికాయని భరించే తీగ మామిడిచెట్టు కన్నా పెద్ద వృక్షమై ఉండాలి. యుక్తితో వాదిస్తే ఎద్దుకు కొమ్ములున్నప్పుడు మనిషికెందుకుండవు? కొంతమంది ఆగమాలను ఒప్పుకొని ప్రత్యక్షాన్ని అవహేళన చేస్తారు. మరికొంతమంది ప్రత్యక్షాన్ని ఒప్పుకొని ఆగమాలను అవహేళన చేస్తారు. అంటే ఆ రెండు ప్రమాణాలను ఒప్పుకుంటూ కూడా వాటి పరిమితులు తెలియని వాళ్లు పూర్వమీమాంసకులు. వేదాల పరమప్రామాణ్యాన్ని ఒప్పుకున్నా దేవుణ్ణి ఒప్పుకోని నాస్తికులు. అద్వైతవాదులు, విశిష్ట అద్వైతులు వేదాలను ఒప్పుకుంటారు, వాటి ఉపనిషత్తు భాగాల్ని జ్ఞానకాండమని ఒప్పుకుంటారు, కాని ఇతర భాగాల్ని కర్మకాండమని గేలి చేస్తారు. వీళ్లంతా కూడా బ్రహ్మసూత్రాల యొక్క పరమ ప్రామాణిక శక్తి తెలియని వాళ్లు. నిజానికి వేద శాస్త్రాలన్నీ ప్రామాణికంగా ఉండి వాటిలో నిర్ణాయకమైన బ్రహ్మసూత్రాలే సర్వోత్తమమని వ్యాససిద్ధాంతం...

"జీవుడు స్వయంగా చేసుకొనే తత్త్వవిచారంలో ఇతర దార్శనికుల విచారం తెలుసుకోలేకపోతున్నాడు. కొన్ని దర్శనాలలో సర్వం శూన్యం. మరికొన్ని దర్శనాల్లో చేతనమొకటే సత్యం. జడత్వం మిథ్య. ఇంకొన్ని దర్శనాల్లో జడమొకటే సత్యం. చేతన మిథ్య. కొంతమంది పరమాత్ముని మాత్రం ఒప్పుకొని మిగిలిన దేవతల్ని వారికన్నా అభిన్నమంటారు. కొందరు ఆత్మను 'అణువు' అని అంటే మరికొంతమంది అతన్ని 'వ్యాప్తుడు' అంటారు. ఆత్మ యొక్క పరిమాణం దేహం యొక్క ఆకారాన్నిబట్టి మారుతుందని కొందరి వాదం. జీవాత్మలు అణువులు అయితే వాటికన్నా భిన్నమైన పరమాత్మ వ్యాపించేవాడు అన్నది నిజమైన సిద్ధాంతం...

"కొంతమంది ప్రకృతి కారణత్వాన్ని ప్రతిపాదిస్తారు. మరికొంతమంది కర్మకారణత్వాన్ని ప్రతిపాదిస్తారు. ఇంకొంతమంది కాలము, గుణము మొదలైన కారణత్వాలను చెప్తారు. ప్రకృతి మొదలైనవి జడ పదార్థాలు కాబట్టి వాటికి జ్ఞానం, కోరిక మొదలైన గుణాలుండవు. ఈ గుణాలు పొందని వస్తువు కర్త అనిపించుకోదు. కొంతమంది శివుడు మొదలైన దేవతలకి జగత్కారణత్వాన్ని ఆపాదిస్తారు. అయితే శివుడు మొదలైన దేవతల అజ్ఞానాది దోషాలు పొందే ప్రసంగాలు శాస్త్రాల్లో నిరూపించబడి ఉండటం చేత వారు నిర్దోషులు కారు. సర్వజ్ఞులుకారు, గుణపూర్ణులూ కాదు. పైగా వారంతా అస్వతంత్రులు. అందువల్ల ఈ జగత్సృష్టికి వారు కారణంకాదు. సకల దోష రహితుడు, అనంతగుణపూర్ణుడు అయిన శ్రీహరి మాత్రమే సృష్టి అంతటికీ సకల కారణమని శాస్త్రాలు చెప్తున్నాయి...

"ముక్తికి సాధనమైన జ్ఞానకర్మల స్థానమానముల విషయంలోనూ, వివిధ దర్శనాల విషయంలోనూ భిన్నత్వం కనిపిస్తుంది. కొంతమందికి కేవలం కర్మ మోక్షసాధనమైతే మరికొంతమందికి జ్ఞానం మోక్షసాధనం. కొంతమందికి జ్ఞానకర్మలు కలిసి మోక్షసాధనం. కొంతమంది కర్మ త్యాగమని వాదిస్తారు. మరికొంతమంది జ్ఞానమే త్యాగమని భావిస్తారు. ఏమైనా అపరోక్ష జ్ఞానానికి సాధనం కర్మ. జ్ఞానమే మోక్ష సాధనం. అపరోక్ష జ్ఞానం అనంతరం చేసే కర్మ, ముక్తిలో ఆనందాతిశయానికి కారణం అన్నది సిద్ధాంతం.

"అయితే ముక్తికల్పన విషయంలో ఈ దర్శనాల్లో ఒకేరకమైన సమ్మతం లేదు. కొంతమందికి దుఃఖాభావం మోక్షం. మరికొంతమందికి సుఖదుఃఖాలు రెండూ అభావమోక్షం. మరికొంతమందికి ఆత్మ ఐక్యం చెందడం ముఖ్యం. కొంతమందికి శూన్యభావమే మోక్షం. ఇంకొంతమంది సంతత ఊర్ధ్వగమనమే ముక్తి అంటారు. ఆ ముక్తి కనుక ఆనందసామ్యముక్తి అయినట్లయితే వాళ్ల వాళ్ల స్వరూపానికి తగిన ఆనందం భగవదనుగ్రహం వల్ల లభిస్తుంది...

"ముక్తికి భక్తి సాధనం. మహత్జ్ఞానపూర్వకమైన భగవదారాధనే నిజమైన భక్తి. శాస్త్రాధ్యయనం చేత బ్రహ్మజ్ఞాన సాధన, కామ్యఫలాలపట్ల ఆపేక్ష లేకుండా భగవంతుని ప్రీతికోసం భక్తిని ఆచరించటం బ్రహ్మజ్ఞానానికి ప్రముఖ సాధనం. భక్తికి ప్రసన్నమైన భగవంతుడు మెచ్చి భక్తునికి ముక్తిని ప్రసాదిస్తాడు. భగవంతుని ఆరాధించడానికి ఏకాదశి వంటి వ్రతాలు అత్యంత ఆమోదనీయమైన సాధనాలు. అసూయ, ద్వేషం వంటి లక్షణాలు ఎప్పటికీ ముక్తికి సాధనాలు కావు..."

## వామనుడైన త్రివిక్రముడు

మధ్వుల ఉపన్యాసధోరణి, అందులో ప్రతి అక్షరమూ త్రివిక్రమ పండితులను ఆకర్షించింది. ఆయన తనకు కలిగిన ప్రతి సందేహాన్ని నిస్సంకోచంగా మధ్వాచార్యుల ముందు పెట్టారు. ప్రతి సందేహానికి మధ్వులు సమాధానమిస్తూ వచ్చారు...

ఇలా 15 రోజుల పాటు వారిద్దరి మధ్య వాదన నడిచింది. 15 రోజుల తర్వాత త్రివిక్రమ పండితులకి అంతకుముందు వరకు వచ్చిన సందేహాలు పటాపంచలయ్యాయి. వైదిక సిద్ధాంతంలోని సూక్ష్మాతిసూక్ష్మ విచారాలన్నిటినీ మధ్వాచార్యుల నుండి నేరుగా తెలుసుకునే భాగ్యం త్రివిక్రమపండితులకు కలిగింది. దాంతోపాటే మధ్వాచార్యుల పట్ల అమితమైన భక్తిభావం కూడా జనించింది... అంతటి పూర్ణప్రజ్ఞులతో చర్చకు దిగిన తన సాహసానికి త్రివిక్రమ పండితులు సిగ్గుపడ్డారు. పూర్ణప్రజ్ఞులకు సాష్టాంగనమస్కారం చేసి తన అవివేకాన్ని మన్నించమని వేడుకున్నారు. వారి పాద ధూళి సదా సేవించే అవకాశాన్ని కల్పించవలసిందిగా విన్నవించుకున్నారు. అలా త్రివిక్రమ పండితులు శోభనభట్టు లాగా మధ్వుల పరమానుగ్రహానికి పాత్రులై, వారి శిష్యులై, వారి ముందు కూర్చొని బ్రహ్మసూత్ర భాష్యం తదితర గ్రంథాలను ఉపదేశరూపంగా వింటూ వచ్చారు.

## అనుభాష్య రచనకు ప్రార్థన

ఒకరోజు త్రివిక్రమ పండితులను పిలిపించి మధ్వాచార్యులు ఆదేశించారు. "మా నుండి మీరు విన్న వివిధ భాష్యశ్రవణాల్ని వ్యాఖ్యానరూపంలో రాయాలి"

ఈ ఆదేశానికి త్రివిక్రమ పండితులు అవాక్కయ్యారు. తనలాంటి అల్పుడు పూర్ణప్రజ్ఞుల ప్రవచనాన్ని వ్యాఖ్యానరూపంలో రాయటమా? కాని గురువాజ్ఞను ధిక్కరించగలడా? బాగా ఆలోచించి గురువుకి ఒక విన్నపం చేశాడు.

"స్వామీ! మీ కృతులన్నీ చింతామణులే. చూడటానికి చిన్నవైనా అవన్నీ పరిమాణంలో పెద్దవి. నేను మందమతిని. మీ కృతులన్నిటికీ వివరణ తెలుసుకొనే అర్హత లేదు. కాని మీ అన్ని గ్రంథాలలోని సారాంశాన్ని ఒకచోట నిరూపించే విశ్వకోశాన్ని మీరు రచించాలి. దాని ఆధారంగా నేను మీరు రచించిన భాష్యాలకు టీక రచించే సాహసం చేస్తాను".

**అను వ్యాఖ్యాన రచన**

త్రివిక్రమ పండితుల అభ్యర్థనను మధ్వాచార్యులు చిరుదరహాసంతో అంగీకరించారు. వెంటనే ఆయన నలుగురు శిష్యులను ముందు కూర్చోబెట్టుకుని వారికి ఆదేశించారు. "నేను నాల్గు అధ్యాయాల కృతిని ఒకటి రచిస్తాను. మీలో ఒక్కొక్కరికీ ఒక్కొక్క అధ్యాయాన్ని నేను ఏకకాలంలో చెప్తాను. మీరు రాస్తూనే ఉండాలి" అంటూ ఆయన చెప్పడం ప్రారంభించారు.

విచిత్రం! పూర్ణప్రజ్ఞులు అలా చెప్తుంటే, ప్రతి శిష్యుడికీ తాను రాసే అధ్యాయమే వినిపించేది. అలా చెప్తూ రాయిస్తూ మధ్వులు నాలుగు అధ్యాయాల మొత్తం గ్రంథాన్ని ఏకకాలంలో పూర్తి చేశారు. ఏకకాలంలో నలుగురు శిష్యులకి నాలుగు వేరు వేరు అధ్యాయాలను చెప్పుకుంటూ వెళ్లటంతో శిష్యుల దృష్టిలో ఆయన 'భావిచతుర్ముఖు'లుగా భాసించారు. ఆ అద్భుతకృతినే అనువ్యాఖ్యానం అంటారు.

ద్వైతసిద్ధాంతం యొక్క సమస్త సూక్ష్మ ప్రమేయాల లోతుపాతుల్ని విశ్లేషించి అవి బ్రహ్మసూత్రాలకు అన్వయించేలా చేసిందీ కృతి. (దీనిమీద జయతీర్థుల వారు రాసిన వ్యాఖ్యానమే 'న్యాయసుధ'.)

అనువ్యాఖ్యానంతోపాటు మరొక కృతిని కూడా మధ్వాచార్యులు అప్పుడు రచించారు. అది వారి అనువ్యాఖ్యాన కృతియొక్క పూర్వపక్షమే కాక సిద్ధాంత న్యాయ యుక్తిమాలల వివరణ. దానికి 'న్యాయ వివరణ' అని పేరు. వారి సూత్రభాష్యానికి వివరణ అయిన అనువ్యాఖ్యాన 'టీక' అనిపించుకుంటే, ఈ న్యాయ వివరణ భాష్యానికి 'టిప్పణి' అనిపించుకుంది. ఇలా భాష్యంతో పాటు టీక, టిప్పణీల పరికల్పనకు సృష్టి చేసిన ఒకే ఒక్క వేదాంతభాష్యకారులు మధ్వాచార్యులు.

అనువ్యాఖ్యాన ప్రదర్శితమైన టీక శైలి జయతీర్థులకు ఆదర్శంగా ఉండి, వారిని ఆదర్శటీకా కారులనిపించింది. న్యాయ వివరణలో ప్రదర్శితమైన టిప్పణి శైలి వ్యాసరాజులు, వాదిరాజులు, రఘోత్తమతీర్థులు, రాఘవేంద్రులంతటి వారికి ఆదర్శకమై వారంతా ఆదర్శటిప్పణీకారులు అనిపించుకోవడానికి కారణమైంది. ఇలాంటి అద్భుత వాఙ్మయరచన

మూలంగా పరంపర యొక్క సమస్త గ్రంథరాశికి మూల ప్రేరణ ఇచ్చిన వారు మధ్వాచార్యులు. ఇది ఇతిహాసిక సత్యం.

మధ్వాచార్యుల అనువ్యాఖ్యానం త్రివిక్రమ పండితులకు కొత్త శక్తినిచ్చింది. గురువుల ఆదేశానుసారం భాష్యవివరణని త్రివిక్రమ పండితులు మొదలుపెట్టారు. ఆయన రచించిన 'తత్త్వప్రదీప' (తత్త్వదీపిక) లో చాలాచోట్ల ఈ అనువ్యాఖ్యానాన్ని వివరిస్తూ దానిని అధ్యయనం చేయటం ద్వారా బ్రహ్మసూత్రార్థాన్ని ఎలా అర్థం చేసుకోవచ్చో ఆయన వివరించారు.

తమ ఆదేశాన్ని పాలించిన త్రివిక్రమ పండితులకు మధ్వాచార్యులు తమ చేతుల మీదుగా అర్చింపబడే లక్ష్మీసహిత నారాయణ ప్రతిమ బహూకరించి అనుగ్రహించారు. (ఈ సుందర లక్ష్మీనారాయణ ప్రతిమను కావు మఠ పరంపరులయిన వారి ఇంటిలో చూడవచ్చు.) త్రివిక్రమ పండితుల ముగ్గురు పుత్రులలో మధ్వాచార్యుల ముఖ్య శిష్యులైన వాళ్లల్లో చివరివాడు నారాయణ పండితులు. ఆయన మధ్వాచార్యుల దివ్యగాథని తన 'సుమధ్వ విజయం' లో అద్భుతంగా వర్ణించారు.


శ్రీ త్రివిక్రమపండితులకు ఆచార్యులవారు అనుగ్రహించిన లక్ష్మీనారాయణ విగ్రహం, ముద్రలు, కావు మఠం, కాసరగోడు

## మధ్యగేహుల వైకుంఠ యాత్ర

**మ**ధ్వాచార్యుల గురించిన వార్తలు వింటూ పాజక క్షేత్రంలో మధ్యగేహులు సంతృప్తికరంగా జీవిస్తూ వచ్చారు. తాము అనంతాసనుణ్ణి శ్రద్ధగా సేవించడంవల్లనే లోకోత్తరుడైన పుత్రుడు కలిగి, అతడు వేదాంత పీఠం మీద శోభిస్తున్నాడన్న వార్త ఆయనకి పరిపూర్ణమైన మనశ్శాంతిని కలిగించింది. మధ్వుల అనుగ్రహంతో కలిగిన రెండవ కుమారుడు తల్లిదండ్రుల్ని వారి వృద్ధాప్యంలో బాధ్యతాయుతంగా చూసుకుంటూ ఆదర్శపుత్రుడని అనిపించుకున్నాడు. ఎంత విచిత్రం! మొదట ఇద్దరు పుత్రుల్ని పోగొట్టుకున్న మధ్యగేహుల దంపతులకు ఆ తరువాతి జన్మితమైన ఇద్దరు పుత్రుల వల్ల ఇప్పుడు శోక మోహాలు పరిహారమయ్యాయి కదా!

మధ్యగేహులకి తాను ఆశించిన తత్త్వజ్ఞాన సిద్ధి లభించింది. శ్రేష్ఠమైన రీతిలో అనంత గుణపూర్ణుడయిన భగవంతుణ్ణి ఉపాసించారు. సకల జీవులకు మోక్షాన్నిప్పించే

ముఖ్య ప్రాణుడే తమకు కొడుకుగా పుట్టడం వారి సుకృతం. ఆ సుకృతమే ఆ దంపతులు వైకుంఠం పొందటానికి కారణమైంది.

## మధ్వానుజుల వైరాగ్యం

మధ్యగేహ దంపతులు వైకుంఠప్రాప్తి పొందాక వాళ్ల రెండవ కొడుకు కొన్ని రోజులు పాజక క్షేత్రంలోనే ఉండేవాడు. విధి ఎంత విచిత్రమైనదంటే, ఊహించలేని విపత్తు కలిగి వారి ఐశ్వర్యం, గోసంపద, ధాన్యం అన్నీ నాశనమైనాయి. దాంతో అతనికీ, అతని భార్యకీ ఐహిక సుఖాలమీద విరక్తి కలిగింది. అన్నగారైన పూర్ణప్రజ్ఞుల దగ్గరకే బయలుదేరి వెళ్లారు. ఆ సమయంలో మధ్వాచార్యులు విష్ణుమంగళంలో చాతుర్మాస్య దీక్షలో ఉన్నారు.

మధ్వుల దర్శనంతో వారిలో ఎక్కడలేని భక్తి పరవళ్లు తొక్కింది. తమకు కూడా దీక్ష నీయమని మధ్వులను ప్రార్థించారు. అయితే అది చాతుర్మాస్య కాలమవటం వల్ల, "దీక్ష పూర్తవగానే మేమే మీరున్నచోటికి వచ్చి దీక్ష నిస్తాం" అని చెప్పి వాళ్లను మళ్లీ పాజక క్షేత్రానికి పంపించారు మధ్వులు. పాజక క్షేత్రానికి తమ్ముడి కుటుంబం తిరిగివచ్చారు. వచ్చిన దగ్గర్నుంచి రాముడి కోసం ఎదురుచూసే భరతుడిలా ఎదురుచూస్తూనే ఉన్నారు. మధ్వులు పాజక క్షేత్రానికి రావటానికి చాలా సమయం పట్టింది. అతి కష్టం మీద జయసింహ రాజుని ఒప్పించి రావడం జరిగింది.

## విష్ణుతీర్థుడైన సోదరుడు

భీముడికి అర్జునుడి మీదున్నంత ప్రేమ మధ్వాచార్యులది. తమ్ముడికి పరబ్రహ్మతత్వాన్ని ఉపదేశించి 'విష్ణుతీర్థులు' అనే నామకరణం చేశారు. తరువాతి కాలంలో విష్ణుతీర్థులు గురువుల దగ్గర శాస్త్రశ్రవణం చేస్తూ, ఇతర వేళల్లో ఇతరులకు తత్త్వోపదేశం చేస్తూ, మిగిలిన సమయమంతా గురుప్రవచనాన్ని మననం చేసుకుంటూ ఒక్క క్షణం కూడా వృథా కాకుండా జీవితాన్ని అర్థవంతం చేసుకున్నారు.

మధ్వాచార్యుల ఆదేశంతో విష్ణుతీర్థులు ఉత్తర దిక్కుకి తీర్థయాత్రకి వెళ్లారు. ఆయన స్నానం చేసిన ప్రతి తీర్థం పావనమయింది. ఆయా తీర్థాల వల్ల ఆయన పవిత్రులయ్యారు.

ఆయన చిరకాల వాంఛ తపస్సు. ఒకసారి ఎవరికీ చెప్పకుండా హరిశ్చంద్ర పర్వతానికి వెళ్లి అక్కడ తపస్సులో నిమగ్నమయ్యారు. తపస్సిద్ధి క్షేత్రంగా ప్రసిద్ధి పొందిన హరిశ్చంద్ర పర్వతంమీద శీతోష్ణాలను అధిగమించి ఆహారాన్ని కూడా త్యజించారు. ఆయన నిరాహార వ్రతాన్ని గురించి తెలుసుకున్న శిష్యులు అక్కడికి వచ్చి భక్తితో ఆయన్ను

సేవించుకునేవారు. వారు గట్టిగా వత్తిడి చేస్తేమాత్రం ఐదు రోజులకోసారి పంచగవ్య తీసుకునేవారు. అలా కొన్ని రోజులే. మళ్లా నిరాహారదీక్ష చేపట్టేవారు. బాగా ఎండిన బిల్వ పత్రాలను స్వీకరించేవారు. తరువాత కొంత జలం స్వీకరించేవారు. ఆయన తపస్సు ధ్రువుడి తపస్సును తలపిస్తుంది. ఎందుకంటే ఆయన తపస్సు చేసుకోవడానికి ఎంచుకున్న ప్రదేశం అత్యంత చల్లగా ఉన్న ఒక శిల. క్రమంగా ఆయన ఉచ్ఛ్వాసనిశ్వాసాలను నియంత్రించే స్థాయికి చేరుకున్నారు. భగవంతుని రూపాన్ని నిరంతరం మనస్సులో నిలుపుకుని ధ్యానంలో మునిగిపోయేవారు.

ఆయన శిష్యులు అనిరుద్ధ తీర్థులు కూడా గురువుకి తగిన ఆదర్శశిష్యులు. కఠినమైన వ్రతచర్య, తర్కంలో ప్రావీణ్యం ఆయన విశిష్టతలు. అతీంద్రియ దర్శనం చేత ఆయన విద్యాసమర్థులనిపించుకున్నారు. ఆయన జీవితకాలమంతా హరిశ్చంద్రపర్వతంమీద గురువుల దగ్గరే ఉంటూ అప్పుడప్పుడు ఉడుపికి మాత్రం వచ్చి వెళుతుండేవారు. కవి శ్రేష్ఠులు, విద్వత్ చూడామణులు, మహాతపస్వి అనిపించుకున్న బాదరాయణ తీర్థులు విష్ణుతీర్థుల మరొక శిష్యులు.

## కత్తిల యందు గ్రంథ కోశం

**మ**ధ్వాచార్యులు ప్రపంచమంతా ఆశ్చర్యపడేటంతటి మహత్కార్యాన్ని చేపట్టారు.

మధ్వాచార్యులు తమ దూరదృష్టితో కలియుగం ముగింపునాటి పరిస్థితులని అంచనా వేశారు. 36,000 సంవత్సరాలు గడిచాక కలి ప్రాబల్యం వల్ల సజ్జనుల జీవితం దుర్భరమవుతుంది. సజ్జనుల సంరక్షణ కోసం భగవంతుడి ఆదేశం చేత మహాలక్ష్మి పయస్విని నదీ తీరంలో బ్రాహ్మణ కులంలో దుర్గాదేవిగా జన్మిస్తుంది. ఆమె చేసిన రుద్రతాండవానికి కలి నశిస్తాడు. కొన్ని సంవత్సరాల కాలం మళ్లా జ్ఞానం ప్రకాశిస్తుంది. జిజ్ఞాసువుల సాధనకి అదొక సదవకాశం.

అయితే అప్పటికి సర్వ మూలగ్రంథాలు లభ్యం కావాలి కదా! తామ్రపత్రాల రూపంలో తప్ప ఇంకే రూపంలోనూ గ్రంథాలు మిగిలి ఉండే అవకాశం లేదు. గ్రంథాలన్నీ తామ్రపత్రాల మీద రాసి సంరక్షిస్తే కలి అంతం తరువాత మరొకసారి పూర్ణ రూపంలో జ్ఞానసూర్యుడు అవతరిస్తాడు... ఇలా ఆలోచించి సర్వ మూలగ్రంథాల్ని తామ్రపత్రాల రూపంలో రాయించి వాటినన్నిటినీ సూళ్యద దగ్గర కత్తిల యందున్న మఠంలో భద్రపరిచారు. ఈ కత్తిల (కత్తిల మంగుళూరు నుంచి 32 కి.మీ.ల దూరంలో నున్న పాణెమంగళూరు అనే ప్రదేశానికి 15 కి.మీ.ల దూరంలో ఉంది.) ఆ గ్రంథాలు ఉంచిన ప్రదేశం గుర్తు

కోసం 'శ్రీ వ్యాసతీర్థ' అన్న ఒక చిన్న సురక్షితమైన గొయ్యి నిర్మించబడింది. దాని కిందనే రాగి రేకుల మీద లిఖించబడిన గ్రంథాలు భద్రంగా ఉన్నాయి. ఆ గొయ్యి ఎప్పుడూ తేమతో ఉండి రాగి చిలుము పట్టిన వాసన వస్తూ ఉంటుంది. ఈ స్థలానికి దగ్గరే ఒక మఠం ఉంది. అందులో శ్రీకృష్ణుని విగ్రహం కూడా ఉంది.

అలా భద్ర పరచిన గ్రంథాలను కలియుగానంతరం పైకి తీసుకువచ్చి తత్త్వప్రచారం చేసే బాధ్యతను తన తమ్ముడైన విష్ణుతీర్థులు వహిస్తారని మధ్వాచార్యులు నిశ్చయించారు. "దుర్గాదేవి అవతారం పుట్టిన వెంటనే మరోసారి జ్ఞానప్రసారానికి అవకాశం లభిస్తుంది. దాని నిర్వహణ బాధ్యత మీది. ఇక్కడ స్థాపించిన సర్వమూలగ్రంథాల్నీ బయటికి తీసి భగవత్తత్త్వాన్ని ప్రజలకు బోధించాలి. అలా యోగులందరికీ ఇహపర సాధనాలు తెలుసుకొనే దారి కనిపిస్తుంది. అప్పటివరకూ మీరు కుమారపర్వతం మీదే వసించండి. అలా చేసేందుకు శక్తినీ, ఆరోగ్యాన్నీ, ఆయుష్షునీ మీకు భగవంతుడు ప్రసాదిస్తాడు" అని కూడా మధ్వులు విష్ణుతీర్థుల్ని ఆదేశించారు.

అలా విష్ణు తీర్థుల ముఖ్య ఆవాసం కుమారపర్వతమే అయింది.

మధ్వాచార్యులొకసారి అదృశ్యులయి ఉత్తర బదరికి వెళ్ళి, కొన్ని రోజుల తరువాత కుమారపర్వతం మీదకి వెళ్లారు. సాధన శిఖరంపై విష్ణుతీర్థుల తపస్సు ఇంకా సాగుతూనే ఉంది. మధ్వాచార్యుల అనుగ్రహం వల్ల స్వచ్ఛంద మరణం పొందే వరం ఆయనకి లభించింది. (ఇప్పటికీ విష్ణుతీర్థులు కుమారపర్వతం మీద తపోనిరతులుగా ఉన్నారని ఆ ప్రాంతంలో ప్రజలు చెబుతుంటారు. మార్గశిర శుక్ల పౌర్ణమినాడు ప్రారంభమైన ఆ తపస్సు నేటికీ సాగుతూనే ఉందనీ, పర్వతం మీద ఆ ప్రాంతాన్ని చేరుకోవడం కాలక్రమంలో దుర్గమంగా మారిందనీ అంటారు.)

## మధ్వశిష్యుల వైభవం

మధ్వాచార్యుల శిష్యులలో అగ్రగణ్యుడు హృషీకేశ తీర్థులు. అందరికన్నా మొదట గురువు వద్ద సన్యాస దీక్ష స్వీకరించినవారు. ఎనిమిది మంది మఠాధీశుల్లోకీ ఈయన్ని 'అష్టోత్కృష్టులు' అని పిలుస్తారు. ప్రవచన కాలంలో పూర్ణప్రజ్ఞుల నోటినుండి వెలువడిన శ్లోకాలను సుస్వరంగా పఠించినవారు ఈయన. మధ్వుల సమస్త మూల కృతుల్నీ సమగ్రంగా అక్షరబద్ధం చేశారు. 'సంప్రదాయ పద్ధతి' అనే కృతిలో 26 శ్లోకాలలో మధ్వమహిమను వర్ణించారు. సుమధ్వవిజయంలో లేని అనేక అంశాలు – ముఖ్యంగా పూర్ణప్రజ్ఞుల బాల్య విశేషాలు – ఇందులో ఉన్నాయి.

మరొక ముఖ్య శిష్యులు ఉపేంద్రతీర్థులు. రెండవ బదరి యాత్ర కాలంలో గురువుల ఆదేశంతో కత్తి పట్టుకొని దొంగల గుంపుల్ని తరిమేసిన మహా సాహసి.

హృషీకేశ తీర్థులు, నరసింహ తీర్థులు, జనార్థన తీర్థులు, ఉపేంద్ర తీర్థులు, వామన తీర్థులు, విష్ణు తీర్థులు, రామ తీర్థులు, అధోక్షజ తీర్థులు అనే ఎనిమిది మంది యతులూ తరువాత కాలంలో పలిమారు, అదమారు, కృష్ణాపుర, పుత్తిగె, శిరూరు, సోదె, కాణియూరు, పెజావర్ మఠాలకు ప్రథమ పీఠాధిపతులుగా బాధ్యతలు స్వీకరించారు. ఉడుపిలో తాము ప్రతిష్ఠించిన శ్రీకృష్ణ పూజాధికారాన్ని మధ్వాచార్యులు ఈ అష్టమఠాధిపతులకూ ఇచ్చి పర్యాయక్రమంగా పూజలు నిర్వహించాలని ఆదేశించారు.

ఒకసారి మధ్వాచార్యులు ఈ ఎనిమిది మందినీ కణ్వతీర్థంలోని ఒక అశ్వత్థవృక్షం దగ్గరకి పిలిచి, అక్కడి మంటపానికి గల నాలుగు గుమ్మాల్నుంచీ (ఒక్కొక్క గుమ్మం నుంచి ఇద్దరిద్దరు వంతున) ఏకకాలంలో బయటకు రావలసిందిగా ఆదేశించారు. అలా వచ్చిన ప్రతి ఇద్దరినీ ద్వంద్వ మఠాధీశులుగా నియమించారు.

## సుబ్రహ్మణ్యంలో భావి బ్రహ్మ

ఒకసారి మధ్వాచార్యులు సుబ్రహ్మణ్య క్షేత్రం సందర్శించారు. అక్కడొక అద్వైత సంప్రదాయ యతి ఉన్నారు. అతని పేరు నరసింహ భట్టాచార్యులు. అతను ఆ క్షేత్రాన్నే తన కార్యస్థానంగా చేసుకొని అద్వైత ప్రచారం సాగిస్తున్నారు.

మధ్వులు అక్కడికి వచ్చినప్పుడు నరసింహ భట్టాచార్య ఆయనతో కూడా వాదానికి దిగారు. వాద నిబంధన ఏమిటంటే – ఓడినవారు గెలిచిన వారికి తమ పీఠాన్ని అప్పగించి, దేశాంతరం వెళ్లిపోవాలి!

వాదం మొదలైంది. గంటలు, రోజులు... గడిచాయి. యథాప్రకారం మధ్వాచార్యులదే పై చేయి అయింది. నరసింహ భట్టాచార్య ఓటమిని అంగీకరించి, తన మఠాన్ని ఆయనకి అప్పగించి, తాను పూజిస్తున్న నరసింహ ప్రతిమను వారి చేతుల్లో పెట్టి దేశాంతరం వెళ్లిపోయారు. (క్రీ.శ. 1259).

అప్పట్నుంచి సుబ్రహ్మణ్య క్షేత్రం వైష్ణవ క్షేత్రంగా ప్రసిద్ధి చెందింది. అక్కడ సుబ్రహ్మణ్య మఠం ఇప్పటికీ మధ్వపీఠంగా ప్రకాశిస్తున్నది. మధ్వాచార్యులు తమకు వేదవ్యాసులు ప్రసాదించిన వ్యాసముష్టిశిలలలో ఒక దానిని అక్కడ పూజార్థం ఉంచారు. (ఇలా వాదనలో గెలిచి, మఠాన్ని శ్రీ మధ్వాచార్యులకు ఇచ్చి, ఆ క్షేత్రాన్ని వైష్ణవక్షేత్రంగా మార్చిన వృత్తాంతానికి

సంబంధించిన తాళపత్రం సుబ్రహ్మణ్యమఠంలో ఇప్పటికీ భద్రంగా ఉంది.) మధ్వులు బదరి వెళ్లి వచ్చాక విష్ణు తీర్థులకు అనుగ్రహించిన 144 లక్ష్మీనారాయణ సాలగ్రామాల తోనూ, వేదవ్యాసుల ముష్టిశిలలతో కూడుకున్న వేదవ్యాస సంపుటం ఇప్పటికీ ఈ మఠంలోనే నిత్య పూజలందుకుంటున్నాయి.

తన తమ్ముడైన విష్ణు తీర్థునికి సోదె మఠాధిపత్యంతోపాటు ఈ సుబ్రహ్మణ్య మఠ ఆధిపత్యాన్ని కూడా మధ్వులు అప్పగించారు.

## శిష్య ప్రపంచం

క్రమంగా మధ్వుల శిష్య ప్రపంచం భారత ఉపఖండంలో ఎక్కడెక్కడికో విస్తరించింది. అశేషంగా ప్రజలు మధ్వసిద్ధాంతం పట్ల ఆకర్షితులయ్యారు. మధ్వ ప్రవచనాల విశిష్టతని ప్రత్యక్షంగానో, మధ్వుల ప్రథమ శిష్యుల ద్వారానో వినటం వల్ల ప్రభావితులైన పండితులు కొందరైతే, ఆ ప్రవచనాలను కథలు కథలుగా చెప్పుకొంటుంటే విని ప్రభావితులైన పామరులు అనేకులు. విద్యా గంధం ఉన్నవాడూ లేనివాడూ కూడా మధ్వ బోధనల ద్వారా జ్ఞాన నిధిని పెంచుకొనే కార్యంలో మునిగిపోయారు.

అందరి మార్గం ఒక్కటే – మధ్వ మార్గం.

అందలి లక్ష్యం ఒక్కటే – ముక్తి సాధన.

మధ్వాచార్యుల శిష్యుల్లో అందరూ సన్న్యాసులే కాదు. గృహస్థాశ్రమ వాసులూ ఉన్నారు. మధ్వ తత్త్వాన్ని పాటించటమంటే ఎంతో నియమ నిష్ఠలతో కూడుకున్న పని. ముఖ్యంగా గృహస్థాశ్రమంలో ఈ నియమాలను పాటించడమంటే మరింత క్లిష్టమైన విషయం. అయినా మధ్వ సిద్ధాంత ప్రకాశం పట్ల వాళ్లు ఎంతగా ఆకర్షితులయ్యారంటే నియమ నిష్ఠలనేవి వాళ్లకేనాడూ కష్టమనిపించలేదు. ఎప్పటికీ అనిపించవు.

అలా మధ్వతత్త్వసారాన్ని ఒంటబట్టించుకున్న గృహస్థ శిష్యులలో లికుచ వంశీయులు ముగ్గురు ప్రధానమైన వాళ్లు. వాళ్లే త్రివిక్రమ పండితులు, వారి సోదరుడు శంకర పండితులు, వారి సంబంధి మరొక శంకర పండితులు. వీరిలో త్రివిక్రమ పండితుని తమ్ముడైన శంకర పండితులు 'అనువ్యాఖ్యాన న్యాయ వివరణ సంబంధ దీపికా' అనే వ్యాఖ్యానాన్ని రచించారు.

ఈ లికుచ వంశంలో వారే ఒకరు అచ్యుతప్రేక్షుల నుంచి సన్న్యాసదీక్ష స్వీకరించి, జ్యేష్ఠ యతులుగా ప్రసిద్ధి చెందారు. ఆయన మధ్వాచార్యులకన్నా పదేళ్లు పెద్దవాడైనప్పటికీ

మధ్వదర్శనంతో పునీతులై, శిష్యత్వం స్వీకరించి జీవితాంతం మధ్వసిద్ధాంత ప్రసారకులుగానే ఉండిపోయారు.

త్రివిక్రమ పండితుల సోదరి కళ్యాణీదేవి. ఈమె మధ్వుల మహిళా శిష్యులందరిలోకీ అగ్రగణ్యురాలనిపించుకొంది. మధ్వాచార్యులమీద సంస్కృతంలో గేయాలు రచించింది.

మధ్వాచార్యులకు శిష్యులూ, ప్రశిష్యులూ అనేకంగా విస్తరించారు. వారిలో విష్ణు తీర్థులకు శిష్యులైన వారిలో ముఖ్యులు అనిరుద్ధ తీర్థులు, బాదరాయణ తీర్థులు. వాళ్లల్లో బాదరాయణ తీర్థులే విష్ణుతీర్థుల అనంతరం సోదె మఠానికి అధిపతులయ్యారు. మధ్వుల ఇతర ప్రశిష్యులలో ముఖ్యులు త్రివిక్రమ పండితుల కుమారులు ముగ్గురు. వారిలో మూడవ వాడైన నారాయణ పండితులు వయస్సులో చిన్నవాడైనప్పటికీ 'సుమధ్వ విజయం' వంటి అనేక విశిష్ట గ్రంథాలు రచించి ప్రసిద్ధి పొందారు. ఈ వంశంలో వామన పండితులనే వారు చివరివారుగా తెలుస్తోంది. వయస్సుని బట్టి ఈయన నారాయణ పండితుల పుత్రులు. మధ్వాచార్యుల అనేక ఉపనిషత్ భాష్యాలకు ఈయన టీక రచించారు.

మధ్వాచార్యులు రెండుసార్లు బదరి యాత్రనే కాక భారత ఉపఖండంలోనే అనేక ఇతర యాత్రాస్థలాలను కూడా సందర్శించారు. ఆయన ఎక్కడికి వెళ్లినా ఆయనకన్నా ముందే అక్కడ ఆయన మహిమల గురించి కథలు కథలుగా ప్రచారంలో ఉండటంవల్ల అశేషంగా జనం ఆయన్ని చూడటానికి, ఆయన ప్రవచనాలు వినటానికి వచ్చేవారు. విన్న వారు మళ్లా మధ్వుల గాథల్ని ఇతరుల దగ్గర ప్రస్తావిస్తూ ఆనందపడేవారు... అలా భారత ఉపఖండమంతా మధ్వతత్త్వం ప్రసారమవుతూ వచ్చింది.

## గోమతీ తీరంలో దశ ప్రమతి

**మ**ధ్వులు ఒకసారి ద్వారక దగ్గర గోమతీ తీరంలో తిరుగుతున్నప్పుడు ఆయన గురించి విని ఉన్న ఆ ప్రాంతపు శూద్రరాజు ఆయన్ని ప్రశ్నించటానికి వచ్చాడు.

ఆ రాజుకి వేదాలంటే అపనమ్మకం–అసహ్యం. వేదాలు ఎంతమాత్రమూ ప్రామాణికం కాదన్నది అతని వాదన. అందుకు అతను వేదాలలోని "యా ఓషధీః..." సూక్తాన్ని తీసుకుని వేద పండితులందర్నీ ప్రశ్నిస్తూ ఉండేవాడు. ఈ సూక్తాన్ని పఠిస్తూ విత్తనాలు నాటితే, అవి అంకురిస్తాయని వేదాలు చెబుతున్నాయి.

"మరి నేను ఈ సూక్తం చదువుతూనే విత్తనాలు వేస్తున్నాను. అవి మొలకెత్తటం లేదెందుకు?" అని వేద పండితుల్ని ప్రశ్నిస్తూ సతాయిస్తూ వుండేవాడు ఆ రాజు.

వేదాన్ని పఠించినా వాటి అర్థం తెలిసి పఠించాలి. అర్థం తెలిసినా భగవంతుని యందు పరిపూర్ణమైన విశ్వాసంతో వాటిని పఠించాలి... ఇవేవీ లేకుండా "ఫలం దొరకటం లేదే" అని ప్రశ్నించే వాడికి ఎవరు సమాధానం చెబుతారు?

ఈ రాజు మధ్వాచార్యుల్ని కూడా ఇలాగే ప్రశ్నించాడు. మధ్వులు అతనిని వారించే ప్రయత్నం చేశారు. "రాజా! వేదాలు అత్యంత ప్రామాణికాలు. సంశయం లేదు.. నీకు ఫలం ఇవ్వనంత మాత్రాన అవి అప్రామాణికాలయిపోవు. అర్హతలేని వాడు పఠిస్తే ఫలం కనుపించదు. నీకు వాటిని పఠించే అర్హత లేదు" అని హెచ్చరించారు.

ఆ రాజు మొండిగా వాదించాడు. వేదాల్ని హేళన చేశాడు.

మధ్వులు ఒక్కసారిగా తమ శక్తిస్వరూపాన్ని ప్రదర్శించారు. ఆ రాజు చేతుల్లోంచి ఆ విత్తనాలు తీసుకొని కుడి చేతిలో ఉంచుకొని, కన్నులు మూసుకొని, "యా ఓషధీః..." అంటూ వేద పఠనం ప్రారంభించారు. అప్పటికే ఈ సంవాదం విన్న జనం చుట్టూ చేరారు. రాజు హేళన చేయటం ఆపలేదు. మధ్వులు వేదపఠనం ఆపలేదు...

క్రమంగా సెకన్లు నిమిషాలయ్యాయి.

నిమిషాలు గడుస్తున్నకొద్దీ గంభీరమైన మధ్వుల కంఠంలోంచి వెలువడుతున్న వేదఘోషతో ఆ ప్రాంతమంతా ప్రతిధ్వనిస్తోంది. పునీతమవుతోంది.

జనమంతా ఉత్కంఠతో మధ్వుల ముఖవర్చస్సు కేసి, ఆయన చేతిలోని విత్తనాల కేసి మార్చిమార్చి చూస్తున్నారు.

అద్భుతం!

పరమాద్భుతం!!

అంతా అలా చూస్తూండగానే మధ్వుల వేదఘోష ఆకాశాన్నంటేలా సాగుతుండగా...

ఆయన చేతిలోని విత్తనాలు మొలకెత్తసాగాయి...

మొలకెత్తాయి...

చిగురులు వేశాయి...

ఆకులు తొడిగాయి...

పుష్పాలు పూశాయి...

ఆహా! ఏమా విడ్డూరం? సంభ్రమాశ్చర్యాలతో ఆ ప్రజలంతా వారి పాదాల మీద పడి నమస్కరించారు. అలా వేద ప్రమాణాన్ని నిరూపించిన భాష్యకారుడు మధ్వాచార్యులు మాత్రమే.

తమ గురువులు ప్రదర్శించిన వేద మంత్రాల మహిమను చూసి శిష్యులంతా మరో సారి సంభ్రమంలో, సంతోషంలో ఓలలాడారు. ఆ ఆనందంలో వాళ్లంతా గురువుల్ని సమీపించి ఒక అభ్యర్థన చేశారు.

"గురువర్యా! వేద పఠనాలు చేసినవాళ్లని చాలామందిని చూశాం. కానీ మీలా వేదసిద్ధి పొందిన గురువులను మేం చూడలేదు, విని ఉండలేదు. మీ ద్వారా వాటి సిద్ధిని చూసే మహద్భాగ్యం మాకిప్పుడు లభించింది... ఇంతటి అపూర్వసిద్ధిని పొందిన మీరు వేదాలమీద భాష్యాన్ని రచించాలి... వేదార్చన చేసే వాళ్లందరికీ వేదాల భావం పరిపూర్ణంగా అర్థమయి, వాళ్లు ఆ వేదమంత్రాల సిద్ధిని పొందేందుకు ఉపకరించేలా మీరు వేదభాష్యాన్ని రచించాలి. ఇతర మతాచార్యులు వేదాల జ్ఞానకాండని పరిగణనలోకి తీసుకోలేదు. వేదాలకు భాష్యాన్ని రచించడంవల్ల ఈ లోపాన్ని కూడా భర్తీ చేసినవారవుతారు."

శిష్యుల కోరికను ఆచార్యులు మన్నించారు. అలా రచించబడినదే 'ఋగ్భాష్యము'. ఋగ్వేదంలోని మూడు అధ్యాయాల మొత్తం నలభై సూక్తాలకు శ్లోకరూపంలో వ్యాఖ్యానాన్ని ఆనందతీర్థులు (మధ్వాచార్యులు) రచించారు. వైదికసాహిత్యం మీద శ్లోకరూపంలో వెలువడిన మొట్టమొదటి భాష్యమిదే. వేదమంత్రాల నుండి ప్రతి పదానికీ భగవత్‌పరంగా అర్థాన్ని అన్వయిస్తూ వారు చేసిన వ్యాఖ్యానం అసామాన్యమైంది. మధ్వులు రచించిన ఈ ఋగ్వేదభాష్యానికి జయతీర్థులు టీకాను జోడించి రాఘవేంద్రస్వాములు 'ఋగర్థమంజరి'ని రచించారు. ఈ ఋగర్థమంజరి విశిష్టత గురించి అరవిందాశ్రమంలోని వేదవిద్వాంసులు కపాలిశాస్త్రి ఇలా రాశారు:

Again the tradition that the Vedic hymns are supremely spiritual in their import was recoverd by Anandathirtha, the Dwaita teacher known as Madhwacharya. This shows clealy that there was even before Sayana a School of vedic interpreters holding that though ritual worship was part of the Vedic religion and as such, the Mantras present an aspect favorable to it. Yet the inner meaning of Mantras was spiritual and the highest aim and use of Veda was God Knowledge and attainment of supreme end of life possible for man.

Madhwacharya's work is comparatively small in volume and the language is simple. But its influence among scholars, modern or ancient, is not commensurate with its importance as can be judged from the fact that most modern scholars and pandits as a class with the possible exception of some among his followers are unaware of the very existence of such a work.

**- Kapali Shastri (Light on Vedas)**

(మధ్వుల ఋగ్భాష్య రచనను గోకర్ణ మహర్షి దైవరాత తమ 'శ్రీ మాధ్వ ఋగ్భాష్య ప్రశస్తిక' లో విస్తృతంగా ప్రశంసించారు.)

గురువుల ఋగ్భాష్యాన్ని చూసి శిష్యులు పరమానందభరితులై వారిని పలు విధాలుగా ప్రస్తుతించారు. శిష్యుల సందేహాలకు సమాధానంగా ఆనందతీర్థులు ఋగ్భాష్యాన్ని గురించి చెప్తూ "నేను భాష్యం రచించింది ఋగ్వేదం మొదటిలోని 40 సూక్తాలకే అయినప్పటికీ దీని అధ్యయనం సమస్త వేదవాఙ్మయాన్ని అర్థం చేసుకోవటానికి దోహదం చేస్తుంది."

## అంధకారంలో మధ్వతేజస్సు

ఒకరోజు రాత్రి చమురుదీపం వెలుగులో శిష్యబృందం సమక్షంలో మధ్వుల ప్రవచనం సాగుతోంది. ప్రవచనంలో శిష్యులంతా పూర్తిగా నిమగ్నమయిపోయి ఉన్నారు.

అంతలో అకస్మాత్తుగా విపరీతమైన గాలి వీచి దీపం ఆరిపోయింది. మళ్లా దీపం వెలిగించాలంటే ప్రయాస. పైగా గాలి ఇంకా ఉద్ధృతంగా వీస్తూనే ఉంది. జ్ఞానకార్యం మధ్యలో ఆగిపోయిందన్న అసహనం శిష్యుల్ని వెంటాడింది. శిష్యుల మనోభావాల్ని గుర్తించిన మధ్వాచార్యులు వారి ఉత్కంఠకి భంగం కలగకుండా - తమ పాదం యొక్క బొటనవేలిని కొంచెం ముందుకు చాచి నిలబెట్టారు.

అంతే!

ఒక్కసారిగా ఆ బొటనవేలి గోటి చివరినుంచి వెలుతురు ప్రసరించింది. మొత్తం ఆవరణమంతా వెలుగుతో నిండిపోయింది. ఆ క్షణంలో వారంతా మధ్వాచార్యుల్లో ఒక జ్ఞానభాస్కరుణ్ణి చూశారు. నిజానికి ప్రతి మనిషి శరీరంలోనూ ఉండే పంచభూతాల్లో అగ్ని ఒకటి. సాత్త్వికత ఎక్కువవుతున్న కొద్దీ తేజస్సు యొక్క ప్రమాణం కూడా పెరుగుతూంటుంది. దేవతలది తేజోమయ దేహం. "ఈ గురువులు సామాన్యమైన దేవతలు కాదు, నిశ్చయంగా జీవోత్తములైన వాయుదేవుల అవతారమే! అందుకే వారికింతటి శక్తి సంక్రమించింది" అంటూ శిష్యులు ప్రస్తుతించారు.

## మధ్వులు ఎత్తిన బండ

దక్షిణాదిన సంచారం చేస్తూ మధ్వాచార్యులు ఒకసారి భద్రానదీ తీరాన కలశ గ్రామం సందర్శించారు. అప్పటికి ఆయన వయస్సు 75 సంవత్సరాలు.

ఆ ప్రాంతంలో భద్రానదీ ప్రవాహం చాలా రమణీయంగా ఉంది. అయితే ఆ నదీ తీరంలో ఒక భారీ గండశిల ఉంది. ఈ బండని నది మధ్యలోకి దొర్లించగలిగితే ప్రవాహం

మరింత తీరానికి చేరువగా వచ్చి ప్రజల స్నానాదికార్యాలకు మరింత వీలుగా ఉంటుంది అని పూర్ణప్రజ్ఞులు గుర్తించారు. ఇదే మాట ఆయన ఆ ఊరివాళ్లని అడిగారు.


శ్రీ మధ్వాచార్యులు ఒంటిచేత్తో ఎత్తిన బండ (భీమనబండ)

"ఈ గండశిలని ఆ ప్రవాహం మధ్యకి చేరవేస్తే మీకు స్నానపానాదులు సులువవుతాయికదా. ఎందుకు చేయరు?"

దానికి గ్రామస్థులు వినమ్రంగా జవాబిస్తూ, "అందుకోసం మేము చాలా ప్రయత్నం చేశాం స్వామీ! కొన్ని వందలమంది కలిసి త్రోసినా దాన్ని కదల్చలేకపోయాం. ఏ భీమసేనుడో వచ్చి చేయాలి తప్ప మా వల్ల ఎక్కడవుతుంది?" అన్నారు.


శ్రీ మధ్వాచార్యులు ఎత్తిన బండమీద చెక్కిన శిలా శాసనం, శ్రీ మధ్వాచార్యులు, వారి దండకమండలాల రేఖాచిత్రం

మధ్వాచార్యులు చిరునవ్వు నవ్వి గ్రామస్థులంతా చూస్తూండగానే స్వయంగా వెళ్లి గండశిలను తన ఒంటి చేత్తో పై కెత్తారు. గ్రామస్థులంతా "మహాద్భుతం, మహాద్భుతం" అంటూ సంభ్రమంలో మునిగిపోయి చూస్తూండగానే అవలీలగా ఆనందతీర్థులు ఆ బండను ఎత్తి గ్రామస్థులు ఆశించిన విధంగా నదీప్రవాహం మధ్యలో వేశారు.

గ్రామస్థులు తాము చూస్తున్నది 'నిజమా! కలా!' అన్నంత ఆశ్చర్యంతో అవాక్కయ్యారు.

ఆ సంభ్రమం నుంచి తేరుకున్న మరుక్షణం వాళ్లకి ఆయనలో భీమసేనుడే కనిపించాడు. "ఈయనే ఒక భీమసేనుడు, ఒక హనుమంతుడు..." అనుకున్నారు. ఆనందాతిశయంతో వాళ్లంతా ఆయనకి

సాష్టాంగ ప్రణామం చేశారు. (ఈ సంఘటనకు సంబంధించిన శిలాశాసనం ఇప్పటికీ కలశ గ్రామం దగ్గర కనిపిస్తుంది. ఈ శాసనం మీద 'మధ్వాచార్య ఏక హస్తినా ఆనీయ స్థాపితా శిల' అని స్పష్టంగా రాసి ఉంది. దానికి జతగా మధ్వుల రేఖాచిత్రం, ఎడమ కుడిచేతులలో దండకమండలాల చిత్రాలు ఉంటాయి.)

చికమంగుళూర్ జిల్లాకి సంబంధించిన 'ఎపిగ్రాఫికా కర్నాటక– మైసూరు' గెజిట్‌లో రికార్డయి ఉన్న దాని ప్రకారం ఈ గండశిల పరిమాణం 20'×16'×10'. బరువు సుమారు 50 టన్నులు. ఈ శాసనాలకి సంబంధించిన ఇతర దాఖలాలు ఇలా ఉన్నాయి.

At one point is a large boulder, a big square-shaped stone placed horizontally on another. On the former is an inscription in Sanskrit, stating that Sri Madhwacharya brought and placed it there with one hand!

**- Extract from Mysore A Gazetteer Compiled by B. Lewis Rice (Revised Edition) Vol. II - Mysore.**

Madhwacharya Bande - At Ambuteertha alluded to earlier, the river Bhadra rushes very deep between some water-worn rocks. Here at one point, there is a large boulder which is a big square-shaped stone placed horizontally on another. The former, which is called Madhwacharyara Bande or Bheemana - Kallu has an inscription in Samskrita, stating that Shri Madhwacharya (the founder of the Dwaita School of Philosophy) brought and placed it there with one hand. The length of this stone is 6.1 meters, breadth 3.6 meters and height 10.98 meters. The circumstances under which he brought the stone are mentioned in the Madhwa - Vijaya. The saint Saw a big rock which had been brought by about a thousand men for some teertha and abandoned through utter inability. He is stated to have enquired 'Why was the rock not conveyed (to its destination) for the good of the people'. The crowd at the place replied that there were no men able to convey it there and that even Bheema were to try it was doubtful if be could do it or not. It is stated that there upon, he bore up the rock easily with one hand. 'As in the form of Hanuman, he had borne up the mountain (Gandhamadana)', and placed it at the intended spot. There is a figure Madhvacharya about 11 cms high, carved on upper part of the rock.

**-Extract from Chikmagulur District Gazetteer, Ed. By K. Abhishankar - 1981, Banaglore.**

At one point is a large boulder, a big square-shaped stone placed horizontally on another. On the former is an inscription in Sanskrit, stating that Sri Madhwacharya about and placed it there with one hand.

The circumstances under which he brought the stone here are related in the Madhva -vijaya. Maheksha (Madhvacharya) saw a big rock, capable of supporting the fall of water from a height, which had been brought by a thousand men for some tirtha, and abandoned through utter inability. 'Why was the rock

not conveyed (to its destination) for the good of the people?' he inquired; When the crowd at the place replied, that there were no men able to convey it there and that even if Bhima were to try, it was doubtful whether he could do it or not. Whereupon he bore up the rock easily with one hand, as in the form of Hanuman he had borne up the mountain (Gandhamadana), and placed at the destined spot. And this rock in the Tunga even now bears witness to its deed.

**- Extract from Mysore Gazetteeer, Vol. V. Ed. by C. Hayavadana Rao, Bangalore (1930)**

Notice ought to have been directed in an earlier section to Mg. 89, the date of which is about 1240. It is an inscription on the top of a big boulder called the Bhimana - Kallu at the Amba - Tirtha in the Tunga river. It states that the rock was brought there and set up with one hand by Madhavacharya. This was the reformer of 13th century, who was the exponent of the system of Dvaita or dualism, and the founder of the sect of Mādhava Brahmans. The circumstances under which he brought the stone here are thus related in the Madhva -Vijaya.

Maheksha (Madhvāchārya) saw a big rock, capable of supporting the fall of water from a height, which had been brought by a thousand men for some tirtha, and abandoned through utter inability. 'Why was the rock not conveyed (to its destination) for the good of the people?' he inquired; when the crowd the place replied, that there were no men able to convey it there, and that even if Bhima were to try, it was doubtful whether he could do it or not. Whereupon he bore up the rock easily with one hand, as the form o Hanumān he had borne up the mountain (Gandhamādana). And placed it at the destined spot. And this rock in the Tungā even now bears witness to its deed.

**- Extract from Epigraphica Carnatica (Kadur District) Vol VI, by Lewis Rice, 1901, Bangalore.**

పసితనంలో పాజక క్షేత్రంలో పాలు, పెరుగు పాత్రలమీద బండల్ని ఎత్తి పెట్టినప్పుడు మధ్వుల వయస్సు 3-4 సంవత్సరాలు. భద్రానదిలో ఈ గండశిలను ఎత్తిపెట్టినప్పుడు ఆయన వయస్సు 75 సంవత్సరాలు. భీమసేనుడు కాక మరెవ్వరికైనా ఇది సాధ్యమా?

## గ్రహణస్నానం

ఒకసారి చాతుర్మాస్య కాలంలో కణ్వతీర్థంలో మధ్వాచార్యులు విడిది చేసిఉన్నారు. బహుశా అది ఉత్తరబదరికి వెళ్లడానికి ముందు పాటించిన చివరి చాతుర్మాస్యాల్లో ఒకటి.

ఆ రోజు సూర్యగ్రహణం. అదేరోజు సోమవారం, అమావాస్య కావటంవల్ల ఆ సూర్యగ్రహణానికి చూడామణీ యోగమని పేరు. అంటే అన్ని ఇతర గ్రహణాలకన్నా ఆ సూర్యగ్రహణం కోటిరెట్లు అధిక శక్తి కలిగింది. ఆ రోజు సముద్రస్నానం విశేషమైన మాహాత్మ్యం కలిగి ఉంటుంది.

ఆనందతీర్థులు తన శిష్యుల సమేతంగా సముద్రస్నానానికి బయలుదేరారు. ముందుగా కణ్వతీర్థంలో స్నానం చేశారు. తరువాత సముద్రస్నానానికి వెళ్లారు. గ్రహణకాలం కావటంవల్ల సముద్రపు హోరు చాలా ఎక్కువగా ఉంది. గ్రహణం పట్టడానికి ముందుగా మధ్వులు సముద్రతీరంలో ఆసనంమీద కూర్చొని ఐతరేయ శ్రుతి సూక్తాలనుంచి తత్త్వాన్ని ఉపదేశిస్తూ ప్రారంభించారు. ఆ ప్రవచనం ఎంత సుందరంగా వుందంటే సముద్రపు ఘోషను మించి ఆయన గంభీరకంఠం నుంచి తత్త్వప్రసారం ఉద్ధృతంగా సాగింది. ఆ ప్రవచన ఘోషకి అక్కడ స్నానానికి వచ్చిన భక్తజనులంతా ఆకర్షితులయ్యారు. వాళ్లంతా మధ్వుల శిష్యుల వెనకాల బారులు తీరి కూర్చొని శ్రవణానందకరంగా సాగుతున్న ఆ మధ్వభాషణల్లో పరవశించిపోయారు...

గ్రహణం ఆరంభమయ్యింది. వెంటనే మధ్వులు ప్రవచనాన్ని పూర్తి చేసి స్నానానికి సముద్రం వైపుకు వెళ్లారు. స్నానం చేస్తూండగా అలల తాకిడికి మధ్వులు పడిపోవడం చూసి కొందరు ద్వైతసిద్ధాంత వ్యతిరేకులు పగలబడి నవ్వారు. వారి హేళనకు సమాధానమా అన్నట్లుగా మరుక్షణంలో మధ్వులు ఒక్కసారిగా తమ దృష్టిని సముద్రం మీద కేంద్రీకరించారు.

అంతే! సముద్రం మొత్తం స్తంభించిపోయింది. ఒక్క అల కూడా లేకుండా నిశ్చలమైన సరస్సులా మారిపోయింది. ఈ వింత సంఘటన చూసిన జనమంతా ద్రాను పడిపోయారు. కాని మధ్వశిష్యులకు అదేమంత ఆశ్చర్యం కలిగించలేదు. గురుదేవులే వాయుదేవుడి అవతారమయినప్పుడు ఇందులో ఆశ్చర్యపడవలసిందేముందీ అనుకున్నారు.

## మల్లయోధుల ఓటమి

**మ**రొకసారి ఒక నిండు సభ. ఆ సభలో ఆనందతీర్థులు తత్త్వోపదేశం చేస్తున్నారు. అక్కడ విద్వాంసులున్నారు, అనేకమంది పామరులున్నారు. తత్త్వోపదేశం మధ్యలో ఉండగా, సభికుల్లోంచి ఇద్దరు కుస్తీపహిల్వానులు అకస్మాత్తుగా పైకి లేచారు. వాళ్ల వెనకాల ఒక పెద్ద గుంపు. ఆ లేచిన వాళ్లిద్దరూ మధ్వాచార్యుల వద్దకు వచ్చి, "మీరు మహాబలశాలురట కదా! ఆ మహాబలాన్ని పరీక్షించాలని మా కోరిక. అవకాశమిస్తారా సామీ!" అని వెటకారంగా అడిగారు.

ప్రశాంత వదనంతో మధ్వాచార్యులు "తప్పకుండా, ఇక్కడే. ఇప్పుడే" అన్నారు. ఆ ఇద్దరి పహిల్వానుల్లో ఒకడు కాంతవర దేవస్థానంలో ఒక భారీ ధ్వజస్తంభాన్ని ఒంటి చేత్తో ఎత్తి ఖ్యాతి పొందినవాడు. ఇంకొకడు భారీ గదతో కొబ్బరిచెట్టు కాండం మీద కొట్టి కాయలు రాలిపించినవాడు. ఇప్పుడు వాళ్లిద్దరూ మధ్వాచార్యుల్ని సవాల్ చేస్తున్నారు.

మధ్వాచార్యులు దరహాసం చేస్తూ "మేం సన్యాసులం. ఇంకొకరి మీద చేయి చేసుకోవడం ధర్మం కాదు. కాబట్టి మేమిలాగే కూర్చొని ప్రవచనం చేస్తూంటే మీరు వచ్చి మా గొంతు పట్టుకుని మీ సామర్థ్యాన్ని ప్రదర్శించండి" అంటూ రెచ్చగొట్టారు.

'ఈ సన్యాసికి ఎంత ధైర్యం' అనుకుంటూ వాళ్లిద్దరూ వచ్చి మధ్వాచార్యుల గొంతు నులమసాగారు. శిష్యులు ఆందోళనతో చూస్తుండగా మధ్వులు ప్రసన్నముఖంతో దరహాసం చేస్తూనే ఉన్నారు. ఆ పహిల్వానులు మధ్వాచార్యుల గొంతు పిసికి పిసికి పైకెత్తటానికి ప్రయత్నించి చెమటలు కక్కుతూ కూలబడ్డారు. అలా కూలబడిన పహిల్వాన్లను లేపి కూర్చోబెట్టడానికి మధ్వుల శిష్యులు చాలా ఉపచారం చేయవలసి వచ్చింది. ఆ సభలో జనమంతా ఆ సంఘటనతో నిశ్చేష్టులయిపోయారు.

## జగత్ గురువుని గౌరవం

ఆ పహిల్వాన్‌లిద్దరూ పూర్తిగా కోలుకున్న తరువాత పూర్ణప్రజ్ఞులు వారిని ఆదేశించారు. "మీకు నేను మరో అవకాశం ఇస్తాను. ఇప్పుడు నేలమీద నా కాలు పెడుతున్నాను. మీ ఇద్దరూ కలిసి ఆ కాలి బొటనవేలిని పై కెత్తండి. అలా ఎత్తగలిగితే మీరు గెలిచినట్లే".

ఆ వస్తాదుల్లో మళ్లా ఆశ చిగురించింది. పోటీకి సిద్ధపడ్డారు. ఒకసారి ఏనుగు ఘీంకరించినట్లు హుంకారం చేశారు. ఒక్కసారిగా ఇద్దరూ కలిసి నేలమీదకు వంగి మధ్వుల బొటనవేలిని చులాగ్గా ఎత్తేయబోయారు.

ఒకసారి...

రెండోసారి...

మూడోసారి...

ఈ సారి వాళ్ల బలమంతా ఉపయోగించి ఎత్తబోయి, ఎత్తలేక మళ్లీ కూలబడ్డారు. శిష్యులు, సభికులు పగలబడి నవ్వారు. శిష్యులకు అర్థమైపోయింది. కలియుగ భీమసేనుడు 'గరిమ' అనే యోగశక్తిని ప్రదర్శించారు. అందుకే అంతటి వస్తాదులు నేలకూలారు.

## లఘిమా కౌశలం

ఇంకో సందర్భంలో అశేషంగా జనం పాల్గొన్న ఒక విద్వత్‌సభలో మధ్వాచార్యులు పాల్గొన్నారు. అకస్మాత్తుగా ఆయన దృష్టి ఆ సభికుల మధ్యనున్న ఒక బాలబ్రహ్మచారిపై పడింది. అతన్ని ఆప్యాయంగా దగ్గరికి పిలిచారు. అప్పటికి అతనికి ఉపనయనం జరిగి కొద్ది రోజులే అయింది.

ఆ వటువుని వంగోమని చెప్పి, ఒక్కసారిగా తాను అతడి భుజాలమీద ఎక్కి కూర్చున్నారు. కూర్చొని, "చిరంజీవీ, ఈ నర్సింహదేవస్థానానికి ప్రదక్షిణం చేద్దాం పదా" అన్నారు. అంతే!

సభికులంతా ఆశ్చర్యసాగరంలో మునిగిచూస్తుంటే ఆ బాలబ్రహ్మచారి అనాయాసంగా చిరునవ్వులు చిందిస్తూ మధ్వాచార్యుల్ని మోస్తూ ఆలయం చుట్టూ ప్రదక్షిణలు చేశాడు. ఏం అద్భుతం! అందరూ అబ్బురపడుతుంటే శిష్యులు వివరించారు. "ఇది మా గురువులు ప్రదర్శించిన 'లఘిమా' యోగశక్తి. ఈ శక్తి వల్ల భారమైన శరీరం దూదిలా తేలికైపోతుంది"

**జట్టీ ఆర్తనాదం**

ఒక మహా వస్తాదు. ఈ వస్తాదు ఇంతకుముందు మధ్వుల్ని సవాల్ చేసిన ఇద్దరు జట్టీల కంటె మహాబలశాలి. 50 మంది రాజభటులు కలిసినా ఎత్తలేకపోయిన ఒక మహావృక్షాన్ని అవలీలగా పెకలించివేసిన జగజ్జట్టీగా పేరు పొందాడు.

మధ్వాచార్యుల గురించి విన్నాడతడు. పరీక్షించాలని వచ్చాడు. "నా కన్నా మొనగాడివా? ఏదీ నా మీద గెలు, చూద్దాం" అంటూ మధ్వుల్ని సవాలు చేశాడు.

మధ్వులు ఎప్పటిలాగానే చిరునవ్వు నవ్వారు. "బల పరీక్షకి మేం సిద్ధమే. కాని, సన్యాసినై వుండి నీతో ముఖాముఖి కుస్తీకి రావటం నియమ విరుద్ధం... ఒక పని చేద్దాం. మేమిలాగే కూర్చొని వేద పఠనం చేస్తూంటాం. నువ్వు మా మెడ పట్టి పైకి లేపితే నువ్వే గెలిచినట్లు" అన్నారు.

వస్తాదు 'ఇంతేనా' అని అన్నాడు.

మధ్వుల వేద పఠనం ప్రారంభమైంది. క్రమంగా ఉచ్చస్వరంలో వారు చేస్తున్న వేదఘోషతో ఆ పరిసర ప్రాంతాలన్నీ ప్రతిధ్వనిస్తున్నాయి. వస్తాదు తాను గెలిచిపోతున్నానన్న ఆనందంతో ఉబ్బితబ్బిబ్బవుతూ పూర్ణప్రజ్ఞుల్ని సమీపించాడు.

ముందుగా తన ఎడమచేత్తో మధ్వుల మెడ పట్టుకుని లేపబోయాడు. సాధ్యం కాలేదు. కుడిచేత్తో లేపబోయాడు. సాధ్యం కాలేదు. వేదఘోష సాగుతూనే వుంది. అసహనంతో 'హుం'కారం చేస్తూ రెండు చేతుల్తోనూ బలంగా ఆయన మెడ పట్టి లేపబోయాడు. అతను తన బలప్రయోగం పెంచుతున్నకొద్దీ వేదఘోష ధ్వని పెరుగుతోంది. ఇంకా ఇంకా...

చెమటలు కారుతూంటే ఆ వస్తాదు చేతులు చెమటతో తడిసి ఒక్కసారిగా పట్టు జారిపోయి కింద పడిపోయాడు.

కొద్దిసేపు విరామం తరువాత, "పోనీ మా బొటన వేలిని కదపవయ్యా చాలు" అంటూ ఆనందతీర్థులు కాలిబొటన వేలిని అందించారు. ఈ సారి ఇంకా ఘోరంగా పరాభవం పొందాడు ఆ జగజ్జట్టి.

ఆ సన్నివేశాన్ని చూస్తున్న శిష్యబృందానికి భారతంలో జరాసంధుల్ని ఓడించి విర్రవీగుతున్న మల్లయుద్ధవీరుడు జీమూతమల్లుణ్ణి మట్టి కరిపించిన భీమసేనుడు తమ గురువులో మరోసారి దర్శనమిచ్చారు. భక్తితో గురువుకి నమస్కరించారు.

ఇలా చాలాసార్లు జరిగింది. వేర్వేరు ప్రదేశాలలో కుస్తీలో వస్తాదులైన శివ, అగ్ని, వాసుదేవుడు, ఉగ్ర మొదలైన బలశాలురు మధ్వాచార్యుల్ని గెలవాలని వచ్చి శాయశక్తులా శ్రమించి భంగపడి వెనుదిరిగిపోయారు.

**రామభక్తుడి శక్తి**

ఇలా మధ్వుల బలం గురించి ప్రచారం జరిగిన కొద్దీ ఎక్కడెక్కడినుంచో పహిల్వానులు వస్తూనే ఉన్నారు. మధ్వుల్ని ఓడించే ప్రయత్నం చేస్తూనే ఉన్నారు.

ఒకసారి ఆనందతీర్థులు విద్వత్‌సభలో ఉండగా, వస్తాదులు కొంతమంది గుంపుగా వచ్చారు.

"నీవేమి మహా బలశాలినని విర్రవీగుతున్నావట. మాలో ఏ ఒక్కరిని జయించగలిగినా నువ్వు వీరుడివే. రా" అంటూ వాళ్లు సవాల్ చేశారు.

"ఎందుకంత శ్రమ నాయనా! మీరంతా కలిసి మా శరీరం మీద నుంచి ఒక్క వెంట్రుక తొలగించినా ఓటమిని అంగీకరిస్తాం. రండి. కానివ్వండి" అంటూ పూర్ణప్రజ్ఞులు తన ప్రవచనం కొనసాగించారు.

ఆ వస్తాదులందరికీ రోషం వచ్చింది. మూకుమ్మడిగా వారిని చుట్టుముట్టారు. తమ శక్తి అంతా ప్రదర్శించారు... ఒక్క వెంట్రుకని కూడా కదల్చలేకపోయారు.

ఆ సన్నివేశం చూస్తుంటే సభలోని వాళ్లందరికీ రావణాసురుడి సభలో హనుమంతుడి తోకకి మంట పెట్టిన సన్నివేశం స్ఫురించింది. ఎంత మంట పెడితే మాత్రం హనుమంతుడి కేమయింది? ఏమీ కాకపోగా లంకంతా తగలబడింది!

మరోసారి మరో ఊళ్లో వస్తాదులూ ఇలాగే వచ్చి ప్రగల్భాలు పలికారు. అప్పుడు మధ్వులు "మీరంతా మా ముక్కుకొనమీద గుద్దండి. మా ముఖంలో కాంతి ఏ కొంచెం తగ్గినా విజయం మీదే" అంటూ అన్పించారు. వాళ్లు విజృంభించారు. ముక్కు మీద గుద్దారు. ముఖం మీద గుద్దారు. అలా గుద్దిన ప్రతిసారి బండరాయి మీద గుద్దినట్లు వాళ్ల చేతివేళ్లలో ఎముకలు విరిగాయి తప్ప ఆనందతీర్థుల తేజస్సు ఇసుకరేణువంత కూడా తగ్గలేదు. వస్తాదులకు పరాభవం తప్పలేదు. వాళ్లకి అప్పటికి గాని తాము ఢీకొన్నది కలియుగ భీమసేనుడ్ని అన్న విషయం అర్థం కాలేదు.

## పంచమూర్తుల పూజ

సంచారంలో ఉండగా 'వారంతీ' అనే దేవాలయాన్ని ఆనందతీర్థులు సందర్శించారు.

(కర్నాటకలో ఉప్పినంగడి నుంచి 10 కిలోమీటర్ల దూరంలోని మధ్యాగ్రామం దగ్గర వారంతీ దేవాలయం ఉంది.) అది ఒక పుణ్యక్షేత్రం. అక్కడ నారాయణ, వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ అనే పంచమూర్తులు లింగాకారంలో ఉన్నాయి. వీటిని ప్రతిష్ఠ చేసింది – మహాభారత కాలంలో పంచ పాండవులు. వాటి అభిషేకానికి ఉదకాన్ని తీసుకువచ్చింది ద్రౌపదీదేవి.

మధ్వావతారులయిన భీమసేనులు ఆ ఆలయాన్ని దర్శించి అక్కడ పూజాదికాలు నిలిచిపోవడం పట్ల విచారించారు. ఆయన రాక విని, చూడాలని వచ్చిన ఆ ప్రాంతపు రాజుకి ఆ ఆలయ విశిష్టతని వివరించారు. అప్పటికప్పుడు ఆ ఆలయాన్ని పునరుద్ధరించి, అక్కడ నిత్యధూప దీప నైవేద్యాది కార్యక్రమాలు కొనసాగేలా చేశారు. ఇదంతా సగం రోజులోనే జరిగిపోవటం విశేషం.

## అకాల వృష్టి

సంచారంలో భాగంగా సరిదంతర (ఇడెతారి) అనే ఊరి మీదుగా వెళ్లాల్సి వుంది అప్పటికి ఆ ఊరి పరిస్థితి చాలా అధ్వాన్నంగా ఉంది.

చుట్టుపక్కల చెరువులన్నీ ఎండిపోయాయి. తాగటానికి నీళ్లు కావాలన్నా మైళ్లకొద్దీ దూరం వెళ్లాల్సి వస్తోంది... ఇలాంటి స్థితిలో ఒక మహాగురువు తమ ఊరికి వస్తున్నారని తెలిసి ఊరి పెద్దలు వెళ్లి వారిని ముందు విడిదిలోనే కలుసుకున్నారు.

"అయ్యా, మీరు వస్తే మీకు పాదాభిషేకం చేయటానిక్కూడా మా ఊళ్లో నీళ్లు లేవు. కాని మీరు రావాలనే మా కోరిక. మా సమస్య..." అంటూ వివరించాడు.

పూర్ణప్రజ్ఞులు వారి పట్ల సానుభూతి, కరుణ ప్రదర్శించారు. "మేం వస్తున్నాం, మీరు వెళ్లండి" అన్నారు.

శిష్యబృందంతో కలిసి ఆ ఊరి పొలిమేరలో అడుగుపెడుతూనే మధ్వాచార్యులు కన్నులు మూసుకుని ధ్యానం చేశారు...

క్షణాల్లో ఎండంతా మాయమై, ఆకాశమంతా దట్టమైన మబ్బులు కమ్మేశాయి...

టప్... టప్... అంటూ చినుకులు పడసాగాయి. ఒకటా రెండా! వందలు, వేలు, లక్షలు, కోట్లాది చినుకులతో ఆకాశం చిల్లు పడిందా అన్నట్లుగా కుంభవృష్టి కురిసింది.

ఆ ఊరి చెరువు మొత్తం నీటితో నిండిపోయింది. ఊరి జనం సంభ్రమంతో నిశ్చేష్టులయ్యారు. అంతలో తేరుకుని ఆనందంతో నృత్యం చేశారు. గెంతారు. నీళ్లలో తనివితీరా తడిసిపోయి పరుగుపరుగున వెళ్లి మధ్వులకు సాష్టాంగ నమస్కారం చేశారు.

"మీరు సామాన్య యతులు కారు. ఆ వాయుదేవుడే మీ రూపంలోకి వచ్చారు. అందుకే మేఘాల్ని మీరు మా ఊరి మీదే స్తంభింపజేసి వర్షింపచేశారు. స్వామీ..." అంటూ వాళ్లు అనేక రకాలుగా ఆనందతీర్థుల్ని స్తుతించారు.

ఊరు ఊరంతా వచ్చి మేళతాళాలతో అపూర్వమైన స్వాగత సంరంభంతో మధ్వుల్ని తమ ఊరి మధ్య విడిది చేయించారు. వారందరికీ మధ్వాచార్యులు తత్త్వబోధ చేశారు. ఏ శక్తి సమస్త జగత్తునీ కాపాడుతుందో ఆ సర్వశక్తిమంతుడైన భగవంతుణ్ణి ఎలా ఆరాధించాలో బోధించారు. నారాయణుడ్ని అర్చించటానికి మించిన ముక్తిసాధనం మరొకటి లేదని వాళ్ల మనస్సుల్లో నాటుకునేలా చేశారు. భూదేవి సమేతుడైన శ్రీమన్నారాయణుడి విగ్రహాన్ని ఇచ్చి, నిత్యపూజ చేసి తరించవలసిందిగా ఆదేశించారు.

(ఆ స్థలాన్ని ఇప్పుడు 'ఎర్కిమఠం' అని పిలుస్తారు. మధ్వులు కురిపించిన జలధారతో నిండిన చెరువుని ఇప్పటికీ అక్కడ చూడవచ్చు. ఇది ఉప్పినంగడికి 10 కిలోమీటర్ల దూరంలోని ఆత్కూరుకి ఒక కిలోమీటరు ప్రక్కగా ఉంది.)

### గౌడ పశ్చాత్తాపం

ఇలా మధ్వసిద్ధాంతంతో ప్రజల్ని సమ్మోహపరుస్తూ, తత్త్వబోధ చేసుకుంటూ సాగుతున్న ఆనందతీర్థుల్ని ద్వేషించే ఇతర సిద్ధాంతవాదులు, కొందరు ఈ మహిమాన్విత శక్తి ఉనికిని భరించలేకపోతున్నారు. అసూయకి, ద్వేషానికి అంతమెక్కడ? బుద్ధివికాసం కలగాలి కదా!

తత్త్వప్రచారం చేసుకుంటూ వెళ్తున్న మధ్వాచార్యుల్ని శాశ్వతంగా మట్టుపెట్టడం ఒక్కటే పరిష్కారంగా భావించిన ఈ దుష్టశక్తులు ఆ ఊరి గౌడకి మధ్వుల మీద విషం నూరిపోశారు. బుద్ధి మందగించిన గౌడ కసితో మధ్వుల్ని మట్టుపెట్టాలని నిశ్చయించు కున్నాడు.

ఆయన శిష్యబృందంతో పాటు ఆ ఊరిని విడిచి సంచారం సాగిస్తుండగా, ఊరి బయట ఒక చిన్న ఆనకట్ట ప్రాంతంలో కత్తితో ఆయన మీద దాడి చేసి సంహరించటానికి గౌడ సిద్ధమయ్యాడు.

మధ్వుల బృందం బయల్దేరింది...

ఊరి పొలిమేరలు దాటింది...

ఆనకట్ట ప్రాంతంలో మలుపు తిరుగుతోంది...

అప్పటిదాకా పొదల చాటున దాక్కొనివున్న గౌడ ఉద్ధృతమైన ఆవేశంతో ఒక్కసారిగా లేచి తన ఖడ్గంతో మధ్వుల మీదకి ఉరికాడు...

ఈ హఠాత్ సంఘటనకి వెనుక వస్తున్న శిష్యులంతా నివ్వెరపోయారు...

ఒకరిద్దరు శిష్యులు "అయ్యో, అయ్యో..." అంటూ కేకలు వేస్తున్నారు...

కాని...

ఆనందతీర్థులకి ఎదురుగా దూకి, ఆయన్ని నరికేయాలని కత్తి ఎత్తిన గౌడ ఒక్కసారిగా తన కళ్లెదుట మిరుమిట్లు గొలుపుతున్న కాంతిపుంజాన్ని మాత్రమే చూసి అప్రతిభుడయ్యాడు.

కళ్లకి ఏమీ కనబడటం లేదు - ఒక అపూర్వమైన తేజోరాశి మినహా అంతా అంధకారంలా తోచింది.

ఏమా దివ్యకాంతి దర్శనం? సూర్య భగవానుణ్ణే ఎదురుగా నిలబడి చూస్తున్నానా అన్నంత సంభ్రమంలో ఆ కాంతి పుంజాన్ని చూడలేక కళ్లు మూసుకున్నాడు గౌడ. అప్రయత్నంగా అతని చేతిలోని కత్తి జారి కిందపడి పోయింది.

కొద్ది క్షణాల తరువాత కళ్లు తెరిచి చూశాడు. చిరునవ్వు చిందిస్తూ ప్రకాశిస్తున్న మధ్వాచార్యులు కనిపించారు. మనోవికాసం కలిగింది.

అంతే!

ఒక్కక్షణం కూడా ఆలోచించకుండా ఆయన పాదాల మీద పడి పదే పదే క్షమాభిక్ష కోరాడు.

కరుణామయుడైన ఆనందతీర్థులు క్షమించారు. ఆ క్షణాలనుంచీ గౌడ ఆయనకి మహాభక్తులలో ఒకడుగా మారిపోయి మధ్వతత్త్వ ప్రచారంలోనే జీవితమంతా గడిపాడు.

జాతి, మత, కుల వివక్షతకి అతీతంగా తనని ఆశ్రయించిన ప్రతి ఒక్కరికీ తత్త్వబోధ చేస్తూ వాళ్లని చరితార్థుల్ని చేశారు మధ్వాచార్యులు.

## కృష్ణామృత మహార్ణవం

దక్షిణ కన్నడదేశంలో వైద్యనాథేశ్వర (కొక్కడ) క్షేత్రంలో ఆయుర్వేద ప్రవక్త అయిన ధన్వంతరి ఆరాధ్యమూర్తిగా విలసిల్లుతున్నాడు. ఇక్కడ ధన్వంతరి - ఉడుపిలోని అనంతేశ్వరుడి లాగా లింగాకారంలో ఉంటాడు. ఆ ఆలయానికి ఈశాన్యంలో విశాలమైన, మహిమాన్వితమైన సరోవరం ఒకటి ఉంది. ఆ సరోవరంలో స్నానం చేసి, ధన్వంతరిని అర్చించేవారికి సకల రుగ్మతల నుంచీ విముక్తి లభిస్తుందని ప్రతీతి.

వైద్యనాథేశ్వరం విద్వాంసులకు కూడా నిలయం. యజ్ఞయాగాది వైదిక కార్యక్రమాలకు అది నెలవు. ఆ ఊరి యాజ్ఞికులకు నాయకమణి ఇడెపాడిత్తాయ. ఆయన స్వతహాగా సాత్త్వికుడు. దేవస్థాన పాలకవర్గంలో ప్రముఖుడు.

ఆనందతీర్థులు తమ సంచారంలో భాగంగా వైద్యనాథేశ్వరాన్ని సందర్శించారు. అప్పటికే వారి గురించి అనేకసార్లు విని వుండటం వల్ల ఆ ఊరి పెద్దలంతా ఇడెపాడిత్తాయ సారథ్యంలో మధ్వులకు అపూర్వమైన స్వాగతం ఇచ్చారు.

ఇడెపాడిత్తాయులు భక్తిపరుడు. సాత్త్వికుడు. కాని సదాచార పరిజ్ఞానం అంతగా తెలిసిన వ్యక్తి కాదు. ముఖ్యంగా భగవంతుని నిత్యపూజ, ఊర్ధ్వపుండ్రధారణ, ముద్రాధారణ, ఏకాదశి వ్రతం మొదలైన శాస్త్రవిధుల గురించి అంతగా తెలీదు. భక్తితత్పరత మాత్రం అపారం.

ఆ నేపథ్యంలో మధ్వాచార్యుల సందర్శనం ఆయనలో అలౌకికమైన మార్పు తీసుకువచ్చింది. తాను కలిసి తీరాల్సిన, తన జీవితాన్ని ఉద్ధరించగల గురువు "వీరే" అన్న భావన మనసులో బలంగా నాటుకుంది. అప్పట్నుంచి తనకు మార్గదర్శనం చేయవలసిందిగా ఆయన పూర్ణప్రజ్ఞుల్ని పదే పదే ప్రార్థించారు.

ఆ ప్రార్థనతో ప్రసన్నులైన మధ్వులు, 'కృష్ణామృత మహార్ణవం' అనే కృతిని రచించి ఇడెపాడిత్తాయకు ప్రసాదించారు.

ఇదొక మహాద్భుత రచన. దేవపూజ, గోపీచందన మహాత్మ్యం మొదలైన వైష్ణవులు తెలుసుకొని, ఆచరించవలసిన అనేక క్రియా రూపాలకు ఇదే ఆధారం. పంచ సంస్కార వర్ణనంగా రూపొందిన ఈ కృతిలో ఇతిహాస పురాణాల్లో చెప్పబడిన ఏకాదశివ్రత విధి విధానాల విశిష్టత, ఆచార నియమాలు మొదలైనవి స్పష్టంగా వివరించబడ్డాయి. 'కృష్ణామృత మహార్ణవం' లోని క్రియలను ఆయా విధి విధానాల ప్రకారం ఆచరించే ఏ వైష్ణవుడైనా మోక్షప్రాప్తికి అర్హుడవుతాడనటంలో సందేహం లేదు.

ఈ 'కృష్ణామృత మహార్ణవ' రచనకు ముందే 'జయంతీ కల్పం' కూడా మధ్వాచార్యుల కృతిగా వెలువడింది. పక్షానికొకసారి ఏకాదశినాడు ఉపవాసం వైష్ణవులకు తప్పనిసరి. కృష్ణాష్టమి నాడు కూడా విధిగా ఉపవాస వ్రతం ఆచరించాలి. ప్రతి ఏకాదశి నాడు, శ్రీకృష్ణాష్టమి నాడు ఉపవాసం చేసి, చంద్రోదయ కాలంలో శ్రీకృష్ణునికి అర్ఘ్యమిచ్చి, మరునాడు మాత్రమే భగవత్ప్రసాదాన్ని స్వీకరించి ఉపవాస దీక్ష విరమించాలి... ఈ విశేషాలను తెలియజేసే విశిష్టకృతి 'జయంతీ కల్పం'.

### ఉజీరలో అజరమధ్వులు

కొక్కడ నుంచి మధ్వులు ముందుకు సాగి 'ఉజీర' క్షేత్రం చేరారు. ఆ రోజుల్లో దాన్ని 'ఉచ్ఛభూతి' అని కూడా పిలిచేవారు. పురాతనమైన జనార్దన దేవాలయం ఉండటం వల్ల ఉజీర ఒక పుణ్యక్షేత్రంగా భాసిల్లుతోంది.

ఉజీరకి ఆ రోజుల్లో వేదవిద్వాంసుల క్షేత్రమని ప్రచారముండేది. సహజంగానే అన్ని ఊళ్లలోలాగానే ఇక్కడ కూడా మధ్వాచార్యుల గురించి విశేషంగా విద్వాంసులు విని ఉన్నారు. ఆయన మహిమలు, చతుఃషష్ఠి కళల్లో ఆయనకి గల ప్రావీణ్యం విని వున్నప్పటికీ ఇదంతా నిజం కాదనే వాదించే వైదికులు కూడా కొంతమంది ఉన్నారు. సహజంగానే వాళ్లకి మధ్వులు సాగిస్తున్న ద్వైతసిద్ధాంత ప్రచారం కంటకింపుగా ఉంది.

ఎంత దురదృష్టం! తత్త్వం విలువను తెలుసుకోవాలన్న ఉత్సుకత కన్నా తమ సిద్ధాంత ప్రతిష్ఠను కాపాడుకోవాలన్న ఆరాటం పండితుల్లో ఎక్కువైన చోట విద్వాంసుల సందేశాలు దారి తప్పడం సహజం. అందువల్ల సరైన దిశా నిర్దేశాలు లేకుండా సమాజం దారితప్పడం, లేదా విసుగు చెందిన ప్రజలు తాత్త్వికప్రపంచం నుంచి దూరంగా తొలగిపోవటం జరుగుతూంటుంది. అందుకే ఆనందతీర్థులు తత్త్వసిద్ధాంత ప్రచారానికి ప్రథమ ప్రాధాన్యత నిస్తూ సంచారం చేసేవారు.

ఆ ఊరిలో అసూయాపరులైన కొందరు పండితులు మధ్వాచార్యులను వాదనలో ఓడించడానికి ముందుకొచ్చారు. వాళ్లల్లో ఎక్కువమంది యాజ్ఞికులు. వివిధ క్రతువుల

నిర్వహణకు సంబంధించిన జ్ఞానం మధ్వాచార్యులకు నిశ్చయంగా ఉండి ఉండదని వాళ్ల నమ్మకం. భీమసేనుడుగా మహాభారతకాలంలో అశ్వమేథ యాగం చేసినవాడాయన. ఆ విషయం వాళ్లకెలా తెలుస్తుంది?

వాగ్వాదం మొదలైంది. మధ్వాచార్యులు వేదార్థాన్ని వివరిస్తూ 'నారాశంసి' అన్న శీర్షికతో వేద మంత్రాలకు అర్థాన్ని సాదరంగా నిరూపించారు. విని ఆశ్చర్యపోవటం పండితుల వంతయింది. తమ అంచనా తప్పయిందన్న దుగ్ధతో వాళ్లు ఆనందతీర్థుల వాదాన్ని ఒప్పుకోవడం మానేసి వితండ వాదానికి దిగారు. మధ్వులు తొణకలేదు, బెణకలేదు. "అలా అయితే ఈ వేదమంత్రాలకు సరయిన అర్థమేమిటో మీరే చెప్పండి" అని ఎదురు ప్రశ్నించారు. మధ్వుల్ని నిలదీయాలని వచ్చిన విద్వాంసులకు గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్టయింది.

అంతే! ఎలాంటి వాగ్యుద్ధానికి దిగకుండా పండితులంతా సభ నుంచి నిష్క్రమించారు.

## కర్మ నిర్ణయం

అదే సభలో మరొక పండితుల గుంపు మరో రకంగా మధ్వాచార్యులను ఎదిరించటానికి సిద్ధమైంది.

వేదాల నుంచి – 'మిహోనామ్నీ ఋక్' సముదాయానికి అర్థం చెప్పగలరా? అని నిలదీశారు. దానికి అర్థం చెప్పాలంటే వేదాలను కాచి వడపోసుండాలి... అయితే పూర్ణప్రజ్ఞులు ఎంత సునాయాసంగా ఆ వేదమంత్రాల నిగూఢార్థాన్ని వివరించారంటే ఆ సభలో పండితులంతా పూర్ణప్రజ్ఞుల సకలవిద్యా ప్రావీణ్యతకు పరవశించిపోయారు. "ఇదే నిజమైన పాండిత్యం" అంటూ వాళ్లంతా మరీ మరీ శ్లాఘించారు.

అలా వివరించిన వేదమంత్రాల అర్థాన్ని ముందు తరాలవారి ప్రయోజనాలకోసం 'కర్మ నిర్ణయం' పేరుతో మధ్వులు లిఖించారు. అది ఇప్పటికీ లభిస్తూనే ఉంది.

(ఈ ఉజీర గ్రామంలో మధ్వుల విజయానికి గుర్తుగా ఇప్పటికీ అప్పటి సభా వివరాలు, ప్రతివాద ఖండనల వివరాలను తెలిపే శిలాశాసనం ఉంది.)

## భీమ భోజనం

మధ్వాచార్యుల భక్తుల్లో దేశమరాజు వంటి పాలకులు, శ్రీమంతులు ఉన్నారు. సామాన్యులూ ఉన్నారు. శ్రీమంతుల భోజనాలకు వెళ్లినప్పుడు వాళ్లని నిరాశపరచకూడదనే ఉద్దేశంతో కనీస భక్ష్యాలను తిని వెళ్లిపోవడం చేసేవారు. పేదవారిచ్చిన భోజన పదార్థాలను పదిరెట్లు హెచ్చుగా చేసి వారికే మళ్లీ సమర్పిస్తుండేవారు.

## టీక రాసిన వృషభం

ఒకసారి మధ్వాచార్యులు పాఠం చెప్తుండగా ఒక విచిత్రం జరిగింది. ఆ సభలో శ్రోతలంతా వివిధ శాస్త్రాలను చదివి ఔపోసన పట్టిన ప్రజ్ఞాదురంధరులు. సదాచార గుణభరితులు. ఒక అర్థంలో వాళ్లంతా దివి నుండి భువికొచ్చిన దేవతలు.

గురువులైన ఆనందతీర్థులు సాక్షాత్తు బ్రహ్మదేవుడు. మాటలకు అధిదేవత అయిన భారతీదేవికి భర్త. విషయం బ్రహ్మసూత్రం, గీత ఉపనిషత్తుల మీద ఆయన రచించిన అపూర్వ భాష్యాలు. రుద్రుడు మొదలైన దేవతలు ఆశ్చర్యం అనిపించేటంతటి గంగా ప్రవాహంలాంటిది వారి పురాణం. తమ గ్రంథాలకు ఆయన ఇస్తున్న వివరణ వింటుంటే శ్రోతలకి విద్వత్‌లోకంలో విహరిస్తున్నంత ఆనందంగా ఉండేది.

ఒకసారి విద్వాంసుల బృందం అలా కూర్చున్నప్పుడు ముఖ్యశిష్యుల్లో కొందరు, "గురువర్యా! తమ యొక్క అద్భుత గ్రంథాల వివరణను టీక గ్రంథాల రచన ద్వారా తెలిపే భాగ్యశాలి ఎవరు?" అన్నారు. పూర్ణప్రజ్ఞులు ఒక్క క్షణంకూడా తడబడకుండా అక్కడ ప్రతినిత్యం పాఠ్యప్రవచన సమయంలో వచ్చిపోతూండే ఎద్దును చూపించారు.

నిజానికి ఆ ఎద్దు మధ్వుల గ్రంథ భాండారాన్ని ఆయన సంచార కాలంలో వీపు మీద మోస్తూండేది. ఆ ఎద్దు 'కర్మనా జ్ఞాన మాతనూక్తి' అన్న శాస్త్ర సందేశానికి నిదర్శనంగా ఉండేది. ఈ విషయాన్ని గమనించిన ప్రజలు ఆ ఎద్దుని ఒక సుజీవిగా గుర్తించారు. మధ్వులు తన శిష్యుల ప్రశ్నలకు జవాబుగా ఎద్దుని చూపించి వెంటనే వాళ్లందరికీ స్పష్టమైంది - అది ఒక సాధారణ ఎద్దు మాత్రమే కాదనీ, తాను విన్నదాన్నంతా రాసే 'టీక తాత్పర్యా'లనే దివ్యమైన చేతనం.

మొత్తంమీద ఆనందతీర్థుల ప్రజ్ఞని విన్నవాళ్లలో చాలామంది సంభ్రమాశ్చర్యాలతో ఆయన ఔన్నత్యాన్ని అంగీకరిస్తుంటే కొంతమంది మాత్రం సహించలేకపోతున్నారు. ఈ దశలో తమ గ్రంథాలకి టీక గ్రంథాల రచనను ఆ ఎద్దే చేస్తుందని గురువు చూపించడం వాళ్లని ఇంకా బాధించింది. దాంతో వాళ్లంతా కలిసి ఆ ఎద్దుని శపించారు - "ఈ ఎద్దు పాము కాటు వల్ల చావాలి". మధ్వాచార్యులు సర్వజ్ఞులు కనుక బ్రాహ్మణ శాపాన్ని నిర్వీర్యం చేయాలనుకోలేదు. ఫలితంగా కొన్నాళ్ల తరువాత ఒక పామువచ్చి ఎద్దుని కరిచింది. ఎద్దు చనిపోయింది.

ఈ వార్త విన్నవెంటనే మధ్వాచార్యులు తాను రచించిన ద్వాదశ స్తోత్రాన్ని పఠించడం మొదలు పెట్టారు. ద్వాదశస్తోత్ర పఠనం ముగిసిన వెంటనే ఆ జలాన్ని ఎద్దు మృతదేహం మీద చల్లారు.

ఆశ్చర్యం!

అపూర్వం!

ఆ ఎద్దు ఒక్కసారిగా నిద్రలోంచి లేచినట్లుగా లేచి కూర్చుంది. దాన్లో అంతకుముందు లేని తేజస్సు ఏదో కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. చూసే వాళ్లందరికీ ఇదేదో అపూర్వ మహిమలా కనిపించినా శిష్యులు మాత్రం ఇది తమ గురువుల ద్వాదశస్తోత్ర మహిమగా గుర్తించారు. ఈ ఘటనతో అసూయాపరులైన శిష్యుల అజ్ఞానం కూడా పటాపంచలయింది.

"ఆ ఎద్దు యొక్క హృదయం దగ్గర మీరు చెవులు పెట్టి వినండి" అని మధ్వులు చెప్పారు. శిష్యులు తుచ తప్పకుండా ఆ ఆదేశాన్ని పాటించారు. ఆశ్చర్యం. ఆ ఎద్దుయొక్క హృదయంలోంచి ద్వాదశ స్తోత్ర పఠనమే వినిపించింది.

మధ్వాచార్యులు బతికించిన ఆ ఎద్దు తరువాతి జన్మలో జయతీర్థులుగా జన్మించి గురువు నుండి ప్రత్యక్షంగా అభ్యసించిన శాస్త్రానికి 'న్యాయసుధ' అనే టీక కూడా రచించి ముక్తిమార్గానికి కావలసిన జ్ఞానబోధ చేశారు (చేసింది).

## త్రివిక్రములచే వాయుస్తుతి

ఉడుపిలో ఒకరోజు యథాప్రకారంగా త్రివిక్రమ పండితులు మొదలైన శిష్యబృందం సమక్షంలో మధ్వులు శ్రీకృష్ణ పూజ ప్రారంభించారు.

తులసీదళాలతో, పుష్పాలతో సహస్రనామార్చన, ఆయుధపూజ, ఆవరణ పూజలు పూర్తిచేసి ధూపదీపాలు సమర్పించారు. ఇంక జరగాల్సిన నైవేద్యం. ప్రసాదం నివేదన సమయంలో ఎవరూ చూడకుండా అడ్డు తెర వేయటం పూజవిధిలో భాగం. ఆ సమయంలో శిష్యులంతా ద్వాదశస్తోత్ర పారాయణం చేస్తూండాలి. నైవేద్యం పూర్తికాగానే గురువులు గంట మోగిస్తారు. అక్కడితో నైవేద్యం పూర్తయినట్లు సంకేతం.

కాని... ఆరోజు శిష్యులు ద్వాదశ స్తోత్ర పారాయణం సాగిస్తున్నారు.

ఒకసారి చదివారు. అయినా తెర వెనుకనున్న గురువుల నుండి ఘంటానాదం వినపడలేదు.

మరోసారి ద్వాదశస్తోత్రం పఠించారు... అయినా ఘంటానాదం వినపడలేదు.

మూడవసారి కూడా ద్వాదశస్తోత్రం పఠించారు... అయినా నైవేద్యం పూర్తయిన సంకేతం గురువుల నుండి వినిపించలేదు. అందరికీ ఉత్కంఠ, ఆందోళన. ఈ దశలో ముఖ్య శిష్యులైన త్రివిక్రమ పండితులు ధైర్యం చేసి తెరలోకి మెల్లగా తొంగి చూశారు.

అలా చూస్తూనే ఒక్కసారి నిశ్చేష్టులయిపోయారు! ఆపాదమస్తకం పులకించిపోయారు.

ఏమా అద్భుతం!

ఏమిటా సమ్మోహన దృశ్యం!

ఎన్ని జన్మల సుకృతం ఉండి ఉండకపోతే ఆ అద్భుత సన్నివేశాన్ని త్రివిక్రమ పండితులు వీక్షించగలిగారు.

అక్కడ...!!!

విగ్రహపీఠం మీద ఏకకాలంలో శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, శ్రీవేదవ్యాసుల రూపాల్లో శ్రీమన్నారాయణుడు కొలువై వుంటే, వారిని హనుమంతుడు, భీమసేనుడి రూపాల్లో మధ్వాచార్యులు పరమానందంతో ఆరాధిస్తున్నారు...

ఆ సాక్షాత్కారంతో త్రివిక్రమ పండితులకు శరీరంలో అణువణువునా భక్తి పరవళ్లు త్రొక్కింది. ఆ ఆనందపారవశ్యంలో త్రివిక్రమ పండితుని నోటినుండి ఆశువుగా ఒక అద్భుత స్తుతి వెలువడింది.

**శ్రీ మద్విష్ణ్వంఘ్రినిష్ఠాతిగుణగురుతమ శ్రీ మదానంద తీర్థ -**
**త్రైలోక్యాచార్యపాదోజ్జ్వలతి జలజల సత్వాంసహా-స్మాన్ పునంతు ।**
**వాచాం యత్ర ప్రణేత్రీ త్రిభువనమహితా శారదా శారదేందు -**
**జ్యోత్స్నా భద్రస్మిత శ్రీ ధవలితకకుభా ప్రేమభారం బభార ॥**

...అలా సాగిన స్తుతిధార ముగిసిన తరువాత ఆ పారవశ్యంలోంచి త్రివిక్రమ పండితులు బాహ్యప్రపంచంలోకి వచ్చి చూస్తే ఎదురుగా చిరునవ్వులు చిందిస్తున్న గురువులు కనిపించారు. "గురుభ్యోన్నమః" అంటూ త్రివిక్రమ పండితులు పూర్ణప్రజ్ఞులకు సాష్టాంగ ప్రణామం చేశారు.

## బళిద్ధాసూక్తము - అర్థము

మధ్వాచార్యులు త్రివిక్రమ పండితులని దగ్గరకి తీసుకుని, "త్రివిక్రమా! మీరు ఎంతో భాగ్యశాలి. మా రూపాలతో పాటు భగవద్రూపాల్ని కూడా దర్శించుకున్నారు. మీ స్తుతి మమ్మల్ని ఎంతో ఆనందపరిచింది. అయినా మా ఆరాధ్యమూర్తిని కూడా స్తుతించినప్పుడే మాకు తృప్తి కలుగుతుంది..." అంటూ తామే ఒక స్తుతిని రచించి భగవంతునికి సమర్పించారు. అదే 'నఖస్తుతి'గా ప్రసిద్ధి చెందింది.

(త్రివిక్రమ పండితులు చేసిన వాయుస్తుతిని ఇప్పటికీ నిత్య పూజా సమయంలో ఆరంభంలోనూ, ఆఖరులోనూ పఠించే ఆనవాయితీ తప్పనిసరిగా వస్తోంది.)

## మాధవతీర్థులు - అక్షోభ్యతీర్థులు

శ్రీరామతీర్థులు, అధోక్షతీర్థుల తరువాత మధ్వాచార్యుల ద్వారా సన్న్యాసదీక్ష స్వీకరించిన వాళ్లలో మాధవతీర్థులు, అక్షోభ్యతీర్థులు ముఖ్యులు. వాళ్లిద్దరూ ఉత్తరకర్ణాటక ప్రాంతం వారయినప్పటికీ మధ్వమాహాత్మ్యాన్ని విని, వారు ఎక్కడ ఉన్నదీ వెతుక్కుంటూ వెళ్లి, వారిని సేవించి, వారి అనుగ్రహంతో ఉపదేశం పొందినవారు. నిజానికి వయస్సులో వాళ్లిద్దరూ చాలా చిన్నవాళ్లు. ఆ ఇద్దరిలోకీ అక్షోభ్యతీర్థులు ఇంకా చిన్నవారు.

## బేలూరు ప్రయాణం

తమ ప్రియ శిష్యులైన పద్మనాభతీర్థుల కోరిక మేరకు మధ్వాచార్యులు బేలూరు బయలుదేరి వెళ్లారు. బేలూరులో ఒక ప్రశాంత సమయంలో పద్మనాభతీర్థులను దగ్గర కూర్చోబెట్టుకుని మధ్వాచార్యులు ఒక ఆదేశం ఇచ్చారు.

"మా అవతారం పూర్తయింది. మేం మా గురువులైన వేదవ్యాసుల దగ్గరికి వెళ్లిపోతున్నాం. ఇకపై వేదాంతసామ్రాజ్య పాలనా బాధ్యత మీదే. ప్రజలందరికీ ధర్మమార్గాన్ని ఉపదేశిస్తూ శ్రీ విష్ణుసర్వోత్తమ తత్త్వాన్ని విస్తృతంగా ప్రచారం చేయండి. మీకు ఉత్తరాధికారిగా నరహరితీర్థులకి పీఠాన్ని అప్పగించండి. వారు మాధవతీర్థులకు, అనంతరం వారు అక్షోభ్యతీర్థులకు పీఠం అప్పగిస్తారు..."

ఈ ఆదేశం పద్మనాభతీర్థులకు పిడుగుపాటుగా అనిపించింది. మొదటిసారిగా తాము గురువుగారి నోటినుండి విన్న అప్రియమైన సందేశమిది. ఏమైనా గురువుగారి ఆదేశం శిరసావహించక తప్పలేదు.

## రామదేవుల ఆగమనం

ఆ రోజు కార్తీకమాసంలో శుక్లపక్ష ద్వాదశి. అదే ఉత్థాన ద్వాదశి. ఆ రోజు భగవంతుడు చాతుర్మాస్య యోగనిద్రను పూర్తిచేసి లేచే పవిత్రమైన రోజు.

ఆ రోజు కూడా ఎప్పటిలాగానే పూజలూ, పారాయణలూ జరిగాయి. మధ్యాహ్నం పాఠ్యప్రవచనాలు జరిగాయి. కాని ఎందుకో ఆ పూట మధ్వాచార్యుల ముఖంలో ఇతర రోజులలో ఎన్నడూ కనపడని ఆతృత ఏదో శిష్యులకు కనిపిస్తోంది. వాళ్లు కుతూహలం పట్టలేక గురువుల్ని విచారించారు.

"కొద్దిసేపట్లో మా ఆరాధ్యదేవులైన శ్రీ మూల రామదేవులు ఇక్కడకు వస్తున్నారు. మా ద్వారా సన్న్యాసదీక్ష స్వీకరించి మా ఆదేశంతో కళింగదేశాన్ని పాలిస్తున్న నరహరితీర్థులు అక్కడ గజపతి కోశాగారంలో ఉన్న - చతుర్ముఖ బ్రహ్మచేత అర్చించబడిన శ్రీ సీతాసమేత రామదేవుల - విగ్రహాల్ని మా ఆదేశంతో ఇక్కడికి తీసుకువస్తున్నారు. రండి, అందరం కలసి స్వాగతిద్దాం" అంటూ పూర్ణప్రజ్ఞులు శిష్యులకు పురమాయించారు.

శిష్యులందరూ సంభ్రమంతో మధ్వుల్ని అనుసరించారు. గురువులు చెప్పినట్లే జరిగింది. కొద్దిసేపటికి నరహరితీర్థులు శ్రీ మూల సీతారామప్రతిమలతో విచ్చేశారు. వాటిని గురువులకు అప్పగించి సాష్టాంగప్రణామం చేశారు. ఆ విగ్రహాలను స్వీకరించి మధ్వాచార్యులు సకల వైభవంతో పరమ భక్తితో పూజించారు. గురువులు నరహరితీర్థులను విశేషంగా అనుగ్రహించారు. "నా ఆదేశాన్ని అనుసరించి సమర్థంగా మీరు పాలన చేశారు. నాకు చాలా సంతోషమయింది. ఈ ప్రతిమల్ని పూజించే అవకాశం మీకు రాబోయే కాలంలో లభిస్తుంది".



ఆనాడు శ్రీ నరహరితీర్థులు తెచ్చి ఇచ్చిన శ్రీమూల సీతారామ లక్ష్మణ ప్రతిమలు

ఈ అనుగ్రహంతో నరహరితీర్థులు ఆనందాతిశయంలో కన్నడంలో కీర్తనల రచనకు శ్రీకారం చుట్టారు. గురువులిచ్చిన ద్వాదశస్తోత్రం ఆధారంగా 'రఘుపతి' అన్న మకుటంతో ఈ కీర్తనలు సాగాయి. అలాగే కన్నడంలో ఆయన పద్యరూపంలో రచించిన సాహిత్యం తరువాతి కాలంలో హరిదాస సాహిత్యంగా రూపుదిద్దుకుని కన్నడంలో మధ్వసిద్ధాంత ప్రచారానికి బాటలు వేసింది.

కొద్ది రోజులకి ప్రధాన శిష్యులందరికి గురువులు బదరికి శాశ్వతంగా వెళ్లిపోతున్నారన్న సంగతి తెలిసి విచారం మొదలయింది.



ఉత్తరాదిమఠ పరంపరలోని ప్రస్తుత పీఠాధిపతి శ్రీ శ్రీ సత్యాత్మతీర్థ స్వాములవారు శ్రీ మూలరాములధారి పూజ; పరంపరలోని ఇప్పటి ఉత్తరాధికారి శ్రీ సత్యాత్మ తీర్థస్వామి

ఒక మకర సంక్రమణంనాడు రజతపీఠపు విశిష్ట వార్షికోత్సవం ఆనందతీర్థుల సారథ్యంలో జరిగినప్పుడు తమ గురువుల అవతారం ముగింపు వార్త శిష్యులందరికీ తెలిసిపోయింది. రాబోయే వియోగం అందరిలోనూ విచారాన్ని నింపింది.

మాఘమాసం ఆరంభమయింది. జ్ఞానసాధనకు విశేషమైన మాసమిది. ఎందుకంటే రథసప్తమి, భీష్మాష్టమి ఈ మాసంలోనే వస్తాయి.

ఆ రోజు మాఘశుద్ధ నవమి (క్రీ.శ. 1278). మధ్వులుగా అవతార మెత్తిన వాయుదేవులు బదరి పోవటానికి ఎంచుకున్న తిథి అదే. ఉడుపి పరిసర ప్రాంతాల్లోని భక్తజనులంతా ఉడుపికి చేరుకున్నారు. ఉత్సవ సంభ్రమం కన్నా వియోగం యొక్క దుఃఖం అందరిలోనూ నిండిపోయింది.

ఎప్పటిలాగానే వైభవంగా శ్రీకృష్ణపూజ ప్రారంభమైంది. పూజ పూర్తవగానే ఆనందతీర్థులు తమ మఠంలోని హృషీకేశ తీర్థులు సహా (మఠాధిపతులుగా వెళ్లాల్సిన) ఎనిమిదిమంది ముఖ్య శిష్యుల్ని పిలిచి ఆదేశమిచ్చారు.

"ఇటుపై శ్రీకృష్ణదేవుని పూజను కొనసాగించే బాధ్యత మీది. పర్యాయక్రమంలో నిరంతరం భగవంతుని ఆరాధించండి. మీ పరంపర కూడా అదే క్రమంలో నిర్వర్తించాలి. మీమీ సంస్థానాలకు మేము ప్రత్యేక ప్రతిమలను ఇస్తాం. స్వీకరించి ఆరాధించండి" అన్నదే ఆ ఆదేశం.

క్రమంగా - శ్రీ సీతాలక్ష్మణ సమేత శ్రీరాముడు, చతుర్భుజ కాళియ మర్దన కృష్ణుడు, ద్విభుజశాలియైన కాళియ మర్దనకృష్ణుడు, శ్రీ విట్టలుడు, శ్రీ భూవరాహదేవుడు, శ్రీ నృసింహ దేవుడు, శ్రీ విట్టలుడు, శ్రీ రాముడు - ఈ దేవతామూర్తులను ఇచ్చి అనుగ్రహించారు. ఆ విగ్రహాలను స్వీకరించి వారు వినమ్రతతో అన్నారు: "మీ అమృత హస్తాలతో పూజించబడిన ఇంతటి పవిత్రమూర్తులను పూజించే అర్హత మాకెక్కడ ఉంది?"

మధ్వాచార్యులు చిరునవ్వు నవ్వి "మీకా అర్హత ఉందని తెలిసే ఆ ప్రతిమలను అనుగ్రహించడం జరిగింది. ఎల్లప్పుడు మేం మీలోనే ఉండి శ్రీకృష్ణ దేవుని పూజ చేయిస్తాం" అని వాగ్దానం చేశారు.

పద్మనాభతీర్థులను పిలిచి ప్రత్యేకంగా చెప్పారు: "రుక్మిణీదేవిచే చేయించబడ్డ శ్రీకృష్ణ ప్రతిమపూజకు ఈ అష్టమఠాధిపతులను నియమించి, శ్రీ మూల సీతారాముల ప్రతిమలను పూజించే అవకాశం మీకు అనుగ్రహిస్తాం. ఇవే సంస్థానానికి ప్రధానమైన ప్రతిమలు". ఆ రకంగా గురువులిచ్చిన ప్రతిమలను పద్మనాభతీర్థులు భక్తిశ్రద్ధలతో స్వీకరించి నమస్కరించారు.

విష్ణుతీర్థులు, పద్మనాభతీర్థులను మధ్వాచార్యులు ప్రత్యేకంగా పిలిచి, తాము రెండవ బదరి యాత్రలో వ్యాసనారాయణుల నుండి పొందిన వ్యాసముష్టులను అందజేశారు. పద్మనాభ తీర్థులు తమకిచ్చిన వ్యాసముష్టిశిలలను ఉత్తరాది మఠసంస్థాన పూజలో చేర్చుకున్నారు. విష్ణుతీర్థులు తమ వ్యాసముష్టిని సుబ్రహ్మణ్య మఠంలో స్థాపించారు.

తమతో రెండుసార్లు వెన్నంటి వచ్చిన సత్యతీర్థులకు సీతాలక్ష్మణసమేత శ్రీరాముని విగ్రహాన్ని అనుగ్రహించి తమ గురువులైన అచ్యుతప్రేక్షుల పేరిట సంస్థానానికి నామకరణం చేసి, ఆ సంస్థానం ద్వారా సత్‌సిద్ధాంత ప్రచారాన్ని విశేషంగా సాగించవలసిందిగా మధ్వాచార్యులు ఆదేశించారు.

త్రివిక్రమ పండితులు, శంకర పండితులు గృహస్థ శిష్యులకు వారి కర్తవ్యం ఉపదేశించి సిద్ధాంత ప్రచార కార్యక్రమాలను సాగించటానికి తగిన దిశానిర్దేశం చేశారు.

## మధ్వ సందేశం

మధ్వాచార్యులు అందరికీ తీర్థ ప్రసాదాలిచ్చారు.

అనంతేశ్వరుని సన్నిధానంలో పద్మాసనంలో కూర్చున్నారు. శిష్యులు, భక్తులు అంతా క్రిక్కిరిసి వున్న ఆ సభాస్థలిలో అందరి ఉత్కంఠ, ఉత్సుకతల మధ్య తమ తుది సందేశాన్ని అందించారు:

"ప్రియమైన శిష్యులారా, భగవద్భక్తులారా! భగవంతుడు మాకు అప్పగించిన అవతార కార్యం పూర్తయింది. మేమిప్పుడు ఉత్తర బదరికి వెళ్తున్నాం. ఇటుపై మేం ఉండేది అక్కడే దైవసన్నిధిలో.

"మీరంతా అదృష్టవంతులు. కోటిజన్మల సాధనకు ఫలితంగా లభించిన వైష్ణవ జన్మను సార్థకం చేసుకొని తత్త్వజ్ఞానాన్ని సంపాదించుకొన్నారు. తత్త్వజ్ఞానాన్ని సంపాదించడం కన్నా ఉన్నతమైన కర్తవ్యం మరొకటి లేదు. జ్ఞాన సాధనానికి నిర్దిష్ట కర్మను ఆచరించటంకన్నా వేరొక దారిలేదు. నిత్యం ఆచరించాల్సిన అన్ని కర్మలనీ శ్రద్ధగా ఆచరించి ప్రతిఫలాన్ని ఆశించకుండా భగవంతుడికి సమర్పించాలి. ఏ కర్మయొక్క ముఖ్యలక్షణమైనా శ్రీహరి ప్రీతి చెందటమే కావాలి. పరమాత్మ ప్రీతి చెందితే ఇహపరసౌఖ్యాలన్నీ అయాచితంగా లభిస్తాయి...

"స్నానం, సంధ్యావందనం, దేవపూజ, బ్రహ్మయజ్ఞం, వైశ్వదేవం మొదలైన నిత్యకర్మలలాగానే ఏకాదశి, కృష్ణాష్టమి వ్రతాలను కూడా ఆచరించి తీరాలి. వాటిని ఆచరించడం ఎలాగైతే పుణ్యసాధనం అవుతుందో, ఆచరించకపోవడం కూడా అలాగే పాపసాధనమవుతుంది...

"గురువులను, పెద్దలను గౌరవించండి. దేవతలను ఆరాధించండి. దేవతా తారతమ్య పరిజ్ఞానం కలిగిఉండండి. శ్రీవిష్ణు సర్వోత్తమ తత్త్వాన్ని ఎల్లవేళలా మనస్సులో నిలుపుకొని ఉండండి. జీవితంలో లౌకిక కార్యాన్ని పరిమితం చేసుకోండి, ఆధ్యాత్మ కార్యాలకు ఎక్కువ అవకాశం కల్పించండి...

"నిత్య కర్మలు ఎంత ముఖ్యమో సత్యధర్మాల అనుష్ఠానం కూడా అంతే ముఖ్యం. సకలప్రాణుల హితాన్ని కోరి భగవంతుని ఆరాధించటమే నిజమైన జీవనం... వర్ణాశ్రమ ధర్మాలు శాస్త్ర సమ్మతం. వాటిని పాటించటం అనేది కర్మాచరణ వ్యవస్థకి అవసరం. అయితే వర్ణాశ్రమ ధర్మాలకు మూలమైనవి సత్యధర్మాలు. వాటిని పాటించకపోతే వర్ణాశ్రమ ధర్మాలకు అర్థంలేదు...

"జ్ఞాన సాధన సమాజానికి మూలాధారమైనది. అది జరగని ఆచారం భ్రష్టాచారమే అవుతుంది. కామం, క్రోధం, ద్వేషం, అసూయ మొదలైన దోషాలన్నీ వ్యక్తిత్వ వికాసానికి ప్రబలమైన అడ్డుగోడలు. వాటికి లొంగిపోకుండా నిర్మలమైన మనస్సుతో భగవంతుణ్ణి ఆరాధించండి... దైవాన్ని, ధర్మాన్ని అంగీకరించని ఇతర మతాలను విమర్శించండి. పరమతాలను నిరాకరించడం యొక్క లక్ష్యం ఉత్తమ మత స్థాపన మాత్రమే కాని కేవలం

దూషించడం కాకూడదు... ఆత్మస్తుతి, పరనింద ఎన్నిటికీ మానవుడి ఉన్నతికి సాధనాలు కాలేవు... దుర్జనులు చేసే విపరీత ప్రచారాల మోహంలో పడి ప్రజలు పతనం కాకుండా హెచ్చరిస్తూ ఉండటం పట్ల మీ బాధ్యతను విస్మరించకండి...

"వర్ణాశ్రమాల పరమధర్మం – అన్ని కాలాల్లోనూ, అన్ని స్థలాలల్లోనూ అన్ని కర్మలనీ సర్వశక్తివంతుడు, సర్వజగత్‌కీ రక్షకుడు అయిన భగవంతుణ్ణి ఆరాధించటమే. ఈ ఆరాధన ఫలం శాశ్వత సుఖానికి నెలవైన ముక్తి. ఇందుకు 'ప్రీణయమో వాసుదేవం' అన్నది మీ అందరికి మహామంత్రం అవుతుంది గాక... మీకు మంగళమగు గాక..."

**బదరిగమనం**

ఈ సందేశంతో అక్కడ చేరిన భగవద్భక్తులందరికీ తమలోని అజ్ఞానాంధకారం పటాపంచలయిన అనుభూతి కలిగింది. ఒక దివ్య సందేశం విన్న ఆనందంతో వాళ్లంతా పులకరించిపోయారు.

ఈ సందేశం తరువాత మధ్వులు ఐతరేయ భాష్య ప్రవచనం ప్రారంభించారు. తమకు ఇష్టమైన ఆ ఉపనిషత్ మర్మాలను అరటిపండు ఒలిచిపెట్టినంత సరళంగా వివరిస్తున్నారు. శ్రీహరి యొక్క మహిమను తెలిపే గ్రంథమే ఐతరేయ ఉపనిషత్. అత్యంత శ్రావ్యంగా, సుందరంగా, హృద్యంగమంగా సాగుతున్న గురు మధ్వుల ఈ ప్రవచనాన్ని వింటూ శ్రోతలు మైమరచిపోయారు.

అలౌకిక ఆనందంలో మునిగిపోయి, తన్మయత్వంతో మధ్వవాక్కుల అమృతాన్ని ఆస్వాదిస్తున్నారు.

అంతటి మహోన్నత దివ్యారాధన దేవతల్ని సయితం సమ్మోహనపరిచిందా అన్నట్లుగా ఒక్కసారిగా ఆకాశం నుంచి పుష్పవృష్టి కురిసింది... గురువుల మెడలో తులసిమాల పడింది. పారిజాతాలు, మందారాలు వంటి దేవలోకపుష్పాలు ఎంత ఉధృతంగా ఆనంద తీర్థుల మీద కురిశాయంటే, ఆ పుష్పవృష్టి సృష్టించిన పుష్పరాశిలో మధ్వగురువులు మునిగిపోయారు.

అంతా రంగురంగుల పుష్పాలమయం.

అందరికీ ఆత్రుత, ఆదుర్దా... ఏరీ గురువులు? ఎక్కడ? ఎక్కడ?... అనుకుంటూ శిష్యులు ఆ పుష్పరాశిని సమీపించి, పుష్పాలను తొలగించారు.

.....?

ఒక్కసారిగా ప్రాన్పడిపోయారు. చేష్టలుడిగి ఒకరినొకరు సంభ్రమాశ్చర్యాలతో చూసుకుంటూ దుఃఖాతిశయంలో మునిగిపోయారు.



శ్రీ మధ్వాచార్యులవారు అదృశ్యమైన చోటు
(అనంతేశ్వర దేవాలయం, ఉడుపి)

ఎందుకంటే -

అక్కడ గురువులు లేరు!

తాను కోరుకున్న బదరికి వెళ్లటం కోసం ఇక్కడ్నుంచి గురువులు లిప్తకాలంలో అదృశ్యమయ్యారు. ఇంతటి శక్తిమంతుడైన జ్ఞాన స్వరూపుడైన మధ్వాచార్యులకు శిష్యులు కావటం తమ పూర్వజన్మ సుకృతం అనుకుంటూ శిష్యులు గురుపీఠానికి నమస్కరించారు.

గురువు వాయుదేవుడి అవతారం. అందుకేనేమో ఒకసారి అన్నారు. "మేము బదరికి వెళ్లాక కూడా ఇక్కడే అదృశ్య రూపంలో ఉంటాం."

అలా అప్పటి వరకూ పౌరాణిక క్షేత్రంగా మాత్రమే ప్రచారంలో ఉన్న ఉడుపి ఆనాటి నుంచి మధ్వుల మాహాత్మ్య దర్శనంతో అప్రతిమ తత్త్వక్షేత్రంగా ప్రసిద్ధి చెందింది. మధ్వాచార్యుల చేతుల మీదుగా ప్రతిష్ఠితమైన శ్రీకృష్ణుని మూర్తితో మహా పుణ్యక్షేత్రంగా ప్రపంచఖ్యాతిని ఆర్జించింది.

మధ్వులు బదరికి వెళ్లాక, పద్మనాభ తీర్థులు బేలూరుకి వెళ్లి అక్కడ కొన్ని రోజులున్నారు. తరువాత ఆనెగొంది రాజ ప్రార్థనతో ఆనెగొందికి వెళ్లారు.

నరహరితీర్థులు మళ్లీ కళింగదేశానికే వెళ్లి, అక్కడి (తన తరువాత వచ్చిన) రాజులకు మార్గదర్శకులనిపించుకున్నారు. అప్పుడప్పుడు పద్మనాభ తీర్థుల్ని సందర్శించి, మార్గదర్శనాన్ని పొందుతూ వచ్చారు. శాస్త్రతత్త్వాల్ని లోతుగా తెలుసుకుంటూ వచ్చారు. వారు రాజుగా పాలించిన కాలంలో శత్రు సంహారం మొదలైన కార్యాలను చేసినందుకు స్మారకంగా శ్రీ కూర్మక్షేత్రంలో యోగ నరసింహుణ్ణి (క్రీ.శ.1281) ప్రతిష్ఠించారు.

మాధవతీర్థులు, అక్షోభ్యతీర్థులు మాత్రం పద్మనాభతీర్థుల దగ్గరే శాస్త్రాధ్యయనం చేస్తూ ఉండిపోయారు.

ఉడుపికి చెందిన అష్టమఠాధిపతులూ మధ్వగురువుల ఆదేశంతో తమతమ సంస్థానాలలో శ్రీకృష్ణ పూజా కైంకర్యాన్ని సాగిస్తూ వచ్చారు.

మధ్వాచార్యుల తమ్ముడైన విష్ణుతీర్థులు కొంతకాలం ఉడుపిలో వుండి, మళ్లీ తపస్సు కోసం కుమార పర్వతానికి వెళ్లిపోయారు. చాలా కాలం తరువాత శ్రీకృష్ణ దర్శనం కోసం మళ్లీ ఉడుపికి వచ్చినప్పుడు ఆయన్ని చూడగానే అక్కడి జనమంతా "మధ్వులే తిరిగి వచ్చారా" అన్నంత సంభ్రమంలో మునిగిపోయారు. కొద్ది రోజుల్లోనే విష్ణుతీర్థులు మళ్లీ కుమార పర్వతానికి వెళ్లి అక్కడ తపోదీక్షలో మునిగిపోయారు.

త్రివిక్రమ పండితులు తదితరులు గురువుల ఆదేశానుసారమే అర్థవంతమైన జీవనం సాగించి కృతకృత్యులయ్యారు. 'విష్ణుస్తుతి' అనేది త్రివిక్రమ పండితుల అపూర్వకృతి. వారి కుమారులయిన నారాయణ పండితులు 'సుమధ్వ విజయం' రచించి, మధ్వ మాహాత్మ్య ప్రసారానికి శాశ్వతమైన బాటలు వేశారు. సంగ్రహరామాయణం, అనువ్యాఖ్యానటీక, నయచంద్రిక మొదలైన అనేక ఇతర కృతులు కూడా నారాయణ పండితుల నుంచే వెలువడ్డాయి.

ఈ మధ్వపరంపరలోని మాధవతీర్థులు నాలుగు వేదాలకూ వివృత్తిని రచించారని ప్రతీతి. అక్షోభ్య తీర్థులు స్వయంగా విద్యారణ్యులంతటి వారి పాండిత్య యశస్సుని అణచి, జయస్తంభాన్ని ప్రతిష్ఠించారు. జయతీర్థులు రాసిన టీక గ్రంథాలు మధ్వుల గ్రంథాల అర్థగాంభీర్యాన్ని విశిష్టమైన రీతిలో జిజ్ఞాసువులకు అందించాయి. వారి 'న్యాయసుధ' - వ్యాఖ్యాన ప్రపంచంలో గౌరీ శంకరులుగా ప్రసిద్ధి చెందింది.

మధ్వాచార్యులు రాసిన శ్రీమద్భాగవత తాత్పర్యం యొక్క గొప్పతనాన్ని విజయ ధ్వజ తీర్థులు రాసిన సమగ్ర భాగవత వ్యాఖ్యానం తెలియజేస్తుంది.

తరువాత కాలంలో వాదిరాజులు, వ్యాసరాజులు మొదలైన జ్ఞానమూర్తుల సాధన ఫలితంగా వైష్ణవ వాఙ్మయం ప్రపంచమంతా విస్తృతంగా ప్రచారమయింది. వాదిరాజుల వారు మధ్వ సిద్ధాంత ప్రాశస్త్యాన్ని భారతదేశమంతా వ్యాపింపజేసి 'అభినవ ఆనందతీర్థులు'గా కీర్తిపొందారు.

విజయేంద్రులు, రఘోత్తములు మొదలైన వారి టిప్పణీ గ్రంథాలు జ్ఞాన ప్రసారానికి కొత్త ఊపునిచ్చాయి. మంత్రాలయ గురు రాఘవేంద్రస్వామి మహిమలు తమ మూలగురువులైన మధ్వాచార్యుల వైష్ణవ తపఃశక్తి యొక్క మహిమల లోతుల్ని విశ్వమంతా వ్యాపింపజేసాయి.

మధ్వాచార్యుల వల్ల జయసింహరాజు ప్రభావితులయినట్లుగా, వ్యాసరాజులచే విజయనగర శ్రీకృష్ణదేవరాయలు మొదలైన రాజులు, సుదీంద్రస్వామి, రాఘవేంద్రస్వాముల ప్రభావంతో తంజావూరు రఘునాథనాయకులు మొదలైన రాజులు, వాదిరాజులచే సోది అరసప్పనాయకుడు, సుమతీంద్ర తీర్థులచే శ్రీరంగ ప్రాంతపు రాజాలు, సత్యబోధ తీర్థులచే సవణూరు ప్రాంత నవాబు, సత్యతీర్థులు మొదలైన వారిచే మైసూరు రాజులు ప్రభావితులై, మధ్వసిద్ధాంత ప్రచారానికి రాజకీయ మద్దతుని అందించారు.

నరహరి తీర్థుల చేత ప్రారంభమయిన హరిదాస సాహిత్యం 'మునిత్రయం'గా పిలవబడే శ్రీపాదరాయలు, వ్యాసరాజులు, వాదిరాజుల చేత విస్తృత ప్రచారంలోకి తీసుకురాబడింది... ఈ దాస సాహిత్య ప్రచారంలో పురందరదాసులైతే 'కర్ణాటక సంగీత పితామహులు'గా వాసికెక్కారు... కనక దాసుల వల్ల మధ్వసిద్ధాంతంలో వర్ణవ్యవస్థ యొక్క ఆంతర్యాన్ని ప్రపంచం సులభంగా తెలుసుకోగలిగింది... ఇంకా, విజయదాసులు, గోపాల దాసులు, జగన్నాథ దాసులవంటి హరిదాసాగ్రేసురల వల్ల హరిదాస సాహిత్యం గ్రామగ్రామానికి విస్తరించి, ప్రజలను హరిభక్తులుగా తీర్చిదిద్దేందుకు ఉపకరించింది... నిజానికి హరిదాస సాహిత్యంలా ప్రచారం పొందిన శ్రీహరి ఆరాధనా సాహిత్యం మరొకటి లేదు. దాని సంగీతం, సాహిత్యం, ఆధ్యాత్మ భావనా పటిమ ఒక త్రివేణి సంగమంలా కన్నడభాషకు కొత్త రూపాన్ని, ప్రయోజనాన్ని సిద్ధింపజేశాయి.

... ఇంతటి అమోఘమైన సాహిత్యానికి మూలప్రేరణ మధ్వాచార్యులు రచించిన ద్వాదశస్తోత్రం.

మధ్వసిద్ధాంతం ఒక అపురూపమైన, అపూర్వమైన, అసాధారణమైన ఆధ్యాత్మ జీవన సరళి...

విష్ణు సర్వోత్తమత్వ ప్రతిపాదన వల్ల ఇదే 'వైష్ణవ సిద్ధాంతం'....

మాయావాదాలను నిరసించి, వాటి మాయను ఎండగట్టింది కనుక ఇదే అసలైన 'తత్త్వవాదం'...

అద్వైత దర్శనాన్ని అత్యంత సమర్థంగా నిరాకరించటం వల్ల ఇదే 'ద్వైత సిద్ధాంతం'...

వేద ప్రతిపాద్యులయిన మధ్వాచార్యులచే ప్రతిష్ఠించబడింది కనుక ఇదే 'శ్రీమధ్వ సిద్ధాంతం'...

**బళిత్థాసూక్తార్థము**

ఋగ్వేదములో (1/141/1-5 నుండి) ఋక్కులలో బళిత్థా సూక్తము చెప్పబడినది. ఈ సూక్తములో వాయుదేవుల అవతారత్రయ గొప్పదనం, సాధన వివరించబడింది. ఇందులో అత్యంత సంగ్రహంగా, సమగ్రంగా మూడు అవతారాల జ్ఞానబలాధిక్యాన్ని స్పష్టం చేయటం జరిగింది.

ఆ మూడు అవతారాలే త్రేతాయుగంలో ఆంజనేయుడు, ద్వాపరయుగంలో భీమసేనుడు, కలియుగంలో మధ్వాచార్యులు. శ్వాసరూపంతో ఈ విశ్వాన్ని ఆవరించి ఉన్న వాయువు మూలరూపం జ్ఞానంతో పరిపూర్ణమూ, విశిష్టమైన పరిపూర్ణ బలాధిక్యమూ ఎలా ఉంటుందో అదే శక్తితో మూడు అవతారరూపాలలో కూడా ఉంటుందని వేదం చెపుతోంది.

***ఓం బళిత్థాతత్వపుషే ధాయిదర్శతం***
***దేవస్య భర్గః స్సహసోయతో జని।***
***య దీము పహ్వరతే సాధతే మతిర్***
***ఋతస్య ధేనా అనయంత సస్రుతః ॥***

భగవదాజ్ఞను శిరసావహించి అతని ప్రీతికోసం అవతరించే శ్రీ వాయుదేవుని మూలరూపం బలాత్మకమైనది, జ్ఞానముతో పరిపూర్ణమూ క్రీడాదిగుణ విశిష్టమూ అయిన శ్వాసరూపంతో ఈవిశ్వాన్ని ధరించి ఉంది.

అటువంటి వాయురూపం మూలరూపంలో ఎలా ఉంటుందో, అలాగే బలజ్ఞానాదులతో కూడుకొన్నదై అవతారంచేయుట కొరకు శ్రీనారాయణునిచే

ప్రేరేపించబడింది. వాయుదేవుని ప్రథమావతారానికి 'మతి' అని పేరు. అంటే హనూమాన్ అని పిలవబడింది. ఈ రూపం జ్ఞానాత్మకుడైన శ్రీరామచంద్రుని సమీపంలో క్రీడిస్తూ భక్తిభావంతో వంగి నిలుచున్నది. అలాగే శ్రీరాములవారి కార్యములను సాధించి పెడుతుంది. ఈ రూపం శ్రీరామరూపుడైన శ్రీహరి యొక్క అమృతప్రాయయాలైన మాటలను శిష్యులకు ఉపదేశించింది. అలాగే ఆ శ్రీరాముని మాటలను సీతాకృతిలో దాగియున్న శ్రీలక్ష్మీదేవికి చేరవేసింది.

1. వాయుశబ్దార్థం మూడు అవతారాలకు అన్వయిస్తుంది. ఎక్కడైతే పరిపూర్ణబలం, పరిపూర్ణజ్ఞానం నిండి ఉంటుందో అక్కడవాయుశబ్ద ప్రయోగం చేయాలి. బలజ్ఞాన సమాహారమే వాయుశబ్దార్థం.

   వాయుదేవులు హనుమదవతారంలోనూ భీమావతారంలోనూ మధ్వావతారం లోనూ బలకార్యాన్ని, జ్ఞానకార్యాన్ని పరిపూర్ణ ప్రమాణంలో చేసిన విషయం అందరికీ విదితమే.

2. మూడు అవతారాలలోనూ భగవత్ ప్రీతికోసం ప్రయత్నమే తప్ప తన స్వంతకార్యమనేది వాయుదేవునికి లేదు. భగవత్కార్యసాధకుడు. అంగద జాంబవంతాదులకు సాధ్యపడని సీతాన్వేషణకార్యాని ఒక్క హనుమంతుడే సాధించాడన్న విషయాన్ని బళిత్థాసూక్తం మొదటి మంత్రం చెబుతోంది.

**పృక్షోవపుః పితుమాన్ నిత్య ఆశయే**
**ద్వితీయమాసప్త శివాసు మాతృషు ।**
**తృతీయమస్య వృషభస్య దోహసే**
**దశప్రమతిం జనయంత యోషణః ॥**

ఈ మంత్రము పూర్వార్ధములో శ్రీ వాయుదేవుల ద్వితీయావతార వర్ణన చెప్పబడి ఉంది. ఉత్తరార్ధములో తృతీయావతారమైన మధ్వాచార్యుల వర్ణన వచ్చి ఉంది.

శ్రీ వాయుదేవుని రెండవ అవతారమైన భీమావతారం (పృక్షః – పృత్+క్షః) కౌరవ సేనను నాశము చేసింది.

అధికమైన అన్నమును ఆరగించగల సామర్థ్యము కలది. స్వచ్ఛందమృత్యువై నిత్యమూ శోభిల్లుతూ ఉంటుంది.

1. నూరు మంది దుర్యోధనాదులను సంహరించడమేకాక, కౌరవుల మొత్తం 11 అక్షోహిణీసైన్యంలో 6 అక్షోహిణీ సైన్యమును నాశమొందించినది భీముడు ఒక్కటే. ఈ నిదర్శనంతో అతని బలాధిక్యాన్ని అర్థం చేసుకోవచ్చు. జరాసంధ, కిమ్మీర–బక – హిడింబ, కీచకాదులను వారి సైన్యాన్ని భీముడు సంహరించాడు. ఇది ఇతరులకు అసాధ్యం. ఇందువలన వాయువు యొక్క సామర్థ్యం మూలరూపంలో ఎలాగో అవతార రూపంలో కూడా అలాగే నన్నది స్పష్టమౌతుంది.

2. బలాధిక్యాన్ని భీముడు ప్రకటించినట్లు జ్ఞానాధిక్యాన్ని ప్రకటపరచిన సందర్భాలు మహాభారతంలో చూడవచ్చును. సప్తాగమముల, సప్తశాస్త్ర జ్ఞానములో అతడు నిమగ్నుడై యుంటాడన్న విషయమూ బలిత్థాసూక్తము చెబుతోంది. ఇలా బలజ్ఞానములు భీమునిలో అత్యధికంగా ఉన్న విషయం దృష్టాంత పూర్వకంగా తెలియవస్తోంది.

దేవశ్రేష్ఠుడైన ఈ వాయువు యొక్క మూడవరూపం దశప్రమతి (పూర్ణప్రమతి) అని ప్రసిద్ధమైంది. తత్త్వజ్ఞానాన్ని పితుకుట కొరకు శ్రీ–భూ–దుర్గా అనుదేవేరులు మధ్యగేహభట్టులపత్ని యందు సన్నిహితులై శ్రీ మధ్వాచార్యులను పుట్టించారు.

1. 'అస్యవృషభస్య' – వాయుదేవుని దేవశ్రేష్ఠుడు అని బలిత్థాసూక్తము ప్రతిపాదిస్తోంది. 'పూర్ణప్రజ్ఞులు' అని చెబుతోంది; మధ్వాచార్యుల 37 గ్రంథములను అధ్యయనం చేసినపుడు వారి సర్వజ్ఞత్వం, జీవోత్తమత్వం స్పష్టమౌతుంది.

**నిర్యదీం బుధ్నాన్మహిషస్య వర్పసః**
**ఈశానాసః శవసాక్రంత సూరయః ।**
**యదీమను ప్రదివోమధ్వ ఆధవే**
**గుహాసంతం మాతరిశ్వామథాయతి ॥**

శ్రీ వాయుదేవులు జ్ఞానరూపులు, సజ్జనులను పరిపాలించేవారు, దేవశ్రేష్ఠులు. వారియొక్క జ్ఞానరూపంతో వెనుకటి మంత్రంలో చెప్పిన విధంగా జ్ఞానకార్యం ఎక్కువ ప్రమాణంలో చేయబడింది. ఇందువలన రుద్రాది దేవతలకూ విశేషజ్ఞానాన్ని పొందుట సాధ్యమయింది. అటువంటి రుద్రాదిదేవతలను ఉద్దేశించి హృదయగుహలో నున్న సర్వస్వామియే భగవంతుడు సకల వేదప్రతి పాద్యుడు అను తత్త్వాన్ని మథించారు.

1. జ్ఞానకార్యానికై అవతరించిన శ్రీమధ్వాచార్యులు వేదాదిశాస్త్రాలను మథనం గావించి రుద్రాదిదేవతలకూ జ్ఞానవిశేషాన్ని అందించారని స్పష్టంగా ఇక్కడ చెప్పియున్నారు.
2. ఈ శ్రుతిలో స్పష్టంగా 'మధ్వ' 'మాతరిశ్వా' అను పేర్లతో శ్రీ వాయుదేవుల తృతీయావతారాన్ని ప్రస్తావించడం జరిగింది.

'మధు' అంటే ఆనందం. 'వా' అంటే తీర్థం 'ఆనందతీర్థ' అనే అర్థం తెలియవస్తోంది. ఆనందాన్ని (మోక్షానందాన్ని) కలిగించే తీర్థం (శాస్త్రాన్ని) విశ్వానికి అందించినందున వారికి ఆనందతీర్థాచార్యులని సార్థకనామధేయమని చెబుతోంది. ఆనందతీర్థ శబ్దార్థాన్ని 5వ సర్గం సుమధ్వవిజయంలో చూడవచ్చును.

ప్రయత్ పితుః పరమాన్నీయతే
పర్యాపృక్షుధో వీరుధో దంసురోహంతి ।
ఉభాయదస్యజనుషం యదిన్వత్
ఆదిదోయవిష్ఠో అభవద్ ఘృణాశుచిః ॥

శ్రీ వాయుదేవులు శ్రీమధ్వులుగా అవతరించి తన తండ్రీ, సర్వోత్తముడూ అయిన శ్రీ నారాయణునిచే ప్రేరితులై సకల కార్యాలనూ సాధించారు. ప్రశ్నరూపములైన లతలను దంతములందుంచుకుని చీల్చివేశారు. వీరి జన్మ లక్ష్మీనారాయణులచే జరిగినందున వీరు వారిరువురికన్న తారతమ్యంలో చిన్నవారు. (ఇతరులకన్నా పెద్దవారు) వీరు విష్ణుభక్తుల విషయంలో కృపజూపువారు. వీరికి గర్భవాసాది దోషములు లేవు. వీరు పరిశుద్ధాంతఃకరణులు.

1. శ్రీమధ్వాచార్యుల వారు సకల పూర్వపక్షములనూ ఖండించినవారు.
2. లక్ష్మీ నారాయణుల తరువాత వీరు జీవోత్తములుగా ప్రసిద్ధి చెందినవారు.
3. గర్భవాసాది దోషములు వీరికి లేవని 2వ సర్గము సుమధ్వ విజయములో చెప్పియున్నారు:

ఆదినామృత్తరావిశద్ యాస్వశుచి-
రహింస్యమాన ఉర్వియా వివావృధే ।
అనుయత్ పూర్వా అరుహత్ సనాజువో
ని నవ్యసీష్వవరాసుధావతే ॥

శ్రీ వాయుదేవులు అకారవాచ్యుడైన నారాయణుని ఆజ్ఞతో ఈవిధముగా మూడు అవతారాలను అంజనాదేవి, కుంతీ, మధ్యగేహపత్ని అనే తల్లుల ఉదరంలో ప్రవేశించారు. వారి నైజ స్వభావానికనుగుణంగా అన్నివిధాలుగా దుష్కర్మాదులచే స్పర్శలేని వారై యుండిరి. దుష్కర్మములవలననూ ఉదరంలో ఉన్న క్రిముల వలననూ ఎటువంటి హింసకూ లోబడనివారై పెరిగారు. సనాతనుడైన శ్రీహరిని ప్రతిపాదించే కారణంచేత 'సనాజువ' అనిపించిన నిత్యమైన వేదవాక్యాలను షట్‌శాస్త్రముల కనుగుణంగా నిధానంగా వివరించారు. పంచరాత్ర మహాభారతం, మూల రామాయణములనబడే పౌరుషేయ శాస్త్రాలలో అవి వేదములంత కఠినాలు కాదన్న కారణంతో వేగంగా వ్యాఖ్యానించారు.

1. ముగ్గురు తల్లుల గర్భాంబుధిలో నున్నప్పటికీ వారికి ఎటువంటి దోష స్పర్శ కలగలేదనీ, దుష్కర్మములస్పర్శ కూడా కలగలేదని వివరించినందున వీరు ఋజువులు, శుద్ధులు నిష్కల్మషులన్న విషయం స్పష్టమయ్యినది. ఇదంతా వారి స్వసామర్థ్యం వలననే సాధ్యమయ్యింది.

2. వేదాలకు శిక్షా, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిష్యము, కల్పము ఇలా షడంగాలను అనుసంధానముచేసి వాటిలో దాగి ఉన్న అంతరార్థాన్ని బయటికి సవిస్తరంగా తీసుకొనివచ్చిరి. వేదవ్యాఖ్యాన విషయాలలో నిధానముగా పంచరాత్రాగమము, మహాభారత, రామాయణాది పౌరుషేయశాస్త్ర విషయంలో శీఘ్రగతి ననుసరించి వాటి ప్రాధాన్యతను విశ్వానికి పరిచయం చేశారు.

3. 37 గ్రంథాలను రచించినది అందరికీ తెలుసు. వారికున్న జ్ఞానభాండారం అమితమైనది. వ్యాఖ్యానం వారు మాత్రమే చేయాలి, ఎందుకంటే వారు వేదప్రతిపాద్యులు వేదాలు వారి మహిమను కొనియాడుతున్నాయి. ఇన్ని విషయాలు బళిత్థాసూక్తం మనకు తెలియజేస్తోంది.

ఈ మధ్వ ప్రతిపాద్యద్వైత సిద్ధాంతం, వేదాలు మొదలైన సకల శాస్త్రాలకు సంపూర్ణ న్యాయం చేకూర్చటం చేత ఇదే 'సమగ్ర వైదిక సిద్ధాంతం'... ప్రతిపాదనకూ శ్రీ వేదవ్యాసుల మాటలలో ప్రమాణములిచ్చి సందేహాలకు తావులేకుండా చెప్పబడిన తత్త్వం.

... అలా, సమగ్రత, పూర్ణత్వాలు లక్షణంగా ఉండటం వల్ల తత్త్వశాస్త్రాన్ని నిరూపించే సిద్ధాంతం ఇది ఒక్కటి మాత్రమే.

ఇదే – మధ్వాచార్యుల అవతారంలో వాయుదేవులు మానవాళికి అందించిన 'జ్ఞానజ్యోతి'.

## శ్రీ మధ్వాచార్య ప్రణీతములయిన సర్వమూల గ్రంథములు

గీతా ప్రస్థానగ్రంథములు – గీతాభాష్యము గీతా తాత్పర్యనిర్ణయము

సూత్ర ప్రస్థాన గ్రంథములు – బ్రహ్మసూత్రభాష్యము.
అనువ్యాఖ్యానము.
అణుభాష్యము.
న్యాయ వివరణ.

ఉపనిషత్ప్రస్థానగ్రంథములు – ఐతరేయ ఉపనిషద్భాష్యము.
ఛాందోగ్యోపనిషద్భాష్యము
బృహదారణ్యకోపనిషద్భాష్యము.
ఈశా వాశ్యోపనిషద్భాష్యము
తలవకారోపనిషద్భాష్యము
షట్ప్రశ్నోపనిషద్భాష్యము
కాఠకోపనిషద్భాష్యము
అథర్వణోపనిషద్భాష్యము
మాండూ కోపనిషద్భాష్యము
తైతిరీయోపనిషద్భాష్యము

శ్రుతి ప్రస్థాన గ్రంథములు – ఋగ్భాష్యము

ఇతిహాస ప్రస్థాన గ్రంథములు – మహాభారత తాత్పర్యనిర్ణయము, యమకభారతము

పురాణ ప్రస్థాన గ్రంథము – భాగవత తాత్పర్య నిర్ణయము

ప్రకరణ గ్రంథములు – తత్త్వ సంఖ్యానము
తత్త్వ వివేకము
విష్ణుతత్త్వ వినిర్ణయము
ప్రమాణ లక్షణము
కథా లక్షణము
ఉపాధి ఖండనము
మాయావాద ఖండనము
ప్రపంచమిథ్యాత్వానుమాన ఖండనము.
కర్మనిర్ణయము

ఆచార గ్రంథములు – తంత్రసార సంగ్రహము
సదాచారస్మృతి
జయంతీ నిర్ణయము
కృష్ణామృత మహార్ణవము
ప్రణవ కల్పము

స్తోత్ర కృతులు – నఖస్తుతి
ద్వాదశ స్తోత్రము
కందుక స్తుతి.

* * *